# పీఠిక

సర్

రా న్' నామధేయుఁడగు ప్రసిద్ధాంగ్ల నవలాకారుఁ డాంధ్రలోక
కపరిచితుఁడు కాఁడు. బహు గ్రంథరచనాధురంధరుండగు
శాశాలి కాంగ్ల సారస్వతమున నేకారణముననో స్థానములేదు.
నాల్డ్సయొక్క "Loves of the Harem" అను గ్రంథమున
అనువాదము.



మ్క రాజధాని యగు 'కాన్‌స్టాంటు' నగరము ఘోరతర
ఎరమారణమున కాలవాలమాయెను. ముప్పది సంవత్సరము లు
సుందరపురుషులు జాతి మత విచక్షణ లేక, ఆకస్మికము గ,
ఁముగ విగతజీవు లగుచుండిరి. తచ్ఛవములు బాస్ఫరసుజలము
దేలుచుండెను. వానిని బరిశీలింప, వారందఱును మెడవెను
ఁము క్రిందుగఁ దగిలిన కత్తిపోటుచేఁ దెగటారిరని వ్యక్తమగు
చుండెను. హంతకుఁ డెవ్వఁడో తెలియకుండెను. భయంకర దుర్మాణ
ల సంఖ్య అధికతర మగుచుండెను. నగరమునందు సహజముగ
ష హాకారములు చెలరేగెను.

మన కథా ప్రారంభావసరమున రాజధానిస్థితి యట్లు లుండెను.
'ఖలీలు' నామధేయుఁ డగు కథానాయకుఁడు తదన్యజనాసాధ్య
కార్యభారము వహించి, అత్యద్భుతకార్యము లొనరించి, కృత
కృత్యుఁడై, తుదకు సార్వభౌముఁ డగును.

కథాకల్పనయందును, ప్రధానకథను బోషించుటకై యుపకథ
సముచితముగఁ గల్పించుటయందును, పాత్రప్రదర్శనమునందును,
పోషణమునందును, తదౌచిత్యమునందును రైనాల్డ్సు నిరుపమా
నకృతియుఁడు. ఈతని మించిన పాశ్చాత్యు లనేకు లున్నను
పాఠకుల కీతఁడే ఆదర్శప్రాయుఁడై యున్నవాఁడు.

భాషా దేశాభ్యుదయము లకు భాషాంతరీకరణములు గా
ములు. స్వతంత్రగ్రంథము లెంత యవసరమో, అన్యగ్రం

భాషానువాదములును అంత యవసరమె. ఈ సువ్యక్తవిషయము అల్పు
లకు మాత్ర మవ్యక్తము.

భాషాంతరీకరణము సులభసాధ్యము కాదు.— కవిత్వమువలె నిదియు
నొక కళ యని చెప్పఁదగును — కావుననే, ఆంధ్రీకరణము లంతగా
రుచింపఁజాలకున్నవి. అందు, దేశభాషాగ్రంథములకంటె, నాంగ్లగ్రంథ
ములు మఱియుఁ గష్టసాధ్యములు. దేశభాషలకు సంస్కృతము మాతృ
మగుటయు, నాంగ్లము మనకుఁ గేవలము విరుద్ధమగుటయే అందులకుఁ
గారణము. అల్పజ్ఞున కిదియు దుర్గ్రాహ్యమై, సర్వము సామాన్య
ముగఁ దోఁచుట సహజము. కావుననే విద్యార్థి విద్యాధిక, విద్యా
శాఖాధికారుల మన్ననఁ గాంచిన 'బక్సారు యుద్ధము' ను తదిత
గ్రంథములను రచించియు, నాంగ్లగ్రంథానువాద మొనరించుటకు గ
శంకించితిని. నేఁ దెనిఁగించిన 'మొగలాయీ దర్బారు' సంపుటముఁ
చదివిన నామిత్రు లవ్యాజ గౌరవాభిమాన పూరిత చిత్తముతో నన్ను
బ్రోత్సహించుటచే, నీ గ్రంథానువాదమునకుఁ గూడఁ బూనుకొంటిని
రసగ్రహణపారీణులగు పండితులు తప్పులను మన్నింతురుగాక.

రై నాల్డ్సు గ్రంథములలోనెల్ల నిదియే మిగుల రసవంతమైనదనియు,
తొలుదొల్త దీనినే తెనిఁగింపవలయుననియు, హిత మొనరించిన
అబ్దుల్ ఎస్. వాహాబుసాహేబునకును, శ్రమ యనక వ్రాఁతప్రతిఁ జూచిన
నా మిత్రులు పురిపండా అప్పలస్వామిగారికిని, ప్రసిద్ధ సరస్వతీ గ్రం
మాలాధ్యక్షులగు శ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారికి
నేను కృతజ్ఞుఁడను.

వైశాఖపట్టణము
1—2—28

కొుసలికంటి సంజీవరావు

# అంకితము



ప్రసిద్ధ 'పెద్దాపుర' రాజ్యమున వంశపరంపరగ వజీరులై వెలసిన 'వైజర్సు' గృహమున జానకమ్మ సీతారామ రాయల గర్భమున నుదయించి, నిజజనకునకు నయనానంద కరముగఁ బ్రవర్థిల్లి; బహు భాషాకోవిదుఁడై, అనంతవిజ్ఞానము గడించి, ప్రసంగచూడామణియై తనరి, సుధాకరునివలె నిరంతర మందహాస విరాజమాన ప్రసన్నాననుఁడై దీపించి; నిజసోదరీమణుల కమితోపకార మొనరించి, విశేష ధన సంపాదన మొనరించి, విశేష వ్యయ మొనరించి, విశేష ధనము పీడి, ఏఁబదినాల్గవ సంవత్సరమున దివికేగిన నా మేనమామ అప్పారావుపంతులుకు ఈ 'యంతఃపురము' నవల ప్రథమ భాగ మంకిత మొనంగువాఁడను.

మన కథాప్రారంభసమయమున, * మూడవసలీము సుల్తాను ప్రసిద్ధ తురుష్క సామ్రాజ్యమును శాసించుచుండెను. ఆసియా యూరపు ఆఫ్రికా ఈ మూడుఖండములయందును వ్యాప్తిఁ గాంచిన యా సామ్రాజ్యమును సాధారణముగా 'నట్టోమను' సామ్రాజ్యమనియు నందురు.

తత్ప్రభుత్వరాజకీయపరిస్థితు లా సమయమునఁ గడు సంకుచితముగ నుండెను. రాజ్యాంగమున నే క్షణమున నెట్టి మారుపు లుప్పతిల్లునో తెలియక జనులు సంక్షుభితమనస్కులై యుండిరి. జనుల యవస్థయే యటులుండ, రాజ్యతంత్రముం ద్రిప్పు నధికారుల గుఱించి వేఱుగఁ జెప్పవలయునా ?

అట్టి సమయమున మఱియొక భయంకర వైపరీత్యము సంభవించెను. జనులను దురంతభయవిస్మయసాగరమున ముంచివైచెను ; ఝంఝామారుతావసర గభీరజలరాశివలె, ప్రజాహృదయము మిక్కిలి కలగుండువడెను. అనాదిసిద్ధమై ప్రసిద్ధచరిత్ర యశోభాసురమై, రష్యాద్యనేక రాజ్యమత్సరకారణమై, యద్వితీయవైభవయుతమై యొప్పు రాజధాని దుస్సహవిషాదభయ మేఘావృతమాయెను. 'కాన్‌స్టాంటు' నగరరాజమున నందందుఁ దిరుగాడు జనులందఱు నా భయంకర వ్యాపారముం దలఁచియే కొందలమందుచుండిరి. ఎల్లెడల నదియే గుసగుసలు. గృహములందును, వీథులందును, భోజనాగారములందును, కాఫీమందిరములందును, పురమందిరంబులందును, తదితరస్థలంబు

* 1807

లందును గూడ నియ్యదే సామాన్యప్రసంగమాయెను. భయాతిరేకమునఁ దమతమ వ్యాపారముల మఱచి, సర్వజనభక్షకియగు కరాళ మహామారి నగరమున విజృంభించి స్వైరవిహార మొనరించుచుండెనో యన, భయవిహ్వలులై నగము చచ్చిరి.

అంతటి యుపద్రవమేమి ? రాజు నిరంకుశుఁడై, జనులను బాధించు చుండెనా ? కాదు, కాదు. తొల్లిఁటి సుల్తానులవలెఁ గాక ఈ సలీము ప్రజాస్వాతంత్ర్య గౌరవసంపదలను రక్షింపఁగడంగెను. అట్టులైన, ప్రజావళి తీవ్రకలవరము కేవలము రజ్జు సర్పభ్రాంతియా ? కాదు. దుర్భరమగు, ఘోరమగు విపత్తు సంభవించుటచేతనే హృదయము ప్రయ్యలాయెను. ఇఁకఁ గాలయాపన మొనరింపక, కుతూహల ప్రకంపితపాఠకునకుఁ దత్కారణ మెఱింగించెదము.

సుమారు రెండు సంవత్సరములక్రిందట నీ వింత వదంతి బయల్వెడలెను. రాజధాని కంటియున్న 'బాస్వరస్సు' నదిలోఁ జాలశవములు కొట్టుకొని పోవుచుండెనట. ఆయువుమూడిన స్త్రీపురుషుల మృత కళేబరములందుఁ బడి, ప్రవాహము ననుసరించి పోయి సాగరముం జేరుట సాధారణవిషయమై యుండెను. వ్యభిచార పంకకళంకితలగు భార్యలను తారునఁ దెగనఱికియో, తదితర తెఱంగులనో, నదీజలంబులఁ బడఁద్రోయుచుండిరి. పాడిదొఱంగి ప్రవర్తించు పరిచారికలు బందీలుసహిత మట్టిదుర్మరణమునకే పాల్పడుచుండిరి. కాన, నట్టి మృతకళేబర ప్రదర్శన మొకవింతకాదు. భయకారణ మేమన, నట్టి శవములసంఖ్య రెండుసంవత్సరములనుండి క్రమముగా మీఱు చుండెను: తుదకు హత్యాకాండ మధికతమమాయెను: దురంత నర వధ సర్వసాధారణమాయెను: ప్రజల యవస్థ మఱియు దుస్సహమాయెను. ఇందు మఱియొక వైపరీత్యము. నదీతోయములఁ దేలుచుండినవి స్త్రీ శవములుకావు. పురుషుల కళేబరము లగుటచే, జనుల

భయము శతాధికమై, వర్ణనాతీతమాయెను. తద్భయంకరవ్యాపార మునకు సంబంధించినవిషయములుకొన్ని క్రమముగావ్యక్తమాయెను.

భార్యలపై, ఉపభార్యలపై, దాసీజనంబులపైఁ గినియు ధూర్తులా యూ కాంతలను దిట్టమగు గోనెసంచులలోఁ బెట్టి, వానిమూతులు బిగియ గట్టి నదీప్రవాహమునఁ బడవేయుచుండిరి. అదియే నాఁటి యాచారము. మహాసామ్రాజ్య భారధురంధరులగు సుల్తానువారి దుర్వార దురాగ్రహమునకు గుఱియగు దురదృష్టవంతు లంతిపుర ముననే, యాక్షణముననే భయంకర కాలపాశముంబోలు ధనుర్జ్యా ప్రపీడితకంఠులై దారుణముగ మరణించుచుండిరి. వారును బాస్వరనదీ తోయములనే తేలుచుండిరి. కడునుబ్బి, నల్లనై, వికృతమై, వింటి నారితోఁ జుట్టియున్న కంఠములను గాంచునంతనే. తద్విషయము విశదమగుచుండెను. అట్టి మరణములకుఁ అట్టి దృశ్యములకును పుర జను లలవాటుపడియేయుండిరి. కాని, ప్రజాహృదయమును విచ్ఛిన్న మొనరింపఁజాలు హత్య లట్టివికావు. అట్లు చచ్చినవారు స్త్రీలుకారని ముందే చెప్పియుంటిమి గదా. సంచులయందు బంధింపఁబడుటలేదు. కంఠములు పాశబద్ధములగుటలేదు. ఆ శవములను పరికించినంతనే, కత్తిపోటుచే మరణించి యుండవలయునని తెలియుచుండెను. మఱియు ఆగాయము మెడవెనుకనో, కొంచెము క్రిందుగనో కానవచ్చుచుం డెను. ఒకింత విచారింప నా మందభాగ్యు లేమరియుండు సమయ మున, నెవ్వఁడో పాపాత్ముఁడు మృత్యువువలె వెనువెంటఁ బొంచి యుండి, వాని నొక్కపోటునఁ బొలియించుచుండెనని తెలియఁగలదు.

ఈ భయానక హత్యలయందు నింకొక వింత లక్షణము పొడ సూపుచుండెను. ఇట్టి యాకస్మిక దుర్మరణమునకుఁ బాలైన భాగ్య హీను లందఱును యువకులు, సుందరాంగులు; ప్రాయము పద్దెని మిది ముప్పది సంవత్సరములకు నడుమ నుండును. బాలురు, తతటిహింస

యేండ్లు గడచినవారలును అట్లు మరణించుటలేదు. తరుణవయస్కులే యీ తెఱంగున ఘోరముగాఁ జావనేల? మఱియొక యద్భుత మెద్దియన, యట్టి యమానుషకృత్యముల నొనరించు హంతకులు ధనమున కాసించినవారు కారు. ఆయా పురుషులు ధరించిన యాభరణములు, చెంత నుండు ధనమును అట్టులే యుండెను. హంతకులు ధనాశా ప్రేరితులైనచోఁ, జచ్చినవాని సొత్తు హరింపకుందురా? కాన, నిది యొక విపరీతము. మరణించుచుండిన యౌవనపురుషు లొక్కజాతి వారు కారు తురుష్కులు, ఆర్మేనియనులు, గ్రీకులు, పరాసులు లోనుగాఁ గలవారు — తురుష్క సామ్రాజ్యనగరమున నుండు నానా జాతులవారును విచక్షణలేక వధ్యు లగుచుండిరి. నదీజలముపైఁ దేలు శవముల దుస్తులను బరికింప, లెక్కకు మీఱిన సువర్ణనాణెములో, వెండినాణెములో, అధమము రాగిడబ్బులో — ఎవ్వియో తప్పక కాన వచ్చుచుండెను. కావున, ధనాపహరణము దోపిడియు నిట్టి దారుణ వ్యాపారమునకుఁ గారణము కాదని స్పష్టమగును. సౌందర్యయౌవన విభాసితులగు పురుషులే మరణించుటయు, మరణము తీరు సదా యట్టులే యుండుటయు, మొదలగు విషయములను బరికింప, నీహత్యల కెల్ల నొక్కటియే కారణ ముండవలయునని స్ఫురింపకమానదు.

ఈ రెండుసంవత్సరములలో మరణించిన యౌవనసుందరాంగుల సంఖ్య నూటికి మీఱియుండును. కాదు, కాదు. విశాల బాస్ఫరనదీ తోయముల గోచరించిన మృతకళేబరముల సంఖ్య వేయికి మించి యుండును. కొన్ని కళేబరములు పురజనానీకనయనపథముఁ దొలఁగి సముద్రముఁ జేరియుండును. నిగూఢముగ నెందఱు కడతేరిరో యెఱుంగరాదు. ఇంతకు, లెక్కతోఁ బనియేమి? బహుశోకవిస్తీర్ణ మార్గల యీ మహానగరమునందలి యనేక కుటుంబములు — ధనికులు, ఛండీనవిత్తులు, అధికారులు, అధికారరహితులు, కులీనులు, సామా

న్యాలు మొదలగు తారతమ్యములు లేక — గృహాధికారి, భర్త, సోద రుఁడు, కుమారుఁడు మొదలగు నత్యంత ప్రియతముల నాతెలంగునఁ గోల్పోయి యనంతదుఃఖసాగర నిర్మగ్నులై యుండెను. తుదకు నగరము విపరీత సాంద్రదుఃఖభయానక మేఘాచ్ఛాదిత మాయెను. పురజనుల దురవస్థ వర్ణించియే యుంటిమి.

కారణము తెలియకున్నను, కారణము నరయఁబూనుట మనుష్య స్వభావముగదా. భయవిహ్వలులైన జనులు తదవసరజనిత మహాశోకల వరముచే నీ హత్యాకాండమునకు రాజకీయ కారణమును నిరూ పించిరి. కాని, భయావేశ మొకింత యడంగినంతనే, యాకారణ మస మంజసమని వారు గుర్తించిరి. ప్రభుత్వము గమనింప నవసరములేని పడుచువారలే వధ్యు లగుచుండుటచే, నట్టి యనుమానమున కవ కాశము లేదు. యూదులు క్రోధోన్మత్తులై, క్రైస్తవ తురుష్క జాతులపైఁ బగదీర్చికొన నుద్దేశించి, యిట్టి భయంకరవ్యాపారము నకుఁ గడంగి యుండుదురనియు జను లనుమానించిరి. కాని, అదియు నసంబద్ధమే. ఏమన, మరణించుచుండిన యువకులలో నుత్తమవంశజు లగు యూదులు గూడనుండిరి. కావున, నొక జాతిపై నిందారోపణ మొనరించుట యసాధ్యము. జాతిమతవిభేదములు లేక, ఎల్లరు దమ తమ ప్రియతమ బంధుజనులను గోల్పోయి, గోలుగోలున నేడ్చు చుండిరి.

మఱియు, ప్రతిహింసా తత్పరతయే యీరాక్షస కృత్యములకుఁ గారణమగునేని, హత్యలన్నియు నేకవిధముననే జరుగనేల? యువ కులు ఒక్కవిధముననే వంచింపఁబడి, ఒక్కవిధమగు నాయుధముచేతనే, ఒక్కమర్మస్థానముననే ఒక్కహంతకుని చేతనే వధింపఁబడుచుండి నట్లు కాన్పింపనేల?

కాని, ప్రతిహింసాచరణము కారణము కాదేని, ఇట్టి భయంకర సంభూత మరణములకుఁ గారణాంతర మేముండును? ఎంతటిహింస

జరిగియుండిన, నిట్టి భీభత్సప్రతిహింసా ప్రదర్శనము మూడవలయును? అంతటి హింస యేమై యుండును? సర్వమగమ్యము. యోచనా సామర్థ్య మీసందర్భమున నిరర్థకము. వృద్ధులు, అనుభజ్ఞులు, వైజ్ఞానికులు, సర్వజ్ఞాన సంపన్నులు సహితము వెల్లవాఱిన మోములు వేల్వైచి మిన్నకుండిరి. ఆశ, ఉత్సాహము, కళయు వారి వదనముల నుండి తొలఁగ, వారు కేవలము నిర్జీవ ప్రతిమలవలె నుండిరి. వర్ణనాతీతమగు భయముతప్ప వారి కితర మెఱుంగఁ జాలరైరి. లక్షాధికారులగు ధనవంతులు సహితము భయవిహ్వలులై యుండిరి. సర్వభయ నివారిణియగు ధనమే నిరర్థకమగు నపుడు, దారిద్ర్యపంకమునఁ బొరలాడు పేదల గుఱించి వేఱుగఁ జెప్పవలయునా! కంటికిఁ గానరాని వ్యాధివలె, చీడవలె, పీడవలె, మరణము నగరము నందు వ్యాపించి, విజృంభించి, తాండవమాడుచు, సుందర సజ్జనసంహారమొనరించుచు, ప్రజాహృదయమును బూర్తిగఁ గలంచివైచెను.

నగరరక్షణక్రియాదక్షులగు నధికారులు తద్రహస్యము భేదింపవలయునని కడుఁ బ్రయత్నించిరి: శక్తివంచన లేకుండ మిక్కిలి పాటుపడిరి: రక్షకభటుల సంఖ్యఁ బెంపుచేసిరి. అనుమానాస్పదములగు స్థలములందు నెక్కుడు భటులను గాపుంచిరి. రేయి యగునంతనే ద్విగుణీకృతమగు జాగరూకతతోఁ గాచుచుండిరి. అధికారులు ప్రచ్ఛన్నరూపమున నగరమునం దెల్లెడలను దిరుగాడుచుండిరి. ఉన్నతరక్షకోద్యోగులు సహితము తమ సహజ దురహంకారమును వీడి, సందులు, గొందులు, భయంకరహంతకజనులు నివసించు మాఱుమూలలు — ఈ యా స్థలములనక, నగరమునందంతటను వాయువువలె వ్యాపించి, ప్రాణభయంబని వెనుదీయక, శ్లాఘాపాత్రమగు పట్టుదలతో బహుళప్రయత్నము లొనరించుచుండిరి. రక్షకభటులు తమ బుద్ధిశక్తి నైపుణ్యములు వెల్లడియగునట్లు క్రొత్తక్రొత్త విధములను

ప్రయోగించుచుండిరి. కాని, ఆ ప్రయత్నము లన్నియు సముద్రము నందుఁ గలుపు చక్కెరవలె, బూడిదబోయు పన్నీరువలె, బూర్తిగ వ్యర్థమాయెను. హత్య లెప్పటియట్లు నిరాఘాటముగా జరుగుచుండెను.

అంతటి దురవస్థకుఁ బాల్పడిన జనులు విగతధైర్యులై, తమ తమ సామాన్యవ్యాపారములఁ జక్కబెట్టికొనఁజాలకుండిరి. స్వగృహము వీడిన నెట్టి యపాయము సంభవించునో యని తహతహ లాడఁజొచ్చిరి. పుత్రమిత్రాది బంధుజనులం గోల్పోయిన మఱికొందఱు క్రోధాతిరేకమున నొడలెఱుంగక కసిదీర్చికొనవలయునని దృఢముగ సంకల్పించుచుండిరి. మఱికొందఱు ప్రభుత్వమువారు ప్రకటించిన యమూల్య బహుమానము గడింప నాసించి, తత్కార్యసాధనాయత్తచిత్తులై నగరమునందందందు సంచరింపఁదొడంగిరి. పదునెనిమిది ముప్పది సంవత్సరముల నడుమ నుండు ప్రాయంపువారు మాత్రమే భయంకర దుర్మరణము పాలగుచుండిరని చెప్పియుంటిమి గదా. కావున, నా ప్రాయము మీఱిన వారలు నిర్భయముగ సంచరించుచుండిరి. కాని, వా రంతమాత్రమున సౌఖ్యముగ నుండిరా ? వర్తకులు, వణిగ్వరులు, సంపన్నులు, అధికారులు లోనుగాఁగల వివిధ తరగతుల గృహస్థులు సూర్యోదయ మగునంతనే, యే ప్రియబాంధవుఁడు, పాపిష్ఠి నిగూఢనిశితాశిఘాతమునం జచ్చి నదీగతుఁడాయెనని, వినవలయునో యని దురంత భయాక్రాంతచిత్తులై రాత్రులందు శయ్యాగతు లగుచుండిరి.

తురుష్కదేశ మా కాలమున ఇటీవల వఱకు గూడ నిరంకుశ రాజ్యము. తద్రాజ్యాధిపతియే సర్వమునై యుండువాఁడు. కాన, అట్టి విపరీత బాధలం గుందు దీనజనులు తమ సార్వభౌముఁడే తమరి నుద్ధరింపవలయునని సహజముగా నాసించిరి. సలీముపాదుషా యట్టి అత్యాచారముల కెంతమాత్రము బాధ్యుఁడు గాఁడని జను లెఱింగియుండిరి. కాని, జగద్రక్షకుఁ డగు పాదుషాయే తమ్ము రక్షింపనిమొడల,

ఇఁక దిక్కెవ్వరు? "పాదుషావారు సర్వాధికార సమన్వితులట, సర్వ శక్తియుతులట, సర్వగుణగ్రహణ పారీణులట కదా! ఇంతటి మహనీయులు రెండుసంవత్సరముల నుండియు నీయత్యాచారముల నడంపఁజాలనిచో, మన కీతనివలని ప్రయోజనమేమి?" అని జనులు తమలోఁ దాము ప్రశ్నించికొనఁ దొడఁగిరి. దుర్భర నరమేధము నడంచుట సుల్తానుయొక్క కర్తవ్యమని వారు నిశ్చయించిరి.

జనసామాన్యమే కాదు, పెద్దవారలు సహిత మట్టులే భావించిరి. వివిధతరగతుల పురజను లేకాభిప్రాయు లగుటచే, నాస్థానసభ్యులా విషయమును సుల్తానున కెఱింగింపవలసినవారైరి. సుల్తాను ప్రజాక్షేమము నరయువాఁడు. తన యుద్యోగు లొనరించుచుండిన ప్రయత్నము విఫలమైనందులకు వగచి, యధికతర తీవ్రప్రయత్నము లొనరించి యెట్టులైనను జనులను రక్షింపవలయునని కృత నిశ్చయుఁడాయెను. అట్టోమను సామ్రాట్టులలో సలీము కడు వివేకవంతుఁడు దయార్ద్రచిత్తుఁడు నైనను, ఆ పరిస్థితుల ననుసరించి కడు నిరంకుశముగనే మెలంగెను.

సలీము సుల్తాను నిండుదివాణమున సింహాసనాసీనుఁ డాయెను. మంత్రు లందఱు నాతనిఁ బరివేష్టించి యుండిరి. నగరమునందలి ప్రధానాధికారు లెల్లరు నరుదెంచి తమ తమ స్థలంబుల నాసీనులై యుండిరి. ప్రధాన న్యాయాధిపతి యనుజ్ఞాతుఁడై సభాభవనమున కేతెంచెను. ఈతఁడు మన కాలపు న్యాయప్రదాతలవలెగాక, సైనిక 'దివానీ' శాఖలకు సర్వాధికారియై యుండెను. ఈతఁడు 'హాసేను ఎఫండీ' యను నామము ధరించెను. ఈతఁ డరువదేండ్లు గడచిన ముదుసలిఁడు.

తన యధికారపు దుస్తులఁ దాల్చిన హాసేను కొల్వుకూటముఁ బ్రవేశించి, వెండితీగలవలెఁ దళ తళ మెఱయు గడ్డము నేలపై బొరలాడునట్లుగ సుల్తాను వారి సమక్షమున సవినయముగ సాష్టాంగ

మాచరించి, భయకంపితహృదయుఁడై దీనవదనుఁడై యల్లనఁ బాదుషా వారిని దిలకించెను. న్యాయాధిపతి యట్లు కలవరమందనేల? సుల్తాను నేఁడు సహజసుందర మందహాసము దొఱఁగి కఠినవదనుఁడై యుండెను. న్యాయాధిపతినిఁ గాంచి యాతఁ డిట్లు గర్జించెను —

"ఓయీ! ఈ యరాజకమునకు, అత్యాచారములకుఁ గారణ మేమి? నగరరక్షణభారము నీవు వహించియుంటివి. అధికారమంతయు నీ హస్తగతమై యున్నది. రెండు దీర్ఘసంవత్సరములు గడచెను. ఈ హత్యలింకను అంతరించుటలేదు. నగరమునందలి పెక్కు కుటుంబ ములు పుత్రాదులను గోల్పోయి ఘోషించుచున్నవే! ఏమందువు?"

"మహనీయ సార్వభౌమా! ఈ భయంకర రహస్యభేదన వ్యాపార మున నే నణుమాత్ర ముపేక్షింపలేదని మనవి చేయుచున్నాఁడను. చేయఁగల ప్రయత్న మొనరించుచుంటిని. నా దురదృష్టవశమున నింతవఱకును జయముఁ గాంచఁజాలనైతిని."

"ఓరీ! నా జనులు సహింపఁజాలక, ఒక్క తెఱంగున ఘోషింపు చున్నారు. వారా తెఱంగున వెఱగందుటకుఁ దగు గారణము లేక పోలేదు. ప్రజాసముద్ధరణ మొనరింపమేని, అల్లావారి దుర్వారాగ్రహము నకుఁ బాత్రు లగుదుము. బాధ దుర్భరమగునేని, జనులు తిరుగఁ బడెదరు; విప్లవము చెలరేఁగును; ఇతరదేశపు నృపాలురకు మేము హాస్యాస్పదు లగుదుము. హసేన్! చూడుము! ఎనిమిది దినములు గడువొసంగితిమి. ఈ లోపున నీ ఘోరవధ లాచరించు హంతకుని జాడఁ గనిపట్టవలయు. లేదేని, మిగిలిన న్యాయాధిపతులు నీవలెఁ గాక కడు నప్రమత్తులై ప్రభుత్వ కార్య నిర్వాహణమునకుఁ గడంగునట్లు, తొమ్మిదవనాఁటి యుదయమున నీ శిరము ఖండించి సింహద్వార మున ప్రదర్శింతుము."

ఆ తెఱంగున సలీము సుల్తాను కఠినముగఁ బలికి, నిజాధికారపుర

స్వరముగాఁ జేయి విదలించెను. ఆ భావము గ్రహించి, న్యాయా ధీశుఁడు హానీను మాఱుమాటాడుటకు సాహసము చాలక, నగము చచ్చి, దర్బారు మర్యాదచొప్పున మూఁడు ప్రణామములు లొనరించి యావలకుఁ బోయెను.

సుల్తాను క్రూరుఁడు గాఁడు, కఠినుఁడును గాఁడు. పరిస్థితులు ప్రతి ఘటించుటచే నితికర్తవ్యతావిమూఢుఁడై, యంతటి కాఠిన్యము నాతఁడు వహించెను. సభామధ్యమున సింహాసనాసీనుఁడై యాతఁడు గాంభీర్య ధుర్యుఁడై భయంకరపు టాజ్ఞ నట్లు ప్రకటించెనేగాని, లోలోన నాతఁడు కడు పరితపించెను.

సభ యంతటితో ముగిసెను. సకరుణుఁడగు సలీము విచారా క్రాంతచిత్తుఁడై యంతిపురంబుఁ జేరి, 'ముస్తఫా,' 'మహమ్మదు' అను తన ప్రియ పుత్రులం జీరి, నాఁటి సమాచారము వారికిఁ దెలియఁ బఱచెను. "తండ్రీ! విచారింపవలసిన యవసరము లేదు. శరదిందు విమల చంద్రికతోఁ దులతూఁగు నీ సౌజన్య మింత మాత్రమునఁ గళంకితము కానేరదు. రాజ్యభార ధురంధరుండ వగుటచే, నీ విధ్యుక్త ధర్మమును మాత్ర మొనరింపఁ గడంగితివి." అట్టి నిజపుత్రసమంజస సమయోచితానునయాలాపముల నాలించిన సుల్తాను హృదయభారము తొలంగెను.

ఈ సందర్భముననే రాజకుమారుల గుఱించి యొకింత తెలుప వలయును. వారి స్వాతంత్ర్యము నరికట్టి బందాలవలె బంధించియుంచుట తదాస్థాన సాంప్రదాయ సిద్ధమై యుండెను. వారి సౌఖ్యముల కేమాత్రము నంతరాయము లేదు. వారికై మందిరములు ప్రత్యే కింపఁబడెను. వాని కంటియుండు నారామములయందు వారు విహరింపవచ్చును. కాని, బాహ్యప్రపంచముతోడి రాకపోకలుగాని, ఉత్తరప్రత్యుత్తరములు గాని లేవు. అంతమాత్రమున వా రజ్ఞానాంధ

కారమున మునింగియుండిరని తలంపరాదు. ఆవల జరుగు సమస్త విష యములను ఎప్పటికప్పుడు వారికిఁ దెలియజేయుచుండిరి. ఆ కారణ మున, రాజధానియందలి భయానకహత్యాపరంపర గుఱించి వారును ఎఱింగియే యుండిరి. రాజధానికి దాపరించిన మహోపద్రవమును గుర్తించియుండుటచేతనే, రాజకుమారులు తమ జనకుని ప్రవర్తన మును నిండు సంతసముతో నామోదించిరి.

దురదృష్టవంతుఁడగు హసేను దుర్భర విషాద భయకంపిత హృద యుఁడై, తీవ్రాలోచనాతప్తచిత్తుఁడై, నిజమందిరాభిముఖుఁ డాయెను. శీలవతియగు నాతని భార్యయు, సుందరాంగియగు పుత్రి కయు నాతని రాకకై నిరీక్షించుచుండిరి. న్యాయాధిపతియగు హసేను అంతలో నరుదెంచి, సుల్తాను క్రూరశాసనము వారి కెఱింగించెను. పాపము వారు ముగ్గురుంగలసి తమకు సంభవించిన ఘోరవిపత్తు దలంచి పనవి పనవి యేడ్వనారంభించిరి. ఆతఁడప్పుడే మరణింపనుండి నట్టులా యబలలు సుస్నిగ్ధభాసురవదనమండలములు సుందరసంధ్యా రుణరాగము నందము వహింప, బాష్పవారి విమల ముత్యంపుసరుల వలెఁ దోరంబై ప్రవహింప నవ్యక్త కలస్వనంబున విలపించిరి. కొంత తడవైన పిమ్మట హసేను పెద్దనిట్టూర్పువిడిచి, విషాదానల ప్రభా వముచేఁ దడియారిన గొంతు సవరించి, యాలోచనపూర్వకముగా నిట్లు పరితపించెను —

“ఏమిచేయుదు? దిక్కేయ్యది? రెండు సంవత్సరములలో సాధ్యము కాని కార్యము ఎనిమిది దివసములలో సాధ్యమగునా? ఎట్లు కాఁగలదు? అత్యద్భుత హత్యాన్వేషణా నైపుణ్యముగల రక్షకభటులే యరయఁ జాలని ఘోరతర రహస్యము నేనెట్టు లరయఁజాలుదు? ఇది యంతయు నా ప్రాణము కబళించుట కుత్పన్నమైన యపూర్వాభేద్యవిచిత్రసంఘటన...”

న్యాయాధీశుని పుత్రికయగు జులేఖా మృదుల మధురస్వరంబున

నిట్టులనెను —

“ జనకా! ఈ మహోపద్రవము తొలఁగు నుపాయము లేదా? పాదుషావారి భయంకరాగ్రహమును జల్లార్చి వారి కఠినశాసనము ను సంహరింపఁజేయు మిత్రుఁడు నీకు లేఁడా?”

నిబిడాంధకార బంధుర వాతావరణమున మెఱయు తటిల్లతవలెఁ దోఁచిన యాశాలేశముచే నొక్కింత యూరటఁ గాంచి, జులేఖా జనయిత్రి తత్తరపాటున నిట్టులనెను —

“ ఔను, నా సోదరుఁడు ‘పాషా’ తనకుఁగల పలుకుబడిని ప్రదర్శించి, మనలఁ దప్పక రక్షించును.”

హతాశుఁడగు హసేను తల పంకించి దైన్యముగ నిట్టులనెను —

“ ప్రేయసీ! ఎక్కడి యాస? మేటి నగరరక్షణ భార ధురంధరుఁడనగు నేనే పాదుషావారి క్రూరశాసనము వాఁత బడియుండ, ఏ యధికారి, ఏ పాషా నన్ను రక్షింపఁగలఁడు? ఇట్టి కఠినప్రవర్తనము తమ విధ్యుక్తధర్మమని మన పాలకులు విశ్వసించి యున్నవారు. ప్రయత్నమువలనఁ బ్రయోజనము లేదు.”

మఱల మువ్వురు విచారభారమున క్రుంగిపోయి, మాటాడనేరక మిన్నకుండిరి. అంతలో నా కాంతామణి చటుక్కున మోమెత్తి, ముకుళిత వదనసరోజ మొకింత వికసింప, నాకస్మిక సంజనితోద్విగ్న చిత్తయై, నిజమనోకాంతుని డాసి, యాతని వీనుల నిట్లు గుసగుసలాడెను — “నాథా! మనల నుద్ధరించువాఁ డొక్కఁడు గలఁడు. నాఁడు మీ రొనరించిన యమితోపకారమునకుఁ బ్రత్యుపకార —”

“ హా! మఱచితి —” తన భార్య పలుకుల నాలించినంతనే, హసేను నావరించిన సాంద్రతర నిరాశామేఘములు పటాపంచ లాయెను. పెన్నిధిఁ గన్న పేదపగిది నమందానంద కందళిత హృదయుండై ధూర్తుఁడు పత్వరముగ నిట్టులనెను —

"హా! మఱచితి. నేను సహాయ మపేక్షింపఁజాలువాఁ డొక్కఁడు గలఁడు. అంతులేని యీ విపదంబుధినుండి తరింపఁజేసిన, నాతఁడే చేయవలయు. కాని, ఒక్కక్షణమైన నాలసింపరాదు. సుల్తాను రయంబునఁ బ్రసన్నుఁ డగువాఁడు కాఁడు. కృతనిశ్చయ మైయున్న యాతని చిత్తనిశ్చలతను సడలించుటకు గొన్ని దినము లగును."

"నాథా! ఇఁక నాలస్యమేల? కలమిదిగో! ఇది కాగితము. ఏమి వ్రాయుదురో –"

ఆ వాక్యము పూర్తి కాకుండగనే, హాసే నిట్టులనెను –

"ఔను. లేఖ లిఖింతును. మన ప్రియపుత్రికయే దౌత్యము నొనరింపవలయు. ఆతఁడు మాననీయుఁడు. కాన, నాతని సముఖమున జులేఖా నిర్భయముగా మేలిముసుఁగుఁ దీయవచ్చును. అశ్రుజలపూరితనయనయై తన జనకునకై యర్థించు సుందరబాలికా రత్నముం గాంచునంతనే యాతని మెత్తని చిత్తము కరఁగక మానదు."

భయంకర మృత్యువదన గహ్వరముఁ జొరనుండిన జనకుని రక్షింపఁ బ్రయత్నించుట కే పుత్రిక సమ్మతింపకుండును? హాసేను పలుకులు పూర్తిగ నాలింపకముందే యాతని యనుంగు పుత్రిక సమ్మతించెను. తా నొనరింపవలసిన దౌత్య మెట్టిదో యా బాలిక చింతింపలేదు. అంతలో హాసేను జాబు లిఖించెను. జులేఖా యా జాబు నందికొని, జనకు నుపదేశము గ్రహించి, యనుజ్ఞాతయై రయమున నిర్గమించెను.

అపూర్వ సౌందర్యవతి యగు జులేఖా మేలిముసుఁగు దట్టముగఁ దాల్చి, రాజధాని యందలి వీథులవెంబడి వడి వడిఁ బోయి, ప్రసిద్ధ దుర్గరాజము సమీపించెను. ఆమె వెంట నరుదెంచిన పరిచారిక లిర్వురు సింహద్వారము చెంత నిలువ, నా కాంత యందుఁ బ్రవేశించెను. కావలియుండు భటానీక శ్రవణమున నెద్దియో పలుకుచు నామె కక్ష్యాంతరంబులు కడచి, సుళువుగా నంతిపురంబుఁ జొచ్చెను. అందరి

ద్వారములఁగూడ నట్టులే యతిక్రమించి, చాల దవ్వరగిన యనంతరము ఘోరభయంకరాకారుఁడు, కాలమేఘముంబోలిన వాఁడొకఁడు గోచరించెను.

ఈ కృష్ణాంగుఁడు కొజ్జాల కందఱకు నొడయఁడు. తదధికారము ననుసరించి వానిని 'కిసలర్ ఆగా' యనిపిలుతురు. మర్యాదగౌరవములం దాతఁడు పాషాలతో సమానుఁడై యుండెను. పాదుషావారి యంతిపురశాఖకుఁ జెందిన యధికారి యగుటచే, నాతఁడు కడుగౌరవనీయుఁడై యుండెను. తదనుగుణముగా నాతఁడు సువర్ణాలంకార విరాజమానమగు డాబుసరి దుస్తులఁ దాల్చి మూర్తీభవించిన యధికారమువలె నుండెను. ఆ యాగా ప్రసన్నుఁడైన గాని, జులేఖా కృతకృత్య కానేరదు. కాన నాతనిఁ గాంచినంతనే, యామె ముద్దియ సవినయముగా మోకరించి దైన్యముగఁ బ్రార్థించెను. ఆతఁడు మొదట నిరాకరించెను; యనంతరము సంశయించెను; అవనతవదనయై రమణీయ ముక్తాఫలోపమాన బాష్పబిందు సందోహ విరాజిత నయనయై దీనతర కలస్వనంబునఁ బ్రార్థించు నా కలకంఠిపై తుదకు జాలి వహించి, 'కిస్లరాగా' యామె నా చెంతనున్న మందిరమునకుఁ గొంపోయెను. కాని, పాఠకుల నం దీ సమయమునఁ బ్రవేశపెట్టఁజాలము.

అం దేమాయెనో గాని, మన జులేఖా యొక గంటలోపుననే, రాజనగరునుండి యరుదెంచెను. ఆ కన్నెమిన్న యాశా సంతోష దీపిత సుందరాననము, లఘుతరగమనము గమనింతుమేని, యామె సందేశము భగ్నము కాలేదని స్ఫురింపక మానదు. తన పరిచారికలు వెంటనరుదేర, జులేఖా శీఘ్రముగ నిల్లుజేరెను.

తమ పుత్రిక రాకకై తలిదండ్రులు కడు నాతురముతో నిరీక్షించుచుండిరి. గృహముఁజొచ్చినంతనే ఆకుమారితొలుదొల్త నతిరయమునఁ [illegible]నాలింగన మొనరించి, యనంతరము తన తల్లిని గాఢతరముగఁ

గౌఁగిలించెను. ఉత్సాహతమకమున నాపుత్రిక మాటాడనేరకున్నను, దూతకృత్యము సఫలీకృతమాయెనని యా దంపతులు గ్రహింపఁజాలియుండుటచే, నమందానందకంపితహృదయులైరి. జులేఖా యెటులుండెను? ఆ ఏణాక్షి విశాలతరళనయనముల నుండి వెలువడు నానందబాష్పబిందువులు ధవళమౌక్తికముల వలె రాజిల్లుచు సుస్నిగ్ధభాసురకపోలముల వెంబడి కుచకుంభములపై వ్రాల, సుందరకుసుమసంభరితమగు లతికవలె మోము వాల్చియున్న యా బాలికారత్నము వర్ణనాతీతయై యుండెను.

తదానందరసోద్రేకము చల్లారినంతనే, పాదుషావారి యంతిపురంబు సందలి యుదంతము జులేఖా సవిస్తరముగ నెఱింగించెను. ఆ పలుకులనెడు నిర్మలసలిలమును పిపాసాపీడితులగు పాంథులవలె నా దంపతులు గ్రోలి సంతోషపారవశ్యమున దమ ముద్దులపట్టిని గ్రుచ్చి కౌఁగిలించికొనిరి. హాసేనిట్టులనెను. —

"తల్లీ! నీయభిమానము, కార్యరచనానైపుణ్యము నసమానములు. ఈ సాయంకాలము నీ మాతులగృహంబున కేగుము. నాపైఁ బాదుషావారు ప్రయోగించిన భయంకరశాసనము నాలించి వారెల్లరుఁ గడు దల్లడిలుచుందురు. వారి భయముడిపి నీమామయొక్క పుత్రికల సహవాససౌఖ్యము ననుభవించి యరుదెమ్ము."

జులేఖా యిట్లు బదులాడెను.

"తండ్రీ! అట్టి యవకాశము లేదు. నాదౌత్యము గుఱించి మీరిరువురు దప్ప నన్యులెవ్వరును నెఱుంగరాదని యామహనీయుఁడు ఖచితముగాఁ బలికెను. కాన, ఈసమాచారము వారలకు నివేదింపఁజాలను."

"పట్టీ! యట్టులేయగుఁగాక. ఈదారుణ రహస్యభేదనకార్యపరతంత్రుండనై, నిద్రాహారములం దలంపక, రేయింబవళ్లని గణుతింపక,

సర్వవిధములఁ బ్రయత్నింతుననియు, సాధింతునను నమ్మకము కలదని యు, గురదృష్టవశమున నొకవేళ సాధింపఁజాలనిచో, నిక్కంపు మహామ్మ దీయునివలె విధివిధాన మవిలంఘనీయమని గుర్తించి ధైర్యోత్సాహ ములతో తొమ్మిదవ దినమున మరణముఁ గాంతుననియు దెల్పుము."

౨

పై సంగతులు జరిగిననాఁటిసాయంకాలము సూర్యాస్తమయ సమయమున సుందరాంగుఁడగు నొక తురుష్కయువకుఁడు సముచిత వస్త్రధారుఁడై, కాన్స్టాంటు నగరవీథులందు మందగామియై విహరించు చుండెను. వాని సౌందర్యము వర్ణనాతీతము. పౌరుషమయ సౌందర్యమున నంతకు నతి శయించు పరిపూర్ణవిగ్రహము తలంపునకు రాజాలదు. ప్రాయము ఇరువది రెండువత్సరములు మీఱియుండదు. శరీరము సువర్ణచ్ఛాయాసదృశమై, నిడుపును బలుచనయునై శలాకవలె నుండెను. నిండు యండాకారముగల వాని వదనము నిర్వికాసముగ నుండెను. అంతకంటె నెక్కుడు ప్రాయముగల యనుభవజ్ఞునివలె నాతని వదన మాలోచనాధీనమై యుండెను. శిరోజములు సుందరసాంద్రతరనీలంపుఁ గాంతులీనుచు నుండెను. నయనములు విశాల నీలోత్పలదళ సన్నిభములై సుందర నారీ జన నయనములవలె మనోహరములై ప్రేక్షణీయములై యుండెను. ఆ నయనములు సహజముగఁ గాంతివిస్ఫురితములయ్యు నాతఁడు యోచనా పరుఁడగు సమయమున మాత్రము కొంతతేవడి, మానస ముద్రే కించునపుడు గొబ్బునఁ బ్రజ్వలితములగుచుండెను. నల్లనై, మసృణమై, మనోహరముగ వంకలు తిరిగిన సన్నని మీసము సముచితముగ నమరి యున్న యోష్ఠము నాచ్ఛాదించి, ధవళదంతదీప్తులను మఱియు నతిశ యింపఁ జేయుచుండెను.

ఈ యువకుఁ డాలోచనాపరుఁడై, పరధ్యానముగ మెల్లగ నడచు

చుండెను. వాని వైఖరి గమనింప, నెవ్వనినో యరయఁగోరినటులు, ఎద్దియో కాంచుటకై యిలు వెడలి పచారు చేయుచుండినటులునుండెను. క్రమముగా నాతఁడు గ్రీసుదేశస్థులు నివసించు పేటలోనికిఁ బోయి దేదీప్యమానముగా రాజిల్లు నొక భవనముఁ గాంచి, యందుఁ బ్రవేశించెను. అది యొక కాఫీ మందిరము. అందు సుఖాసీనుఁడై యాతఁడు సామాన్యాల్పాహారములఁ గోరెను. సర్వజన విధేయుఁడగు సేవకుఁడు పథికజనాపేక్షణీయములగు పర్బతు హుక్కాలను గూడ సగౌరవముగఁ గొనితెచ్చెను.

ఆ సమయమునఁ దదశనామందిరమున మఱి యిరువు రతిథులు మాత్రమే యుండిరి. మనోహర వసనాలంకృతులగు నా యిరువురం గాంచినంతనే వారు గ్రీకులు కావలయునని స్ఫురించును. వారును మన తురుష్కుని ప్రాయమువారలే. వారి వస్త్రధారణము గూడ సరసముగనే యుండెను. రూపసంపదయును దత్సమానముగ నుండెననియే కాన్పించును. ఆ గ్రీకుల యెదుట నున్నది పానకము కాదు, నిర్మల సలిలము గాదు; మేజాపై మధురసపూరితమగు నొక కూజాయు, నాలుగు గ్లాసులును ఉండెను. వా రెద్దియో విషయము గుఱించి దీర్ఘముగఁ జర్చించుచు, మధ్య మధ్య మధురసాస్వాదనాసౌఖ్యముఁ జూరఁగొనుచుండిరి. తత్ప్రసంగమున నిమగ్నులయ్యు, నూతనాగతుఁ డరుదెంచినంతనే ప్రబోధితులై, పరస్పరసంభాషణములు నిలిపి, తమ నేత్రములతో నాతనిఁ బరిశీలింపఁ దొడంగిరి.

అట్టి పరిశీలనమునకుఁ గారణ మేమి? ఆలోచన పూర్వకముగా వా రా తురుష్కు నరయుచుండిరా? లేక వారు కేవలము యథాలాపముగా నూరక వీక్షించుచుండిరా? కొంత తడవైన పిమ్మట నా గ్రీకులు తమ వీక్షణ పరంపరల మఱలించి, భావగర్భితముగ నొకరి నొకరు తిలకించి, యెద్దియో గుస గుస లాడిరి. వారు మగుడ నా తురుష్కు-

వంశజునిపై దృష్టి నిలిపి, తోడనే మఱల గుస గుస లాడఁ దొడంగిరి. నాలుగైదు నిముసము లట్లుగడచెను. వారెద్దియో ముఖ్యతర విషయము గుఱించి దీర్ఘముగ చర్చించి, తలపోసి, తుద కొక నిశ్చితాభిప్రాయము నకు వచ్చినటు లుండెను. తోడనే వా రా యువకునిడాసి సవినయముగ, సగౌరవముగ, సదుచితముగఁ బలుకరించిరి. వారి యభిప్రాయము వ్యక్తమాయెను.

ఆ గ్రీకులు తనతో సరసముగ సంభాషింపఁ గోరిరని యాతఁడు గ్రహించెను. విశాలహృదయుఁ డగు నా యువకుఁడు తదనుగుణముగ మెలంగెను. గ్రీకులు సంతుష్టాంతరంగులై, వికసిత వదనులై, యా చెంతనున్న యాసనముల నలంకరించిరి. లోకసామాన్య విషయముల గుఱించి వారు ముప్పురు గొంతకాలము ప్రసంగించిరి. ఆ క్రైస్తవు లిర్వురు సోదరులు కారనియు, మిత్రులనియు, వారి నామధేయములు 'లూకాసు' 'జూలియను' అనియు మన తురుష్క యువకుఁడు గ్రహించెను.

ఆ యిరువురిలో లూకాసు అనువాఁడు ప్రాయమున నొక సంవత్సర మధికుఁడై యుండును. అతఁడు విచిత్రవర్ణ సమంచితము లగు దుస్తులను దాల్చియుండెను. ఆడంబరమగు నాతని దట్టికంటి మణి మయ విరాజితంబులగు బాకులు రెండు వ్రేలాడుచుండెను. కృష్ణ సర్ప సన్నిభములై, కుటిలములై, గుజ్జుగఁ బెఱిఁగిన యాతని శిరోజము లపైఁ జక్కని టోపీ యొకటి అమరియుండెను.

రెండవ క్రైస్తవ యువకుని వస్త్రధారణమున ఒకింత యధికతర నాగరకము సూచించుచుండెను. వా రిరువురు గ్రీకులే యైనను, తమ తమ స్థానిక సాంప్రదాయముల ననుసరించి వస్త్రధారణ మొనరించి యుండవలయును. వాని శిరోజములు గూడ గాఢతర నీలంపురాసి సుందరముతో నలరారుచుండెను. కొంచెము ప్రాన్యతరమై, పలు

చన్నై సొగసుగ నిగనిగ లాడుచు మాత్ర ముండెను. తురుష్కయువకు నకు వలె వారికిని గడ్డములు లేక తుమ్మెదరెక్కలఁ బోలు చక్కని మీసము మాత్రము దిద్దినటు లమరి యుండెను. లూకాసు మీస మొకింత దట్టముగ, నిండుగ, గంభీరముగ నుండెను.

జూలియను లూకాసు లిర్వురు బాల్యము నుండియు స్నేహితులు, సహాధ్యాయులు, ఉత్తమ వంశ సంజాతులు; తలిదండ్రుల యనుజ్ఞ వడసి దేశయాత్రాపరులై తొలుదొల్త రాజధాని కరుదెంచి, దర్శనీయములగు నా మహానగరమునందలి వివిధ వింత ప్రదేశంబులం గాంచుచు, సమందానంద జలధి తరంగముల నోలలాడుచు హాయిగ సందు విడిసియుండిరి. పారావారముఁ బోలిన యా నగరవతంసము వారు ప్రవేశించి పదునైదు దినము లాయెను. ప్రసంగవశమున నీ సంగతులు తురుష్కునకుఁ దెలియవచ్చెను.

తురుష్కయువకుఁడు గ్రహించిన రహస్య మొకటి కలదు. తనతో నా క్రైస్తవులు ధారాళముగ సంభాషింపఁదలచియుండిరని యాతఁడు కనిపెట్టెను. ఆ కారణమునఁ బ్రసంగవశమున నా మహమ్మదీయ యువకుఁ డిట్టులనెను —

“అయ్యలారా! నా కీ నగరము కేవల మపరిచితము. మీ రరుదెంచి పదునైదు దినములైన నాయెఁగాని, నే నీ యుదయమే యిందుఁ బ్రవేశించితిని. మిగిలిన నా యుదంతము మీ యుదంతమునే పోలియుండును. నేనును సద్వంశజుఁడను. ఈ ప్రసిద్ధ నగర సందర్శనమే, నా రాకకుఁ గూడఁ గారణము. ఆర్యులారా! మీ నామధేయములు ‘లూకాసు’ ‘జూలియను’ లని మీ మీ ప్రసంగములవలన గ్రహింపఁ గలిగితి. నన్ను ‘ఖలీలు’ అని పిలుతురు.”

గ్రీకులు మిక్కిలి సంతసించిరి. తురుష్కయువకుఁడు సరళ స్వభావుఁ డనియు, విశాలహృదయుఁ డనియు, తప్పక స్నేహపాత్రుఁ డనియు

వారు గుర్తించి, తమ సంతసము సముచితముగ వెలిబుచ్చి, తమ మధురసముం గొనివచ్చి యాతని చెంత నాసీనులైరి. అంత ఖలీలు ఇట్లు ప్రశ్నించెను —

"మిత్రులారా! మీ రీ నగరమున కేతెంచి యిన్ని దినములాయెం గదా. ఈ ప్రదేశమున కేల రావలయునని విచారింపలేదా? విచారింపవలసిన యవసరము లేకపోయెనా? నా హృదయ మెఱింగించెద, గమనింపుఁడు. ఈ రెండుజాములలో నాకుఁ దెలియవచ్చిన సమాచారము నింతకుముందే వినియుంటినేని, ఈ పాడు నగరమునఁ గాలిడి యుండను."

లూకాను ఇట్లు పలికెను — "మిత్రమా! నీ యభిప్రాయము గ్రహించితిమి. ఇంతమాత్రమున ధైర్యముఁ దొలంగువారము కాము. చలింపకుండుటయేగాక, అవకాశ మేమాత్రము చిక్కినను, ఈ భయంకర హత్యా రహస్యము నరయవలయునని కృతనిశ్చయులమై యున్నవారము. నిరంతర భోగార్ణవ నిర్మగ్ను నొనరింపఁజాలు ప్రభుత్వ ప్రకటిత బహుమానము గుఱించి వినియుందువా?"

"కొంచె మాలించితి. కాని, దయామయుఁడగు నల్లా కరుణాతిశయముచే నా యాహార విహారములకు లోటులేని సంపద కలదు. ఈ భయంకర నరవధ గుఱించి యందురా? ఈ నగరమునఁ దాండవమాడు మృత్యుదేవత దీర్ఘకరాళదంష్ట్రలకుఁ జిక్కకుండ నెట్లు సంచరింపఁగునా యని మాత్రము చింతించువాఁడగాని, వేఱు విచారము లేదు."

ఒక్క నిముస మెల్లరు నూరకుండిరి. అంత లూకాను ఇట్టులనెను —

"మేము మీ పట్టణమున కేతెంచిన ప్రథమదినముననే యొక వింత సంగతి సంభవమాయెను. ఈ భయంకర హత్యావ్యాపార కలాపము గుఱించి యపుడు తెలిసెనేని, నే సంతటి సాహసమునకు దొరకొని యుండువాఁడఁ గాను. పిడుగువంటి దుర్వార్త యామఱునాఁడు

మాకుఁ దెలియవచ్చెను.”

అంత జూలియను నిజహృదయాభిప్రాయసూచకముగా వింతగ మందహాస మొనరించి యిట్టులనెను —

“సాహస మొనరించినను, ప్రమాదము మాత్రము సంభవింపలేదు: ప్రమాదరహిత మగుటయే గాక, కేవలము మఱియొక విధముగాఁ బరిణమించెను.”

ఖలీలుఁ డుత్సాహపరుఁ డాయెను —

“సాహసమా! మీ రొనరించిన సాహసకృత్య మెద్ది? మీ సంభాషణ సరణి గమనించిచూడ, చాల కథ యున్నదని స్పష్టమగుచున్నది. మీ యీ పలుకులు కేవల ముపోద్ఘాతపూర్వక మనియు, అసలు విషయము నెఱుకపఱచి నాపై గల పూర్ణవిశ్వాసముఁ బ్రకటింతు రనియు విశ్వసింతును.”

లూకాసు తోడనే యిట్టులనెను —

“మిత్రమా! అభ్యంతర మేమి? గమనింపుము. మే మిరువురు మీ నగరమున కేతెంచి పదునైదు దినము లాయెనని తెలిసెఁగదా. మేము సాయంకాలము నగరప్రవేశ మొనరించితిమి. అశ్వారూఢు లమై ప్రయాణ మొనరించుచుండ, మార్గమధ్యమున నా మిత్రుఁడు జూలియను ప్రమాదవశమున నేలఁ బడెను. నా మిత్రుఁడా కారణమున బస దొఱకినంతనే తన మందిరముఁ బ్రవేశించి విశ్రమింపఁ గోరెను. నేనన్ననో, యధిక కుతూహలాధీన చిత్తుఁడనై, సంధ్యాసమయమున నీ మహానగర మెటులుండునో చూడవలయు నని యెంచి యిలు వెడలితిని. నే నొక వీథింబడి పోవుచుండ, నొక వృద్ధురాలు పలుకరించెను. తా నెచటికో పోవలయు ననియు, దారి యెఱింగింపవలయు ననియు నామె కోరెను. వెంటనే నా యసమర్థత తెలియఁబఱచితిని. అంత యటులో నా కాంత నన్ను వీడక, ఏమేమియో తెలిపి తెలిపి, నడుమ

నాకును నా కుశల మరయుచు నన్నెంతయు మెచ్చి మెచ్చి, తుద కాకస్మికముగ నిట్టులనెను — "ఆహా! నీవంటి సరసవచన రచనాధురంధరుండగు నవయౌవన ప్రతిభా విభాసితునిఁ గాంచినచో, మా దొరసాని యెంత సంతసించును! ఆనందపరవశ యగుఁ గదా!" నే నంత దరహాసితాననుఁడనై - "ఓ బోటీ! నీ యేలికసాని యెవ్వరు?" అని ప్రశ్నించితి. ఖలీలు మిత్రమా! నిజము చెప్పవలయుఁ గదా, సరస కథాక్రమమున కియ్యది అనుక్రమణిక కావలయునని గ్రహించితి; మఱియు నట్టి వ్యాపారమునఁ జొరుటకు నా కేమాత్ర మభ్యంతరము లేకపోయెను. కాని, ఈ నగర రంగస్థల ప్రదర్శిత భయానక హత్యా పరంపర గుఱించి యా సమయమున నెఱింగి యుండినచో, నప్రమత్తుఁడనై యన్యథా ప్రవర్తించి యుండెడివాఁడ సుమా."

తోడనే, ఖలీలుఁ డిట్లు పలికెను —

"కాని, నీవు చెప్పఁబోవు సాహసిక వ్యాపారమునకు ఈ పట్టణపు హత్యలకును పరస్పర సంబంధ ముండదని భావింతును. ఉండెనేని, నీవు సజీవముగా మగిడి యిట కరుదెంచి యుండవు గదా!"

"ఎటు లుండును? లేదనియే గ్రహింపవలయు. కాని, హృదయ విదారణ మొనరించు నా భయంకర హత్యలం దలంచుట కిది యదను గాదు. ఏమన, నా కథ నిరవధిక సంతసప్రదము: గమనింపుము. నీ యజమానురా లెవ్వతె యని ఆ వృద్ధవనితను ప్రశ్నించితి. కాని, సహజముగ బహుభాషిణి యగు నా జరఠాంగన బదులాడక, కుటిలముగ నవ్వి, ముక్కున వ్రేలిడి, అంత కుతూహలము అనుచిత మనియు, నన్నింక విశ్వసించుట ప్రమాదజనక మనియుఁ బలికెను. నా కుతూహలము శతాధిక మాయెనని వేఱుగఁ జెప్పవలయునా? నేఁ గడు వినయవిధేయుఁడనై యుందుననియు, అవంతయుఁ జలింపక కడు నిశ్చలముగ నుందుననియు, బహు జాగరూకతతో నడచికొందుననియు

నచ్చఁజెప్పి, సౌందర్యరాశియగు తన దొరసాని సాన్నిధ్యమునకుఁ గొంపో వలయునని బ్రతిమాలితిని. ప్రసంగవశమున నా ముదుసలి జారవిడిచిన మాటలఁబట్టి, యా వనితారత్న మెవ్వతె యైనను అసాధారణ సౌందర్యవతి కావలయునని యెంచి, తదానన విలోకనాతురుఁడనైతి. మొదట నా వృద్ధురా లనుమానించినటు లుండెను. కాని, నా స్థితి గతుల నరసి, నే నీ నగరమునకు క్రొత్తగ వచ్చి, దారి తెలియకున్నాననియు, ఒకింత దవ్వున నుండి తనను వెంబడింపవలయునని యామె పలుక, నే నట్లులే వెడలితిని. వియత్తలము మేఘరహితమై నిర్మలముగ నుండు టచే, నేను సుళువుగాఁ బోఁజాలితి. విశాలమగు వీథులఁజొరక, సన్నని సందుగొందులఁబడి సాగి సాగి, నదీతీరముఁ జేరితిమి. అచట నొక చిన్న దోనెయు, నందు ఇరువురు నల్లని బానిసలు నుండిరి. అందు మే మాసీనుల మైనంతనే నావ వడి వడిఁ బోసాగెను. పశ్చిమతీరమున నున్న సుందరారామములఁ గాంచుచు జలవిహార మొనరించుచుండ, నా ప్రవర్తన మపుడు స్మృతిపథమునకు వచ్చెను.

"నీ డెందము కొంచెము సందేహ భయాక్రాంతమై యుండును! ఏమందువా, ఈ నగర భయంకర హత్యల గురించి వినియుండక పోయినను, శుద్ధాంతమునఁ గాలుమెట్ట సాహసించితివి గదా. పరపురుషులు ప్రవేశింపరాని చారుతర కాంతా నివాస మందిరమే నీ గమ్యస్థాన మని గ్రహించి యుందువు. అంతకంటె సాహసకృత్య మే ముండును?"

ఖలీలుఁ డట్లు పలుక, లూకాసు మగుడ నిట్లు పలికెను —

"నిజముగ నొకింత భయభ్రాంతియుతుఁడ నైతి సుమా. ఇట్టి సాహసిక వ్యాపారమున నేలతగుల్కొంటినా యని ఖేద మొందితి. కాని, అంత యొనరించి యెట్లు మగుడనగును? కాన, విచారముడిగి ప్రయాణ మొనరించితిని. వృద్ధురాలి ప్రవర్తనము పూర్తిగఁ దెల్లమాయెను.

గృహాన్వేషణము కేవలము మృష యని గ్రహించితి. నా దృష్టి నాకర్షించి నన్నా ప్రసంగమునకు దింపుటయే యామె యభిప్రాయము కావలయునని నా కపుడు స్ఫురించెను. కాని, మిత్రమా! నీజాతి నంతయు నగౌరవ పఱచుచుంటినని తలంపవలదు సుమా — క్రైస్తవ సుందర నారీజన బృందమునవలెనే, తురుష్క వంశ సంజనిత మోహ నాంగులు సహితము అనంగ శరదళిత హృదయలై తనుచితముగ సంచరింతురనియు, ప్రపంచము కన్నెఱుంగక నేకాంతమునం బౌర లాడు మచ్చికంటుల కీ వృద్ధురాలివంటి తారుపుగత్తె లున్నంగాని రహస్యవ్యాపారము సాగదనియుం గూడ గుర్తించితిని. ఏమైనను, సాహసమగు కార్యమునందుం జొచ్చితిని. పరిణామము సానుకూలము గనే యుండెనని ముందే చెప్పియుంటి గదా.”

అంత రెండవ గ్రీసుదేశస్థుండగు జూలియను తన మిత్రుని వాంించి యిట్టు లనెను —

“మిత్రమా! కథ పెంపుచేయక, ప్రధాన విషయమునకు రమ్ము.”

ఉల్లసిత మానసుండగు లూకాసు మందహాస విరాజిత వదనుండై, వల్లెయని పలికి, ఇట్లు చెప్ప దొడంగెను —

“ఇంక శీఘ్రముగ ముగింతును. గాఢతర నీలంపు బాస్వర నదీజల ములపై నొక యరగంట శీఘ్రప్రయాణముసలిపి, ఇరువైపుల దట్టమగు వృక్షములచేం గప్పంబడి జనసామాన్యమునకు దృగ్గోచరముకాని యొక్క సన్నని క్రయ్యం బ్రవేశించితిమి. నాలుగైదు నిముసములలో మా నావ చాందినీవలె నమరియున్న జొంపముల నడుమం బోయి పోయి యొక సోపానపరంపరప్రమోాల నిలిచెను. తోడనే వృద్ధవనిత నేలకు డిగ్గెను. అనుజ్ఞవడసి నేనును దిగి యామె వెంటం బడితిని. ఆ కాంత హెచ్చ రింప, నాకులచప్పుడు కాకుండ మెల మెల్లగ నడచితిని. మే మొక విశా లారామముం బ్రవేశించితిమి. అవ్వనాంతమున సమున్నత వృక్షా

వృత్తమై యొక మందిరము గోచరించెను. దట్టంపుఁ బర్ణశాల నతిక్ర మించి సుందరమగు పచ్చికబయలు ప్రవేశించినంతనే, యొక ద్వారము కానవచ్చెను. కాని, మేము ప్రవేశింపవలసిన ద్వార మదికాదు. ఒకింత చుట్టు తిరిగి పాణిద్వారము చేరితిమి. ఆ తాళపుఁజెవి తనవద్ద నుండుటచే, నా వృద్ధురాలు రయమునఁ దలుపు తెఱచెను. మే మందుఁ బ్రవేశించి, తివాసితోఁ గప్పఁబడియున్న మెట్ల నెక్కుచు నారోహించి తిమి. అట్లు చాల దవ్వేగితిమి. అంత నొకచోని కెదురుగా నింకొకటి యమరియున్న రెండు ద్వారములు కాన్పించెను. అచట వ్రేలాడుచుండిన మనోహర రజిత దీపముచే నా ప్రదేశము కాంతి యుతమై యుండెను. ఆ కాంత రయమున నొకద్వారము జాయఁ బోయి, ఏలకో యాకస్మికముగ నిలచిపోయెను. నిలుచుటయే గాదు, భయంకర విషధరమునుగాంచు పాంథునివలె, నా యింతి యమిత భయాక్రాంతచిత్తయై వడంకుచు వెనుదిరిగెను. అంతటి వెఱపుకొలుపు నది సర్పమే కావలయునని యెంచి యడుగువైచి, కంపితహృదయుఁడ నయ్యు, గృపాణముపైఁ జేయిడి పరికింప, నొక చక్కని పాదరక్షల జత ప్రత్యక్ష మాయెను!"

ఖలీలు మందహాస మొనరించి యిట్టులనెను —

"గ్రహించితి. మహమ్మదీయుఁడ నగుటచే దదర్థము నాకు గ్రాహ్య మైనది. కాంతుఁడు నిజప్రియాంగన శయ్యామందిరము ప్రవేశించు నపుడు, పాదరక్షలు ద్వారముచెంత వీడును. పిలిచినఁ గాని, యం దెవ్వరు జొరరాదని యయ్యది సూచించును."

ల్యూకాసు మగుడ నిటులు చెప్పఁ దొడంగెను —

"కాని, ఆ సాంకేతికము నా కా సమయమునఁ దెలియదుగదా. ఏ పామో మార్గము నిరోధించి యుండునని భావించిన నా కంటికి ప్రాణము లేని చెప్పులు గోచరమగుటచేఁ బట్టఁజాలక పక పక నవ్వఁ

బోతిని. ఆ వృద్ధురాలి ప్రవర్తన మంతయు హాస్యాస్పదముగ, నంత విపరీతముగ నుండెను. కాని, ఆ ముహూర్తముననే యా తలుపు పిడి చలించెను. తోడనే, పరిచారిక యమిత భయవిహ్వలయై తడబడు తన హస్తముతో నాచేయి గట్టిగఁ బట్టి, రెండవద్వారము కడ నిశ్శబ్దముగాఁ డెరచి, యందు నన్ను ద్రోసివైచెను. అంతయు నొక క్షణమాత్ర కాలమున సంభవించెను. అమిత భయ కారణ మెద్దియో యుండుననని నే నపుడు గ్రహించితి. పెదవి కదల్పక ఆమె యేమొనరించినను ఊరకుంటిని. ఆ ప్రదేశ మంధకార బంధురమై యుండెను. ద్వారము వెంటనే బంధింపఁబడెను."

లూకాసు రెండు నిముసములు మిన్నకుండెను. ఖలీలుఁ డిట్లు ప్రశ్నించెను —

"ఆ పరిచారిక నిన్ను వెంబడించెనా?"

"లేదు, ఆ తమోసాగరమున నే నొక్కఁడనే యుంటిని. ఆ గభీర నిశ్శబ్దప్రదేశమున నేకాకినై యుంటి. నిమిషములు కడచుచుండెను; నేనట్టులే నవగాధిఁ జెంది యుంటిని. క్రమముగా ననిర్వాచ్యభయాతురుఁడనైతి—"

"ఆహా! నీ కాసమయమున భయంకరనాగరిక హత్యలగుఱించి తెలిసియుండెనేని—"

"ఎఱుంగను, ఎఱుంగను! ఎఱింగియుండినచో, నెంతకైనఁ దెగఁబడి యెంతటి సాహసమైన నొనరించి, యాప్రదేశమునుండి తప్పించుకొనుటకై ప్రయత్న మొనరించి యుందును. నిముసములు కడచెను. అంధకారమునఁ బొరలాడుచుంటిని. ఏమియుఁ దోపకుండెను. నే నెందుంటినో, నాకు సంభవించిన యుపద్రవ మెద్దియో, నే నే మొనరింపవలయునో, ఏమియుఁ దెలియదాయెను. అట్టి విపరీతపు దురవస్థకుఁ బాల్పడి దుఃఖితాత్ముఁడనై యుండ, నా పాదరక్షలుండిన ద్వారము

సార్భాటముగాఁ దెలుపఁబడెను. ఆ శబ్దముతోఁ బాటు ఈ పలుకులు స్పష్టముగ, ఖండితముగ, బిగ్గఱగ వెలువడెను — "అమీనా! అమీనా! ఏమీ వైపరీత్యము! ఆ స్త్రీ యేమాయె? నాయాజ్ఞ యగునంతనే ఫలాహారములఁ గొనిరాదేమి? ఇంకను రాదే! —" ఆహా! నాయవస్థ యప్పుడెటులుండెను? వర్ణింపఁజాల. ఆ యధికారపూరిత వాగ్జాలముల నాలించినంతనే, యాతఁడు గృహాధిపతి కావలయునని గ్రహించితిని. భయాతిరేకమున నాయొడలంతయు నొక్కసారి కంపించెను. నే నొనరించిన మహాపచారము నాకిపుడు వ్యక్తమాయెను. యజమాని ఒకవేళ నేనుండిన మందిరముఁ బ్రవేశించిన, నేమిచేయవలయు? నా గతి యేమికావలయు? దురంతభయానల తప్తుఁడనై కాల్సేతులాడక గిజగిజలాడుచుండిన యాసమయమున, నామందిరపు టంతర్ద్వారము తెరువఁబడెను; కాంతిసముజ్జ్వలమగు దీపము మెఱుపువలె మెఱసెను; దీపమేగాదు, అపూర్వసౌందర్యవిభాసితవదనయగు జవ్వని యొక్కతె గాఢనీల మేఘపటలమునుండి వెలువడు పూర్ణసుధాకరబింబమువలె, నయనపర్వముగ నుదయించెను. మేలుముసుఁగు దొలఁగియున్న యాసర్వాంగసుందరి, ఆ విద్యుల్లతాంగి, నాకమునుండి దిగివచ్చిన దివ్యాంగనవలె నుండెను. ఆ దివ్యసుందరవిగ్రహముఁ గాంచి మంత్ర బద్ధమగు సర్పమువలె పారవశ్యుఁడనై, చైతన్యవిహీనుఁడనై, యని మిషనయనుఁడనై యట్టె నిలిచిపోతిని. ఆ నవమోహనాంగియు నన్నుఁ గాంచి విస్మయవిస్ఫారితవదనయై, విభ్రాంతచిత్తయై యట్టె నిలిచిపోయెను. నే నెటు శేతించితినో, దానేమి కావింపవలయునో, ఆ తరళనయన యాక్షణమున నిర్ణయింపనేరకపోయెను. తుదకామె నన్నుఁ డాసి — "హా! నీ వెవ్వఁడవు? ఈ శుద్ధాంతము నెట్లు ప్రవేశించితివి? ఏమి చేయుచుంటివి? —" అని వడివడిఁ బ్రశ్నింపఁ దొడంగెను. ఆ ప్రశ్నావళి నాలించి, యాచెంతనున్న మందిరముననున్న

మఱియొక దివ్యసుందరవిగ్రహము బిఱబిఱ నరుదెంచి సాక్షాత్క-
రించెను. ఆహా! ఆ యెలనాగ సోయగము సహిత మద్వితీయమై,
యగణితమై, నిష్కళంకమై యుండెను. ఆ యిందుముఖుల నిర్వుర
నొక్కసారి కాంచినంతనే, వార లేకగర్భసంజాతలు కావలయునని
గ్రహించితిని. నే నాపైఁ గాలహరణ మొనరింపక నా యుదంత
మంతయు రయమున సంగ్రహముగ నెఱుకపఱచితిని. అంత నా సుందరు
లొకరినొకరు తిలకించిరి. వారి పరస్పరవిలోకనములు విస్మయాశ్చర్య
సమ్మిళితములై యుండెను. ఆ యబలారత్నములు మార్దవలజ్జాపరలై
నాపైఁ బ్రేక్షణమాలికలను బుంఖానుపుంఖములుగఁ బఱపిరి. అంతలో
నెద్దియో ఆకస్మికముగా స్మరణకు వచ్చుటచే జ్యేష్ఠసోదరి దిగ్గున
లేచి, నే బ్రవేశించిన ద్వారమునకు బీగము వైచెను. తమ మందిర
మున కరుదేఱవలయునని ఆ యన్నుమిన్న నన్నంతట నాహ్వానించెను.
ఉత్సాహపూరిత హృదయుఁడనై రయంబున వారితో సరిగితిని.
వివిధ వస్తు సమృద్ధమగు నొక విశాలమందిరముఁ బ్రవేశించితిమి.
అందొకమూల కమనీయ చంద్రకాంత శిలానిర్మిత జలస్తంభము విమల
పరిమళ సలిలము మనోహరముగా నెగురఁజిమ్ముచుండెను. మిత్రమా!
ఆ కోమలాంగులు పదునేడు పందొమ్మిది వర్షముల ప్రాయపువారై
యుందురు. ఆ కళంక రహితేందు ముఖులు తమ మేలుముసుఁగుల
ధరింపలేదు. ఒక్కసారి ప్రదర్శితమాయె, నిఁక ముఖాచ్ఛాదనా
ప్రయత్నమేల, యని వారు సహజముగా భావించియుందురు. ఎట్లు
భావించిన నా కేమి? నేను ధన్యుఁడనైతిని. ఒక మొగమలుసోఫాపై
వారలాసీనలై నన్ను వారి నడుమ గూర్చుండఁబెట్టిరి. నే నేతెంచిన
కథాక్రమము మఱల నివేదింపవలయునని యాసుందరాంగులు కోరు
టచే, నా యుదంతము సవిస్తరముగా నెఱింగించితి. ఆ హేమ
గాత్రిలు మగుడ నాశ్చర్యపరవశలై సాభిప్రాయముగా నొండొరులఁ

దిలకించిరి. వా రపుడు యథార్థము నెఱింగించిరి. తమ జనకుని భార్య తన యుపయోగార్థము నన్నా తెఱంగున రప్పించెననియు, పరిచారిక యగు అమీనా భయవిహ్వలయై, చేయునదిలేక, నన్నుఁ దమ మందిరశ్రేణియందుఁ బ్రవేశపెట్టెననియు, నా కలకంఠులు తెలియపఱచిరి. ఇంకను ఒక సంశయము నన్ను బాధించుచుండెను. 'జనకుని భార్య' యనిచెప్పనేల? జనకుని భార్య జనని కాకుండునా? నేనా విషయము ప్రశ్నించి, సంశయనివారణ మొనరించుకొంటిని. వారి జనయిత్రి మరణించెను. తోడనే యాతఁడు మఱియొక కాంతను వివాహమాడెను. 'ఇస్మిలడా' యను పేరుగల ఆ సతీమణియే నన్ను రావించెను. తద్రహస్యము తెలిసినంతనే, నా యవస్థగుఱించి చింతించితిని. నా రహస్యవ్యాపారము బయల్పడునేని, ఎంతయేని యుపద్రవము సంభవించును. నేనేగాక, ఆ కాంతారత్నము, ఆ పరిచారిక యుంగూడ మహాపదం బొరయుదురు. కాన, ద్రోహ మొనరింపరాదని యాసోదరీద్వయమును వేడికొంటిని. అంత నాయగ్రజ శంకాసంతోషమయ వీక్షణజాలముల నాపైఁ బఱపి, మాయామర్మముల నెఱుంగని ముగ్ధయయ్యు, ప్రౌఢముగ నిట్లుపలికెను — "ద్రోహమా, ఎంతమాట! ఆర్యా! భీతిఁదక్కి యుండుము. మఱియు, రహస్యభంగ మొనరింతుమేని, నీ దర్శనభాగ్యము మఱల లభింపదుగదా." మిత్రమా! నా యానందమునకు మేఱలేదు. అంత వారి నామధేయముల నడుగ, నగ్రజపేరు 'గుల్నేరు' రెండవ యిందుముఖి పేరు 'జైరజా' యని తెలిపెను. వృద్ధపరిచారిక యగు నమీనాను ఆగ్రహోదగ్రుఁడై కఠినముగఁజీరిన యాతఁడే వారి జనకుఁడగు 'దాల్టబను పాషా'. అమీనా గుఱించి యేమాలోచించిరో, నే నా మందిరము మగుడఁ బ్రవేశించి వారి సుందరవదన సందర్శనభాగ్యము నెట్లు వడయఁగలనో తెలియఁగోరితిని. కాని, అమీనా యొనరించిన

ప్రయత్న మన్యథా పరిణమించుటచే, నామె పూర్తిగ వారిచేఁజిక్కియున్నది. ఇఁక నావృద్ధురాలు వారిమాట కెదురాడఁజాలదు ఒకవేళ నా రాకపోకల గుఱించి ఇస్పెల్లాసతి యెఱుంగవచ్చినను, మమ్మాపద వాటయింపనేరదనియే విశ్వసింతుమని గుల్నేరు సమంజసముగాఁ బలుక, నా హృదయభార మడంగెను."

"ఆకాంతల సముచితకల్పనా ప్రావీణ్యము ప్రశంసనీయమే." అని ఖలీలుఁడొకింత విరసముగాఁ బలుక, లూకాసంత నిట్లుబదులాడెను —

"వారి ప్రవర్తనము గుఱించి దురభిప్రాయపడుట యసంగతము. నిష్కపట నిర్మల నిశ్చలస్వభావలగుటచేతనే, యాముహూర్తమున వారట్లు మెలంగిరి. నా నుడులు విపరీతముగఁ గాన్పించుఁ గాక, అయ్యదే నిశ్చయము. సహవాసము నెఱుంగక పొగులు పడఁతులు సంతసప్రదమగు సహచర్యము నపేక్షించుట సహజముగదా. అంతియు గాని, పరిస్ఫుట దర్పణ సదృశనిర్మల హృదయలగు నా మానినీమణులు దురూహలఁ దలంపఁ జాలరు."

"అసంభవము! తలంపజాలరు" అని రెండవ గ్రీకు యువకుఁడు గంభీరముగాఁ బలికెను. ఖలీ లిట్లులనెను —

"ఓహో! తెలిసినది. సౌందర్యనిలయమగు నా స్వర్గలోకమునకు నీవుగూడఁ బ్రయాణ మొనరించి యుంటివి కాఁబోలు."

"ఔను. ఆ విషయముఁ గూడ మన మిత్రుఁడు లూకాసే చెప్పఁగలఁడు." ఆ కథకుఁ డిట్లు మగుడ నుడువఁ దొడఁగెను —

"జ్యేష్ఠసోదరియగు గుల్నేరే నా హృదయము నాకర్షించియున్నను, ఆ యిరువురతో సముచితముగఁ సంభాషణ మొనరించి, యనంతరము నే నొకమిత్రునితో నీ నగరముం కరుదెంచితిననియు, ఈ సారి అతనిఁ గూడఁ బ్రవేశపెట్టుదుననియుఁ దెలుప, నా మదవతీరత్నములు సంతోషితస్వాంతలై యామోదించిరి. మిత్రమా! అదియే నా సాహ

య్యముచే నా రేడుసారులా శుద్ధాంతసదనమునఁ జొరఁ జాలితిమి; ఆ దివిజనారీశిరోరత్నముల సందర్శించి ముచ్చటించు భాగ్యము కాంచితిమి. పలు మాట లేల ? మదీయ హృదయ మెఱింగించెద. నా చిత్తము గుల్నేరు కాంతాధీనమై యున్నది. అన్యకాంతను వివాహ మాడనొల్లను. ”

తత్సమానోత్సాహముతో జూలియను ఇట్టులనెను —

“ రెండవ సోదరి యగు తైరజాయే మదీయ ప్రణయాధిదేవత. నే నా మనోహరకుసుమ కోమలినే పరిణయ మాడెదను. ”

ఖలీలుఁడు కొంతతడవు గాఢాలోచనానిమగ్నుఁడయి యిట్లనెను —

“మిత్రులారా ! ఇట్టి రహస్యము నా కెఱిఁగించుట కెద్దియో భద్ర కారణ ముండవలయును. మీ మానసమున నెద్దియో యుద్దేశము లేకున్న, నింతటి యవివేక మొనరింపఁజాలరు. అవివేకమే గాదు. మాననీయుఁడగు దాల్టబనుపాషా యంతిపుర రహస్యవ్యాపారములను ఒక యపరిచితున కెఱింగించుట యగౌరవప్రదము హైన్యమునుగదా. ”

లూకాసు ధారాళముగ నిట్లు పలికెను.

“ ఉద్దేశము నిక్కముగఁ గలదు. నే నిదె వ్యక్తపఱచెద గమనింపుము. మొన్నటి సాయంకాలమే మే మా ముద్దుగుమ్మలఁ గాంచి యుంటిమి. నేఁడు మగుడఁ బోవలయు. కాని, వారి బంధుగురాలగు నొక జవరాలు వారి యాతిథ్యముఁ గాంచనున్నది. బాంధవ్యమునకు మైత్రి దోహద మగుటచే, వారి నెయ్యము గాఢతమమై యున్నది. అమితమగు చనవు బలిమిచే నా కన్నియ ఆ సోదరీద్వయమును వీడక తోడునీడవలె నిరంతరము వారి నంటియుండును. కాన, నా సుందరి కంటఁబడకుండ రాకపోకలు సాగించుట దుస్సాధ్యము. మా రహస్యము నా పథూటి కెఱింగించుటకు తైరజా గుల్నేరులు సంకోచించిరి. ఆ కన్నియకూడ రహస్యభంగ మొనరింపఁజాలని పత్తి

స్థితులం జిక్కువడిన గాని క్షేమకరము కాదు. ఆ కన్నియ యనన్య సామాన్య సౌందర్యవతియట. తనచిత్త మింకను అన్యాక్రాంత మొనరింప లేద — ”

ఖలీలు దరహాసితవదనుఁడై యిట్టులనెను —

“ నీ యభిప్రాయము తెల్లమాయెను. మీ వంటి ప్రియుఁడు మఱి యొకఁడు కావలయు. ఆపై నీక నానందలహరి యవిచ్ఛిన్నముగ, అమందముగ, నిర్వ్యక్రముగఁ బ్రవహింపఁగలదు. ”

“ ప్రియుఁడు కాకున్న, ఆ నవమోహనాంగి ‘ జులేఖా ’ ను సరస ప్రసంగమునకు మఱలింపఁజాలు రసజ్ఞుఁడైనను జాలు. ”

అట్లు జాలియను పలుక, ఖలీలుఁ డిట్టులనెను —

“ జులేఖా ! ఆ ముద్దియ యభిధేయము జులేఖా ! ఈ నామధేయము కడు మధురము. ఈ లేమ సార్థకనామధేయ కావలయు. పేరు సర్వ సాధారణముగా స్వభావానుగుణముగ నుండును. కాని, ఈ జులేఖా యెవ్వరు ? ఈమెయు పాషాయొక్క పుత్రిక యగునా ? ఏలనందురా, ఈ వ్యాపార మతి భయావహము. ఘనాధికారసంపన్నులగు మహనీయుల శుద్ధాంత కాంతాజనంబులతో సరసము లాడఁ గడంగుట కడు ప్రమాద భూయిష్ఠము గదా. ”

“ మిత్రమా ! ఆ కన్య నామము జులేఖా యనియు, నామె యమితరూపవై భవసముజ్జ్వల యనియు మాత్ర మెఱుంగుదుము. కాని అన్యము తెలియదు. నీ వీ మందిరము చొచ్చినంతనే, నీ దివ్యాకృతి కాంచినంతనే, జులేఖాతోడి పరిచయమునకు నీవే తగుదువని మే మిరువురము గ్రహించితిమి. ”

ఆ తెఱంగున లూకాసు తమ విచిత్రోదంతము నెఱుక పఱచుటయే గాక, తమ హృదయాభిప్రాయముఁ గూడ వ్యక్తపఱచెను. ఖలీలు మగుడ నాలోచనాపరుఁడై, యనంతర మిట్టులనెను —

" ఆర్యులారా ! నేఁడు మిమ్ముఁ గాంచుట విధిప్రేరితము కావలయు. కాన, నా కభ్యంతరము లేదు. ఆ మనోహర ప్రణయ మందిరమున కెపుడు పోవలయునో, ఎటు లేగవలయునో మీరే యానతిండు. "

లూకాసు అమందానందకందళిత హృదయుఁడై నిజాననమునఁ జిరునగవు తూగాడ, సగర్వముగ నిట్లు బదులాడెను.

" సమయమా ! ఇయ్యెదె. అచిరకాలమునఁ బ్రయాణోన్ముఖులము కావలయు. "

అంత వారు ముప్వురు మధురసపాన మొనరించి, తద్గృహాధిపతికిఁ జెల్లింపవలసిన పైకము చెల్లించి యానలకుఁ బోయిరి.

## 3

యువకులు ముప్వురుఁ గలసి లెక్కకుమీఱిన సందు గొందుల వెంబడి పోసాగిరి. తలవెంట్రుకల చిక్కువంటి యామార్గము లూకాసు నకు బాగుగఁ దెలిసినటు లుండెను. అతఁడు మార్గదర్శకుఁడై ముందు నడువ, ఖలీలు జూలియను లనుగమన మొనరించు చుండిరి. మార్గమధ్యమున రక్షకభటు లనేకులు వారి కంటఁ బడిరి. హత్యా రహస్య విచ్ఛేదన క్రియా పరతంత్రులగు నధికారులు ప్రచ్ఛన్న రూప మున నెల్లెడల సంచరించుచుండిరి. వా రా యువకులఁగాంచి, "యువకు లారా ! భద్రము, విడిపోవునపుడు మాత్రము భద్రము ! " అని హెచ్చరించుచుండిరి. మిత్రసహితముగా విహరించుటయే క్షేమకర మని వారి యభిప్రాయము.

క్రమముగా వారు నదీతీరము సమీపించిరి. అచట నొక చిన్న నావ సిద్ధముగా నుండెను. చీఁకటివంటి బానిస లిర్వురు తెడ్డులఁ బూని యుండిరి. వా రందుఁ బ్రవేశించినంతనే, యాదోనె విహంగము వలె ఱివ్వునఁ బాఱెను. కళాపూర్ణుఁడు నిర్మల గగనతలమున మహా

వైభవముతో రాజిల్లుచుండెను. ఆకసమునుండి వెలువడు ధళధళాయ మాన సముజ్జ్వల రజతకాంతి ప్రవాహ ప్రభావముచే నగరమునందలి దివ్యభవనములు విమల బాస్వర శిలోచ్చయములందు సుందరతరంబుగఁ బ్రతిబింబించుచుండెను.

ఒక గడియలో వారు లూకాసు వర్ణించిన ప్రయ్యోఁ బ్రవేశించి, సాంద్రలతానికుంజములఁ గడచి, క్రమముగా సోపానపరంపర నారోహించిరి. అయినాను వాకిళ్ళు వేసియుండెను. ఖలీలునిఁ గాంచినంతనే యామె వెఱగందె, "మువ్వురా?" యని ప్రశ్నింప, లూకాసు సమయోచితముగా నిట్లనెను —

"ఈతఁడు మామిత్రుఁడు. వెఱగందకుము. మేమిట్లు సంకేతించియే యుంటిమి. ఇదిగో! ఇయ్యది గ్రహించి ప్రతివచనము లాడక నడుపుము."

ఒక బంగరునాణెము ఖంగుమని చేతఁ బడినంతనే యా వృద్ధురాలి వదనము సిబ్బివలె విస్తరిల్లెను. జూలియనుకూడ నామె చేయిఁ దడిపెను. ఖలీలు మాత్రమూరకుండునా? అతఁడుసుష్కుఁడారుకాసులఁ దీసి యా కాంత కొసంగెను. ప్రథమ ప్రవేశమగుటచే ఘనమైన బహుమానము నొసంగి ఆపరిచారికను బ్రసన్నురాలి నొనరించికొనవలయునని ఖలీలు భావించెఁగాఁబోలు! ఏమైనను, ఆపరిచారిక పరవశాత్మయాయెను. అయ్యది యథార్థమో మిథ్యయో మాత్రము చెప్పఁజాలము. అయినాను చేతులు జోడించి, నిజమానసోల్లాసము మందస్వరమున నిట్లు వెలిబుచ్చెను — "ఆహా! ఏమిరూపము! ఏమి సౌందర్యము! మహాత్ముఁడుతోఁడు, మీకుఁదగిన మిత్రుఁడు!"

వికసిత నారంగ సౌరభ్య సంవాసిత మందానిలములు హాయి గొలుప, వారు క్రమముగా రహస్యద్వారము సమీపించిరి. తాళము వేసి యుమినాను తలుపు తెఱచెను. మిత్రులు మువ్వురు లిఖాసీ పట

చిన వెట్లు వరుస నాక్రోశించిరి. పాదరక్షకుం డెక్కడ ప్రత్యక్షమగునో యని తొంగి తొంగి చూచెను సఖీనానుం గాంచి, ఖలీలు నవ్వు కొనెను. కాని అట్టి విఘాతమెద్దియు సంభవింపలేదు. పాషాపుత్రి కల మందిరద్వారమును అమీనా కషునిశ్శబ్దముగాఁ దెఱచెను. తోడనే మిత్రత్రయ మందుఁ బ్రవేశించెను.

ఆ ద్వారముతోఁబాటు నంతర్ద్వార మొకటి వివృతమాయెను. తలుపు వీడినంతనే, లూకాను వర్ణించిన సుందరాంగు లుదయించిరి. వారి యసామాన్య రూపవైభవముఁగాంచి, తనమిత్రుని వర్ణనమతిశ యోక్తి కాదని ఖలీలు గ్రహించెను. ఆ మోహనాంగులు తమ ప్రియులకు హృదయపూర్వక సుస్వాగతమొసంగవలయునని సుమధుర మందహాస విరాజితవదనలై, దర్శనోత్సుక విస్ఫారితనయనలై, లఘు తర గమనమున నరుదెంచిరి. కాని, పరపురుషుఁడగు ఖలీలు కాన వచ్చుటచేఁ దెల్లవోయి, యట్టె నిలిచిపోయిరి. కాని, వారి ప్రియులు సమాధాన మొసంగు లోపుననే, ఆ కాంతలు విషయమును గుర్తింపఁ జాలిరి. అంత ఖలీలు మహమ్మదీయ సాంప్రదాయసిద్ధముగ, నిజవంశ మర్యాద యచ్చుపడునట్లు సగౌరవముగ, సవినయముగ మస్తకము వాల్చి ప్రణామమాచరించెను. తురుష్క యువకుని మఱియొకసారి తిలకించినంతనే, యా సోదరీద్వయమునకు అమితానుకూలాభిప్రాయ మేర్పడెను. అంతలో నా ప్రణయినీప్రణయు లమితానందపర వశులైరి. గుల్నేరును లూకాను గాఢాలింగన మొనరించెను. త్రైర జాను జూలియను నిజబాహుపంజరమున బంధించెను. కాని, అన్య పురుషుఁడు ప్రత్యక్షముగ నుండుటచే, నాలజ్జావతులు సంపూర్ణపరి రంభ సౌఖ్యము ననుభవింపఁజాలకపోయిరి.

గ్రీకులు తమ కాంతల చెవిలో నెద్దియో పలికిరి. తోడనే యా లలితాంగులు ఖలీలును జూచి, మనోహరకలస్వనంబున నాతనికి

సుస్వాగతమొసంగిరి. జ్యేష్ఠ సోదరియగు గుల్నేరు మందస్వరంబున నిట్టులనెను —

"ఆర్యా ! మాయాత్మీయురా లిచటనున్నది. నిన్నుఁ గాంచు నంతనే యమిత విస్మయవిభ్రాంతచిత్తయైనను, ఆబాల యమందా నందవివశయగునని విశ్వసింతును. ఆర్యా ! అయ్యదె ద్వారము, ఆలతాంగి కట్టెదుటకుఁ బోయి పరిచయము చేసికొనుము. మీరు ముప్వు రొక్కసారి ప్రత్యక్షమగుదురేని, విస్మయమత్యధికమై దుస్సహ మగును. కాన, నీవు ముం దేగుటయే వాంఛనీయము."

ఖలీలు వేఱువిధ మాలోచింపక, నిశ్చలచిత్తుఁడై, గుల్నేరు చూపిన ద్వారము ప్రవేశించెను. జులేఖా విస్మయము వర్ణనాతీత ముగనుండెను. ఆముగ్ధ తన మేనమామయగు దాల్తబనుపాషాను దప్ప మఱియొక పురుషునిఁ గాంచి యెఱుంగదు. కావున, ఖలీలుఁ డాకస్మికముగా గోచరించుటచేఁ గాఁబోలు, నమితభయ విస్మయా క్రాంతచిత్తయై 'హా' యని యఱచెను. తత్సమీపమందిరమున నున్న గ్రీకులును ఆకాంతలును తదాశ్చర్యార్థకము నాలించియు, జులేఖాయొక్క విస్మయము నడిపి యామె హృదయము నాకర్షించు టకు ఖలీలున కవకాశ మొసంగెడు తలంపునఁ గొన్ని నిముసములు మిన్నకుండిరి. ఈలోన గ్రీకుల రాక గుఱించియు నాతఁడు జులేఖాతో ముచ్చటింపవచ్చును. తమప్రణయగాథ నాయింతికి పాషా పుత్రిక లింకను ఎఱింగింపలేదు ; ఎఱిఁగించుటకు సాహసము చాలక పోయెను. మఱియు, ఖలీలుని యునికిచేఁ గొఱతవడిన పరిరంభపరిచుంబ నాది సౌఖ్యముల నాయువతీయువకులు శతాధికముగా ననుభవించిరి. పరస్పర ప్రణయసంభాషణకార్యనిమగ్నులై యా నల్వురు మేను మఱచి పోయిగనుండిరి. సరసులను బ్రవేశపెట్టి యమీనా వెడలి

నంతనే, యీాద్వారమును గుల్నేరు బంధించెనని మనము గ్రహింప వలయును.

ఒక యరగడియ గడచినంతనే తైరజా గుల్నేరులు, తమప్రియులు వెంటనరుదేర, నారెండవ మందిరము ప్రవేశించిరి. అందుఁ బ్రవే శించినతనే, ఖలీలు కృతకృత్యుఁ డాయెనని తెల్లమాయెను. ముద్ద రాలు జులేఖా భయముడిఁగి సహజమందహాస సంశోభితయగుటయే గాక, సుందర తురుష్క యువకునిపైఁ బ్రసన్న వీక్షణములఁ బర్వ జేయు చుండెను. రత్నకంబళముపై నున్న సువర్ణ ధగద్ధగితములగు మొగ మలు టెక్కియంబులపై నా మెఱుఁగుఁబోఁడి సుధాకర ప్రభాభాసుర వదనయై ఒయ్యారముగా వ్రాలియుఁడ, ఖలీలుఁ డాహేమగాత్రి చరణ భర్మకంజాతముల మ్రోల ప్రణయ వినయ గర్వస్ఫూర్తి దీపింపఁ మోఁకరించియుండెను. ఆ కురంగనయిన ప్రబోధితయై యుంటచే, గ్రీకుయువకుఁ గాంచినంతనే, బాలికా సహజ లజ్జాభర మ్మున నల్లన మోము వాల్చినను, వెఱగందలేదు. ఆ కుసుమగాత్రి కోమల పల్లవంబును దన హస్తమునఁ గేలించి, శ్రవణపుటమున ఖలీలు ధైర్యము కఱపెను.

ఖలీలుఁ డంతటఁ, దన మిత్రులగు లూకాసు జూలియనులను బరి చయ మొనరించెను. ఘనలజ్జావనతాననయై, చారుతరమరాళమువలె మనోహరముగ మోమువాల్చి, వారి ప్రణామములఁ బరిగ్రహించి, మధురమంజుల స్వనమున నాకన్నియ సుస్వాగత మొసంగెను.

అంత నా నెలంత కొంకింత ధైర్యము కదుర, సహజ సుందరవద నము సంధ్యారుణరాగభాసురమై యలరార, సింధూరసన్నిభములగు పెదవులపై భావగర్భితమగు చిరునగవు చెంగలింప, తైరజా గుల్నే రులఁ గాంచి యిట్లులనెను.—"సోదరీమణులారా! అకస్మికముగా నన్నిట్లు విస్మయ విభ్రమముల పాల్సేయుట పాడిగాదు సుఁడీ."

పాషా పుత్రికలు లజ్జితులై యానందాతిరేకమున నవ్వుచు నుచితాసనముల నలంకరింపఁ దొడఁగిరి. ఒక్కొక్కఁడు నిజప్రియాంగనా సహితముగా నొక్కొక సోఫాపైఁ గూర్చుండి, మన మలర గుసగుస లాడికొనిరి. ఈ సమయముననే యువతీత్రయమును విపులతరముగా వర్ణించెదము.

ఆమందిరము లూకాను వర్ణించినట్లు నానావస్తు సమృద్ధముగ నుండెను. అం దమరియున్న తల్పములు, మంచములు, సోపాలు, ఆసనములు, దిండులు, మేజాలు, జాలరులు మొదలగునవి అసామాన్యములై, అమూల్యములై యుండెను. విలువగల యలంకారములు లెక్కకు మీఱి యచ్చటచట నుచితముగ నుండెను. పలువిధములగు రుచికర ఫలాహారము లొక్క చక్కని మేజాపై నమరి యుండెను. వెండికలశమునం దునిచిన మేలురకంపు గులాబీయత్తరుచే నా మందిర భూమిక సుగంధ బంధురమై యొప్పారెను. నిర్మల సలిల పూరమగు నంబుయంత్ర మొక చక్కని బలపపుకుండియందు నృత్యము సలుపుచుండుటచే నా వాతావరణము నిరంతర పరిశుద్ధ శీతలానిల సమృద్ధంబై యుండెను.

పాషా జ్యేష్ఠపుత్రిక యగు గుల్నేరు అసాధారణ సౌందర్యవతి. ఆ కళావతి వదనమండలము ఆరోగ్యరంజితమై, అనూనకాంతి సముజ్జ్వలమై, అనధిక కుంతల నికరాచ్ఛాదితమై చారుతరంబై యుండెను. విగ్రహము సమున్నతము. ఆకార మంగపరిపూర్ణతాసమృద్ధంబయ్యు సముచితముగ నమరియుండిన కారణమున నమంద శోభాయుతమై, వర్ణనీయమై, దర్శనీయమై యొప్పారెను. ఆమె సోదరియగు జైరజా సమున్నతాసనముపైఁ గపిలవర్ణ విరాజిత శిరోజములు చక్కఁగఁ ఘాటితములై, సహజ నిగనిగ ప్రభాభాసురములై యలరారుచుండెను. ఆ జవ్వని వదనము గుల్నేరు నెమ్మోమువలె దుర్నిరీక్ష తేజో విభాసి

తంబు గాక, శీతలామృత కిరణముల వెదఁజల్లు సుందర సుధాకర బింబము నందము వహించి యుండెను. అద్దములంబోలు నునుజెక్కులు సంధ్యారుణరాగ దీపితంబులు గాక, శ్వేతగులాబి రుచులకు నిలయములై యుండెను. ఇంకను సంపూర్ణ యౌవనము ప్రాదుర్భవింపని కారణమున నామె యాకృతి నిజసోదరకంటె లఘుతరముగ నుండెను. ఆ యన్నుమిన్న వక్షోజముల పొంకము గమనింప బాల్యావస్థ యంతరించి మనోహర యౌవనావస్థగఁ బరిణమించుచుండెనని తెలియఁగలదు. ఆ సుందరుల నయనములు నీలవర్ణ విభ్రాజితములై యుండెను. అందుఁ దైరజా నయనము లొకింత గాఢతరముగ దీపించుచుండెను. ఆ యింతుల దంతములు విమల ముక్తాఫలంబులవలెఁ జూడ మనోహరముగ నుండెను. ఆ కంజాక్షుల చుబుకములు హ్రస్వములై, నునుపులై సముచితాల్పకూపదీపితములై దర్శనీయములై యలరారుచుండెను. జ్యేష్ఠసోదరి యగు గుల్నేరు వక్త్ర మొకింత పూర్ణతరంబై, యొకింత గాఢ సిందూరవర్ణరంజితమై యొప్పారెను. ఆ హేమగాత్రల కరచరణములు, అధికవర్ణసమునకుఁ గడంగక, పరిపూర్ణశోభాయమానముగ నుండెనని చెప్పనొప్పును.

అపూర్వసౌందర్యవతి యగు జూలేఖా రూపురేఖలు వేఱు విధంబుగ నుండెను. కాటుకవలె నల్లనై నిగనిగ మెఱయు నా కన్నియ నెఱికురులు విరళముగ, సాంద్రతరంబుగ, భుజములపై, నెన్నడుముపై జీరాడుచుండెను. బాదములఁబోలు నా యింతి కనుంగవ ఆకర్ణాంత విశాలములై, అంగారసుందర వికాసభాసురములై, మృదులవ్యామోహదీపితములై ప్రసిద్ధ హరిణ నయనముల విడంబించుచుండెను. భాసుర వదనదర్పణమునఁ దీర్చిన విండ్లవలె సమరు నా కోమలి కనుబొమలు కడు మనోహరముగ నుండెను. తత్పక్ష్మల సమాశ్రిత కేసరము లపూర్వదీర్ఘములై, హృదయాదర్శము లనఁదగుఁ దన్మనోహరనేత్రములకు

నల్లని తెరలై, తత్కారణమునఁ దద్భావాలోచన లన్యజనదృగ్గోచరము కాకుండ మాయఁజాలు సాధనములై యొప్పారెను. ఆ మోహనాంగి వక్త్రము మన్మథుని ధనువువలెను, అధరోష్ఠములు అభినవార్ద్రి ప్రవాళ సన్నిభముగను అపూర్వ సౌందర్యముతో నలరారుచుండెను. అపురూప మరాళ కంధరమువలె దీర్ఘమై, నునుపై, వైభవముగ వంగియమంద సౌందర్యముతో నలరారు నా సుధాకరానన కంఠము దర్శనీయము. తదంతమున విరాజిల్లు శిరము చారుతర లతాంత శోభాయమానముగ దీపించుచుండెను. అత్యధికముగాక, సముచితవైభవముగఁ బెనుపొందిన యాకన్నెమిన్న పేరుటురము చక్కఁగ వర్తులమై, నిరర్థక మాయాపరికల్పితావలంబముల సాహాయ్యములేకనే పొంకముగ నిగిడి మనోహర హారిదంతగోళములవలె నేర్పడియుండెను. జులేఖా దేహము సహజముగఁ బాండువర్ణ సమోపేతమైనను, జీవరహితవైవర్ణ్యము నందక, చారుతర చంద్రకాంతశిలాసదృశభాసుర వికాసనైగసిగ్యములతో నలరారుచుండెను. ఆమందయాన సాధారణ దీర్ఘశరీరయయ్యు, సుందర పయోధరముల నతిశయింపఁజేయు మనోహరమగు సన్నని కౌనుచేతను, సృష్టికారుని శిల్పచాతుర్యముంజాటు భుజముల వైభవముచేతను, ఊరుద్వయాది నిమ్నావయవదీర్ఘతచేతను సమున్నత మూర్తిగనే దోఁచుచుండెను. అంగసౌష్ఠవము, అంగపరిపూర్ణత, అంగవిన్యాసము, అంగస్ఫూర్తి, తదన్యోన్యమనోహర సమాశ్రయము చేతను నా జవరాలు అనన్యశరూప వైభవములతో నలరారుచుండెను. మధుర మంజుల వీణారవంబువలె, మనోహర కలకలనినాద సంకలిత విమల రజత ప్రవాహమువలె నొప్పు నాకలకంఠి కలస్వనము మధుర తరంబై, శ్రవణపేయమై, వర్ణనాతీతమైయుండెను.

ఆ యానందమందిరమునఁ గూడిన యాస్త్రీపురుషులు పరస్పర ముఖ విలోకన మొనరించుచు, సరస సంభాషణముల మునింగి, వేణు

విచార మెఱుంగక హాయిగనుండిరి. శుద్ధాంతమున బ్రవేశించుట యపాయకరమని వారాసమయమునఁ దలంపఁజాలరైరి. ప్రణయ సౌఖ్యార్ణవ నిర్మగ్నులైన యామత్తకాశినులును దా మొనరించిన మహాపరాధము గుఱించి తలంపరైరి. మహమ్మదీయాంతఃపుర ప్రవేశము కంటె ఘోరతర నేర మింకొకటి యుండదు. తన జనానా యందుఁ బరపురుషుఁడు గోచరించునేని, మహామానియగు మహమ్మదీయ కులీనుఁడు ఆఁకొన్న వ్యాఘ్రమువలెఁ గ్రోధోన్మత్తుఁడై భయంకర కరవాలము రయమునఁదీసి, చొరఁబడిన యాకాముకునే గాక ఆకాంతను గూడ నిర్దయుఁడై తెగనఱకును. మహమ్మదీయ ధర్మశాస్త్రమిట్టి యుద్బోధన మొనరింపకున్నను, అట్టి తీవ్రాచరణము సాంప్రదాయసిద్ధమైయుండెను. కాని ప్రణయానిలోద్ధూత హృదయులగు నాయువజనుల కాసమయమున వివేకమెటులుండును ?

తన్నృహాధిపతియగు దాౖత్తబను పాషా గుఱించి కూడ నొకింత యచటనే యనవలయును. అతని ప్రాయ మేఁబదియైదేండ్లు. కాని, దీర్ఘమగు గడ్డము నెరిసి రజతవర్ణము సమీపించియుండుటచే, నాపాషా యధికతరప్రాయునివలె గోచరించుచుండెను. కాయ మతిస్థూలము. వదనమునఁ గాఠిన్యగాంభీర్యములు తోఁచుచుండెను. చాల కాలము రణరంగములందు విహరించిన కారణమున, మోమొకింత వివేకరహితమై గూడ నుండెను. అతనికిఁగల జ్ఞానసంపద కడుమితము. సమర ప్రశంస తప్ప నితర లౌకికవ్యవహార జ్ఞాన మాతనికి శూన్యమనియే చెప్పనొప్పును. రణవ్యాపారమునమాత్ర మాతని యనుభవ మపారము: ఒక్కప్రత్యేకసైన్యమున కధినాథుఁడై, ప్రశంసనీయ ధైర్యస్థైర్యగుణవిరాజితనాయకుఁడని పేరు గాంచెను. మతవిషయములం దాతఁడు కడు ఛాందసుఁడు, కఠినుఁడు. ఐనను, ఒక్కలోపము మాత్రము కలదు. మధురమగుమధువుపై నాతనికి మక్కువ మిక్కు-

టము. 'చార్వేషు', 'బర్గండీ' మొదలగు ప్రసిద్ధ మధురసము లాతని మందిరమున నెల్లప్పుడు సిద్ధముగ నుండును.

పాషాయొక్క-భవనము ప్రాసాదముగ నుండెను అయ్యది మహావైభవ సమన్వితమై, లోకసంభావ్యమగు దాసదాసీజన సమృద్ధమై, నయనపర్వముగ రాజిల్లుచుండెను. ఇంతకుమున్ను వర్ణించిన మందిరము వేసవి కాలమున విడిసియుండుటకగు విశ్రాంతిమందిరము. ఇందుండు సేవకుల సంఖ్య యత్యల్పము. ఆదాసీనలు సంధానకర్త్రియగు నమీనాకు లోబడియుందురు. ఆవనిత స్వభావము మనకు విదితమే గదా! కావుననే, పాషాపుత్రికల మందిరమున లూకాసు, జూలియను, ఖలీలులు ప్రవేశించుట కవకాశము చిక్కెను. బహుజన సంకీర్ణమగు నగరమందిరమున నట్టి కృత్యము దుస్సాధనము, అసాధ్యము.

తురుష్క-యువకుండగు ఖలీలు జులేఖా హృదయము ప్రవేశించుచుండెగదా. ఆ కలభాషిణి మితభాషిణియై, సంతోష లజ్జా విభ్రమాధీనయై తన ప్రేమాల మోదకరించి నిజవాక్సుధారసధారల నవిరళముగ గురిపించు సుందర తురుష్క-యువకుని నౌదార్యముగ దిలకించుచుండెను. ఆ హేమగాత్రి కెంపెదవులనుండి మాటలు వెలువడకున్నను, ఇందీవరదళసన్నిభనయనము లా సుందరి విజృంభిత హృదయమును దెలుపుగు వివిధ వికారములను జాటుచుండెను. ప్రణయోదయ సూచక మగు నివారిత పారవశ్యము మార్దవముగ, మంజులముగ సుందర వదన మండలమును దాండవించుచుండెను. ఆ కన్యామణి సంతోషపరవశయయ్యు, మహమ్మదీయ కాంతాజనోచితమగుటచేతనో, తన ప్రియుడత్యున్నతవంశసంజాతుడని వార్గోరణిం బట్టి గ్రహించుటచేతనో.గాని, యొకవిధమగు గౌరవము జూపుచుండెను.

ఒక గంటకాల మా మిథునములు కాలగమన మెఱుంగక, తా మొనరించిన యనుచితకార్యమువలన నెట్టి యుపద్రవము సంభవించునో

యని విచారింపక, సరససంభాషణమునఁ బూర్తిగ నిమగ్నులై యుండిరి. అట్టిసమయమున, నిశ్చల వినిర్మలాకసమునుండి భూరి మేఘధ్వానములు హఠాత్తుగ వెలువడునట్లు, అవ్వలి ద్వారము తీవ్రముష్టిఘాతముల కాకస్మికముగా గుఱియై తత్ప్రదేశమంతయు మాఱుమ్రోఁగఁ దొడంగెను. ఎంత ప్రమాదము! ఎట్టి విఘాతము!

తైరజా గుల్నేరులు అత్యంత భయ విహ్వలశరీరలై, వదనములు కళావిహీనములై వెల్లవాఱ, సుందరకరయుగ్మములు ముకుళించి యతి దైన్యస్వరమున "జనకుఁడు! జనకుఁడు!" అని యఱచిరి.

"మామ!" యని యఱచుచు జులేఖా దిగ్గునలేచి విభీతహరిణము వలె దిగులొందెను. కాని, ఖలీలుయొక్క భావగర్భిత గంభీరవీక్షణముఁ గాంచి, యాతఁడే తన రక్షకుఁడో యన, నా లతాంగి యాతని భుజాస్తంభము నాశ్రయించెను.

ఆ తలుపుపై నింకను ముష్టిఘాతములు పిడుగులవలె గురియుచు నుండెను. అంత, పాషాయొక్క కఠోర నిష్ఠుర కంఠ నినాదముగూడ వినవచ్చెను. వారందఱు విపరీత భయాతిరేకమునఁ గర్తవ్య మెఱుంగక ప్రకంపితశరీరులై యుండ, ఖలీలు తన మిత్రుల నుద్దేశించి యిట్టులనెను.

"మిత్రులారా! మనము చొరరాని శుద్ధాంతము ప్రవేశించితిమి. విమయ మెట్లు పరిణమించినను, మనమే సహించుకొనవలయు. ఎద్దియో కథ కల్పించి బాధ్యత మనమే వహింపవలయుఁగాని, ఈ కోమలాంగుల నణుమాత్రపు నేరమునకైన, అనుమానమునకైనను, గుఱి కానీయరాదు. ఇట్టి ప్రవర్తనమే మనకు గౌరవప్రదము."

"మిత్రమా! లెస్సగాఁ బల్కితివి. అన్యథా ప్రవర్తింపనేరము. మీ యిరువురి తరఫునఁ గూడ నేనే ప్రసంగించి, తగు సమాధాన మొసంగెద."

అట్లు లూకాను పలుక, జూలియను తన తురుష్క మిత్రు నౌదా
ర్యము నుగ్గడించి, తోడనే యామోదించెను.

ఒక్క నిమిషముకంటె నెక్కుడు కాలేదు. ఐనను, పాషాయొక్క
భయదహంకార గర్జనలును తలుపుల ధమ ధమ ధ్వానములును అధిక
తర మాయెను. మిత్రు లేకాభిప్రాయబద్ధు లగుటచే, ఇంక జాగుచేయ
వలసిన యవసరము లేదు. "పాషాయొక్క భయంకరదురాగ్రహము
నేనే తొలుదొల్త భరియింతుగాక!" యని ఉద్విగ్నహృదయుఁ డగు
లూకాను పలుకుచు రయమునఁ బోయి ద్వారము తెఱచెను.

౪

లూకాను తాళము తీసినంతనే, ద్వారము గుభాలున నొక్క విసురునఁ
దెఱువఁబడెను. నల్లని దీర్ఘకాయులగు బానిస లార్గురును, ఆ మధ్య
దాల్తబను పాషాయును గోచరించిరి. ఆ సేవకులలో నిర్వురు తమ్ము
బెక్కుసారులు బాస్ఫరనదీ తోయములపై యా మందిరమునకుఁ
దోడ్తెచ్చువారలే యని యాతఁడు గుర్తించెను.

లూకాను ఒక ప్రక్కను నిలిచియుండెను. కట్ట తెగునంతనే పఱ
తెంచు నదీప్రవాహము పగిది, పాషా ఒక యున్మాదునివలె నందు
రయమునఁ బ్రవేశించెను. ఆ కారణమునఁ దా నెఱింగిన బానిసలకుఁ
గనుసన్న చేయుటకు లూకానున కవకాశము చిక్కెను. ఆ సన్న వారు
గ్రహించి, తాము రహస్యభంగ మొనరింపలేదని శిరఃకంప మొన
రించి తెలియఁబఱచిరి. గ్రీకుయువకుఁడు సంతసించి వారి కపాయము
వొరయకుండఁ గాపాడెదనని మఱల సంజ్ఞ యొనరించెను.

ఈ మూఁగసంభాషణ మొక్క క్షణములో నాయెను. మఱుక్షణ
మునఁ గ్రోధవివశుఁడై విచ్చుకత్తిం జేఁబూనియున్న పాషా లూకానును
గాంచి యదభ్రభయంకరాకారుండై వీక్షణముల నిప్పులు కురిపింపు

చుండ, నా యువకుఁడు నిశ్చలహృదయుఁడై సవినయముగఁ గరములు మోడ్చి యిట్లు లనెను —

"ప్రభువర్యా! నిరాయుధునిఁ బరిమార్పఁ గోరెదేని, యా నీ నిసి తాసిచే నా కంఠము సత్వరము తెగనఱకుము. నేను సాయుధుఁడ నయ్యు నిరాయుధుఁడ ననుటకుఁ గతం బెద్ది యని ప్రశ్నించితు వేని, సమాధానము చిత్తగింపుము. మత్ప్రేమైకనిధానము, శీలవతియు నగు గుల్నేరు జనకునిపైఁ గత్తి దూయఁజాలను."

తటిల్లతసన్నిభమగు పాషా దీర్ఘకరవాలము మెల్లగ దిగిపోయెను. ఆ వీరపుంగవునకు ధైర్యము కడు ప్రేమాస్పదమై యుండెను. పరమ శత్రువైనను ధైర్యము ప్రదర్శించునేని, పాషా తప్పక కొనియాడును. కావున, నాతఁ డింకను గతినాగ్రహపూరిత వీక్షణుండయ్యుఁ దన కట్టెదుట నున్న ధీరస్వాంతుని వదనముపైఁ గొన్ని నిముసములు దృష్టి నిల్పెను. అంత నాకస్మికముగఁ గృతనిశ్చయుఁడై "పట్టి బంధింపుఁడు!" అని యాతఁడు గొబ్బున నాజ్ఞాపించెను.

ఆ క్షణముననే, యా నల్లని యార్గురు బానిసలును గ్రీకుయువకునిఁ జుట్టిరి. లూకాసు వారింపఁ బ్రయత్నింప కూరకుండెను. పాషా కను సన్నఁ గాంచి, యా సేవకు లా యువకుఁడు ధరించిన రత్నంపు బాకు లను దీసికొని యాతని ముందునకు నడిపించిరి. దాల్తబను పాషా ఖడ్గపాణియై యా రెండవ మందిరము ప్రవేశించెను.

జనకునిఁ గాంచినంతనే, తైరజా గుల్నేరు లత్యంత భయాతురమున నాతని చరణములపై రయమున వ్రాలి, విషణ్ణహృదయలై, దురంత దుఃఖితస్వాంతలై, రక్షింపు మని యతి దైన్యముగఁ బ్రార్థించిరి. ఖలీలు భుజదండమున కంటియున్న మనోహర హేమవల్లరి జులేఖా యును, అత్యంత కుపితస్వాంతుఁ డగు మామను అతి వినయవినమి తోత్తమాంగయై మానముద్రాభిముద్రితయై చారుతరనయనేందీవర

దళవినిర్గళిత వీక్షణజాలముచే నర్థించెను.

ఆ ప్రణయినీ ప్రణయుల నొక్కసారి కలయఁజూచి, "వీరిని నిరాయుధుల నొనరింపుఁడు" అని పాషా జలధరగంభీరధ్వానమున దన సేవకుల నాజ్ఞాపించెను.

ఖలీలుఁ డంత వినయ గౌరవము లుట్టిపడ నిట్టులనెను —

"ప్రభుశేఖరా! అట్టి యవసరము లేదు. ఈ సమయమున నీయాజ్ఞ యమోఘము; నిరోధింపఁ గడంగువారము కాము, అన్యథా ప్రవర్తింపనేరము."

ఖలీలు విరమించినంతనే, జూలియ నిట్టు లనెను —

"ప్రభువరా! అపరాధ మొనరించితిమి. తత్ఫల మనుభవింప మరణింప సంసిద్ధులమై యున్నవారము. మేమే నేరస్థులము! —"

ఆతఁ డట్లు పలుకుచుఁ దనఖడ్గాది యస్త్రములం దీసి యాసేవకుల కొసంగెను. తురుష్కయువకుఁడు గూడ నట్టులేయొనరించెను. ఆ తెఱంగున జూలియను పలుకుచుండగనే, పాషా పుత్రిక లేక కంఠమున, "మరణనూ? వలదు,వలదు!" అని దుర్భరవిషాదానలతప్త చిత్తలై భయాకులిత విస్ఫారితనయనలై; ప్రస్వేదకణముక్తాఫల విరాజితవదనలై యఱచి, దైన్యముడిగి దిగ్గునలేచి, తమ తండ్రిని బ్రియులను వడివడి వీక్షింప గడంగిరి. జులేఖాయును లేచి తన ప్రియునిపై వినయ లజ్జా కాతర వీక్షణములఁ బఱపెను. అంత లూకాసు ఇట్టులనెను —

"ప్రభునరా! సావధానచిత్తుఁడవై నాకొంకింత యవకాశ మొసంగెదేని, నీ యీ పుత్రికలు దోషరహితలనియు, మేమే యపరాధులమనియు, మేమే శిక్షార్హులమనియు విశదీకరింపఁగలను."

రోషభీషణాకారుఁ డగు పాషా కఠినస్వరమున వల్లెయనిపలుక,

లూకాసు సహజనిశ్చలకంఠమున నిట్లు వాక్రుచ్చెను —

"ఆర్యవర్యా! మేము ముగ్వురము సంపన్నగృహస్థుల పుత్రులము. యాత్రాపరులమై మొన్న మొన్ననే యీ నగరరాజము ప్రవేశించి తిమి. నగర సందర్శనాభిలాషచే నిందందు సంచరించి, యనంతరము జలవిహార మొనరింపవలయు ననెడు కుతూహల ముదయింప, నదీతీర మున కేగి, నౌకారోహణ మొనరించి, యీ సుందరారామముం గాంచితిమి. ద్వారము తెఱచి యుండుటచే—"

"ఏద్వారము ?"

"తోఁపునకు వెనుక నెచటనో యున్నది." అని లూకాసు తెలిసియుఁ దెలియనట్లు యథాలాపముగ, నిశ్చలముగ బదులాడి యనుజ్ఞాతుఁడై మగుడ నిట్లు చెప్పఁదొడఁగెను —

"ఆరామ మతిమనోహరముగా నుండినట్లు చూచినంతనే గాన్పించెను. కావున, స్వతంత్రించి ప్రవేశించితిమి. వివృతద్వారము దృగ్గోచరమైనంతనే, ప్రస్తుత మీవనవాటిక విజనంబని భావించి కౌతుకోత్సాహతమకమున నిట్టట్టు సంచరించితిమి. వివిధవృక్షక్రమము, అందము చందము తిలకించి, ప్రభువర్యా! నీయభిరుచి నెంతయు గొనియాడితిమి. కొంతకాలమునకు అలసి దాహార్తులమై, సలిల మెట్లు లభించునా, అతిథిసత్కార మెట్లు వడయునగునో యని చితింపుచుండ, దెఱచియున్న మందిరద్వార మొండు నయనపథమునంబడెను."

"ఏద్వారము?" అని కఠిన నిరాదరణస్వరమున పాషా ప్రశ్నింప, నిట్లు లూకాసు బదులాడెను —

"ప్రభువరా! ఈదీర్ఘమందిరశ్రేణి వెనుక నుండు ద్వారము."

"కానిమ్ము" అని కఠిన నిష్ఠురస్వరమున పాషా పలికెను. లూకాసు ఇట్లు చెప్పఁదొడంగెను —

"యథార్థ మెఱింగింపవలయు, మా మిత్రుఁడగు నీ తురుష్క—

యువకుఁడు అనాహూయమానముగ మందిరప్రవేశ మొనరింపరా దని సమంజసముగా హెచ్చరించెను. అట్టి హితవచనము పెడ చెవినిఁ బెట్టి, సాహస మొనరించినవాఁడను నేనే. ఈ యారామగృహము చొచ్చి దాహబాధనివారణార్థము నీరమడిగి, నాలుగు నిముసము లిందు విశ్రమించిన నేమిప్రమాదమని యోచించి, కృతనిశ్చయుఁడనై, నేనును నాయకత్వము వహింప, నామిత్రులు వైమనస్కు లయ్యు నన్ననుగమించిరి. ఈనగర జన చిత్తసంక్షోభ మొనరించు భయంకరహత్యావ్యాపారపరంపర నాలించియుండుటచే, నొండొరుల నెడబాయరాదని మేము మువ్వురము నేర్పఱచికొని యుంటిమిఁ కావున, నామిత్రులు నన్ను వీడిపోఁజాలరైరి.”

ఆ నుడు లాలించినంతనే, ఆ యువతీమణుల శరీరము లొక్కసారి కంపించెను. అందు ముఖ్యముగా, జులేఖా గాఢతరప్రకంపితగాత్రయై, నిలువఁజాలక, అవలంబము నాచ్ఛాదించు మనోహరపుష్పవల్లరివలె మగుడ ఖలీలు భుజము నాశ్రయించెను. కాని, నితాంత కుపిత స్వాంతుఁడైయున్న పాషా నిజహస్తచాలనమున నాజ్ఞాపింప, నా కుసుమ కోమలి నిరావలంబ కావలసివచ్చెను. అనంతరసమాచారము నివే దింపవలయునని పాషా కోరెను: లూకాసు మగుడ నిట్లుపలికెను —

“ఇఁక నెంతయో లేదు. ఈభవనము ప్రవేశించితిమి: సోపాన పరంపర నారోహించితిమి: మాకంటికి గోచరమైన మొదటి ద్వార మునఁ బిలిచితిమి: ఎవ్వరుఁ బలుకలేదు: మేమంతట తెగువచేసి — నేనే యని నాయభిప్రాయము — యాతలుపు తెఱచుకొని మందిర ప్రవేశ మొనరించితిని. నామిత్రులు నావెంట నరుదెంచిరి. అందు సుఖాసీనులైయున్న యీ మానవతులు మమ్ము నాకస్మికముగాఁ గాంచి భీతచేతస్కలై కెవ్వున నఱచి, మానవతీసహజధైర్యమూని, తోడనే యావలకుఁ బోవలయునని మమ్ముల నాజ్ఞాపించిరి. కాని,

ప్రభువర్యా! యపూర్వరూపవైభవమున నలరారు ఈజవరాంగ్రడం గాంచి, బద్ధేంద్రియులమై, వివేకరహితులమై, వెడలఁ జాలక అట్టె నిలిచిపోతిమి. మాప్రవర్తన మసమంజసము, సాహసికము, దౌర్జన్య పూరితమనియు నేను దప్పక యంగీకరింతును. సాధ్వసాగ్రహములు రెండును నిరర్థకము లగుటచే, మా మధురోపలాలిత వాక్యప్రతివాక్య బద్ధులై, యీసుందరాంగు లియ్యకొనిరి. మే మెల్లరము ప్రణయ ముగ్ధులమైతిమి. మాహృదయముల నీ రమణీమణుల కర్పించివైచితిమి. పూజ్యులగువారి జనకుల నర్థించి యనుజ్ఞవడసి పాణిగ్రహణ మొన రింప నాసించియున్నవారము. మేము పరస్పర సంభాషణంబుల మునింగియుండ, నీవరుదెంచితి. ఇయ్యది మాసమాచారము.''

పాషా గాఢ తీవ్రాలోచనాపరుఁ డాయెను. అతని నిశ్చలగంభీర వందనముఁగాంచి యాతని హృదయ మరయుట కష్టసాధ్యము. ఐనను ఒక్కొకఁ బరిశీలింతుమేని, గ్రీకు యువకుఁడు లూకాను తెలిపిన కథ యందలి సత్యాసత్యముల విమర్శించుచుండినట్లు స్ఫురింపఁగలదు. వధూమణులు దుర్భరడోలాయమానమానసలై యుండిరి. అందు తైరజాగుల్నేరుల యవస్థ మఱియు దుస్సహముగ నుండెను. అట్టి విషమావస్థం జిక్కి యు, నాజవ్వనులు లూకాను హృదయయౌదార్య మును లోలోన నుగ్గడించిరి. ఆహా! ఆ గ్రీకుయువకుని ప్రవర్తన మెంత శ్లాఘనీయముగ నుండెను! పాషాపుత్రికలకును, దన మిత్రుల కును, ఎట్టి యపాయము వొరయకుండ, నేరము నంతయుఁ దన మీఁదనేవైచికొనెను! తాను సమిత్రముగా నొనరించిన యసంగత కృత్యమునకుఁ దానొక్కఁడే బాధ్యత వహించెను! దుర్వారమగు పాషాభయంకరాగ్రహదావానలమునఁ బడి మ్రగ్గుటకైనను, ఆ ధైర్య శాలి, ఆ స్థిరచిత్తుఁడు, ఆ స్వార్థత్యాగి, అత్యసాధారణోదార స్వభా వుఁడు సంసిద్ధుఁ డాయెను! ఖలీలు జూలియను లాతని సచ్ఛీలముఁ

గాంచి విస్మయ విభ్రమ పరవశులైరి.

నిబిడకుటిలకుంతలనికరవిరాజితాననుఁడగు లూకాసుపై దృష్టి నిల్పి " ఓయీ! నీవెవ్వఁడవు? " అని కఠినముగ పాషా ప్రశ్నించెను.

"ప్రభువరా! నన్ను 'లూకాసు వాశిలో' యని పిలుతురు. లోకైక సార్వభౌములగు సుల్తానువారి ప్రజాళిలో నే నొక్కఁడను. నాజనకుఁడు ఆల్బేనియా రాష్ట్రమునందలి తన భూవసతి ననుభవించు సంపన్న గృహస్థుఁడు. "

అంతట నా పాషా రెండవ గ్రీకుయువకునిఁ గాంచి, నీ వెవ్వఁడవని ప్రశ్నింప, నాతఁ డిట్లు విన్నవించెను —

" నా నామధేయము ' జూలియను మెలీడా ' మా నివాసస్థానము 'లెమ్నాను' అను ద్వీపము. అచ్చటి వర్తకులలో నా జనకుఁడు మిక్కిలి ధనవంతుఁడు. నేనును లోకైక సార్వభౌములగు మూఁడవ సలీము పాదుషావారి ప్రజాకోటిలోనివాఁడను. "

దాల్తబను పాషా యంతట తురుష్కయువకునిఁ గాంచి ప్రశ్నింప నాతఁ డిట్టులనెను —

" నా యభిధేయము ఖలీలు ఉస్మాను. నా తండ్రి "కార్మేనియా రాష్ట్రమునందలి యమితాధికారయుత సంపన్నులగు సరదారులలో నొకఁడు. ఆ పుణ్యాత్ముఁడు పుణ్యలోకమున కేగుటచే, నా భాగ్యము నా యధీనమాయెను. దేశాటన మొనరించుచు నీ నగరము కేతెంచితి. మదీయ వంశ గౌరవ ధనసంపద లహీనము లగుటచే, మనోహరాకార యగు భవదీయసోదరి పుత్రిక జులేఖాను, జెట్టఁబట్ట నాసించి యున్న వాఁడను. నా మిత్రులవలె నేనును లోకపాలకులగు సలీము పాదుషా వారి ప్రజాకోటిలోనివాఁడనే యని వేఱుగఁ జెప్ప నవసరము లేదు."

తురుష్కయువకుని వచనరచనాధురంధరత్వము, నిశ్చలాత్మ విశ్వాస పూరితమై యుండెను. జులేఖా సంతస సంభ్రమ లజ్జా రసరంజి

తానసన్నయై, రేమా పలుకుల నాలించెను. పాషా మగుడఁ గొంత తడ వాలోచనా నిమగ్నుఁ డాయెను. అతఁ డొక్కసారి ప్రకంపితుఁ డాయెను. కాని, అన్యులు కనిపట్టరాని యట్టులు సహజ గాంభీర్యము వహించి, యాతఁడు తన ప్రథమపుత్రిక యగు గుత్నేరుంగాంచి సన్న యొనరించినంతనే, యిరువురు బానిస లా కోమలాంగిని అల్లన బట్టిరి. అయ్యబలామణి భయవిభ్రమేక్షణయై, యనదవిధమున — "తండ్రీ! ఏమి చేయింతువు?" అని దైన్యముగఁ బ్రశ్నించెను. ఆ హరిణేక్షణ భయ చంచలవీక్షణములు జనకుని వీడి తన ప్రియునిపై నిలిచెను.

"ప్రభువరా! కరములు ముకుళించి మ్రొక్కెద. పిడుగువంటి నీ యాగ్రహము నన్నే దాకుఁ గాక!" అని లూకాసు ప్రార్థించెను.

"ఓ తండ్రీ! క్షమింపుము — నా యక్కను క్షమింపుము! రక్షింపుము!" అని మైరజా దురంతభయాక్రాంతచిత్తయై యఱచెను.

"మామా! శాంతింపుము. క్రోధోన్మత్తుఁడవై యిట్టి దారుణ మొనరింతువేని, నీ చిత్తమున కిఁక శాంతి చిక్కదు." అని వినీలాయతనేత్ర యగు జులేఖా దైన్యవిస్పష్టస్వరమున హితము కఱపెను.

జూలియను గూడ తదుచితగతిఁ బలికెను. ఖలీలు సహితము భాషింపఁబోయెను. కాని, అంతలో దాల్తబను పాషా యహంకార పూరితుఁడై, మాటాడవలదని చేయి విదళించి, కఠినస్వరమున గంభీరముగ నిట్టు లనెను —

"గమనింపుఁడు. శాంతి వహించి మీ పలుకుల నెల్ల నాలించితి. మీ రిఁక సావధానమనస్కులై మదీయవచనములు వినుఁడు. పవిత్రవంతమగు న యంతిపురంబు కాని తెఱంగునఁ బ్రవేశించి, నా కెంతయో యవమానము ఘటిల్లఁ జేసిరి. ఉపేక్షింపరాని మహాపరాధము మీ రొనరించిరి. మీ ప్రవర్తనము తప్పక దండనార్హము. ఓయీ లూకాసూ! నీవే ప్రధాన నేరస్థుఁడవని నీవే యంగీకరించి యుంటివి.

నీ పలుకులు నిక్కము లగునేని — నిక్కమనియే నేను విశ్వసింప వలయును — నీ ప్రోత్సాహముచేతనే నీ మిత్రులు నీ వెంట నరుదెంచిరి. కావున, నా యాగ్రహభారము నీవే భరింపవలయును."

"ప్రభువరా! సంతోషపూర్వకముగా భరియింతును. ఈ తక్కిం గల వారి నందఱను క్షమియింతువేని, ఎంతటి కఠినశిక్షకైనం బా లగుదును." అని లూకాసు నిబ్బరముగం బలికెను. దుర్భరబాధితాత్మయై, దాసజనమధ్యస్థయై యున్న భాగ్యహీనురాలు గుల్నేరు నునుజెక్కుల బొప్పవారి ప్రవహింప, "తండ్రీ! తండ్రీ!" యని విలపించెను. పాషా యిట్లు లనెను —

"మిగిలినవారి నందఱిని క్షమియింతును. కాని, ఓసీ! దుష్టాత్మా! నిన్నుం బూర్తిగ విడిచివేయరాదు. మువ్వురలోం బెద్దదానవు, పిన్న వయస్కలగు నీ సోదరికిని, తత్ప్రాయంపు టాత్మీయురాలకును బుద్ధి కఱపవలసిన దానవు, నీ వెంత గర్హితముగ సంచరించితివి! ఈ యాగంతకులం గాంచినంతనే, మన సేవకులను నీవ చీరవలయును. జనానా పవిత్రతకు భంగ మాపాదించిన యీ చెనటులను బంధించి యుంచు భారము నీయది. కాని, నీ వే మొనరించితివి? పురుషుల నింపుండ నిచ్చితివి! వా రిటం దడయునట్లు ప్రోత్సాహపఱచియు నుందువు! అన్యథా యెట్లు భావింపనగును? ఆం! నే నేతెంచినపుడు మీ వదనము లనాచ్ఛాదితములై యుండెం గదా? అన్యపురుషుల దుష్టవీక్షణపాతము కాకుండ, వనితాజనంబుల వదనములు మేలుముసుంగుల మఱుంగున నుండవలయునని యుద్ఘోషించు పవిత్ర మహామ్మదీయ సూత్రములను మంటంగలిపితివే! గుల్నేర్! నీ ప్రవర్తన మత్యంత దోషభూయిష్ఠము, దండనీయము. ఈ గ్రీకు యువకుండు తన మిత్రుల నేరము సహితము తానే ధరించి, యాత్మసమర్పణ మొనరింప సంసిద్ధుం డాయెను. అట్టులే, నీవును నీ యపరాధమునకే గాక, ఈ బాలికల వంతు గూడ

పరిహార మనుభవింపవలయును.”

లూకాసు ఉద్వేగ్నహృదయుఁడై, స్వరము కంపింప, నిట్టులనెను —

“ప్రభువరా! అందఱిని క్షమింతునని బాస చేసియుంటివే! ఇపుడు —”

“విరుద్ధముగా నాచరింపను. నా పుత్రికను సంహరింతునని తలంపకుము. తా నొనరించిన యవివేకమునకు ఫల మనుభవింపవలయు: ఇఁక నెన్నఁ డిట్టి ప్రవర్తనమునకుఁ గడంగరాదు. కావున, నీ మరణము నీ కాంత వీక్షింపవలయు.”

ములుకులవంటి యీ పలుకులు వీనులఁబడినంతనే, యీ నిర్భాగ్యురాలు గాఢతమోంధకార నిర్మగ్నయై, హృదయము విహ్వలింప, దురంత భయాతిరేకమున, కెవ్వన నఱచెను. పరిచారకు లామెను గట్టిగఁ బట్టియుండిరి. లేనియెడల, నిజజనకుని పాదములపై నామె వ్రాలవలసినదే. తనసోదరి విపరీతదురవస్థఁగాంచి, త్రైరజా నిజహృదయ పరితాపము భరింపఁజాలక తాఁ గూర్చుండిన సోఫాపై వ్రాలెను. జులేఖా విస్మయభయాతురయయ్యు, ధైర్యమువీడక, తురుష్క యువకుఁడు ఖలీలు రక్షింప సమర్థుఁడని విశ్వసించి కాఁబోలు, తదభిప్రాయ సూచకముగా నాతనిఁ దిలకించెను. ఖలీలు తోడనే ఒక యడుగు ముందువైచి, వినయ గాంభీర్యము లుట్టిపడ నిట్టులనెను —

“ప్రభువర్యా! నా మిత్రుఁడు విగతజీవుఁడు కావలయుననియే నీవు కృతనిశ్చయుఁడవై యుంటివేని, నా మనవి చెల్లింపుము. మంద భాగ్యుఁడగు నా మిత్రు నొక్కసారి యాలింగన మొనరించి యొకింత ధైర్యము కఱపుట కనుజ్ఞ దయచేయుము.”

“నిరాకరింపఁజాలను. కాని, ఆలసింపరాదు; ఈ రంగ మింతటితో ముగియవలయు.”

దాత్తబను పాషా యట్లు పలికి కనుసన్న చేయ బానిసలు

లూకాసును వీడి కొంత దవ్వునకుఁ బోయిరి. అంత ఖలీలు పాషా భయంకర దురాగ్రహమునకు గుఱియైన తన మిత్రుని డాసెను. సమీపించు నపుడే రయమునఁ దన వ్రేలినుండి తీసిన యుంగుళీయము జేతఁబూని, మిత్రుని కంఠము నాలింగన మొనరించి యిట్లు గుసగుసలాడెను—

"మిత్రమా ! భయము వలదు ! పాషా చర్య నాకు మిథ్యగాఁ దోఁచెడిని. నిన్ను భయవిహ్వలు నొనరించి యనంతరము క్షమించు ననియే భావింతును. ఒకవేళ పాషా కృతనిశ్చయుఁడై యుండునేని, ప్రాణాపహరణమే యాతని నిరూఢాభిప్రాయమగునేని, ఇఁక గత్యంతరము లేకుండునేని—భద్రము ! అట్టి యవస్థ కలుగునపుడు గాని వలదు సుమా! — ఈ యుంగరము ప్రదర్శింపుము ; నే నొసంగితినని వచింపుము ; తత్ప్రభావము విశ్వసింపుము."

నిజ మిత్రబంధు జనబృందంబుల వీడి, యన్యలోక ప్రయాణోన్ముఖుఁడై, దుర్భరవిషాదానలతప్త చిత్తుఁడై యున్న లూకాసును ఖలీలుఁడు ధైర్యధుర్యు నొనరింపఁ గడంగుచుండెననియే యెల్లరు సహజముగ భావించిరి. జులేఖా మాత్ర మట్టి విభ్రమమునకు లోఁబడక, తన ప్రియుని చర్య యనిమిషనేత్రయై యరయుచుండెను. ఖలీలు తన ముద్దుటుంగరమును నిగూఢముగఁ దీయుటయు, తన మిత్రు నాలింగన మొనరించు నెపంబున నాతని కరమున కందించుటయు నానూక్ష్మగ్రాహిణి కనిపట్టెను. కావున, ఆ గ్రీకుయువకుఁడు విముక్తుఁడు కావచ్చునని ఆకన్నియ సహజముగ భావించియుండును.

రెండవ గ్రీకుయువకుఁడు జూలియనుకూడ పాషా యనుజ్ఞవడసి దుర్భర విషాదవిచ్ఛిన్నహృదయుఁడై తనమిత్రు నాలింగన మొనరించెను. అయ్యదే కడసారి స్పర్శనమని భావించి జూలియను వెగడు పడియుండ, లూకాసు మెల్లగ నిట్టులనెను —

"మిత్రమా ! మనోవికారముల మఱుగుపఱచి నిశ్చలవదనుఁడవు కమ్ము! — ఆశారహితుఁడఁగాను ! మఱలఁ గలసికొందుమని విశ్వసింపుము."

"పరమాత్మునకు వందనములు ! మిత్రమా ! నీ యౌదార్యము, నీ త్యాగశీలము కేవలము నిరుపమానములు!—" అని తన మిత్రునివీనుల వడివడిఁ బలుకుచు సమందానందాతిశయమున నాతని జాలియను గాఢాలింగన మొనరించెను. ఇఁక మృత్యువువాతఁ బడనుండిన మిత్రు నా తెఱంగున నాలింగన మొనరించుట మానవ స్వభావమని పాపా భావించి, "వీని నిఁకఁ గొనిపొండు !" అని తన సేవకుల నాజ్ఞాపించి, యంతకంటె నెక్కుడు కరుణాసహనములఁ జూపఁజాల ననుభావము ప్రకటితము కావలయునో యన నొక్కసారి యా నేరస్థులఁ గలయఁజూచి వెనుదిరిగెను.

మన కథాసూత్రము త్రెంపి, ఇట్టి భయానక విచిత్రసంఘట్టనము నకుఁ గారణభూతమగు నమీనాను గమనింపవలయును. ఆతారువు గత్తె యవస్థ కడు దుర్భరముగనుండెను. తన విషయము బయల్పడు నేమో, దానఁ దన కెట్టి యుపాయము సంభవించునో యని కడు గలవరమంది, యాజరతాంగన మొదటిమందిరమునఁ బొంచుండి, రెండవగదియందలి కథాక్రమము తత్తరపాటుతో గమనించు చుండెను. గుణవంతుడఁగు లూకాసు కల్పించినకథ నాలించినంతనే, య మ్ముదుసలి హృదయభార మడంగెను. అందుఁ దన ప్రశంసయే లేకుండుటచే, పోయినప్రాణ మామెకు మఱల నలవడెను. ఇంకను ఆలసించినచో నేమి ప్రమాదము వాటిల్లునో, ఏక్షణమున పాపా యరుదెంచునోయని వెఱచి, ఆ పరిచారిక రయమునఁ బాఱి, తన యేలికసానియగు ఇస్మలిడా మందిరము చొచ్చెను.

పాపాయొక్క నల్లనిబానిసలు లూకాసు గుల్నేరులను ఆవలకు

నడిపించికొనిపోయిరి. ఖలీలు జూలియయును తనవెంట నరుదేర, పాషా వారిని వెంబడించెను. ఆగ్రహధురీణుఁడగు నాపాషా వారి నంటియేయున్నను, అట్టులే సందుచేసికొని, ఖలీలుఁడు నిజమనోహారిణియగు జులేఖా పీనుల నేమియోపలికి, మధురప్రణయపూరిత వీక్షణము నా యున్నుమిన్నపైఁ బఱపెను. జూలియను కూడ నిజ ప్రియాంగన నొక్కసారి ప్రణయముగ్ధుఁడై తిలకించెను. వా రందఱు నావలి కేగినంతనే, యా ద్వారము గడియ పడెను. జులేఖా తోడనే తైరజాను ఆలింగన మొనరించి, "సోదరీ! భయాతురవై విలపింప కుము. నీ సోదరికిఁ బ్రమాదము వాటిల్లనేరదు! నా వచనముల విశ్వసింపుము!" అని పలికెను.

"విశ్వాసమా! జులేఖా! ఏమంటివి? నా సోదరి జీవించియుండుఁ గదా!" యని తైరజా యాకస్మికసంజనితానందపరవశయై ప్రఫుల్ల వదనయై, సంశయబాధితాత్మయునై వడి వడి నడచెను. ఇందీవరాక్షి జులేఖా యిట్లు బదులాడెను —

"మన సోదరి గుల్నేరు నిజమనోకాంతుని దుర్మరణము కాంచు దురవస్థకుఁ బాలుకాదని యెఱుంగుము. లూకాసు మరణింపఁడు."

"ఎంతటి యదృష్టము! కాని, ఎట్లు —"

ఆ తెఱంగునఁ బెందత్తరమునఁ బ్రశ్నించు జులేఖాను వారించి తైరజా యిట్టు లనెను —

"సఖీ! నా పలుకులు విశ్వసించి వెఱ పుడిగి యుండుము. ఖలీలు లూకాసున కొక యుంగర మొసంగెను. సర్వభయనివారిణి యగు నా రక్షప్రభావముచే లూకాసున కెట్టియాపదయైనను వాటిలనేరదు!"

౫

దొల్టబను పాషా సపరివారముగా సోపానపరంపరావరోహణ మొన రించెను. ప్రాంగణము ప్రవేశించినంతనే జూలియను ఖలీలులఁ గాంచి

"ఇటు రం" డని యాతఁడు పలికెను.

పాషా యంతఁ దన చెంతనున్న తాళము తీసి యొక యంతర్ద్వారము తెఱచెను. యువజన మధ్యస్థుఁడై యాతఁ డందుఁ బ్రవేశించి యిట్టు లనెను —

"నేఁ దిరిగి యరుదెంచువఱకు, మీ రిందుండవలయు. గభీరబాస్ఫర నదీ తోయమున మీ సహచర విద్రోహి మరణించిన సమాచార మెఱుకపఱచి, ప్రాణములపైఁ దీవు కలదేని మీరు మఱి యెన్నఁడీ శుద్ధాంతసదనమునఁ జొరఁబడు దురాచార మొనరింపకుండునట్లు కొంచెము హితము కఱపి, మిమ్ముఁ బోనిత్తును. మదీయ పరిచారకులు విచ్చుకత్తులఁ బూని కావలియుందురు. కావున, ఈ లోనఁ దప్పించుకొని పలాయన మొనరించుటకుఁ బ్రయత్నింపకుఁడు."

పాషా కఠినగాంభీర్యధుర్యుఁడై యట్లు పలికి యా తలుపునకు బీగముపైచి తన దారిఁ బోయెను. ఆతఁడు వెడలినంతనే, తన మిత్రునితో జూలియను ఇట్టు లనెను —

"ఖలీలు మిత్రమా! నీ యభిప్రాయ మేమి? ఈ పాషా ద్రోహబుద్ధియై మనల నిందు బంధించి యుండునా?"

"నే నట్లు భావింపను."

"లూకాసు నీ కర్ణమున నేమైనఁ జెప్పెనా? తాను జీవించియుండు నవకాశ మున్నదని పలికెనా?"

"మిత్రమా! నేనే అట్టి యాశ కల్పించితిని."

జూలియను సహజముగా విస్మయపరవశుఁ డాయెను — "నీవా! ఖలీల్! నావలె నీవును బంధితుఁడవు. ఇందుండి —"

తన మిత్రుని వారించి వినయ నిశ్చల గంభీరస్వరమున ఖలీ లిట్టు లనెను —

"మిత్రమా! హృదయారాటముఁ దక్కి యుండుము. మన యను

చరుఁ డెంత శ్లాఘనీయముగ మెలంగెను! అట్టి స్వార్థత్యాగిని, అట్టి పరిశుద్ధయశోభాసురుని రక్షింప సమర్థుఁడనై యుండ –”

జూలియను విస్మయాతురపరుఁడై పట్టఁజాలక “నీకుఁ గలసామర్థ్య మెద్ది?” యని రయమునఁ బ్రశ్నించెను. ఖలీ లిట్లుపలికెను –

“అట్టి సామర్థ్య మొక యుంగరమునఁ గలదు. అద్దానిని మీ రెవ్వరుఁ గాంచకుండ మన మిత్రున కొసంగితిని. తన్ముద్రికాధరుఁడు నిశ్చయముగా సురక్షితముగా నుండునని విశ్వసింపుము, చాలును.”

ఆ మిత్రద్వయ మట్లు పరస్పరసంభాషణానిమగ్నులై యుండ, పాషా తన సేవకులను గలసికొనెను. అన్యోన్యప్రేమానుబద్ధులగు లూకాసు గుల్నేరుల రెక్కలవిఱిచి కట్టవలయునని పాషా కఠినముగ నాజ్ఞాపించుటచే, నాతని దాసులగు కొజ్జాలు వెంటనే యటు లొనరించిరి. ఇరువురు కొజ్జాలు వారి వెనువెంట నుండిరి. మిగిలిన నలుగురును తళతళ మెఱయు కరవాలములఁబూని జూలియను ఖలీలులు బంధితులై యుండిన గదిముంగిట నప్రమత్తతతోఁ గాపుండిరి. దొట్ట బను పాషా విచ్చుకత్తి చేఁబూని, లూకాసు గుల్నేరులు పరస్పర సంభాషణ మొనరింపకుండ వారి నడుమ నుండెను. గ్రీకుయువకు నొకభటుఁడు గట్టిగఁ బట్టియుండెను. రెండవవాఁడు గుల్నేరు సమీపముననే నడుచుచుండెను. ఆయబల యవస్థ కడుంగడు దుస్సహముగ నుండెను. పాప మామందభాగ్యురాలు లూకాసు ఖలీలుల పరస్పరాలింగనావసర రహస్యసంభాషణము నెఱుంగదు. తద్రహస్య మెఱింగించి నిజమనోకాంతచిత్తదావానలముఁ జల్లార్పఁ జాలుట కా యువకున కింకను అవకాశము చిక్కదాయెను. కాన నా ముద్దియ మానసము వర్ణింపరాని తెఱంగున దహించికొని పోవుచుండెను.

వారట్టులా యారామసీమ నతిక్రమించి సోపానపరంపర డిగ్గి, నాకాశ్రయస్థానము చేరిరి. అంతదనుక నా భాగ్యహీనురాలు

గుల్నేరు నిరాలంబయై యెట్టులెట్టులో సహింపఁజాలెను. విస్మిత భయాతిరేకమున నాక్రాంత బద్ధేంద్రియయై, తనకుఁ బ్రాప్తించిన మహాసంకటమును తలంపనేరక, కీలుబొమ్మవలె నడుచుచుండెను. కాసేపు, దూరాజవ్వాని విచ్ఛిన్నహృదయయై, నిజమనోనాథుని రక్షింప వలయునని గోలుగోలున విలపించియుండును. తానొక మహాక్షోభకర స్వప్నమునఁ బ్రయాణమొనరించుచుండినటుల యుండెను. నావ, సాంద్రతర వృక్షచ్ఛాయనుండి వెలువడి, సోపానముల సమీపింపఁ, నీటి కలకలధ్వని వీనుల సోకినంతనే, యామె భ్రాంతియంతయుఁ దొలంగెను. అనతిదూరమున నున్న గభీరభాస్వరనదీ జలగర్భమున నిజ మనోకాంతుఁడు తనకు వెలియై చిరావాస మొనరింప నెంచిన దారుణవిషయమామె స్మృతిపథమున మెఱపు మెఱసిన చందమునఁ గోచరించెను. గుల్నేరు తోడనే చైతన్యవిహీనయై పట్టువీడిన రంభాస్తంభమువలె నేలఁ గూలఁబోయెను. ఆచెంత నున్న భటుఁడు తత్ప్రమాదము వాటిల్లకుండ నారమణీరత్నమును నిజ దీర్ఘబాహు యుగ్మమునఁ బట్టెను.

గుల్నేరు సంస్మృతయై కనువిచ్చి పరికించుసరికి, మేఘరహితమై, వినిర్మలమై, నక్షత్రప్రభా భాసితంబై యొప్పు గగనమండలము దృగ్గోచర మాయెను. తోడనే తన దుస్సహ దురవస్థ పెను భూతమువలెఁ దలంపునకు వచ్చెను. ఆమె పడవయం దాసీనయైయుండెను. ఆ కుసుమ గాత్రి కోమల కరపల్లవము లింకను పాశబద్ధములై యుండెను. ప్రాణప్రియుఁడామె ప్రక్కనే కఠినపాశబద్ధుఁడై యుండెను. భటులు నాకా దండములు చేఁబూని యానకార్యపరతంత్రులై యుండిరి.

దాల్తబను పాషా ధవళరజతకాంతి సముజ్జ్వలిత కరవాలము చేఁబూని నడిమధ్యస్థాణువువలె నాసీనుఁడై యుండెను. నావ విశాల నదీజల మధ్యమున నుండెను.

తదవసర ప్రకృతి సౌందర్యము అసామాన్య వైభవోపేతమై యుండెను. చాన్ద్రికావిశాలాంకీ దర్పణమున ప్రతిబింబించు వ్రసౌధ దేశాద్యనేక నగరభాగ నికరములు వర్ణనాతీతముగ భాసిల్లుచుండెను. కాని, ప్రాణాధిప్రియతమ ఘోర దుర్దశావసరమున భీకర నిరాశా శోకాగ్నిని బడు నాకీసమయమున నీ ప్రకృతి సౌందర్య వైభవముతోఁ బనియేమి ?

కఠిన పాషాణహృదయునైనఁ గరగింపఁజాలు తెఱంగున నామె దీనాతిదీనావనతాననయై, వివర్ణవదనయై, యశ్రుజలార్ద్రనయనయై, దుర్భరవిషాదావరుద్ధకంఠయై, "జనకా! హా! జనకా! రక్షింపుము! ఆ యువకుని విడువుము. భరింపఁజాల? చూచి యెట్లు సహించుదాన? నా ప్రాణములోడనే యంతరించును. తండ్రీ! నిలిచియున్నను, ఉన్మాదిని నైపోదు —" నని విలపించెను.

"పాపాత్మురాలా! నోరు మూయుము! నీ ప్రియుని పని సరి, మరణింపక తీఱదు!"

విభీతహరిణశాబకముఁ గాంచి గర్జించెడు వ్యాఘ్రమువలె భయానక స్వనమున బలుకు నా పాషాతో లూకా నిట్టు లనెను —

"ప్రభువరా! నా ప్రాణమునకై యర్థించువాఁడఁగాను: నీ పుత్రిక కొఱకైన ననుకంప వహింపవలయునని ప్రార్థించెద. పవిత్ర మహమ్మదీయ సాంప్రదాయమునకు మదవివేకప్రవర్తనముచే భంగము కలిగించితి ననియు, నా కారణమున నా తనువు నీ క్రోధాగ్నికింధనము కానోపు ననియు నెఱుంగుదు. ఐనను, కరుణ సర్వరసప్రధానము, అఖిలమానవ గుణోత్కృష్టము. వధ్యుఁడగువానిని క్షమించితినని నీవే మున్ముందు అనిర్వాచ్యానంద మనుభవింపఁగలవు. ఆర్యా! దయామయుఁడవై ప్రాణదాన మొనరింపుము, ఈ నగరమున కెన్నఁడు నరుదేఱక అతి దూరదేశమున నుందునని ప్రమాణ మాచరింతును,"

పాషా యిట్లు బలుకాడెను —

"నీ నుడు లాలించితి, కాని నీ మనవి చెల్లింపనేరను. కొన్ని యవసరములందుఁ గరుణాగుణము గొప్ప దోష మగును. ఈ యవసర మట్టిది. చావు తప్పదు. నీ జీవిత మిఁక నాలుగైదు నిముసములతో సరి. కాలయాపన మొనరింపక, నీ మతానుసారముగా దైవమున కంత్య ప్రార్థనము సమర్పించుకొనుము."

అట్లు పరుషముగఁ బలికిన దాల్తబను పాషా క్రోధ ఘూర్ణిత వదనుఁడై కనుసన్న చేయ, నొక కొజ్జా తన చేతనున్న తెడ్డు నటుంచి వంగి యొక గోనెసంచి తీసెను. ఆ సంచిం గాంచినంతనే, గుల్నేరు శరీర మొక్కసారి జల్లుమనెను. భయాతిశేకమున నామె హృదయము తట తట కొట్టుకొనెను. ఆ భటుఁడు సంచిమడత విప్పుచుండగనే యా కోమలి ప్రాణము లెగిరిపోయెను. కెవ్వున నఱచి, పట్టు తప్పిన కుందనపు విగ్రహామువలె నేలఁ గూలఁబోయిన యక్కాంత శ్రవణ పుటమున లూకాసు రయమున నిట్లు పలికెను — "ప్రేయసీ! భయ ముడుగుము. నాకుఁ బ్రాణభయము లేదు!"

అట్టి వాక్యామృతము కురియుటచే, పోయిన ప్రాణము గుల్నేరు నకుఁ దిరిగివచ్చెను. అంతఁదనుక దుర్భర నిరాశా భయానకసాగరమున మునింగియుండిన యా పడఁతి యమితానందపరవశాత్మ యాయెను. కాని, తన ప్రియుని కనుసన్నఁగాంచి యామె తమ్మదేకము నడంచి కొనెను. అంతట, లూకాసు మఱియొకసారి పాషాను ప్రార్థించెను — "ప్రభువరా! ఇయ్యది నా కడసారి ప్రార్థన, కృపాంబువులు కురి పింపుము!" కాని, ఆ పాషా రూక్షవీక్షణములఁ జూచుచు చూచి జల ధరమువలె నిట్లు గర్జించెను — "నీవు మరణింపక తప్పదు! తప్పదు!"

"ప్రభువర్యా! తీవ్రపడకుము. కార్యము మించిన యనంతరము —"

"ఓయీ! వృథాయాసము వలదు. సంసిద్ధుఁడవు గమ్ము! ఇఁక

మూఢుడకుము!"

డాల్ట్రబను పాషా యాతెలుంగునఁ గఠినహృదయుఁడై నిజప్రాణాప హరణ మొనరింపఁ గృతనిశ్చయుఁడై యుండుటఁ గాంచి, లూకాసు మగుడ నిట్టులనెను —

"ప్రభువర్యా! మఱియొక్కమాట. ఈ యుంగరము నొక్కసారి పరికింప వేడెదను."

ఆగ్రహానలతప్తుఁడై యున్న పాషా యీ పలుకులకు విసుగుజెంది, కసలి "అది యేమి?" యని ప్రశ్నించెను.

"ఆర్యా! ఏమైనను, ఇఁకఁ జావనున్నవాని ఈ యంత్యప్రార్థన చెల్లింపవలదా?"

పాషా యంతట మిక్కిలి చీకాకుపడియు సమ్మతించి, గ్రీకు యువకుఁడు ధరించిన యుంగరము చూడఁబోయెను. లూకాసు బాహుయుగ్మము వెనుకకు విఱిచికట్టఁబడి యుండెఁగదా. కావున, పాషా వంగి చూడవలసినవాఁడాయెను. ఒకచేయి నడిమివ్రేలున నొక వజ్రపుటుంగర ముండెను. రెండవచేతి నడిమివ్రేలున నుండినది యొక శిలాముద్రిక. అందొక బిందువు చక్కఁగఁ జెక్కఁబడి యుండెను. ఆ బిందువుచుట్టు నెవ్వియో గుఱుతు లుండెను. అట్టి రెండవ యంగుళీయము దృగ్గోచర మైనంతనే, పాషా యమిత విస్మయ సంభ్రమాకులుఁడై, యదరి "ఆ!!" యని యఱచెను. ఆ యుంగ్ర వస్తుప్రభావ మప్పుడు లూకాసునకు వ్యక్తమాయెను. మన మిత్రుఁడగు ఖలీలు యొక్క యపారాభిమానసామర్థ్యముల కాతఁడెంతయు సంతసించెను. ఒక సామాన్యపుటుంగరమునం దంతటి ప్రభావ ముండుటయు, తన ప్రాణప్రియుఁడు కరాళమృత్యుదంష్ట్రలనుండి వెలువడు శుభసూచన గోచరించుటయుఁ గాంచి యా ప్రణయిని ప్రమోద విస్మయసంభ్రమాకుల చిత్త యాయెను.

దాల్త్రబను పాషా మఱియొకసారి యా ముద్రికపై దృష్టినిల్పి, రెప్పవాల్పక కడు సూక్ష్మముగాఁ బరిశీలించెను. పరీక్షాఫలిత మేమి? పాప మూశేఁకు విభ్రాంతచిత్తుఁడై, ఏమి కావించవలయునో నిర్ణయింప నేరక, యిట్లు ప్రశ్నించెను —

" యువకుఁడా! నీ కీ ముద్రిక యెట్లు లభించెను? "

పాషా యొక్క తొంటి కాఠిన్యగాంభీర్యము లంతరించెను. లూకాను నిశ్చలస్వాంతుఁడై యిట్లు లనెను —

" నా మిత్రుఁడగు నా తురుష్క యువకుఁడు ఖలీలు ఉస్మాను నా కొసంగెను. "

పాషా విభ్రమనిశ్చేష్టితుఁడై, కొంతతడ వాలోచనాపరుఁడై మగుడ నిట్టు లనెను —

" యువకుఁడా! నిక్కము పలుకుము. ఈ ఖలీలుఁ డెవ్వఁడు? నీ వెందు కలసికొంటివి? మీకు పరస్పర స్నేహ మెట్లు లలవడెను? తెలుపని సమాచార మేమైన నున్నచో, మఱుగుపఱుపక సత్వరము తెల్పుము. "

" ఆర్యా! ఏమియు నెఱుంగను. నాలుగు గంటల క్రిందట నేనును నా మిత్రుఁడు జూలియను గలసి యొకానొక కాఫీగృహమున నుండ, ఈ తురుష్కయువకుఁడు ప్రవేశించెను. తోడనే పరస్పర సంభాషణా పరతంత్రులమై దృఢతమ స్నేహపాశ బద్ధులమైతిమి. మా సమాచార మింతియ. "

పాషా మగుడ నాలోచనాధీనమనస్కుఁడై తుదకుఁ దన భటునిఁ గాంచి సన్న యొసరింప, వాఁ డా భావము నెఱింగి లూకానును పాశ విముక్తు నొనరించెను. స్వాతంత్ర్య మలవడినంతనే, ఆ యువకుఁడు తన ప్రాణకాంత యగు గుల్నేరునకుఁ గూడ బంధవిమోచనము కల్గించెను. తీవ్రాలోచనా నిమగ్నుఁడై యున్న పాషా లూకాను

చెయ్యము గమనించినట్లు కానరాదు. అతఁడు మగుడ నిట్లు పలికెను—

"ఓయీ! అనృతవాది యాత్మద్రోహపాతకము నొడిఁగట్టికొనకుము. ఈ ఖలీలు గుఱించి మఱియేమియు నెఱుంగవా?"

ఆ యుంగరము కారణమున దాల్తబను పాషా యంత విభ్రమచిత్తుఁడగుటఁ గాంచి లూకాసు సహిత మాశ్చర్యపరుఁ డాయెను. కాని నిజముగ నాతఁ డన్య మెఱుంగఁడు గదా. తోడనే పాషా ద్విగుణీకృతాందోళిత మానసుఁ డాయెను. తన చెంత నొరు లున్న సంగతి యెఱుంగక, ఆతఁ డీ పగిది మందస్వరంబునఁ జింతించెను —

"ఎంత విపరీతము! నేఁడు పరిస్థితులెంత వింతపరిణామము నొందెను! ఈ ఖలీలుఁ డెవ్వఁడు? ఈ యుంగర మెట్లు సంపాదించె? —"

ఆ తెఱంగునఁ జింతాభరితాంతరంగుఁడై యున్న పాషాను వారించి లూకాసు ఇట్టు లనెను —

"ఏమైనను, ప్రభువరా! నీ యాగ్రహము చల్లారెనని భావింతును. మదీయ ఘోరమరణ ప్రదర్శనముం గాంచు దురంత దౌర్భాగ్యము నీ పుత్రికారత్నమునకు —"

"తండ్రీ! ఎట్టి ప్రోద్బలముచేనైన నేమి, నా ప్రాణముకంటెఁ బ్రియతర పదార్థమును రక్షించితివి. నీ కిదె వందన సహస్రము." అని యమితానందావరుద్ధకంఠయై పలుకుచు గుల్నేరు నిజ జనకుని పాదయుగళముపైఁ బ్రాలెను.

పాషా ప్రయత్నము విఫలమాయెను. ఆ రక్ష — ఖలీలుఁ డొసంగిన యుంగరము — ప్రభావ మెట్టిదో గాని యాతఁడు లూకాసును వధింపనేరనివాఁ డాయెను. ఐనను, తాను సహజముగా క్షమాగుణమండితుఁడని ప్రకటింప నుద్దేశించి, గంభీరవదనుఁడై, యాతఁ డిట్టు లనెను—

“మీ మిత్రువుర్గను భయవిహ్వలుల నొనరించితిని. ఇంక నెన్నఁడిట్టి దుర్వ్యవసాయములం జొరకుండురని విశ్వసింతును. కాని, ఈ ఖలీలు ఏమనునో, వాని యుదంత మెట్టిదో యరయవలయును –”

పాషా మఱి మాటాడక, తన భటులఁ గాంచి సన్న చేయ, వారు నౌకాదండముల రయమున ధరించి తమ భుజబలముఁ గొలఁది నావను వడి వడి వెనుకకుఁ బోనిచ్చిరి. పాషా నిగూఢ గాఢాలోచనానిమగ్నుఁడాయెను. యూకాసు గుల్నేహులు ఆశా సంతోషాతిరేకమునఁ బరస్పర విలోకనాయత్తచిత్తులైరి. నావ క్రియ్యఁ జొచ్చి సాంద్రతర వృక్షచ్ఛాయాచ్ఛాదిత మైనంతనే, ఆ యువతీయువకుల పరస్పరకరములు చుంబించెను. కరములే గాదు, పరస్పరహృదయములును, పరస్పర మధురాధరములును నిశ్శబ్దముగాఁ జుంబించెను. అట్టి సమయమున నా మిథున మానందపరవశులగుట సహజముగదా. వారి నింతకాలము విడదీసియుంచిన భయంకర మృత్యునిష్ఠురకరము మాయ మాయెఁ గదా. ఇఁకముం దేమగునో, కఠినహృదయుఁడగు పాషా యేముహూర్తమున వారిని విడదీయునో యెఱుంగ నేరకున్నను, వారు, విశ్వాసపూరిత హృదయులై యెట్టి విచారము తెలియక, అనంతసౌఖ్యార్ణవ తరంగముల నోలలాడుచుండిరి.

పాషా మొదలగువా రటులుండ, ఖలీలు జూలిఖయును లెటులుండిరో గమనింపవలయును. వారి నొకగదియందు బంధించి, సాయుధులగు దౌవారికులఁ గావలియుంచియు సంతసింపక, దాల్తబను పాషా భద్రముగఁ దాళమువైచెను. కారణ మేమన, తాను దవ్వుననుండు సమయమున జులేఖా తైరజాలు బంధితులను విడిచిపుత్తురని పాషా యనుమానించెను. కాని, ఆ బీగమునకుఁ బ్రతి యొకటికలదు. అయ్యది సాధారణముగా నెవ్వరి యధీనమున నున్నను, ప్రస్తుతము అమీనా హస్తగత మాయెను.

ఆ యువకుఁ డామందిరమున నుండి నాలుగైదు నిముసము లాయెను. అంతలోఁ దాళము త్రిప్పినట్లు రెండవ ద్వారముచెంత సవ్వడి యాయెను. వారు వెలుగంది యటుబరికింప, నాతలుపులు మెల్లగఁదెఱువఁ బడెను: సంధాన కార్యప్రవీణ యగు నమీనా సాక్షాత్కరించెను. ఆ స్త్రీభటులు కావలియున్న గవాక్షమువంక వ్రేలు సాపి నోరువిచ్చి మాటాడుట ప్రమాదకరమని సూచించి, ఖలీలువంక చూచి తనవెంట రావలయునని కోరెను. తురుష్క యువకుఁడు మందస్వరమున నిట్లు పలికెను —

" ఏల రావలయు? నన్ను చెరనుండి తప్పించుటయె నీ యభిప్రాయ మగునేని, నా మిత్రుని వీడి రాఁజాలను. నీకు శక్తి కలదేని మా యిర్వు రను రక్షింపుము; లేదేని, నేనును ఇందే యుందును. "

" అసంభవము! కాని, నీ మిత్రున కపాయము వొరయ నేరదు. లూకాసు నొక్కనినే పొలియింతునని పాషా పలికెగదా. "

" అట్లయైన, ఇంతలో నేను త్వరపడి నా సహచరు నిందుంచి దొంగ చందమున నేల తప్పించుకొన ప్రయత్నింపవలయును? "

" అయ్యో! ప్రశ్నింపకుము. నా మాట పాటింతువేని, లాభప్రద ముగ నుండును. "

" మిత్రమా! అపాయము లేదు. పొమ్ము. " అని జూలియను తన స్నేహితుని ప్రోత్సహించుటచే, నాతఁడు క్షణమాత్ర మాలో చించి, అమీనాను వెంబడించెను.

ఆ గదినుండి వా రిరువురు వెలువడినంతనే, ఆ వృద్ధురాలు మగుడ భద్రముగ బీగము వైచెను. తన ప్రాణకాంత సుందరవదన సందర్శన భాగ్యము లభించునని భావించి ఖలీలు సంతుష్టాంతరంగుఁ డాయెను. కాని, సోపానపరంపర నారోహించినంతనే, పాషా శయ్యామందిర ద్వారము గోచరించెను. అద్దాని కెదురుగా పాషా పుత్రికల మందిర

శ్రేణియు దృగ్గోచర మాయెను. అమీనా యా సంకేత మూపక, హామా మందిరాభిముఖియై, ఖలీలు కాంచునట్లు నునుకుట్టుగ గనమూని, యా తలుపు మెల్లఁగఁ దెఱచెను. తురుష్కుఁడు విస్మయపరవశుఁడయ్యెను; సంశయము వీడి, ఈ చోద్యమెద్దియో యెట్టిదైనను అరయవలయునని కృతనిశ్చయుఁడై, యామె వెంబడి నందుఁ బ్రవేశించెను.

వారు ప్రవేశించినది యొక చిన్నగది. చిన్నదయ్యు, నయ్యది సర్వవస్తుసమృద్ధంబై, బహుదీపికా విరాజమానమై యుండెను. అమీనా సన్నపి యొనరింపక, మెత్తని రత్నకంబళముపై పడివడి ముందుగఁబోయి యొక యంతర్ద్వారము తెఱచి, యందుఁ బ్రవేశింపవలయునని ఖలీలుం గాంచి సన్న యొనరించెను. ఆ పరిచారిక యొక ప్రక్కను నిలిచి పోయెను. తురుష్కుఁడు సహజనిశ్చలగమనమున దన్మందిరాంతర్గతుఁడాయెను. అతఁడు ద్వారము దాటినంతనే, యమీనా తలుపు బంధించెను. ఏకాకియైన ఖలీలుఁ డేమి కాంచెను? ఆ మందిరమునందలి యవ్వలికోనయం దమరియున్న సమున్నతాసనముపైఁ బఱచిన రమణీయ విశాలతల్పమున నొయ్యారముగ వ్రాలియున్న రమణీమణి నయనపర్వ మొనరించెను.

ఆ మందిర మతి విశాలము. పాషా పుత్రికల మందిరముకంటె నమిత వైభవతరంబుగ నొప్పారెను. అందు సుఖాసీనయై యున్న సుదతీ రత్నము ప్రాయము ముప్పది సంవత్సరము లుండును. కాని, ముఖ వికాసము విమలమై, సౌందర్యనిలయమై, నిరంతర యౌవన ప్రభావిభాసితంబై యుండుటచే, నామె వయస్సు మూడు నాలుగు సంవత్సరములు కొఱఁతపడినటు లుండెను. శరీరము స్థూలముగాక, తాదృశ పరిపూర్ణ శోభాయమానముగ నుండెను. నిగ నిగ ప్రభాదీపితంబులగు మొగములు దిండులపైఁ గడు నొయ్యారముగ వ్రాలియున్న యా కులుకులాఁడి విషయలాలసము వర్ణనాతీతమై సువ్యక్తముగ నుండెను,

ఆ మిటారి కుచయుగ్మము కుంభసమానమై పొంకము కలిగి యుండెను. కరచరణాద్యవయవము లన్నియుఁ గోమలములై, కాంతి వంతములై, వర్ణనీయములై, సముచితముగ నమరియుండెను. ఆ మోహా నాంగి రూపురేఖ లసదృశవైభవ సముద్దీపితంబులై, నిష్కళంకములై వర్ణనాతీతములై యుండెను.

సౌందర్యరాశియగు నాతరుణి కపోలములు పూర్ణములై సుందర సంధ్యారుణరాగభాసురములై యుండెను. నయనము లాకర్ణాంత విశాలములై, వినీలవిభ్రమనియలములై, మృదులకామవికారాకరములై రాజిల్లుచుండెను. సువర్ణదీపితములగు నీలశిరోజములు కుటిలములై గజేంద్రదంతధవళ సన్నిభకంఠము నాచ్ఛాదించి పూర్ణకుచకుంభ ములపై మనోహరముగఁ జిందులాడుచు నా కామినీమణి వ్రాలి యున్న మొగములు దిండులపై భంగవ్రాతమువలె నమరియుండెను. ఆ సొగసులాఁడి వదనమండలము బింబమువలెఁ బూర్ణవలయాకృతి నలరారుచు, బరిపూర్ణసౌందర్యమునకుఁ గొఱంత కల్గించుచున్నను అసమాన సౌందర్యవైభవోపేతమైయుండెను. రమణీయముగ నమరి యున్న నాసిక యొకింత నిబ్బరముగాఁ దోఁచుచుండెను. మనోహర బింబారుణ విరాజితాధరములు బహుళములై హిమార్ద్రములగు గులాబులవలె నుండెను. తదధరోష్ఠము లొక్కింత వీడియుండుటచే, తదంతర సుందర దంతములు దంతస్ఫూర్తి దీపించుచుండెను. అమంద శోభాయమానముగ నమరిన చుబుకము దత్కమనీయవదనాకృతియు గమనింతుమేని, ఆసుందరి విషయలాలసయగు కామినియని తెలియును. ఆ మత్తకాశిని తా నప్రయత్నముగనే ధీరయువజన హృదయా పహరణ మొనరింపఁజాలుదు నను నాత్మవిశ్వాస మమితముగఁ గలదగు టచే, స్వైరిణీజనసహజ ప్రణయవికారాస్త్రములఁ దాల్పక తదుచిత నిర్లక్ష్యగంభీర సౌందర్య వైభవసముజ్జ్వలయై రాజిల్లుచుండెను.

ఆ మదవతి వస్త్రధారణముగూడఁ దదనుకూలవైభవసమన్వితమై యుండెను. ఆమె ధరించినవినీల వసనము దేహకాంతి నతిశయింపఁ జేయుచుండెను. తదంతర కంచుకము మనోహరగళసీమ దిగువనుండి, ఉదరపర్యంతము పీడి, ఘనవక్షోజవైభవస్ఫూర్తి నెక్కుడుగ వ్యక్త పఱచుచుండెను. మనోహరకుందనమువలె, ప్రసిద్ధహరిదంతమువలె, సమూల్యచంద్రకాంతశిలవలె భాసిల్లు నామేల్బంతి బలితంపు భుజముల నలంకరించిన యనర్ఘమణిమయాభరణములు తత్సౌందర్యము నధిక తర వైభవం బొనరించుచుండెను. ఆమీటారి తాల్చిన పరాయి సుంద రాంఘ్రిద్వయమున కొక్కింత మీఁదుగఁ జాఱి, తదంగ సౌందర్య సౌష్ఠవములఁ జాటుచుండెను. అధికవర్ణనమేల? ఖలీలుఁ డన్యకన్యా సమర్పితహృదయుఁడు కాకుండినచో, ప్రభురాణి యనూన సౌందర్య వైభవ మా ధీరస్వాంతునిం దప్పక అధీరహృదయు నొనరింపఁజాలి యుండెనని చెప్పవలయును.

ఖలీలుఁ డరుదెంచినను, ఆ నవమోహనాంగి ఇంచుకేనియుఁ జలింపక, ప్రదర్శితనిజాంగాంగవిరాజితయై, అట్టె యొయ్యారముగ నాసీనయైయుండెను. తన తనూవైభవముచే నాసుందరాంగుని హృద యము నాతెఱంగున నాకర్షింపఁగడంగి, యాతరళనయన అవనత వీక్షణములచేతనే యాతని మనోహరాకారము పరిశీలించెను. ఆ యువకుఁ డా దివ్యసుందరవిగ్రహమును రయమున డాయక, అట్టె నిలిచిపోయెను. కాన, నామెయే తనచెంత కరుదెంచి, తన శయ్యా తలంబున నాసీనుఁడు గావలయునని సన్న చేసెను. ఖలీలుఁడట్టు లుపవిష్టుఁడై, ఆతొయ్యాలి యేమనునో యని నిరీక్షించెను. అంత నా మధురవాణి మంజులమురళీస్వనంబున నిట్లుప్రశ్నించెను —

"సొగసుకాఁడా! నీవెవ్వరిసమక్షమున కరుదెంచితివో యెఱుం గుదువా?"

"సుహానీయుఁడగు దాల్తబనుపాషా ప్రియభార్యయగు ఇస్మిల్డా సతీమణిసమక్షమున నున్నాఁడనని భావింతును."

ఖలీలు అట్లు సగౌరవముగ బదులాడ, నాపడంతి యాకస్మికోద్విగ్నస్వరంబున నిట్టులనెను—

"ప్రియభార్యయా! ఎంత విపరీతము! నీవంటి దివ్యపురుషుని ప్రేమఁ జూరఁగొన నాశించియున్న నన్ను ఆ మూర్ఖుఁడా, ఆ రక్కసుఁడా ప్రేమించుట?"

"నన్ను రప్పించుట కిదియా కారణము?"

"మఱి యే కారణము?" — మోహాంపువీక్షణజాలములఁ బర్వఁజేసి, యా మత్తకాశిని యానంద కందళిత హృదయయై మగుడ నిట్టులనెను — "మఱి యే కారణమున నింతటి ప్రమాదమునకుఁ గడంగి నిన్ను రప్పింతును?"

మోహవిభ్రాంతచిత్తయై యింకను నేమియో వాకొననుండిన యా మందయానను వారించి ఖలీలుఁ డిట్టులనెను —

"వనితామణీ! నేను ప్రేమాస్పదుఁడ నంటివి. అయ్యది మహాభాగ్యము. కాని, అన్యథా తలంపక మూర్ఖ కృతఘ్నతాపూరిత చిత్తుఁడనని సిరసింపక నా పలుకుల గమనింపుము. నా హృదయము పరాధీనమై యున్నది!"

"క్రూరాత్మా! వయసుకాని కింతటి క్రౌర్యము తగునా? — యువకుఁడా! అసామాన్యసౌందర్యసముజ్జ్వలుండవు; నిన్నుఁ బ్రేమించు కాంత నిట్టి కఠిన నిష్ఠురోక్తులఁ గారించుట పాడియే?"

పాషాభార్య యట్టు లుద్విగ్నచిత్తయై పలుక, తురుష్కయువకుఁడు సహజనిశ్చలస్వరంబున నిట్టులనెను —

"వనితామణీ! కఠిననిష్ఠురప్రవర్తనము నే నెఱుంగను. నీ హృదయము నెఱింగితి: మదీయ కృతజ్ఞత వెలిబుచ్చితి: అనంతరము నా హృద

యావస్థను బురుషోచితముగఁ దెలియఁబఱచితి. ”

“ యువకుఁడా! భవదీయ హృదయాపహారిణి యెవ్వతెయో వచింపుము! ఆహా! వేఱుగ నడుగనేల? ఆ జులేఖాను వలచిగదా, యిటు విచ్చేసితివి! కాని, యువకుఁడా! చూచునంతమాత్రమున హృదయ సమర్పణ మొనరించుకొనుటయా! అసంబద్ధము! కేవలము బాల్య చాపల్యము కావలయు. భ్రమ! —”

“ వనితామణీ! జులేఖాను గాంచినంతనే మోహపరవశుఁడ నైతి నని విస్మయము చెందెదవా! కాని, మదీయప్రవర్తన మసంబద్ధ మగు గాక; నన్నుఁ గాంచిన రెండు నిమిషములకే, కామ వికారాక్రాంత చిత్తవైతివే! ఇంతకంటె నసంబద్ధమా! ”

“ ఆహా! నీ సౌందర్యవైభవమును అమీనా యఖండపదజాలముల నభివర్ణించెను. ఆ ముహూర్తముననే, మోహపరవశనైతి, నేఁడు నీ మనోహరాకారము కన్నులారఁగాంచి, మదీయ పరిచారిక వర్ణన మతి శయోక్తి కాదని గ్రహించితి. గమనించితివా! మఱియొక్క విషయము గమనింపుము. కాంత ప్రేమ నవనీత కోమల సదృశము ; క్రోధపూరిత యగునా — అనివార్యము, భయంకరము! ”

తోడనే సర్వాంగసుందరుండగు నా యువకుఁడు గంభీరముగ లేచి, విస్పష్టముగ, నిట్టులనెను —

“ వనితామణీ! తియ్యని మాటలకు లోఁబడనివాఁడను, నీ బెదరింపుల కదరి నీకు వశంవదుఁడ నగుదునని భావింతువా? అంతటి భ్రాంతి వలదు. వనితామణీ! కాలయాపన మొనరింపక, దయామయ చిత్తవై నన్నుఁ బోనిమ్ము. పాషా సత్వర మరుదేరఁ గలఁడు. నన్ను బంధించిన చెరయందు నేను గానరానిచో, మన యిరువురకును అపాయము వాటిల్లును. ”

కాని, యా కామిని యా పలుకుల నాలించినట్టులు కానరాదు.

సంధ్యాసమయమున వ్రాలియుండు చారుతర కుసుమరాజము వలె నా పడఁతి శిరము నిజ సమున్నత వక్షోజములపై వ్రాలియుండెను. ఆ మోహనాంగి యాలోచనాధీనయై యుండ, హిమసన్నిభమై పూర్ణ సువర్ణ కుంభసాదృశశోభాయమానమై పెల్లుబుకు నా మదవతి వక్షోజములు వీడిన కంచుకమునుండి తొంగిచూచుచుండెను. మొగములు దిండులచే దీపించు తల్పముపై వ్రాలియున్న ఆ కులుకులాఁడి యాకృతి మనోహరమై, మోహజనకమై, వర్ణనాతీతమై యుండెను. అట్టి నవ మోహనాంగిని ఒంటిపాటునఁ గాంచు తరుణ వయస్కుఁడు విగత ధైర్యుఁడై పాదాక్రాంతుఁడు కాకుండుట దుర్లభము. నిజహృదయాపహరణ మొనరించు నెపంబున నే యా కులుకులాఁడి నిజాంగ సౌందర్యాతిశయమును యథాలాపముగాఁ బ్రదర్శించెనని ఖలీలుఁడు గ్రహించెను. ఒక జారిణి తళుకు బెళుకులను గాంచి నిజమనోకాంతను మఱచు స్వభావ మాతనిది కాదు. జులేఖాపై నాతఁడు బద్ధానురాగుఁడై యుండెను. ఆతని ప్రేమ నిశ్చలము, అనంతము, అపారము.

కొంతకాలము ఇస్మిల్దాసతి యటు లుండెను; గభీరాలోచనా నిమగ్నయైనటు లుండెను. ఆ విపరీత సమావేశ మెన్నఁడు తుదముట్టునో యని ఖలీలు విసువున నిరీక్షించుచుండెను. అంత నా కోకిలవాణి నిజసుందరాననము మగుడఁ బైకెత్తి, విశాల వినీల నయననిర్గళిత గాఢ కామ వికారాంచిత వీక్షణజాలముల నా యువకునిపై సిలిపి యల్లన నిట్టు లనెను —

"సుందరాంగా! నా మోహము నింకను దిరస్కరింతువా? మత్సమర్పితహృదయారాధనము నింకను గాలఁ దన్నెదవా?"

"వనితామణీ! నీ క్షేమము, నా క్షేమము గమనింపుము. బ్రతిమాలెద — ఏల బ్రతిమాలవలయు! నన్ను బోనిమ్ము!"

ఆ గంభీరాలాపములు ఖలీలు నోటినుండి వెలువడినంతనే, గూఢ చారిణి యగు నమీనా యున్మాదినివలె శరవేగమున నరుదెంచి, విపరీతభయాతురయై యిట్టులఱచెను— "అరుదెంచెను! మహానీయుఁడు పాషా యరుదెంచెను! ఉద్యానవనమున నడుగులచప్పుడు విని పరుగు పరుగున వచ్చితిని!"

ఇస్మీల్డానతి ప్రకంపితహృదయయై, నిజకేనూలత యొకసారి నడంక, దిగ్గున నాసీనయై యిట్టు లనెను —

"మనోహరాకారా! పొమ్ము. ఆశారహితనై, యుక్తాయుక్త ముల నెఱుంగక, నిన్ను వెఱపింపఁ గడంగితి, క్షమింపుము. నన్ను మఱువవలదు. పునర్దర్శనము కాఁగలదు, పొమ్ము!"

అమితభయవ్యాకులచిత్తయై యున్న యమీనా ఖలీలునకు సన్న యొనరించి వడి వడి నడవసాగెను. తురుష్కుఁ డామెను వెంబడించి, రయంబున, గ్రనుముగాఁ దన చెరఁ జేరెను. ఖలీలు అందుఁ బ్రవేశించు టయు, అమీనా తహ తహ లాడుచుఁ దాళముపై చుటయు, అవ్వలి ద్వారము తెఱచి దాల్తబను పాషా యన్యజన పరివేష్టితుఁడై యరు దెంచుటయు నొక్కముహూర్తమున సంభవించెను.

బంధితు లిరువురు — ఖలీలు జూలియనులు — ఆ మందిరమున భద్ర ముగ నుండుటచే సంతసించి, వారి నుద్దేశించి తనవెంట రావలయునని పాషా పలికెను.

పాషా ప్రవర్తనము వింతగ నుండెను. తొంటి గాంభీర్యము తొలం గెను. క్రోధఘూర్ణమాన మానసుఁడై, దయారహితుఁడై వెడలిన జెట్టి వినమ్రుఁడై, విపరీత విస్మయాక్రాంత చిత్తుఁడై, విభ్రాంతవదనుఁడై యరుదెంచెను. రణవ్యాపార పారంగతుండగు నా వీరుఁడు ఆలోచనా ధీనుఁడై మందుని చందంబున వెఱఁగుఁ జూడ్కుల నిట్టట్టు పరికింపఁ దొడంగెను. సహజాధికార పూరితస్వరమున "నావెంట రండు!" అని

పెళ్ళునుగఁ బలికెనే గాని, తాను మున్నెఱుంగని మర్యాద నాతఁడు వ్యక్తపఱచుచుండెను.

జూలియను ఖలీలులు పాషా వెంటఁ బోయిరి. వారు సోపానముల నారోహించి పాషా పుత్రికల మందిరశ్రేణి ప్రవేశించిరి. మనోహర జలస్తంభ మమరియుండిన మందిరమున లూకాసు గుల్నేరులు అమందానందము ననుభవించుచు సుఖాసీనులై యుండిరి. అమిత సౌందర్య విరాజితాననలగు తైరజా జులేఖాలు సహిత మమితానంద వికస్వర వదనసరోజలై, నిర్విచారముగ నుండిరి.

ఖలీలునిఁ గాంచినంతనే, లూకాసు నిజప్రియాంగనను వీడి, పరుగున బోయి, తన మిత్రు నాలింగన మొనరించి, సంతస కృతజ్ఞతోద్రేకిత స్వరమున నిట్టులనెను —

"ప్రాణమిత్రమా! నా ప్రాణము రక్షించితివి! నే నెంతయుఁ గృతజ్ఞుఁడను."

"మిత్రమా! సంజీవివంటి ఆ యుంగరపు ప్రభావము నే నెఱుంగుదు."

చిరమిత్రులగు జూలియను లూకాసు లంత బరస్పరకరచుంబన మొనరించిరి. వారి యానందమునకు మేరలేదు. ఆ యెదుటనుండిన తైరజా గుల్నేరులు విస్మయ కృతజ్ఞతాపూరిత వీక్షణముల ఖలీలుపైఁ బరగఁ జేసిరి. జులేఖా యన్ననో, వారివలె విస్మయాక్రాంతచిత్త కాక, సంతోష ప్రణయపూరిత నయనయై యుండెను.

తన కృతజ్ఞత నా తెఱంగున సముచితముగా వెలిబుచ్చినంతనే, లూకాసు మగుడఁ దన ప్రేయసిచెంత నాసీనుఁ డాయెను. దాల్తబను పాషా వీక్షణమాత్రమున నైన వారింపకుండుటచే, జూలియను ధైర్యధుర్యుఁడై తన ప్రాణకాంతయగు తైరజాప్రక్క నాసీనుఁడాయెను. జులేఖాప్రక్క ఖలీలుఁడు సుఖోపవిష్టుఁ డాయెను.

దాల్చబనుపాషా మందిరమునడుమ నిలుచుండి, యనన్యసామాన్య ముద్రిక పరిశీలనాకార్యనిమగ్నుఁడై, యితర విషయముల మఱచి యుండెను. దేదీప్యమానముగ రాజిల్లు దీపరాజముల సాహాయ్యముచే, నాతఁ డా యుంగరమును మఱింత పరిశీలనగాఁ బరికింప నవకాశ మాయెను. ఆతని చూపు లింకను అమిశ్రభ్రాంతియుతములై యుండెను. ఎంత పరికించినను, ఆతని కేలుకో సంతస మలవడకుండెను. జనులు[illegible], వివేకరహితునిచందమున నా మహనీయుఁ డా జీవరహిత పదార్థము నదేప్రకారము డిల్లపడి మైమఱచి పరికించుచుండెను. తుద కాతఁడు తెలివొంది, ఖలీలుని డాసి, సగౌరవముగా నిట్లు ప్రశ్నించెను —
“ఈ యుంగరము ధరించు మహనీయుఁ డెవ్వఁడని గ్రహింపఁగలవా?”

“ప్రభువరా! ముందుగనే తెల్పియుంటిఁగదా. నా యువతీ మంతియ.”

ఖలీలుఁ డట్లు నిశ్చలముగాఁ బలుక, పాషా వెఱఁగుఁ జూడ్కు[illegible] నిగిడించుచు నిట్లు ప్రశ్నించెను —

“నీ కీ ముద్రిక యెట్లు లభించెను?”

“ప్రభువరా! అది నా రహస్యము.”

గంభీర సమున్నతాకారుఁడగు నా తురుష్క యువకుని గంభీర వినిశ్చల విస్పష్ట గర్వితాలాపముల కెంతయుఁ జకితుఁడై, ఆ యపూర్వ వైభవ సముజ్జ్వలవదనము పరికించి, పరికించి, శతాధిక విస్మయ వికట భ్రుకుటియై పాషా యనంతరము సుందరాంగియగు జులేఖాను వీక్షించెను. స్థిరచిత్తుఁడగు నా వీరుని విపరీతభావచేష్టల గమనింతుమేని ఆతఁడు గాఢానుమాన బాధితుఁడై, డోలాయమాన మానసుఁడై కుందుచుండెనని వ్యక్తమగును. చెప్పరాని సందేహ మాతని చిత్తము నావరించెను. ఎద్దియో ఆలోచన యాతని డెందమున నుదయించి, విజృంభించి యా ధీరస్వాంతుని తబ్బిబ్బొనరింపఁ దొడంగెను. తన

యనుమానము నిజమగునా, లేక, కేవలము మిథ్యయగునా యని యతఁడెంత చింతించినను నిశ్చయింపనేరక, అందఱు నాలించు చంద మున నిట్టు లనుకొనెను. — "అత్యద్భుతము! నేఁటి సాయంసమయ సమాచారములు కడువిస్మయజనకములు! అదంతయు నరేబియా దేశపు వినోదకథనలె నున్నది. కాని, సామాన్యముగలేను. కేవలము చిత్తవిభ్రమ మొదవించుచున్నది!"

ఖలీలుఁ డంత నిట్లు పలికెను —

"ఆర్యా! మానవజీవిత విషయము లొక్కొకపుడు చిత్రకథల కంటెను, జిత్రతరంబులై యుండు."

"నిజము నిజము! ఈ యపూర్వ సంఘటనమే నిదర్శనము. కాదేని నేఁదలంచునట్లు — " పాషా యికమాటాడక విస్మయవిభ్రమచకితుఁడై ఖలీలుపై దృష్టినిల్పి, "అసంభవము ఎట్టులగును!" అని బిగ్గఱగ నని కొని, రయమున నిట్టులనెను — "ఆర్యులారా! మీరిఁక మీమీనివాస ములకుఁ బోవలయు!"

ఖలీలుఁ డంత నొకింత యుపాలంభ పూర్వకముగా నిట్టులనెను —

"ప్రభువరా! మమ్మిట్లు స్వర్గభవనమున మగుడఁ బ్రవేశపెట్టియు, వెంటనే వెడలఁగొట్టుట పాడియే?"

"అందులకుఁగల కారణమియ్యది. భవదీయ ముద్రికా కథాశ్రవణ కుతూహలోద్విగ్న హృదయుఁడనై నీసమక్షమున కరుదెంచితి. నాతోఁ బాటు నీ మిత్రులును అనుందానంద పరవశులగుదురని యూహించి నిన్నభినందించుభాగ్య మలవడునని భ్రమించి యే తెంచితిఁ గాని, విషయ మన్యథా పరిణమించెను. స్వాప్నగతవృత్తాంతముం బోలిన యీ విచి త్రోదంతము నే భావించినట్లు అద్భుతముగ లేకపోయెను."

"ప్రభువరా! అట్టి యద్భుతగాథలు నీకుఁ బరిచితములై యుండ నోవు. సెల వొసంగెదేని, మన ప్రసిద్ధమగు 'అట్టోమను' సామ్రాజ్య

చారిత్ర ప్రాథమికయుగమునకు , సంబంధించినట్టియు, భవదీయకుతూ
హలస్వభావమున కనువై యమితానందము నొడఁగూర్చునట్టియు
విచిత్రకథ నెఱింగింపఁగలను. ”

పాషా సహజముగఁ గథాశ్రవణాతురుఁ డగుటయేకాక, ఖలీలుఁ
డమిత విస్మయాశ్చర్యాకారణుఁ డాయెను. కాన, నాతఁడు తోడనే
ఇయ్యకొని, సోఫాపై నాసీనుఁడాయెను. గుల్నేరు రయమున లేచి
హుక్కాగొట్టము నందిచ్చి చిల్లమును రగులఁజేసి, నిజప్రాణకాంతుని
చెంతకుఁ బోవ, నా మహనీయుఁ డానందవిశాలవదనుఁడై, గుడగుడ
ధ్వాన మొనరించుచుఁ బ్రియతరధూమపానకార్యపరతంత్రుఁడాయెను.
ప్రణయస్వరూపిణులగు నాజవ్వనలు మువ్వురును దమ ప్రియసందర్శన
భాగ్యము దీర్ఘతరము కావలయునని యే ఖలీలుఁడు కథాకల్పనకార్య
మునకు దొరఁకొనెనని భావించి, యమితానందాయత నయనలై,
నిజనయనకంజాత సంజాత తరళేక్షణములం దమకృతజ్ఞత వ్యక్తపఱచిరి.
జులేఖా మాత్రము కొండొక భద్రకారణ ముండుననియు భావించి
యుండును. ఖలీలుఁడంత నిజమధుర గంభీర విస్పష్టకంఠమునఁ గథా
కథన మొనరించెను.

## ౬

నాకథ 1287 వ సంవత్సరమునాఁటిది. ఆకాలమున, 'చిన్నాశియా'
సెల్జూకు రాజవంశాధీనమైయుండెను. అందలి యొకానొక రాష్ట్ర
మునకు రాజధాని యగు 'కిస్కారు' నగరము ద్రాక్షతోఁటలకును,
స్నానవాటికలకును, మనోహరారామములకును, మహాపురుషుల
సమాధులకును నాకరమై, చరిత్రప్రసిద్ధమై యొప్పారెను. ఆ పట్టణము
నకు 'సౌడాజీ' యను యువకుఁడు ప్రభువై యుండెను.

ఆ పట్టణమున కనతిదూరమున 'బిలేడీ' యను గ్రామ ముండెను.

...య్యాది కిస్కారునగరమునకు సమీపముగ నుండినను, గ్రీసు రాజ్యాంత
ర్భాగమై యుండెను. ఆ గ్రామమునందు సాధుశీలుఁడగు నొక
'షేకు' పుత్రికాసమేతుఁడై నివసించుచుండెను. ఆ మహనీయుఁ
డైహికవిషయముల మఱచి పరమాత్మునిపై మనసు నిల్పి, సకల
భూతదయాపరతంత్రుఁడై, పరోపకారపరాయణుఁడై, యఖిల జన
సంసేవ్యుఁడై కీర్తిసాంద్రుఁ డాయెను. ఆతని మహమ్మదీయమతాభి
మాన మపారము. ఆ పరమపురుషుని ప్రోద్బలముచే నా ప్రాంతస్థు
లందఱు దమ తమ మూఢమతములఁ బరిత్యజించి, పవిత్ర మహమ్మ
దీయమ తావలంబన మొనరింపఁ దొడంగిరి. అచిరకాలమున సము
న్నతమగు మసీదు తలయెత్తెను. దినమున కైదు పర్యాయములు
భక్తుల గంభీరదీనాలాపములచే నా ప్రదేశము ఘూర్ణిల్లఁ జొచ్చెను.

'మస్ఖాటను' అను నా షేకుపుత్రిక దిన దిన ప్రవర్ధమానయై,
సంప్రాప్తయౌవనయై, అనన్య సామాన్య సౌందర్య విరాజితయై
యఖిల పురుష హృదయాపహరణ కారణ మాయెను. పదునాలుగేండ్ల
ప్రాయముగల యా జవ్వని యసదృశ రూపురేఖా వైభవంబుల కలరి,
యా రాజ్యమునందలి వీరులు, సరదారులు, ప్రభువులు, సామంతులు
లోనుగాగల వా రందఱు మోహపరవశులై, యా సౌందర్యరాశిం
దమ కొసంగవలయు నని యా ముసలిషేకును నిరంతర మర్థింపఁ
దొడంగిరి. అందు కిస్కారు పుర ప్రభువగు సౌడాజీ ప్రధానుఁడు.
వృద్ధుని నిర్బంధించియైనను, ఆ లోకైక సుందరి కరగ్రహణ మొన
రింపవలయు నని యాతఁడు దృఢముగ నిశ్చయించెను. కాని
యా షేకు, సౌడాజీ ధైర్యముఁ దలంచి సంతసింపక, భాగ్యముఁ
గాంచి భ్రమింపక, ధూర్తాలాపముల నాలించి చలింపక, నిశ్చల
స్వాంతుఁడై తన పుత్రిక తన మనస్సునకు నచ్చు పురుషుని వరించునని
తెల్పుచుండెను. ఆ కాంతామణి యన్ననో, వృద్ధజనకుని వీడఁజాలక,

ఆ మహాశయుఁడు జీవించియుండు నంతకాలము వివాహము గురించి తలంపరాదని కృతనిశ్చయుఁడై యుండెను.

ఒకానొక రమణీయ సంధ్యాసమయమున నా తండ్రియు నాతని ముద్దులపట్టియును దమ పేదకుటీరము ముందట హాయిగఁ గూర్చుండిరి. ఆ పేదకు తన దేశ చారిత్రమును కథా రూపమునఁ దెల్పుచుండెను. సుందర సంధ్యారుణరాగదీపిత ప్రపంచము శతాధికశోభాయమానముగ నుండెను. తదవసర శీతలానిలము లానందదాయకములై యుండెను. జనకుని కథా నిర్వచన మత్యంతసంతసప్రదమై యుండెను. అట్టి యమిత సంతోష సమయమున నా యనాథ పుత్రికా జనకుల గుండెలు బ్రద్దలగునట్లు, హాయరింఖానినాదము లాకస్మికముగా వినవచ్చెను. కిసాఁరు పురపాలకుఁడగు సౌడాజీ యోధజన పరివృతుఁడై కట్టెదుట గోచరించెను. సౌడాజీ రయమున నేలకుడిగ్గి యా వృద్ధుని జేరి కఠినముగ నిట్టు లనెను —

"అయ్యా! నిన్నర్థించుట కియ్యది కడసారి. చిరకాలమునుండియు నీ పుత్రికఁ గాంచి మోహపరవశుఁడనై, వినిర్మల ప్రేమపూరిత హృదయుఁడనై యుంటి. సగౌరవముగా, సవినయముగాఁ బెక్కుసారులు మన్మనోభిప్రాయము వెల్లడించితి. కాని, ఇంతకాలము నా మాటలఁ జెడచెవినిఁ బెట్టుచుంటివి. వృద్ధుఁడా! మంచి చెడ్డ లరయుము. ఈ జీర్ణకుటీరమున ధనసాహాయ్య విరహితుఁడవై, నీ వంటి గతిలేని యనాగంకుల దానధర్మములపై నాధారపడి, యెంతకాలము జీవింపఁ గలవు? అల్లదె, చూడుము — ఆకసము నంటు నా భవనము! దిగంతముల పర్యంతము వ్యాపించిన యా సుక్షేత్రములు! లెక్కింపరాని గోగణము! నీ పుత్రిక నా యర్ధాంగియై, మదీయ హృదయ సామ్రాజ్య లక్ష్మియై, యన్యకాంతాజన దుస్సాధ్యములగు ననూన భోగభాగ్యముల నోలలాడఁ గలదు. నీ వన్ననో! ఈ పాడుజీవనము తొలంగి,

యభిరామ వైభవాన్వితుఁడవై, దాస దాసీజన పరివేష్టితుఁడవై హాయిగ నుండఁగలవు. మఱియొక మాట గమనింపుము! మూర్ఖుఁడవై యింకను జలము వహింతువేని, తత్ఫల మనుభవింతువు!"

ఆ షేకు సహజనిశ్చలదైన్యస్వరమున నిట్టులనెను.—

"పరమాత్మ్ముఁ డొక్కఁడే! వారి ప్రవక్త మహమ్మదు! పరమాత్ముని ఆజ్ఞ యమోఘము. మానవుఁ డసహాయుఁడు; ప్రతిఘటింప నేరఁడు. అయ్యా! గమనింపుము. నా పట్టిని వారింపను, ప్రోత్సహింపను. సౌడాజీ! ఈ కాంతకు నీ యందనురాగము లేదు. కాన, నీ కీయాశ వలదు."

అంత నా ప్రభువు కుపితుఁడై, యా వృద్ధునిదూఱి, తన యనుచరులఁ గాంచి యిట్టు లాజ్ఞాపించెను — "చూచెద రేమి? రయమున నీ యిరువురను మన నగరమునకుఁ గొంపొండు!"

ఆజ్ఞానువర్తులగు నా భటులు తోడులేని యా దీనజనులపై భయంకర శ్వానములవలెఁ బాఱిరి. తక్షణము వారింబట్టి యశ్వములపై నిడి తమ పట్టణమును వాయువేగమునఁ జేరుటయే వారి యభిప్రాయము! బలవంతులగు నా మొఱకులను వారించువా రెవ్వరు? నిస్సంగుఁడగు షేకునకు దిక్కెవ్వరు? పితృసేవా పరతంత్రయగు మానినీమణి యవస్థ ఏమి కావలయును? అట్టి మహా సంకట సమయమున నాకసమునుండి వ్రాలినట్టు లేఁ బ్రాయంపు వీరుఁ డొకఁడు ఆకస్మికముగ నరుదెంచి, వీక్షణమాత్రమున విషయమును గుర్తించి, కిస్కారుప్రభువుం గాంచి విస్మయము నొందియుఁ జలింపక, నిజకృపాణధారి యాయెను. సౌడాజీయును విస్మయచకితుఁడై యిట్టు లనెను —

"మిత్రమా! నీవా! ఈ యత్త్రమేల? గర్వాతిరేకమున నీ మోహాంగి నన్ను నిరాకరించెను. కిస్కారు ప్రభువు సహింపఁజాలఁడు. మన గాఢచిరమైత్రిందలంచి, నీవు వారింపవని విశ్వసింతును."

"కిస్కారు ప్రభువు భంగపడిన, భంగపడుఁగాక. ఈ పరమభాగవతోత్తముని, ఈ యబలను బాధింపరాదు. మూర్ఖత వహించి ఈ యధమకార్యము విడనాడవేని, మన మైత్రి యంతరించెనని యెఱుంగుము, మన మిఁక బద్ధవైరులము."

"అట్టులే యగుఁగాక!" అని పలుకుచు నిజదీర్ఘకరవాలము సారించి, నూతనాగతునిపై సౌడాజీ దూఁకెను. క్రొత్తవీరుఁడు కడు నిపుణముగఁ దప్పించుకొని యుద్ధమునకుఁ దలపడెను. పోరాటము తీవ్రతర మాయెను. సౌడాజీ కామాంధుఁడై హేయముగఁ బ్రవర్తించినను, ఏకుఁడగుటచేఁ దన యనుచరులను ముగ్గురను దవ్వున నిలిపెను. తమ ప్రభు వేమగునో యని యా భటులును, తమ్ము రక్షింప నరుదెంచిన పురుషపుంగవుఁ డేమగునో యని తండ్రి కుమార్తెలును ఱెప్పవాల్పక తత్తరపాటున నిరీక్షించుచుండిరి. బలసిన వృషభముల భాతి నా యోధు లిద్దరే సమాన బలదర్పలాఘవములతోఁ బోరాడిరి. తుదకు దుష్ప్రవర్తకుఁడగు సౌడాజీ, తీవ్రఖడ్గప్రహారణమున బాహువు సెడి, నేలఁగూలెను. వాని యనుచరు లిఁక సహింపనేరక దురంత క్రోధఘూర్ణిత వ్యాఘ్రములవలె నొక్కయుదుటున నా విజయుని దాఁకిరి. యుద్ధనిపుణుఁడగు నా వీరుఁడు సముచితము. నొక గోడచెంతకు నరిగి, నిజకరలాఘవము వెల్లడి యగునట్లు నిశితకరవాలమును వడి వడి, తళ తళ మెఱపించుచు వైరుల వారింపఁ గడంగెను. అం దొకఁడు ఒక్కపోటున నేలఁబడి దురంత మరణవేదన ననుభవించుచుండెను. తోడనే మిగిలిన యిరువురు ద్విగుణీకృతక్రోధ, వ్యథోద్దీపితులై, భయంకర వైరిమస్తకవిదారణ కార్యైక తత్పరులై, యున్మాదుల చందమున హుంకరించి, యా వీరవరునిపై లంఘించిరి. ఆతని యవస్థ కడు నపాయకరముగ నుండెను. కరాళమృత్యు దంష్ట్రవలె నొకక్రూరకృపాణ మాతని కంఠముపై మెఱయుచుండెను.

మన వీరుఁడు భీమపరాక్రముండైనను, కడు డస్సి యుండెను. ఒక్క క్షణమున నాతని యుత్తమాంగము భూమి నలంకరింప నుండెను. అట్టి మహాకష్టసమయమున షేకుపుత్రికయగు 'మల్లాటను' క్రోధోద్దీపితయై, అమేయబలపరాక్రమసమన్వితయై సౌదాజీ ఖడ్గము చేయి మునఁ దాల్చి, చేయి యెత్తిన యాభటుని ప్రక్కనొక పోటు పొడిచెను. అంత నాయాసనభటుఁడు సంభ్రమనా విగతాస్త్రుఁడాయెను. గర్వితకాంతాపహరణాపసరసంగర మాతెఱంగున నంతరించెను.

మన వీరుఁడు విజయుఁడైనను, ఆతని వామభుజమున గట్టి గాయము తగిలెను. గ్రామస్థు లరుదెంచి తక్కుంగల క్షతగాత్రుల కుపచారములు సల్పుచుండ, షేకు విజయుని దన కుటీరములోనికిఁ గొంపోయెను. సుందరాంగియగు మల్లాటను నిజమానరక్షక సేవాపరతంత్రయై రక్తపూరితమగు నాతని భుజమును భద్రముగఁ గట్టెను. ఆ బింబాధర సమున్నతాకారము, సముజ్జ్వలరూపవైభవము, వికసితతారుణ్యలావణ్యములం దిలకించి, దిగంతముల పర్యంతము వ్యాప్తి గాంచిన యా సొగసులాఁడి సౌందర్యప్రశంస నతిశయోక్తి గాదని విజయుఁడు గ్రహించెను. ఆ సమయమున నా దివ్యసుందరవిగ్రహ మష్టాదశవర్షప్రాయయై; పరిపూర్ణయౌవనవిరాజితయై మన్మథుని బాణమోయన దీపించుచుండెను. విజయుఁడు విగతధైర్యుఁడై నోహో విభ్రాంతుఁ డాయె నని వేఱుగఁ జెప్ప వలయునా?

గాయము కట్టుబడినంతనే, విజయుఁడు సేద దేఱెను. మల్లాటను అతిథిపూజాతత్పరయై, భోజ్యపదార్థములను బల్లపై నాయత్తపఱచు చుండెను. షేకు సముచితసంభాషణంబుల విజయుని ధైర్యపరాక్రమౌదార్యముల నుగ్గడించి, తన కృతజ్ఞత వెలిబుచ్చెను. వినయగుణ విరాజితుఁడగు నాయువకుఁడు తనకు సపర్యలొనరించు నాతరళనయన స్త్రీజన సహజదౌర్బల్యము నతిక్రమించి, శక్తిస్వరూపిణియై, విజృం

భించుటచేతనే విజయ మలవడెనని మందహాస మొనరించుచుఁ బలికెను. తోడనే యా రమణీమణి భాసురవదనము సంధ్యారుణరాగరంజితంబాయెను. నాఁటి మర్యాద ననుసరించి యా మెఱుఁగుబోఁడి యా చెంగట నిలుచుండి వడ్డనచేయ, వా రిరువురు నుల్లాసముగ భోజన మారగించిరి. అంత నా వృద్ధుఁ డిట్టు లనెను —

"వీరాగ్రేసరా! నీగాయముమాని, పూర్ణారోగ్య మలవడువఱకు, నిందుండఁగోరెద. ప్రత్యేకముగ సమరియున్న యొక చిన్న గది నీ యధీనమున నుండును. కారణాంతరములచే నీ విచ్చగింపవేని ఈ రేయియైన నిందు విశ్రమింపుము."

"మాన్యోత్తమా! నే నీ ప్రాంతమునఁ బ్రచ్ఛన్నరూపమునఁ జరించువాఁడ. అట్టివాఁడు నీ యతిథిగా నుండుట కిచ్చగింతు నేని—"

"ఆర్యా! నీవు మా రక్షకుఁడవు: కాన, మాకెంతయు నాదరణీయుఁడవు. నీ యాజ్ఞ శిరమున ధరింతుము. మహనీయా, ఆ మందిరము నీకై యమరియున్నది. ఒక్కమాట గమనింపుము. నిన్నును నన్నును బాలించురాజు మున్నొక్కనాఁడు సాయంకాల మరుదెంచి, మత్కృతసత్కారంబులు వడసి ఇందు శయనించెను. పరమాత్ముని 'మాట' యగు 'కొరాను' పవిత్రగ్రంథము నాతనిశయ్యపై నుంచితి. ఆతఁడు నిద్రమఱచి, జాగరముండి, బహుజాగరూకతతో నాయుత్తను గ్రంథము పూర్తిగఁ బఠించెను. వేకువయైనంతనే యాతఁడు నిద్రాపరుఁడై, యపూర్వస్వప్నము కాంచెను. ఆతనికి దేవదూత ప్రత్యక్షమై యిట్టు లనెను —

"కుమారా! నీవు దివ్యగ్రంథమును భక్తిమెయి పఠించితివి. కావున, నీవును, నీ బిడ్డలును, బిడ్డల బిడ్డలును మాననీయులై వర్ధిల్లఁగలరు." ఆతఁడు తోడనే మహమ్మదీయుఁడాయెను. ఆతని పుత్రులు ముగ్గురు — ఉస్మాను మొదలగువారు — గూడ సత్యమతము నవలంబించిరి.

మన విజయుఁ డా కథ కడు శ్రద్ధతో నాలించి, యా మందిరమున శయనించెను. ఉదయ మగునంతనే యాతఁడు కాల్యకరణీయముల నొనరించి, భోజనమున కరుదెంచెను. ఆతఁ డట గూర్చుండియుండెనే కాని, ధ్యానము కేవలము వేఱుగ నుండెను. వృద్ధునితోఁ బ్రసంగింప కుండుటయేకాక, ఏమి తినుచుండెనో యెఱుంగకుండుటయేకాక, తన కట్టెదుటనున్న యా జగన్మోహినినైనను దిలకింపఁడాయెను. వృద్ధుఁ డా విషయము ప్రశ్నింప; విజయుఁ డిట్టు లనెను —

"మహనీయా! నే నొక యద్భుత స్వప్నము గాంచితి. తద్భావ మరయుటకు నాకు సాహసము చాలకున్నది. పావనచరితుండవు, తదర్థ మెఱింగింప నీవ సమర్థుండవు. మహాత్మా! గమనింపుము. కడు బడలియుండిన కారణమున శయ్యాగతుండ నైనంతనే నిద్ర పోతిని. నీ యందొక చంద్రబింబ ముదయించి, ప్రవర్ధిల్లి, భవదీయ వక్షస్థలమునుండి వెలువడి, నాయందు లీనమాయెను. తోడనే నా గర్భమునుండి యొక వృక్ష ముద్భవించెను. తరుశాఖలు చూచు చుండగనే దీర్ఘతరములై, అనంతములై, సమస్త సముద్రములను, సమస్తదేశముల నతిక్రమించి, మూడు ఖండముల నిండ వ్యాపించెను. దట్టముగఁ బెఱిగిన కొమ్మలక్రింద, 'కాకసస్,' 'అట్లస్,' 'టారస్,' 'హీమస్' అను మహాపర్వతములు తోఁచెను. వృక్షపాదమునుండి 'టైగ్రిస్,' 'యూఫ్రటీస్,' 'నైల్,' 'డాన్యూబ్' — ఈ నాలుగు మహానదులును ప్రభవించి, కోటి నౌకలకు విహారస్థలమై, గభీరానంత మహాసాగరమువలెఁ గాన్పించెను. కొండలు, లోయలు, వనములు, ఆరామములు, మహానగరములు లెక్కకు మీఱి యుండెను. ఎటు చూచినను అర్ధేందుపతాకము సగర్వముగ నెగురుచుండెను. జనానీకములు కిట కిట లాడుచు అల్లాను ఎలుఁగెత్తి ప్రార్థించుచుండెను. వారితోఁబాటు వివిధవిహంగతతులు మనోహర కలకలా రవంబు

లోనరించుచుండెను. అంతలోఁ దరుపత్రములు నిడుపులై కత్తులవలె గోచరించెను. అంతలోఁ బెనుగాలి చయ్యన వీవ, కొమ్మ లన్నియు నల్లిబిల్లిగ నల్లికొని పోయెను; కత్తులను బోలిన యాకులు ప్రపంచము నందలి ముఖ్యనగరములవంకఁ దిరిగెను. అందు ముఖ్యముగా కాన్ స్టాంటునోపిలు గుఱి యాయెను. రెండు సముద్రములు, రెండు ఖండము లును గలియు స్థలమున నున్న యా నగరరాజము, రెండు నీలముల నడుమ, రెండు పచ్చలనడుమ రాజిల్లు వజ్రమువలె నుండి, అఖిలజలధి వలయ వలయిత మహీమండలం బను నంగుళీయమునకు భూషణప్రాయ మగు మహారత్నమును బోలియున్నది. అట్టి యుంగరము ధరింప నుంటి. అంతలో మేల్కాంచితి!"

ఇది యొక యపూర్వ స్వప్నము. విజయుఁడు విభ్రాంతచిత్తుఁడై, షేకు ఏమనునో యని చెప్పవాల్పక నిరీక్షింప, నాతఁ డిట్టులనెను —

"కుమారా! ఈ స్వప్న మత్యుత్కృష్టము, అమిత శుభప్రదము. కాని, ఈ సమయమున వివరములను దెలుపఁజాలను. రణరంగముల స్వైరవిహార మొనరించి మహావీరుండవు కాఁగలవు. అచిరకాలమున మనము మఱలఁ గలసికొందుము. అప్పు డీ స్వప్నభావము పూర్తిగ నెఱింగించెద."

విజయుఁడు హర్షపులకాంకిత శరీరుఁడై, నిజప్రేమైక నిధాన మగు మల్ఖాటను కాంతామణిని వీడియుండుట కష్టసాధ్యమైనను, అందుఁ దడయఁజాలక, పూజ్యుఁడగు షేకు నాశీర్వాదము వడసి ప్రయాణ మొనరించెను.

ఒక సంవత్సరము కడచినను, విజయుఁడు రాకుండెను. పద్మబాంధవు నెడఁబాసిన పద్మినివలె నా పద్మినీమణి మల్ఖాటను ముకుళితవదనయై దుర్భరవియోగానల తప్తయై, కృశించుచుండెను. జనకుఁడు తదవస్థ గుర్తించి ధైర్యము కఱపఁబోయెను. కాని, భగ్నమనోరథుఁ డాయెను.

షేకు నివసించుచుండిన బిలేడీ గ్రామము గ్రీసు రాజ్యాంతర్భాగమై యుండె నని చెప్పియుంటిఁగదా. ఆ సమయమున కాన్‌స్టాంటినోపిలు కూడ గ్రీకుల యధీనముననే యుండెను. గ్రీకుల రాజ్యము విచ్ఛిన్న మగుచుండినను, ఇంకను నిలిచియుండెను. ఈ షేకుయొక్క మత బోధలచేఁ జాలమంది మహమ్మదీయు లగుచుండిరి. మహమ్మదీయుల సంఖ్య క్రమముగా నధికతర మగుచుండెను. తుదకు బిలేడీ పరిపాలకుఁ డగు గ్రీకు ప్రభువు ఇంకను ఉపేక్షించుట యపాయకరమని యెంచి, షేకును శిక్షించినచో నుపద్రవము తొలంగునని భావించి, ఆతని శిక్షించు నెపమున నాతఁ డింట లేని సమయమున నాతని పుత్రికను రయమునఁ దన దుర్గమునకుఁ గొంపోయెను. ఆ ప్రభువు చర్యకుఁ గారణాంతరము గూడఁ గలదు. మల్లాటను నిరుపమాన సౌందర్యము గుఱించి వినియుండెను. కావున, మహమ్మదీయ మత ప్రచారకుని శిక్షించుటయే కాక, ఆ సుందరి పొందు కూడ లభించునని యెంచి యాతఁ డిట్టి దురాచారమునకుఁ గడంగెను. షేకు తన మత ప్రచారము విరమించుట కంగీకరించునేని, యాతని బిడ్డ నాతని కొసంగ వచ్చుననియు నా ప్రభువు భావించెను.

శూన్యగృహము గాంచినంతనే షేకు హృదయము చెక్కలాయెను. తోడనే యాతఁడు తన దేశాధిపతియగు 'ఎర్టోగ్రులు' చెంతకుఁ బోయి, తన దురవస్థ విన్నవించి, తన పుత్రికనుఁ దన వశము నరింపవలయునని ప్రార్థించెను. నృపాలుఁ డభయ మొసంగెను: వృద్ధుఁడు ముదమంది, నిజనివాసమునకుఁ బోయెను.

రాజు సహస్రమాసములు నిండినవాఁడు. ఆతని జ్యేష్ఠ కుమారుఁ డగు 'ఉస్మాను' రాజకార్యములను జక్కఁబెట్టుచుండెను. ఆతఁడు సత్పరిపాలకుఁ డగుటయే కాక, కడు వివేకవంతుఁడనియు, మహావీరుఁ డనియుఁ బేరు గాంచెను. ఆతఁ డా షేకు సమాచారము సాలించి

నంతనే, తానే పోయి గ్రీకు ప్రభువు మద మడంచి యా కాంతను నిజ జనకున కప్పగింతుసని వృద్ధరాజుతోఁ బలికెను. రాజు సమ్మతించెను.

రాజ కుమారుఁడగు ఊస్మాను అనంతరము తన ప్రియమిత్రుఁడగు 'కేజా' ను జీరి యిట్లు లనెను —

"ప్రియమిత్రమా! ఈ గ్రీకుప్రభువు నుపాయముచే సులువుగా భంగ పఱుపవలయు. విలువగల ఉపాయనముల నాతనికి సమర్పించి, రాఁగల శీతకాలమువఱకు మఱియొక దుర్గమున నుందునని తెలియఁ బఱచి, మన ధనకనకవస్తువాహన నివహంబులఁ దన దుర్గమున దాచి యుంచవలయునని కోరుము. ఇయ్యది మన యాచార మగుటచే, నా ప్రభువు తప్పక సమ్మతించును. అనంతర కథ నడిపింప నీవ సమర్థుండవు."

మిత్రుఁడగు కేజా కడు నిపుణుఁడు. సమరవిశారదులగు నలువది పురుషుల నాయత్తపఱచి, వారికి స్త్రీ వేషములు వైచి, వారితోఁ దన రాజు సామగ్రిని గ్రీకు ప్రభువు దుర్గమునకుఁ దరలించెను. ఆ ప్రభు వా మోసము నెఱుంగక, సమ్మతించెను. సమ్మతించుటయే గాక, దురాశాపరుఁడై, కేజానుఁ బిలిచి, రహస్యముగా నిట్టులనెను —

"ఆర్యా! నీవు మహనీయుఁడవు. నీ యమూల్య సాహాయ్యమున నొక్క కార్యము కావలయు. మీ రాజ్యము నా వశము కావలయు. మంత్రివై, సర్వాధికార సమన్వితుఁడవై, రాజ్య తంత్రము నీవు త్రిప్పవచ్చును. పేరునకు నేను రాజుఁ గాని, తదధికార మంతయు నీ హస్తగతమై యుండును. మిత్రమా! నా విన్నపము మన్నించి "మన పరస్పర క్షేమము గుర్తించి కార్యమునకుఁ గడంగుము."

కేజా ఇట్లు బదులాడెను —

"ప్రభువరా! నీ యాశయము కడు శ్లాఘనీయము. చేయఁగల సాహాయ్య మొనరించి కృతార్థుఁడ నాయెద. మన భాగ్యవశమునఁ

దగు సమయము కూడఁ జిక్కినది. ఊస్మాను అచిరకాలమునఁ బ్రయాణ మొనరించుఁ గదా. మార్గమధ్యమున నున్న కొండప్రక్క నీవు యోధజనసహితముగా కాచియుండుము. ఊస్మాను అరుదెంచు నంతనే పిడుగువలెఁ బడి, యాతనిఁ గడతేర్చి, రాజ్యలక్ష్మి గ్రహింపఁ గలవు పోయి వచ్చెద, సెలవిమ్ము."

కేజా రాజద్రోహి కాఁడు, విశ్వాసఘాతుకుఁడును గాఁడు కాని, ద్రోహిని ద్రోహముచేతనే పరిమార్పవలయునని యెంచి, యట్లు లొనరించి, ఆ విషయమును రాజకుమారుఁడగు ఊస్మానునకు నివే దించెను. రాజకుమారుఁడు సంతుష్టాంతరంగుఁడై తన మిత్రు నెంతయు నభినందించెను.

ఆ మఱునాఁడు వృద్ధరాజు తన జ్యేష్ఠకుమారుఁడగు నూస్మానును జేరఁబిలిచి యిట్లు లనెను —

"తనూజా! నా కాలము సమీపించినది. ఇఁక జీవింపఁజాలను. నా యంత్యోపదేశము గమనింపుము. చిన్ననాఁటినుండియు ధర్మము నతిక్రమింపక మెలంగితి. నా జన్మభూమినుండి నాలుగు వందల కుటుంబములను వెంటఁ బెట్టికొని, పెక్కు పోరాటము లొనరించి, ఈ యాసియా దేశమున కరుదెంచితి. ధర్మము సాధారణముగ బలహీనుల యందే యుండును. ఏ కలహమునం దైనను, నేనెల్లపుడు బలహీనులకే తోడ్పడుచుంటిని. కుమారా! నీవును అట్లులే యాచరింపుము. రణ మొనరించునపుడు సమానవైరి నరయుము. దుర్బలులు, దౌర్భాగ్యులు నగు గ్రామస్థులను దోపిడి చేయకుము. అయ్యది కేవలము కాలయాప నమే కాని, శ్రేయస్కరము కాదు. నీ వైరులను మూలచ్ఛేద మొన రించి, నేను స్థాపించిన రాజ్యమును బెంపుచేసి యశోవంతుఁడవుకమ్ము!"

వృద్ధరాజు శీఘ్రముగ మరణించెను: ఊస్మాను ఆసియా దేశమునకు రాజాయెను. అంతలోఁ బ్రయాణసమయ మరుదెంచుటచే, సముచిత

ప్రయత్నము లొనరించి, సైన్యసమేతుఁడై యాతఁడు బయలుదేఱెను. ఊస్మాను పై నాకస్మికముగాఁ బడవలయునని గ్రీకు ప్రభువు స్వల్ప సైన్యముతో మార్గమధ్యమునఁ బొంచియుండె గదా. ఊస్మాను ఆ రహస్యము నెఱింగియే యుండెను. ఆ పరమరహస్య మెఱుంగని గ్రీకులు, ఎన్నఁడు వైరులపైఁ బడి చించి చెండాడెదమా యని తత్తరపాటుతో నిరీక్షించుచుండిరి. అంతలో నుఱుమని పిడుగులవలె నూస్మాను సైనికులు నలుదెసలనుండి రయంబున నరుదెంచి, సింహనాద మొనరించి, గ్రీకుల నందఱనుఁ దెగనఱికిరి. అందు గ్రీకు ప్రభువు సహితము తెగటారెను. ఈ లోన, స్త్రీరూపమున గ్రీకు దుర్గము ప్రవేశించిన ఊస్మాను భటులు గ్రీకు ప్రభువు వెడలినంతనే తమ వేషములఁ బోఁ ద్రోసి, ఖడ్గములఁ బూని, కావలియున్న గ్రీకు భటులను సంహరించి దుర్గము నాక్రమించిరి.

సంధ్యాసమయ మాయెను. దుర్నిరీక్ష్యుఁడై వెలింగిన సూర్యుఁడు శాంతము వహించెనో యనఁ జల్లదనము వహించి మనోహరాకారుఁ డాయెను. పక్షులు కలకలస్వనంబు లొనరించుచు దమ తమ గూండ్లకుఁ బోవుచుండెను. వృద్ధుఁడగు షేకు పరమాత్మునకుఁ బ్రణామము లాచరించి, పట్టెడోగిరము కుడిచి, గుమ్మమునఁ గూర్చుండి, అలికిడి యగునంతనే తన పుత్రికయే యరుదెంచుచుండెనని ప్రకంపితశరీరుఁడై యట్టిట్టు పరికించుచుండెను. పాప మాతని కనుదిన మదియే పని. నాఁడును అట్టులే యాతఁడు నిరీక్షించుచుండ, గుఱ్ఱముల చప్పుడు వడివడి వినవచ్చెను. వృద్ధుఁ డుద్విగ్నహృదయుఁడై పరికింప, అశ్వికులు పెక్కండ్రు తనుత్రాణాది యుద్ధపరికరములఁ దాల్చి యరుదెంచుట కాన్పించెను. వృద్ధుని హృదయావేగము దశాధిక మాయెను. షేకు తెప్ప వాల్చునంతలో నొక యోధుఁడును, వాని ప్రక్క నొక్క యబలయుఁ గాన్పించిరి. వీరుఁ డెవ్వఁడు? వీరుఁ డెవ్వఁడైన నేమి,

ఆ కాంత యెవ్వతె? షేకు పుత్రికయగు మల్హాటనే యగునా? వృద్ధున కేమియుఁ దోఁపకుండెను. ఆతని చిత్తము వర్ణనాతీతముగ నుండెను. విపరీతాశానుమాన మారుతములచే నాతని హృదయము మిక్కిలి కలగుండు వడెను. కాని, అనుమాన మంతరించెను, ఆశ సఫలమాయెను, షేకున కత్యంతప్రియతనువుగు తన బిడ్డయే కంటఁబడెను. ఆ ప్రక్క నున్న వీరుఁడే తొల్లింటి విజయుఁడు. షేకు ఆనందపరవశుఁడై యిట్టులనెను —

"కుమారా! దుర్జనుఁడగు సౌదాజీ ఖానునుండి నాఁడు తప్పించిన వాఁడవు నీవు. నేఁడును నా పుత్రికను నా కొసంగి యమితోపకార మొనరించితివి. ఆర్యా! ఇప్పుడైన నీ నామధేయ మెఱింగింపవేఁడెద."

అంత నునుజెక్కులు సిగ్గున నెఱ్ఱవాఱ, మోమునఁ జిఱునగవు తూఁగాడ, నాతని పుత్రిక యిట్టులనెను —

"తండ్రీ! భూపాలునకు సత్వరము ప్రణామ మాచరింపుము. ఈ మహావీరుఁడే ప్రసిద్ధిఁగాంచిన ఉస్మాను మహారాజు!"

షేకు విస్మయానంద పరవశుఁడై వినయ వినమితగాత్రుఁ డాయెను. ఆతని వారించి, ఉస్మాను ఇట్టులనెను —

"మహనీయా! విజయుఁడు కోరు ప్రత్యుపకార మియ్యది. ఈ కలహంసనుఁ గాంచినంతనే దృఢతరానురాగబద్ధుఁడ నైతి. నాఁటఁ గోలె నీ దివ్యసుందరవిగ్రహము మదీయ హృదయఫలకమున నాటియుండెను. ఈ సుందరి నిరుపమానసౌందర్యవతి యని విని కన్నులార గాంచవలయు నని ప్రచ్ఛన్నరూపమున నరుదెంచి ధన్యుఁడ నైతి. ఈ కన్నియను నా కొసంగుటయే నీవు చేయఁగల ప్రత్యుపకారము. మహనీయా! ఈ జగన్మోహిని సౌందర్యమునకు వశంవదుఁడనై, చిరకాల మిందుండ వలసిన వాఁడనే. కాని, నాఁటి స్వప్నము తలంచి, యఖండ వైభవోపేతుఁడు కావలసినవాఁడు, జడుఁడై నిలువరాదని యెంచి వెడలితిని."

తోడనే షేకు ఇట్టులనెను —

"కుమారా! స్వప్నఫల మప్పుడే ప్రారంభమాయెను. నా పుత్రిక మల్ఖాటను కరగ్రహణ మొనరించితివి. నా దేహమునుండి వెలువడి నిన్నాశ్రయించిన చంద్రబింబ మియ్యదె. ఇఁక స్వప్నవృత్తాంతము పూర్తిగ వివరించెద, నీ యందు ప్రాదుర్భవించిన వృక్షము నీ వంశమును సూచించును. ఆ వృక్షమువలెనే నీ వంశము ప్రవర్ధిల్లును: నీ వంశజులు మూడు ఖండములను స్వాధీనపఱచికొని పరిపాలింతురు. నీవు పేర్కొన్న మహాపర్వతము లన్నియో, మీ వంశ సామ్రాజ్యమున కాధారభూతములగు కహారములు. నైలు మొదలగు మహానదులు వాని చుట్టు ప్రవహించును. నీ వంశముతోఁబాటు పవిత్ర మహమ్మదీయ మతమును విజృంభించును. అఖిల దేశములందును అల్లావారి నామస్మరణము గంభీరముగ ప్రతిధ్వనించును. వివిధవిహంగముల కలకల నినదంబులఁ బోలు వివిధ భాషలాడు వివిధ జనానీకములను నీ వంశజులు శాసింతురు: నీవు కాంచిన యాకులఁబోలిన వాడికైదువులఁ దాల్చి, కాన్‌స్టాంటినోపిలు మొదలగు ప్రసిద్ధ రాజధానుల నాక్రమింపఁ గలరు. ఇట్టి ఖండ ఖండాంతర మహాసామ్రాజ్యము నీ వొక్కఁడవు గడింపనేరవు. నీవు ధరింపనేరని ధగద్ధగితాంగుళీయము నీ వంశజులు తాల్పఁగలరు!"

ఉస్మాను రాకొమారుని సుందరవదనము సంతసోత్సాహములచే దీపింప నిట్టులనెను —

"మహనీయా! స్వప్నఫల మిటులుండుననియే నేనును భావించితి. కాని, ఇంతటి మహదైశ్వర్యము తలపెట్టుటకు సాహసముచాలక ముగ్ధుఁడనైతి. నేనపుడు కేవలము సామాన్యునివలె నీయాతిథ్యము కాంచితిగదా. కాని, సామాన్యరూపముననే ఈమానినీమణి హృదయము నాకర్షింపఁజాలి ధన్యుఁడనైతి. ఈకన్నియ నాయర్ధాంగియై, నా భాగ్యాధికార వైభవము పాల్గొనుగాక."

ఆమఱునాఁడే వారి వివాహము జరిగెను. ఉస్మాను రాకుమారుని స్వప్నము పూర్తిగ సిద్ధించెను.

## ౭

ఖలీలు కథ పూర్తియాయెను. వారెల్లరుఁ గడుశ్రద్ధతో నాలించిరి. గుల్నేసు లూకాసులును, తైరబా జూలియనులును దమ తమ రహస్య ప్రణయసంభాషణముల మఱచి, తత్కథాశ్రవణకుతూహలాధీన మనస్కులైరి. జులేఖా యన్ననో, నిశ్చలచిత్తయై, నిజమనోహరుని సుందరగంభీరాననమున దృష్టినిల్పి యాలించెను. కథానిర్వచనసమయమున తత్సందర్భానుసారముగ నాతురుష్కయువకుఁడు తన మనోహర కంఠము సవరించుకొనుచుండ నా మోహనాంగి ఆనందపరవశ యగుచుండెను. అందు ముఖ్యముగా, రాజకుమారుఁడగు నూస్మాను, నిజనామధేయ మెఱింగించు నవసరమున, ఆ హేమగాత్రికిఁ గలిగిన మోదానందమునకు మేఱలేదు. ఆమె సహజసుందరవదనము భాసురతరంబాయెను. ఉత్సాహాతిశయమున నందఱు నెద్దియో యనుచుండ నా కంజాక్షి యొక్కతెయే, తత్కథాసారస్యము పూర్తిగ గ్రహించినట్లు, మౌనము వహించి ధ్యానైకతత్పరయై యుండెను. కథ ముగిసినంతనే, యెల్లరుఁ దమ యభినందనాలాపముల ఖలీలునితో ముంచివైచిరి. జులేఖా మాత్రము విశాల విభ్రమేక్షణములచేతనే తన సంతసము తెలియఁజఱచెను. ఖలీలున కయ్యది పరమానందదాయకంబై యుండెను.

ఇఁక దాల్తబను పాషా యవస్థ వర్ణనాతీతము. కథారంభముననే యా ముసల్మాను ప్రభువు చేతియందలి హుక్కాగొట్టము జారిపోయెను. పాషా యా విషయ మెఱుంగక దురంతదాహార్తుని చందమున, మైమఱచి కథామృతపాన మొనరింపఁ దొడంగెను.

పాషా పరవశాత్మకుఁ డగుటకుఁ బెక్కు కారణములు కలవు. కథలు, చిత్రకథలు, చరిత్రలు మహమ్మదీయులకు సాధారణముగా గడు ప్రీతికరములు. ఖలీలుని కథ వివిధరసపూరము. అందు వీరరస మొకటి. పాషా వీరుఁ డగుటచే, నాతని చిత్తమున నడగియుండిన వీరోత్సాహ ముద్రేకించి బహిర్గతమాయెను. ఖలీలు కథ ప్రణయ ప్రపూర్ణమగుటచే, పాషా వృద్ధుఁడయ్యు యువజన సహజసంత సోత్సాహపరవశుఁ డాయెను. మఱియు, ప్రసిద్ధమగు అటోమను సామ్రాజ్యమును శాసించు విఖ్యాల యశోవిభాసురమగు ఉస్మాను రాజవంశముయొక్క తొల్లిటి వైభవచారిత్రము వ్యక్తపఱచు గాథ యగుటచేఁ గూడ నమితప్రీతికరంబుగ నుండెను. మఱియొక కారణ మెద్దియన, ఖలీలుఁడిట్టికథ చెప్పుట కెద్దియో కారణముండవలయు నని భావించుటచే, పాషా యన్యాలోచనారహితుఁడై ముగ్ధుఁడాయెను.

పాషా యాలోచనాపరుఁడై కొంతతడవూరకుండి, తురుష్క యువకుని వదనముపై దృష్టినిల్పి, యిట్లు పలికెను —

"ఆర్యా! నీకథ మిగుల నానందదాయకము. మేమెల్లరము సంతో సించితిమి: కాని, నీ యభిప్రాయ మేమని గ్రహింపవలయు?"

"అభిప్రాయమా! మన దేశచరిత్ర నాకుఁ బరిచితమని మీరు గ్రహింపఁదగును. ప్రభువరా! నీవు గమనింపవలసిన విషయమియ్యది. ఇట్టి కథలు మఱి యేడారు నాకు మనోగతమై యున్నవి. తత్కథా మణుల ముందు నియ్యది గాజుపూసవలెనుండును."

పాషా యొకింత విసువున, "మిగుల నాలస్యమైనది, లేదేని —" అని యింకను జెప్పఁబోవు పాషాను వారించి, ఖలీలుఁ డిట్లులనెను.

"రేపు సాయంకాలము కానిమ్ము. మీకానంద మొడఁగూర్పు టయే నాకానందదాయకము."

పాషా నిట్టూర్పు విడుచుచు —

"ఎట్లు పొసఁగును ? మఱియొకసారి మీరు నా జనానాయందుఁ బ్రవేశింపవలసివచ్చునే. కాదేని, మన మిరువురమే కూర్చుండ వలయును."

"ఆర్యా ! ఇంక నాప్రభావ మేముండు ? కథ రసవంతముగ నుండ వలయునేని, కథకుఁ డుత్సాహపూరితుఁడై యుండవలయు. కథకున కుత్సాహ కారణములు రెండు. వాని మానసము నిశ్చలముగ, నిర్మలముగ, చింతారహితముగ నుండవలయు. రెండవది, అంగనాజన సందర్శనము. కావున, ఈశ్రోతలెల్లరు నెల్లియు నుండవలయు."

"అసంభవము ! అసాధ్యము. నాశుద్ధాంతము. తరుణ యువజన విహారణస్థలమగునేని, నాప్రతిష్ఠాగౌరవములకు భంగముసంభవించును. అనూనాధికారవైభవగర్వితుండనగు నాకుఁ దలవంపు ఘటిల్లును !"

"ఇదియా కారణము ! ప్రభువరా ! నీ యాతిథ్యము నా కెంతయు సంతసప్రదము, కరము వాంఛనీయము. నామిత్రులును తదభిప్రాయ బద్ధులనియే నిబ్బరముగ నాడఁగలను. కావున, రేపటి సాయంకాలము వఱకు మమ్మిందేయుంచి వలయు రక్షకభటులఁగాపుంచుము. మఱి యేమైన నొనరింపుము, అభ్యంతరము లేదు."

పాషా మనఃపూర్వకవిలోకనంబున ఖలీలునిఁ దిలకించెను. ఆప్రభువు మానసము మగుడ గాఢానుమానబాధితమాయెను. ఆ యపూర్వ తురుష్కుని గుఱించి మఱియు నరయవలయుననియో, కథాశ్రవణోత్సాహాతమకముననో పాషా యామోదించి యిట్టులనెను —

"సమ్మతించితి. కాని, మదీయానుగ్రహము సార్థకమగునట్లు మీరు దురితంబు లాచరింపక, సరసంబుగ సంచరింతురుగాక. పట్టీ ! జులేఖా ! నీ వేతెంచి చాల కాలమైనదే."

ఆ కలవాణి మధురమంజుల రవంబున నిట్లు బదులాడెను —

"మామా ! ఇందు నొకటి రెండు దినము లుండవచ్చునని తండ్రి

యనుజ్ఞ వడసియే యరుదెంచితి. కావున నాచెలుల కభ్యంతరము లేనిచో —"

జులేఖా వాక్యము పూరింపకుండగనె, తైరజా గుల్నేరు లేక కంఠ మున, దప్పక అందుండవలయునని, అతులితవినయాభిమానగౌరవము లుట్టిపడ, నుద్విగ్నచిత్తలై పలికిరి. అంగీకారసూచకముగా పాషా శిరఃకంప మొనరించెను.

అంత పాషా దిగ్గున లేచి ఆయువకులను దన వెంట రమ్మనెను. వారు తమ మనోహారిణుల కోమలకరస్పర్శన మొనరించి వెడలిరి. అంతిపురంబునకుఁ గొంత దవ్వున నున్న యొక మందిరములోనికి వారి నాతఁడు కొంపోయెను. అందు మూఁడు కోణములు పరస్పర సంబంధము లేక అమరియుండెను. కోణములని అంధకారబంధుర ములు గాక దుర్గంధపూరితకూపములు గాక, శయ్యాదిపరికరసమృద్ధ ములై బాగుగనె యుండెను. ఒక్కొక్కఁ డొక్కొక కోణము ప్రవే శించెను. ఆవల భద్రముగ బీగములు వైచి, పాషా నిష్క్రమించెను.

లూకాసు జూలియనులతో మన కిపుడు పనిలేదు. తురుష్క యువకుఁడు మందిరాంతర్గతుఁడై పరికింప, నయ్యది ఉపయుక్తవస్తు సంభరితమై కాన్పించెను. వివిధరుచిరాహారపదార్థము లాచెంత సిద్ధముగ నుండెను. ఒక ప్రక్కనొక చక్కని శయ్యయు నమరి యుండెను. భుజించి చాలకాలమగుటచే ఖలీలుఁడు క్షుదార్తుఁడై యుండెను. కావున, పాషా వెడలినంతనే యాతఁ డల్పాహార మార గించి, సోఫాపైఁ గూర్చుండి, గత చర్య పరంపరం దలంచి యాలో చింపఁ దొడంగెను. ఒకయనుమాన మెద్దియో యాతని బాధింప నారంభించెను. తోడనే, యాతఁడు దిగ్గున లేచి యాగది నంతయు బరిశోధింప నారంభించెను. లెక్కలేని మెత్తని దిండులతో నమరి యున్న సోఫా ఆ మందిరము చుట్టు నుండెను. ద్వారములకు, గవాక్ష

ములకు మాత్ర మెడమిచ్చి యామృదులతల్పము చుట్టు నుండెను. నేల యంతయు విలువగల రత్నకంబళములచే నాచ్ఛాదితమైయుండెను. ధగధగలాడు కాండపటము లం దనేకములుండెను. వివిధవర్ణ విరాజితములై, యపూర్వ విచిత్రచిత్రాలంకారశోభితములై రాజిల్లు చారుతర కాచఫలకములతో నా మందిరకుడ్యములు కప్పబడి యుండెను. పైనుండి వ్రేలాడుచుండిన వెండిదీపములకాంతి వెదజల్లుచు నొకింత పరిమళముం గూడఁ బర్వజేయుచుండెను. తోరణములు తెరచి యుండుటచేఁ దత్సమీప సుందరారామచరిత మందమారుతములు మన తురుష్క పురుషున కుల్లాసము కల్గించుచుండెను.

ఖలీలుఁడు ధగధగలాడు తెరలను పరికించి, సడలించి, గోడల యందలి గాజుపలకలను పరిశీలింప నారంభించెను. అతఁడు పరీక్షాకార్యనిమగ్నుఁడై యుండ, గానరవము మెల్లగ వినవచ్చినటులాయెను. తురుష్కయువకుఁడు విస్మయాక్రాంతచిత్తుఁడై యాకుడ్యభాగము మగుడఁ దిలకింప, నాతని సంశయము నివారిత మాయెను. ఆ ప్రక్కగదినుండియే ఆకంఠధ్వని వెలువడుచుండెను. అతఁ డొకింత దూర మరుగునంతనే యాధ్వని యంతరించెను. గోడ నంటి యిటు నటు దిరిగి యాలింపఁ బోయిన, వినరాకుండెను. కాని, ఒక్క గాజు పలకపై మాత్రము చెవి నిల్పినంతనే, తద్గానరవము స్పష్టతర మాయెను. గాయకుఁడు తన మిత్రుఁడగు జూలియనే యనియు ఖలీ[illegible]ను గ్రహింపఁజాలెను. కాని, ఆప్రక్కనే యున్న మఱియొక గాజుపలకపై చెవియొగ్గి చూచిన, ఆధ్వని కడు మందమై, యస్పష్టమాయెను. ఇతర స్థలములందు నవ్వడి యేమాత్రము లేకుండెను. ఖలీలుఁడు వితర్కించెను. ధ్వని ఆ యొక్క పలకచెంతనే స్పష్టతరంబై యుండ నేల? తురుష్కయువకుఁడు వయసునఁ జిన్నయయ్యు, యనుభవజ్ఞుఁడును వివేకవంతుఁడు నగుటచే, నందొక రహస్యద్వార మమరియుండునని నిశ్చ

యించెను. ఆమార్గము తన మిత్రుఁడున్న గదిలోనికిఁ గొంపోవునని యాతఁడు భావించెను. ఖలీలుఁడు పెక్కు గుప్తద్వారములఁ గాంచి యుండెను. కావున నాతఁడొకింత పరిశీలించి, సాధారణముగ నగోచరమై యుండు నొక చిన్న మరఁ గాంచి నొక్కినంతనే, యొక కవాటము కడు నిశ్శబ్దముగాఁ దెఱచికొనెను. కాని, ఖలీలు భావించినట్లు తన మిత్రుఁ డున్న మందిరము గోచరింపక, సోపానమునకు వెడల్పుగల వివరము దృగ్గోచరమాయెను.

అతని మిత్రుఁడగు జూలియసు అమితోత్సాహకందళితహృదయుఁడై యొక జాతీయగీతము పాడుకొనుచుండెను. ఖలీలు విస్పష్టముగా వినఁజాలెను. కాని, తనమిత్రుఁడు నిశ్చలముగా నాలాపించుట చూడ, దనసందడి యాతఁ డెఱుంగఁడని స్పష్టమాయెను.

అదియు నంధకారమయమైయుండెను. ఖలీలుఁడు రెండునిముసములు తదేకధ్యానముతో వీక్షింప, కొంతదవ్వున గ్రుడ్డివెన్నెలం బోలిన వెలుఁగు కడునస్పష్టముగఁ దోఁచినటు లాయెను. తనుపక్కుఁ డుండిన మందిర మెత్తుగ నుండెను. అధోముఖుఁడై యాతఁ డెంత పరికించినను, రెండు మూడు సోపానములు తప్ప నేమియుఁ గానరాకుండెను. తన మందిరమునందలి దీపముఁగొని పరికించుట యసాధ్యమాయెను. ఆ దీపము కదలించుటకు వీలులేని విధమున నిగళబద్ధమై యుండెను. కర్తవ్యమేమి? చేఁతనున్న కాగితము గైకొని, చుట్టగ నమర్చి, వెలిఁగించి, తత్కృతకరదీపికా సాహాయ్యమున ఖలీలుఁడు వివరవిమర్శన మొనరింపఁగడంగెను. ఆ దీప మంతరించులోపున నీ విషయములు తెలియవచ్చెను. మెట్లవరుస కొంతవఱకుమాత్ర ముండెను: అనంతర మొకగోడ యడ్డుగ నిల్చియుండెను: అందు ద్వారముగాని, మఱి యేమార్గముగాని, గోచరింపలేదు: దీపమును గానరాలేదు. ఆ గోడచెంత నా మెట్లవరుస మఱియొకప్రక్కకుఁ దిరిగియుండుననియు,

నచట నొకదీప ముండవలయుననియు ఖలీలు వితర్కించెను.

తురుష్కయువకుఁ డప్రతిహత ధైర్యపరాక్రమసమన్వితుఁడై కౌతుక దృఢసంకల్పములుగూడఁ దళుకొత్తుటచే, నా ధీరుఁడు తద్రహస్య పరిశోధనాయత్తచిత్తుఁ డాయెను. తాను నిరాయుధుఁడైనను గణింపక, తదంధకారకూపమునఁ బడెను. సోపానముల సంఖ్య మిగుల నధికముగ నుండెను. లెక్కించిచూడఁ దాను మందిరమూలబంధము సమీపించి యుండవలయునని యాతఁడు గ్రహించెను. ఆతఁడు భావించినట్లు సరిగా కుడివైపున కా మెట్లు తిరిగెను. సుమారు పండ్రెండు గజముల దూరమున నొక యినుపదీపము వ్రేలాడుచుండెను. ఆ దీపపుఁగాంతియే గుడ్డిగుడ్డిగ ఖలీలునకుఁ దన మందిరమునుండి కాన్పించెను.

అట్టి వింతరహస్యమార్గమునఁ జరించుచున్నను, ఖలీలుఁ డించుకేనియు విస్మయాకులుఁడు కాలేదు. కారణమేమి? తురుష్కుఁ డనుభవజ్ఞుఁడు: ధనాధికార సంపన్నుల గృహంబులం దట్టి నిగూఢమార్గములవశ్యముండునని యెఱుంగును. సామ్రాజ్యాధిపతియగు సలీము ధర్మబద్ధుఁడై పరిపాలన మొనరించుచుండెనని వ్రాసియుంటిమి. కాని, తత్పూర్వము ప్రజాళి శలభగణములభాతి దావానలాభీల నిరంకుశత్వము వాఁతఁబడి మ్రగ్గుచుండెను. ఏ ముహూర్తమున భయంకర యమభటులంబోలిన ఘాతుకరాజభటులు కరాళ కాలపాశసన్నిభ ధనుర్జ్యాదీపితహస్తులై ప్రాణాపహరణార్థ మరుదెంతురో యని పాషాలు, మంత్రులు, సామంతులు సహితము భయవిహ్వలులై యుండిరి. కావున, అట్టి ఘోరమరణమునకుఁ బాల్పడకుండ తలదాచికొనుట కట్టి యదృష్టప్రదేశములు తప్పక కావలసియుండెను. మఱియు, నాఁడు ధనరాశి భద్రపఱచుట కష్టసాధ్యముగ నుండెను. అది యటుండ, రాజు ఏ క్షణమున నితాంతకుపితస్వాంతుఁడై, యెవ్వనిభాగ్యము దోపిడిచేయించునో, యెఱుంగ నలవికాకుండెను. కావున శ్రీమంతులు

అన్యజన దుస్సాధ్యము లగు రహస్య ధనాగారములను నిర్మించుకొను
చుండిరి. ఆ కారణమున విస్మయమునకుఁ గారణము లేకపోయెను.
కాని, ఒక్క విషయ మగమ్యముగ నుండెను. అట్టి నిగూఢస్థలమున
దీపిక వెలుంగ నేల ?

ఖలీలు మెల్లగ ముందుకు సాగెను — గోడలన్నియుఁ గడుఘనముగ
నుండెను. నేల యంతయు శిలామయము. కాని, దీపముక్రింద వాగ్రా
మొక చిన్న కఱ్ఱతలుపు కాన్పించెను. అది యొక మఱతలుపు కావచ్చు
యును. కాని, అద్దాని నెత్తుట కొకరంధ్రముగాని, మీటగాని, కొక్కెము
గాని లేకపోయెను. ఖలీలు ఏమియు నిర్ణయింపలేకపోయెను : ఐనను, దాన
నెద్దియో ప్రయోజన ముండునని మాత్రము దృఢానుమాన బాధితుఁ
డాయెను. ధనాగార మం దమరియుండునా ? అసంభవము ! ఏమియుఁ
దోఁపక ఆతఁడు మెల్లగఁ దన్నిచూడ శబ్దమాయెను. లోన గుల్లగ
నుండెనని స్పష్టమాయెను. మఱియొక తాడనమున—తీవ్రతరపాద
తాడనమున దద్విషయపరీక్ష యొనరింపవలయునని ఆయత్తపడియు,
తత్సమయోద్భూతభూరిధ్వని నాలించి భటులో, పాపాత్మో, యెవరు
దేఱవచ్చునని లెస్సగఁ దర్కించి, ఖలీలుఁడు విముఖుఁడాయెను.

తురుష్కుఁడు రెండడుగులు వేసినంతనే. మఱియొక మెట్లవరుస
కాన్పించెను. తోడనే యాతఁ డారోహించి, తదగ్రభాగముఁ జేరెను.
ఆవరుస యచట మఱియొకవంకఁ దిరిగెను. ఖలీలుఁడు వాని ననుస
రించిపోయి, మఱియొక యినుప దీపము గాంచెను. ఒక చిన్న తలు
పచట నోరగఁ దెఱచి యుండుటఁ గాంచి, తురుష్కుఁ డప్రమత్తుఁడై
నిశ్శబ్దముగ నందుఁ బ్రవేశింపఁ గడంగెను. కాని, సన్నని సూకర
ఘుర్ఘుర రవంబు వంటి క్రమోచ్ఛ్వాసనిశ్వాసపరంపర వినవచ్చుటచే,
మన వీరుఁ డాకస్మికముగా నట్టె నిలిచిపోయెను.

ఖలీలుఁ డొక్క నిమిషము నిదానించి పరీక్షించెను. ఆ మందిర

నివాసి యెవ్వఁడైనను, గాఢనిద్రాపరుఁడై యుండవలయునని గ్రహించి, యాతఁడు తొంగి చూచెను. అది యొక చిన్నగది. ...లి దీపపువెలుఁగు అత్యల్పముగ నున్నను, కాటుక రాసిం బోలిన ...తికాయుఁ డొకఁడు ఒకచాపపైఁ బరుండియుండునని మన వీరుఁడు ...హింపఁజాలెను. వైశికముగాఁ గాంతివంతమగు నొక కిరణము ...స ముఖముపైఁ బరగుటచే, తద్వికృతాకారము నయన గోచర ...మాయెను. వాఁడు దుస్తుల నెల్ల ధరించియే యుండెను. భీకర కాల మేఘమున మెఱయు విద్యుల్లతవలె నా దీర్ఘకాయుని చెంగట నొక దీర్ఘకరాళకరవాలము ప్రకాశించుచుండెను. వాఁడు రక్షకభటుఁడు కావలయును. కాని, వాఁడు మైమఱచి నిద్రించుటయు, వీడరాని ఖడ్గము వీడియుండుటయుఁ గాంచి, వాఁడు సురాపాన మొనరించి యుండు నని ఖలీలుఁడు గుర్తించెను. ఆతఁ డా భయంకరాకారుని కోణము ప్రవేశింపక, వెనుదిరిగి, మఱియొక సోపానపంక్తి నయన పథంబునఁ బడినంతనే, త దారోహణ కార్యమునకుఁ గడంగెను. కాని, యొకతలు పచట నద్ధతగులుటచే, నాతఁడు మగుడభగ్నమనో రథుఁ డాయెను. ఆ ద్వారబంధమున కమరియున్న గడియతీసి లోనికిఁ బోవ నవకాశముండినటులే యుండెను. ఒక వేళ నవ్వల బంధింపఁబడి యుండవచ్చును. కాని, గడియఁ గదల్చినచో, ధ్వని కావచ్చును; నిద్రించుచున్న రక్కసుఁడు మేల్కాంచవచ్చును; తలుపు వీడునంతనే, యం దెవ్వరైన గోచరింపవచ్చును; మఱి యేప్రమాదమైన సంభవింప వచ్చును. కావున, సాహస మొనరింపఁబూనుట యవివేకమనియెంచి, ఖలీలుఁడు వెనుదిరిగి తనమందిరమునకుఁ బోవ నుద్యుక్తుఁడాయెను.

ఖలీలుఁ డా సోపానపంక్తి నవరోహించి, నిద్రించు నా నీలజీమూత సన్నిభ దీర్ఘకాయునిఁ గాంచి కత్తి మఱతలుపు నతిక్రమించి, నిజ మందిరాభిముఖుఁ డాయెను. అకస్మికముగా నతఁడు సంభ్ర

మాశ్చర్య చకితుండాయెను. కారణమేమి? దీపపుఁగాంతి యావంత యుఁ గానరాకుండెను! ఆతని మందిరమున నొక దీపిక యుండెఁగదా. తత్కాంతి లేశమైనఁ దోఁపవలయును. కాని, మన వీరుఁడు పూర్తిగ తమోసాగరనిర్మగ్నుఁడై యుండెను. గాలి కోడి తన దీపమార్పి యుండు నని సమాధానపఱచికొని యాతఁడు సోపానముల నారోహించెను. కాని, తోడనే ఖలీలుఁడు శతాధిక విస్మయాక్రాంతుఁ డాయెను. కారణమేమి? తన మందిరకుడ్యమునం దణఁగియుండిన చిన్న మఱ తలుపు తెఱచి గదా, యాతఁడు రహస్యమార్గమున విహరించు చుండెను. ఆవిహారప్రదేశ మిప్పుడు కానరాకుండెను! కానరాకుండుటయే గాక, ఆ స్థలమున బంధీకృత ద్వారబంధమొండు నిలిచియుండెను! తురుష్కుఁ డెంతవెదకినను, మఱమైనను దన కరమునకు దొరకకుండెను.

తురుష్కుఁడు స్థైర్యగుణమండితుఁడు. కావున, కలవరము పడక ఆతఁడు మఱకై ఆ యంధకారమున వెదక గడంగెను. ఆ కీలు అచ్చటనే యుండునని యెంచి యాతఁ డతిప్రయత్న మొనరించెను. కాని, వాని ప్రయాసము వ్యర్థమాయెను. ఒక యరగంట మీఱెను. తన మందిరము చేరు మార్గము తోఁపకుండెను. అవ్వల తన గ్రీకు మిత్రుఁడు జూలియను ఉండునని సహజముగ విశ్వసించి, యాతఁడు మెల్లగఁ దలుపుతట్టెను. కాని, ప్రత్యుత్తరము లేదు. ఆ గ్రీకు రాగాలాపంబున నలసి నిద్రాపరవశుఁడై యుండవలయు. గట్టిగఁ దట్టుట గాని, ఎలుఁగెత్తి సంబోధించుట గాని యనుచితము, ప్రమాద భూయిష్ఠము.

తురుష్కుని యవస్థ నిజముగ దుస్సహాజముగ నుండెను. ఆలోచనాపరుఁడై యాతఁడు పరిస్థితులఁ జర్చించుకొనఁ దొడంగెను. తన రహస్య సంచరణ మెవ్వరైన గుర్తించియుందురా? గుర్తించియే ఆ దొంగ తలుపును బంధించియుందురా? అసంభవము. ఒకవేళ, పాషాగాని, ఒక

ఘటించుచుగాని తన రహస్యమరసియుండరుగాక. తోడనే, వా రాతని నెవ్వాఁడే బంధింపకుండురా? కావున నట్టి యవకాశమున కవకాశము లేదు. ఆలోచించిచూడ, నాకస్మిక మారుతాహతి నా కవాటము బిగిసికొని యుండవలయునని తురుష్కునకు స్ఫురించెను. ఏమైన నేమి, [illegible] తన మందిరము చేరనిచోఁ, దన రహస్యము తప్పక బయల్పడునని యాతఁడు గ్రహించెను. ధీరోదాత్తచిత్తుఁడగు నాతఁడెట్టి ముప్పునకు అనవ విధమున బెగడువడి తడఁబడుటలేదు. కాని, తన యట్టి వాఁడు మాననీయ ప్రభుమందిర రహస్యవిషయ పరీక్షాకార్యోత్సాహియై విహరించిన విషయము పాషాకు విశదమగుఁగదా యని యాతఁడు చింతించెను. కాని, కర్తవ్యమేమి? తదవస్థనుండి వెలువడు నుపాయ మెద్ది?

మఱలుట యసాధ్య మగునపుడు ముందంజ వేయుటయే తరుణోపాయ మని [illegible] భావించి, వెనుదిరిగి, సోపానముల డిగ్గి, క్రిందుముగ [illegible] వజ్రపాతమునఁ దెగిన నల్లని బండఱాయివలెఁ బడియున్న [illegible] గాంచి, యా చక్కి నున్న సోపానముల నారోహించి, [illegible] బంధనాదండము సడలించెను. తలుపు సులువుగా విచ్చెను. అట మనోహరమగు మొగములు తెర మాత్ర మడ్డుగ నుండెను. ఖలీలుఁ డా కాండపటము నల్లనఁ బోఁద్రోచినంతనే, సూర్యప్రభాదీపిత దీపరాజము దృగ్గోచర మాయెను! వివిధాపూర్వ మనోహర వస్తు నికర సంభృత సుందరమందిరము తాఁ బ్రవేశించితినని యాతఁ డాకస్మికముగఁ దెలిసికొనెను! కట్టెదుట ననదృశ సుందరాంగి యగు ఇస్మిల్డా మృదుల మనోహర శయ్యాగతయై యుండెను.

అట్టి విపరీత విషమ పరిస్థితియం దాకస్మికముగాఁ జిక్కువడినను, ఖలీలు స్థిరచిత్తుఁడై, కృతనిశ్చయుఁడై, తా నరుదెంచిన ద్వారము నిశ్శబ్దముగా గడియవైచి, యా మొగములు తెరను గూడ సరిదిద్ది,

పాషా ఖోస్రును సమీపించెను. ఆ మోహనాంగి నా యువకుఁడు నాలుగు గంటల క్రిందటనే కాంచి యుండెను. ఆమె యప్పటి రుచిరాంబరములనే ధరించి, మైమఱచి, నిద్రించుచుండెను. కోమలపు రత్నకంబళముపై నిశ్శబ్దముగ నడచి, యా మందిరమున కంటియున్న రెండవ మందిర మాతఁడు ప్రవేశించెను. అమీనాతో నాతఁడు ముందుగఁ జొచ్చిన గది అయ్యదే. అది విస్మయ లేదు. అంత నాతఁడు ద్వారము సమీపించెను. కాని, కవాటము బంధింపఁబడి యుండుటయే కాక, తాళము వేసిపోయెను. ఇఁక ఖలీలుఁ డెటు పోఁగలడు ? కాని, యాతఁడు వికలచిత్తుఁడు కాలేదు. పరిస్థితు లటు లుండునని యాతఁడెఱిఁగియేయుండెను. అనుమానమున కెడమీక సమయానుకూలముగఁ బ్రవర్తింపఁ గడంగుటకే, యాతఁ డట్టి పరీక్ష యొనరించెను.

ఖలీలుఁడు మగుడ నిస్సిల్డా సతీమణిచెంత కరుదెంచి, యా వలపుల రాణి యపూర్వసోయగము, నయనేంద్రియము సార్థకమగునట్లు వీక్షింపఁ దొడంగెను. కామ వికారోద్భూతములగు నా మోహిని వివిధాంగకములు సుప్రదర్శితములై, మనోహరములై, దర్శనీయములై రాజిల్లుచుండెను. ఆ సుధాకరానన స్వప్నముఁ గాంచుచుండెను. రమణీయప్రవాళ సమానసుందరాధరము మందహాస ప్రచలితమాయెను. మెఱుపువలెఁ దోఁచిన యా లేనగవు మెఱుపువలెనే యంతరింప, నా సుందరాధరము క్రోధ ప్రకంపితమాయెను. తోడనే, ఆ యెలనాగ ముక్తాఫల ధళధళాయమాన దంతములు ప్రకాశింప, కనీయ మందహాస మొనరించెను. సౌందర్యనిలయమగు నాపడఁతి ముఖాంబుజము సంధ్యారుణ రాగభాసురంబై, మనోహర తరంబాయెను. అగణిత సంతోషాతిశయముచేఁ గాఁబోలు, ఆ తరుణి యురువక్షోజ ముప్పొంగెను. దృశ్య మంతలో మాఱిపోయెను. ఆ సుకుమార హేమగాత్ర యొకసారి కంపించెను; వదనసుధాకర మండల మంతలో వికృత

మేఘాచ్ఛాదితమాయెను. అనంతర మా కాంత విసురున నిజకరసంచా లన మొనరించి, సువర్ణమణిమయవిరాజిత నిశితకరవాలము మెఱసి నే లపై జాఱెను. నాయంసమయమున సామాధరించిన కృపాణమయ్యదే. ఖలీలుఁ డాలసింపక, సంతోషభరితస్వాంతుఁడై తదస్త్రము ధరిం చెను. మన వీరుఁ డెంతటి ధైర్యస్థైర్యసమన్వితుఁడై నను, నిరాయుధుఁ డుగదా. అనతి దూరముననే ఘోరాకారుఁడు దీర్ఘకరవాలము తాల్చియుండెను. ఖలీలుఁ డతిసాహస కార్యభరము వహించియుండెను. ఎట్టి యపాయమైనను సంభవింపవచ్చును. మఱియు, నాతఁ డిట్లు చింతించెను —

"ఇఁక భయమునుపలదు. ఈ కాంత మేల్కాంచిన యనంతరము మదీయాభిప్రాయమునకు విరుద్ధముగా మెలంగిన మెలంగుఁగాక! ఇంత దనుక నిరాకరించితినని క్రోధఘూర్ణితయై, ప్రతిక్రియారచనసంకల్పధురీ ణయైయుండినయుండుగాక! ఆత్మసంరక్షణ మొనరించుకొనఁజాలుదు."

తురుష్కుఁ డట్లు చింతించునంతలో నిస్మిల్లాసతీమణికి నిద్రా భంగమాయెను. ఆ నీలోత్పలదళవిశాలములగు గనుగవ మెల్లగఁ దెఱచుచుఁ బరికింపఁ దా నింకను స్వప్నావస్థయం దుండినటులే తోఁచెను. అమితసంతోషవ్యాకులప్రకంపితమానసయయ్యు, కట్టెదుట నున్న మోహనమూర్తిని — ఖలీలుని — తిలకించి, ఆ మోహనాంగి ప్రబోధితాత్మయై, అనిర్వాచ్యానందకందళితయై, ఆ నవమోహా నాకారుని యపూర్వసోయగముఁ గాంచి, పరవశాత్మ ఆయెను—

"మోహనాంగా! నీవే యరుదెంచితివా! అపూర్వచిత్తవిభ్రమము కాదుగదా! ఆహా! ఏమి, నీ సోయగము! ప్రసన్నసుందరాననము! నిరుపమానము! వర్ణనాతీతము! నిశ్చలానందప్రదము!— "

మోహపారవశ్యమున నా కులుకులాఁడి మన తురుష్కవీరుని రూపురేఖావైభవములఁ దడఁబడుచు నభివర్ణింపఁ దొడంగెను. ఖలీ

లుఁడు నిజముగఁ బ్రసన్నవదనుఁడై యుండెను. కాని సహజసుందర వదనమండలము మనోహరమందహాసవిరాజమానమై, శతాధికశోభాయమానమాయెను. తొల్లిటి కాఠిన్యగాంభీర్యములు వీడి, యాతఁడు కాంతాజనచిత్తాపహరణక్రియాదక్షుఁడగు మన్మథకుమార సన్నిభుండై దీపించుటచే, నా ప్రౌఢ సహజముగ దశాధిక మోహావిభ్రాంతచిత్తయాయెను.

"సరసజ్ఞా! స్వప్నమున నిన్నే కాంచుచుంటిని. కనువిచ్చినంతనే, నీ దివ్యమోహనరూపమే నా నయనములకు గోచరించెను. సుకుమారా! నీవు నన్ను వలచితివట, నేనమితానందపరవశనైతి. పిమ్మట నీవు తిరస్కరించితివట, నేను క్రోధపరవశనైతి. నీ వంత తుంటరివై పలుభాషల నన్ను దూరఁ గడంగితివట, తోడనే దుర్భర క్రోధానలతప్తహృదయనై, ప్రకంపితశరీరనై, పాపా ఖడ్గము నంద చేఁజాచితి. ఎన్నఁడు మఱువని ప్రభువు నేఁడేలకో తన కృపాణము నిందు డించి పోయెనని ఎట్టులో కలయందైన నెఱింగియుంటిని. ఆశస్త్రము నా చేతికి దొరకలేదు. నీ వంతలో సుధాకరబింబము వలె సుందర శీతల మందహాస మొనరించితివి: నేను మేల్కాంచితి. సుందరాంగా! నిన్నిపుడు ప్రత్యక్షముగఁ గాంచితి; నీ యపూర్వరూపవైభవసందర్శనజనితానందము మనసార ననుభవించుదానను; సుధారసపూరమగు నీ యధరముపై, వినిర్మలభాసురవిశాలవదనముపై, నయ్యదె మధురమందహాసము తాండవించుచున్నది! కల యని ఎట్లు భ్రమింపఁగలను?"

నితాంత కామోద్రేకపూరితచిత్తయగు నా మదవతి నిజ హృదయావస్థ నుద్విగ్నమంజులకంఠమున వడి వడిఁ దెలుప, నా తురుష్కవంశాబ్ధిచంద్రుఁడు మందహాస మొనరించి, మధుర మురళీకంఠమున సరసముగ నిట్లు బదులాడెను —

"మోహనాంగీ! హృదయము మానవాధీనము కాదను పాఠము

నాకు నేఁ బరవశుఁడనై కన్నెత్తి చూచితిని. సుందరీ! నిక్కము దాపనేల? మదీయహృదయము నీ లావణ్యాకృతి, జుత్తేఫా యధీన మాయెనని భ్రమించితి. నిన్నుఁ గాంచియును, ఉన్మత్తమానవిభ్రమచిత్తుఁడనై, సుందరుఁడనై, నీ మోహాంగమ్మున నలుకలఁ బాలింపక నీ సమక్షమునుండి వెడలితి. శయ్యాగతుఁడనై నంతనే, భవదీయ నిరుపమాన సముజ్జ్వలాకారము మదీయ హృదయపారావారము పై నుదయించి, కలంచి నన్ను వికలస్వాంతు నొనరించెను. ఇంక జుత్తేఫా గుఱించి తలంపనైనఁ దలంపఁజాల. నారీమణీ! హృదయము విచ్చిచెప్పితి. హర్షాందోళితమానసుఁడనై, శయ్యపై నిలువఁజాలక, భవదీయ రమణీయ పాదపంకేరుహములపై వ్రాలి, మత్కృతాపరాధము మన్నింపఁ బ్రార్థింప నేతెంచితి.”

ఆనందహర్షస్వనమున నా మంజుభాషిణి యిట్టు లనెను —

“మోహనాంగా! నిక్కముగ నదృష్టవంతురాలను! నా వీనుల సుధారసధార లొలికించి, నన్ను ధన్యాత్మ నొనరించితివి! కాని, సమరకాంక్షాతురుని చందమున, నా పగిది దవ్వున ఖడ్గము నూఁతగొని, నిలుచుండ నేల?”

“వనితామణీ! ఈ కృపాణము నీ హస్తచాలనమున పదభ్రంశ మొందెను. మోహన సుకుమార కోమలాంగి కరపద్మమున కియ్యది యనుచితమని యెంచి నేఁ బూల్చితి.” అట్లు పలుకుచు నా కరవాలము నొక సోఫాపై నిడి, అతఁడు గర్వరహితుఁడై, వినమ్రుఁడై, మోకరించి, ప్రేమమయాపేక్షుఁడై యిట్టు లనెను — “ఇస్మిల్డా సతీమణి నా తోంటి యపరాధము సైరించునా?”

“సైరించును! మోహనాంగా! తప్పక సైరించును!—” అట్టులుద్విగ్న స్వరమునఁ బలుకుచు నా కలుకులాఁడి మోహము నడంపఁజాలక మందరహాసదంతవిస్ఫురితబాహువల్లరుల రయంబునఁజాపి, నిజపీనవక్షోజము పొంగార, నా తురుష్కుని కంఠము నాలింగన మొనరించెను.

భామినీ భుజపంజరబంధితుఁడైన యా వీరుఁ డప్లన విడిపించుకొని, తపసంగతకార్శ్యమున నా పుండరీకాక్షి యాలుక సహింపకుండ నా కెం ప్రక్క నాసీనుఁడై, యిట్లు లనెను --

"కాంతామణీ! ఒక్క పలుకు గమనింపుము. ప్రసిద్ధ 'తార్తారియా' ప్రభువంశసంభవుఁడ నగు నేను తదుచితముగ మెలంగి, మదీయ గౌరవౌదార్యములకు భంగము వాటయకుండ సంచరించి భవదీయ ప్రేమాభిమానములకుఁ బాత్రుఁడఁ గాఁగోరెద. జులేఖా మదీయహృదయాధిపత్యము వహించితినని విశ్వసించియున్నది. ఆ కన్నియ యెంత కేగి, ప్రాపపడితినని తెల్లముగఁ బలుకుదునేని, నా హృదయభాగ మడంగును. ఈ కార్యము రేపు కావలయును. అనంతరము భవదీయ కమనీయపాదసేవాపరాయణుఁడనై, యనుపమసౌఖ్య పరవశుఁడనౌదు."

ఇస్మిల్డా చిత్తము కామాయత్తమై యుండెను. తన చెంగట నున్న యా నవమోహనాకారుని యపూర్వసాయగము కాంచుకొలఁది నా మత్తకాశిని చెప్పరాని యానందము ననుభవింపఁ దొడంగెను. ఖలీలుని సమాధానముచేఁ జిత్త మొక్కింత చివుక్కుమన్నను, వేడినలు నీసడించు కన్నుగవ మోహార్ణవమున మనోహరముగఁ బరిభ్రమింప నా వగలాఁడి యమితోత్సాహమున నిట్టు లనెను —

"మోహనాంగా! అట్టులే కానిమ్ము. జులేఖాతోడి సంబంధము రేపు విచ్ఛిన్నమగుఁగదా. అటుపై నీవు నా వాఁడవు! కాని, సుందరాంగా! — సాధ్యమగునా? — ఎద్దియో యొక నెపమున — "

"ఒకటి రెండు దినము లీ మందిరమున నుండవలయుననికదా? తరుణీ! సందియము వలదు. ఆ భారము నాయది."

తురుష్కుఁ డా తెఱంగున నా చిత్రాంగి మనోభావము లక్షించి యమృతోపమానమగు పలుకుల నాడుటచే, నా కామిని యనిర్వా

హ్యానందజలధితరంగముల నోలలాడి, మధుర సరసంపుఁ బలుకుల నా తురుష్కుని సగ్గడింప, నాతఁడిట్లు లనెను — .

"కాంతామణీ! నా హృదయము మెఱింగించితి. నీకుఁ బ్రేమాస్పదుఁడనై ధన్యుఁడనైతి. ఇఁకఁ బోవలయు. సెల వొసంగుము."

మోహావిభ్రాంతనై యాస్యవిచార మెఱుంగని ఆ మోహనాంగి యంత నాకస్మికముగ విస్మయవిస్ఫారితనయనయై తురుష్కునిఁ దిలకించెను. ఖలీలుఁడు తన శయ్యామందిరము నెల్లఁ బ్రవేశించెను!

తురుష్కుఁ డాలోచింపక, నిశ్చలస్వరంబున రయంబున నిట్టు లనెను — "అదృష్టవశమున నా గదియం దొక తాళము దొరకెను. శత్రుసాహాయ్యమున నిరోధించు ద్వారముల నెల్లఁ దెఱచి, నాకును నా హృదయాధిదేవతకును నడుమనుండు విఘ్నములఁ గడచి, యరుదెంచితి. నీ మందిరము ప్రవేశించినంతనే, ప్రథమద్వారము భద్రముగ బంధించితి. కాని, కాని, —తాళము— "

ఖలీలుఁ డింక మాటాడనేరక తన జేబులు తడవుచు, వ్యగ్రమనస్కుఁడాయెను.

"ప్రియతమా! కలవరమేల? ఏమైన సందడి వినం బడెనా!"

ఇస్మిల్డా యట్లు ప్రశ్నింప, ఖలీలుఁ డిట్టు లనెను —

"కాదు, కాదు! కాని, తాళ మేమాయెనో కానరాకున్నది. ఈ తల్పముననే, ఈ దిండుల సందున నెందో యుండవలయు."

"మనోహరా! ఇందులకై చీకాకు వలదు. నావద్ద మఱియొకటి యున్నది." ఆమోహనాంగి కుటిలదరహసితాననయై, మగుడ నిట్టు లనెను. — "ఈతాళ ముండుటచేతనే, నా పరిచారిక యమీనా నిన్నిందనుక కొనిరాఁజాలెను. ప్రియతమా! దీనిం గైకొని, నీమందిరము సురక్షితముగఁ జేరి, రేపు సాయంకాలము మగుడ మదీయ భుజవల్లికాశ్లేషికా విహారుఁడవుగా, నరుగుమ్ము!"

అట్లు పలుకుచు నా శాలినను నొసంగు కామినీమణి చారుతర కరాబ్జము నల్లన ముద్దాడి, "ప్రేయసీ! సెలవొసంగుము!" అని మధుర ముగ బల్కి, ఖలీలుడు రయమున వెడలెను. తొలుదొల్త తాను ప్రవేశించిన మార్గముననే తా నమీనాతో వెనుక నరుదెంచిన మార్గముననే యాతడు సుఖముగా దన మందిరము డాసి తలుపు తెఱచి, తా బ్రవేశించినంతనే బంధించి శయ్యాగతుడు డాయెను. చాల రాత్రి జాగర మొనరించి కను డస్సియుండిన నా యువకుడు తోడనే గాఢనిద్రాపరుడాయెను.

సూర్యోదయమాయెను. మిత్రులు మువ్వురు కలసికొనిరి. ఏ కారణముననో గాని నిశీథరహస్యవ్యాపారముల దన మిత్రులగు జూలియను లూకాసులకు ఖలీలు డెఱింగింపలేదు. వివిధరుచిరాహార సమృద్ధంబును, చిత్రప్రసిద్ధ గ్రంథానీకసంకీర్ణంబును, చతుర చతురంగాద్యనేకవినోదవస్తునికరనిలయంబును నగు మందిరము వారి కొఱ కాయత్తపఱుపబడియుండెను. ఇతర ప్రదేశములందు దిరుగాడుటకు మాత్రము వారికి స్వతంత్రము లేకపోయెను. మిత్రు లందే పరస్పరసంభాషణంబుల బ్రొద్దుపుచ్చిరి.

సాయంతన మగునంతనే పాషాభటు లరుదెంచి, ఆ మువ్వురను కాంతాజనమందిరమునకు గొంపోయిరి. సుందరప్రియాంగనా వదన బింబములు గోచరించినంతనే, ఖలీలాదుల హృదయపారావారము లుప్పొంగెను. కథాశ్రవణాతురుడై ప్రియతమ ధూమనాళవిరాజిత వదనుడై దాల్తబను పాషా సోఫాపై న్యాసీనుడై వేచియుండెను.

గుల్నేరు ప్రక్క లూకాసు కూర్చుండెను. తైరజా చెంగట జూలి యను ఆసీనుడాయెను. వీరుడగు ఖలీలుడు జులేఖా చెంత సుఖ విష్టుడాయెను. పాషా వారింపగడంగలేదు. పాషా భార్యయగు నిస్సిల్లాసతీమణి సమక్షమున దా బలికిన పలుకుల బాటింపక

తురుష్క పీఠంపు ప్రణయరాగభాసురుండై, మందహాసవిరాజితుండై యొప్పటియట్టులు నిజమనోహారిణియగు జులేఖాతో సరససంభాషణము సలుపుచుండెను. కాని, పాషా కథాశ్రవణాభిరతుండై నిరీక్షించు చుండుటచే, నా యువతీయువకులు పరస్పరప్రణయసంభాషణసౌఖ్యము ననుభవించుట కంతగ నవకాశము లేకపోయెను. ఖలీలుండంతట విస్ఫారిత నయనుండై, మధురగంభీరస్వరంబునం గథాకథనంబునకుం గడంగెను.

౨

అటోమను వంశజుండగు మురాదు సార్వభౌముండు చతురంగబల సమేతుండై, సెర్వియా దేశమునందలి దక్షిణ దిగ్భాగమున దండువిడిసి యుండెను. ఇయ్యది 1389 వ సంవత్సరమునాంటి చరిత్ర. అచ్చటి నదీప్రవాహమున కిరుకెలంకులం గనుచూపు ప్రదేశమున శిబిరము లమరియుండెను. గుడారములన్నియు బాలచంద్ర ప్రభాదీపితంబులై, సేనానాయకుల నికేతనములు వివిధవర్ణ రంజిత కేతనవిరాజితములై, దర్శనీయములై యుండెను. తత్సమాగత నరజంతునికరములు ధరా తలంబు కంపించునట్లు లెక్కకుమీరియుండెను.

మురాదు సుల్తానుయొక్క శిబిరము సకలసైన్యమధ్యమున సము చితముగ నమరియుండెను. బలవంతులు, ధైర్యసమన్వితులు, రిపుజన భయంకరులు, విశ్వాసబద్ధులు నగు 'జనిజరీ' సైన్యము లాతని శిబిర మును జుట్టియుండెను. ఆ శిబిరమున కనతిదూరమున నాలుగుమూల లందును నాలుగు చిన్న గుడారము లమరియుండెను. అందొకటి, సార్వభౌమ కాంతాజననిలయము. రెండవది యువరాజునకును, మూడవది వాని తమ్మునకును నాల్గవది యోధాగ్రేసరుండగు ప్రధాన సైన్యాధిపతికిని బ్రత్యేకింపఁబడి యుండెను.

మహాసముద్రమువలె సైన్యములు దండువిడిసిన మఱునాఁటి యుదయమున నొక రాయబారి యశ్వారోహకులతో నరుదెంచి, సుల్తానుంజూడఁ గోరెను. ఆతఁడు సెర్వియాదేశాధిపతి పంపిన దూత యగుటచే, దర్శన మొసంగుటకు మురాదు సమ్మతించెను. తన భటుల నచట నిలిపి, ఆ రాయబారి మహమ్మదీయ రాజసముఖమునకుఁ బోయెను.

రాయబారి ఇరువదిసంవత్సరముల యువకుఁడు. వాని సమున్నతాకారము, అంగసౌష్ఠవము, వదనగాంభీర్యసౌందర్యములనుగాంచి, సంతసించి, రాకకుఁ గతం బెద్దియని మురాదు ప్రశ్నింప, యువకుఁడు వినయగాంభీర్యము లుట్టిపడ, నిశ్చలస్వరంబున నిట్లు పలికెను —

"రాజా! నేను సెర్వియాదేశాధిపతి పంపిన దూతను —" 'మిలోషు కబిలావు' డనువాఁడ. అమేయ బలపరాక్రమ ధురంధరుం డగు మా ఱేఁడు పంచిన కార్య మెఱింగించెద, గమనింపుము. మన్త్రప్రభు ప్రతిభ యటుండ, మా ఐరోపాజాతుల సమరకౌశలము మహత్తరము. మాయెదుట మీ ప్రాచ్యసైన్యములు నిలువనేరవు. మేము జయించుట తథ్యము. ఐనను, నిర్నిమిత్తరక్తపాతము దుస్సహమగుటచే, మాభూమీధవుఁడు సంధి ప్రసంగించుటయే వాంఛనీయమని యెంచి, తత్కార్యభారము నాపై మోపెను. దాన మన రెండుదేశములకును చిరమైత్రి యలవడును."

మురాదు కుపితుఁడై యాడెను. —

"యువకుఁడా! నీదార్త్య మతిసాహసము. సంధి నాకాంక్షించువాఁడు మదధీనుఁడు గావలయు!"

"అతిసాహసమా! నీవు సైన్యసమేతుఁడవై మా దేశమున విడియుటకంటెను సాహసమా!"

దూత యీ తెఱంగున వెఱ పుడిగి నిబ్బరముగఁ బలుక, నృపాలుఁడు క్రోధవివశుఁ డయ్యు నిట్టులనెను —

"బాలుఁడవగుటచే, బ్రదికిపోతివి; లేదేని, నీ తల యిచటనే తెగి యుండెడిది. హమ్మ్రా! మహామహిమా నిగ్రహానుగ్రహ సమర్థుండని నీస్వామి కెఱింగింపుము. నిన్ననుగ్రహించితి. నీ స్వామినో, దీర్ఘనిగళబద్ధు నొనరించి, మదీయ రాజధానికి రప్పించెద. నీవు అస్మదీయ శిబిరప్రదేశ పరిసరముల నతిక్రమించునంతనే, యుద్ధమారంభమాయెనని గ్రహింపుము. మార్గమధ్యమున నా సైనిక విభాగమెద్దియైన గోచరించునేని, వారిని గూఢచారులుగఁ బరిగణించి, యెదిరించి, జయమొందుదేని, నీకిష్టమగునట్లు లాచరింపుము. నీవే బంధితుఁడవై మగుడ నరుదెంచుదువా — దారుణ మరణింతువు. హమ్మ్రా!"

యువకుఁడు క్రోధోన్మత్తుఁడై, ఉచితానుచితముల నరయఁజాలక, తీవ్రముగ నెద్దియో పలుకఁబోయెను. సేనాని వానిని వారించి, తన నృపాలుని సహజ క్రూరస్వభావము నెఱింగిన వాఁడగుటచే జాలిగొని, సెర్వియాదేశపుదూతను జల్లగ నావలకుఁ గొంపోయెను. అనలమువలెఁ గనలు నా పాశ్చాత్యయువకుఁడు క్రోధరుద్ధస్వరమున నిట్లు లనెను.

"ప్రసిద్ధ సెర్వియావంశజుని నిష్కారణముగా నవమానించిన నృపాధమునిపైఁ బగ సాధింపనేని —"

"వీరుఁడా! వీరుఁడు విక్రమించునే గాని, బీరములాడఁడు. భీకర నీలజీమూత మరణాఘాత కూలమున నుంటివని గ్రహింపఁజాలక, ఏమేమియో ప్రగల్భములాడఁ గడంగెదు!"

అట్లు హితోపదేశము కఱపు సైన్యాధిపుని సాహాయ్యమున సెర్వియాదేశపు రాయబారి శత్రుశిబిరప్రదేశము నిరపాయముగా నతిక్రమింపఁజాలెను. మహమ్మదీయచమూపతి వెనుకకు మఱలెను: పాశ్చాత్యయువకుఁడు నిజభటానీక పరివృతుఁడై ప్రయాణ మొనరింపసాగెను.

తమ నాయకునకు వాటిల్లిన యగౌరవము నెఱింగినవారగుటచే మిలోషుని సైనికులు కూడ తీవ్రక్రోధకంపితగాత్రులై, ప్రతిక్రియ

గానింపఁ బత్తరసముచుండెను. వారు సమూహమెందు సైన్యము వెడలి నంతనే అస్వలితీరమున నొక యుద్ధకళము గోచరించెను. పెన్నిధి గాంచిన పేదవలె, రాయబాలి పరమానందభరితుండై యొకతడవు తన యశ్వమును నాపించి, పరికించి, ఆలోచనోద్యుక్తుండై యిట్లులనెను— “మిత్రులారా! అదిగో చంద్రకేతనములు! వారు మన వైరులగు మహమ్మదీయులు కావలయును. వారి సంఖ్య కొంచెమధికము. మన మెఱు వని సంగతి యెఱుంగరాకుము. మీ రేమియు! పిఱికిపాటి దేవత మన భుజశాస్త్రముల సహాయించి, నేను సైన్యసంకల్పుఁడ నగుటకు నుంచి యాశకాని గాంచరానౌను. రండు! రండు!”

రాయబాలియగు మిలోష్ఖండు తోడనే చర్మకోశమున నశ్వమునుఁ బొడిచి, జవ్వునఁ బాఱి, నదీస్రోతముల నుత్తరించి, వైరిని నమీపించెను పాశ్చాత్యుని యనుచరులు కూడ జయజయధ్వానము లొనరించుచు దమ నాయకుని వెంటఁబోయిరి.

ఆ మహమ్మదీయ జనసమూహము నడుమ దళముగు ముసుఁగులు ధరించిన వనిత లుండిరి. ఆకాంతలు మేలురకపు అరేబియాగుఱ్ఱముల నారోహించియుండిరి. అందొక బంగరు వెలలేని చీరి చీనాంబరములఁ దాల్చియుండుటయు, ఆమె తేజ యపూర్వశోభాయ మానముగ నలంకరింపఁబడి యుండుటయు, నాపడఁతిం బరివేష్టించియుండు స్త్రీలు సవినయముగా నుండుటయు గమనింప, నాజవ్వని కులీన కావలయునని యువకుఁడు గ్రహింపఁజాలెను. ఆమచ్చెకంటి వినోదార్థ మఱిగి యుండును. పరాభవాగ్నిచే నుడుకుచుండిన రాయబాలికి దయావివేకములు లేకపోయెను. సాయుధులై వడివడి నరుదెంచు నాశ్వికులను గాంచినంతనే, యాజవరాండ్రు భయాధికమునఁ గెవ్వున నఱచిరి. కాని, తురుష్కనాయకుఁడు తనసైన్యమధికముగ నుండుటచే నా కాంతలకు ధైర్యముకలిపి, వారిని నిరపాయస్థలమున నిలిపి, యుద్ధ

సన్నద్ధుఁడాయెను.

సంగరము ప్రారంభమాయెను. పోరాట మారంభమునందే దారు
ణముగనుండెను. మహాశ్చర్యకర అస్త్రసంచాలనలు; క్రైస్తవు లధిక
తర సమరనిపుణులు కావున, విస్తార సైన్యములు గుజరాతులను
దీపించినను, మిలోరుడను క్రైస్తవ సేనాధిపతిని కేసరిత్రాణముల భేదింపఁ
జాలకపోయెను. రాజపుత్రవీరులు ప్రాణములర్పించి చాళుక్య ప్రశంస
నీయముగఁ బరాక్రమించియుఁ దెగటారిరి.

రాయబారియగు మిలోరుఁడంత విభీతతురుష్క కాంతలచెంత
కేగెను—"సుందరులారా! మీరు మాయధీనులైతిరని భీతిల్లకుఁడు.
దుర్మదాంధుఁడగు సుల్తాను ఒడలెఱుంగక దర్పములాడుటచే—"

"క్రైస్తవుఁడా! సుల్తాను నాజనకుఁడు. ఆమహనీయుని గుఱించి
నిష్ఠురములాడవలదు. దురదృష్టవశమున రాజపుత్రిక 'నీలవతి' నీచే
జిక్కినది: ఉదారహృదయుఁడవై మెలంగుము."

సఖీజన పరివృతయగు కాంతామణి యట్లు స్థైర్యమంజుల విస్పష్ట
స్వరంబునఁ బలికి నంతనే, మిలోరుని శరీరము కంపించెను. కారణ
మేమన, సుల్తాను రాజపుత్రిక నిరుపమాన సౌందర్యప్రతీతి దిగంత
ముల పర్యంతము వ్యాపించెను. అసాధ్యమగు సౌందర్యాధి దేవత
రాయబారి యధీనమాయెను! వానిచిత్తము దుర్భరాందోళనముచే
వ్రయ్యలాయెను. ఆతురుష్క నృపాలకన్నియను సాదరముగా సగౌరవ
ముగా విడిచి వేయవలయునని యువకుని హృదయము త్వరపడు
చుండెను. కాని, తన దృఢప్రతిజ్ఞం దలంచి యట్టు లాచరించుటకు
మనసొప్పకుండెను. కాన నాతఁడు పరిస్థితుల నాపడఁతికి వ్యక్తపఱ
చెను—"నిన్ను విడచుటకు నే నసమర్థుఁడ. సమయబద్ధుఁడను, రాజ
భక్తుఁడను నగుటచే నిన్ను నాసైన్యాధిపతి చెంతకుఁ గొనిపోయి, విషయ
మెఱింగించి, ఆతనిఁ బ్రార్థించి నీకు స్వతంత్ర మలవడఁజేయుదు."

"ఉదారవంతుఁడా! అభయమొసంగితివి, చాలును. పాశ్చాత్యులు దయాసమన్వితులని యెఱుంగుము. అచిరకాలమున మాజనకుఁ డుచిత పరిహార మొసంగి, నన్ను విడిపించునని కూడ దలంతును."

రాయబారి సముచితముగ నా రాజదుహితకు ధైర్యముకఱపెను. ఆ కన్నియ తన కృతజ్ఞత దెలుపుటకై, మేలిముసుఁగు సడలించెను. మానిని ఒక యపరచితునకు నిజముఖాంబుజము ప్రదర్శించుటకంటె గౌరవ మింకొకటిలేదు. మురాదు పుత్రికయగు నీలఫరి యసమాన సౌందర్యవతి యని మన రాయబారి ఆలించియేయుండెను. కాని, తాఁగాంచిన వదనము సహస్రాధిక సౌందర్య వైభవముసముజ్జ్వలమై దీపించెను. అట్టి యసదృశరూపురేఖా విలాసముల నాతఁడెన్నఁడు విని కని యెఱుంగఁడు. కాననాతఁడు విస్మయవిభ్రాంతుఁడాయెను. ఆయింతి సోయగము వర్ణించుటకు జిహ్వాయు, చూచుటకుఁ గండ్లును జాల కుండెను. రాయబారి మర్యాద మఱచి యామించుఁబోఁడిని అనిమిషనయనుఁడై యట్టె వీక్షింపఁ దొడంగెను. ఆసుందరి లజ్జాభరమ్మున సిందూరరాగదీపితావనతవదన యాయెను. తన మొఱకుందనంబు నెఱింగి రాయబారియు లజ్జితుఁ డాయెను. నీలఫరి మఱల ముసుఁగు ధరించెను. అనంతమగు ఖాతము తన నాదివ్యసుందరవిగ్రహామునుండి విడదీసినటు లాయెను. ఆతని హృదయక్షేత్రమున మోహాంకురము మొలకలెత్తెను.

నీలఫరీమిలోషు లాతెఱంగున నుండిన సమయమున, క్రైస్తవ సైనికులు విగతజీవుల సొత్తు హరించుచుండిరి. అనంతరము మహామ్మదీయ రాజపుత్రికతోఁబాటు రాయబారి ప్రయాణ మాయెను. ఆ కోమలాంగికి బాధకరముగ నుండునేమో యని ఒక పల్లకి నాయత్త పఱచి, నిశాసమయమునఁ బ్రయాణము మాని, అడుగడుగునకు విశ్రమించుచు నడచుటచే, గమ్యస్థానము చేరుటకు రెండు దినములాయెను.

అచట 'వసీనిము' దేశపురాజు విడిసియుండెను. క్రైస్తవ మహా సైన్యమునందలి యొక పెద్దభాగమున కాతఁడు నాయకుఁడై యుండెను. ఆరాయబారి యుదంతము నాలించి, సైన్యాధిపతి యిట్టులనెను —

"మిత్రమా! నీకు హిత మాచరించుట నాకెంతయు సంతోష కరము. కాని, నా కసాధ్యము. సంగరమున కాయత్తమైన సకల సేనావాహినులకును సర్వసైన్యాధిపత్యము వహించిన సెర్వియా దేశాధిపతియే సమర్థుఁడు. కావున, నీవే తత్కార్యభారము వహించి, మన నాయకుని సమక్షమునకుఁ బోయి, సఫలమనోరథుఁడవై యరుదెమ్ము. అంతవఱకు నీ రాజతనయకు నెట్టి కొఱఁతయు రానీక కని పట్టువాఁడ, పొమ్ము!"

రాయబారియగు మిలోషుఁ డమితోత్సాహోద్విగ్నహృదయుఁడై, మేలిముసుంగు తొలంగిన నీలఫరి దివ్యసుందరవదనాంబుజము మఱల నొకసారితిలకించి, ఆనందపరవశుఁడై, సెలవు గైకొని, తురంగము నారోహించి, వాయువేగమునఁ బ్రయాణ మొనరింపఁ దొడంగెను.

రాయబారి నిశాసమయమున సెర్వియాదేశాధిపతి శిబిరము సమీపించెను. ఉదయ మగునంతనే, మిలోషుఁడు రాజసభాంతర్గతుఁడై, తన రాయబారము నెఱింగించెను. నృపాలుఁ డిట్టులనెను — "తురుష్కుఁడు యుద్ధ మొనరించుటకే సిద్ధమాయెనా? కానిమ్ము. ప్రజానష్టకష్టములను సహింపఁజాలక, సంధి నపేక్షించితి. యువకుఁడా! మురాదు నిక్కముగ ధైర్యశాలియా? లేక మిథ్యాప్రగల్భుఁడా?"

"మహనీయా! మహమ్మదీయనృపాలుఁడు సింహపరాక్రముఁడు. క్రూరనిరంకుశస్వభావుఁ డగుటచే నాతని యశము కళంకితమాయెఁ గాని, నిజముగా నాతఁ డసమానుఁడు."

నృపాలుఁడంత మిలోషుఁడు తెచ్చిన జాబుల నందుకొని, ప్రత్యుత్తరము లిఖింపఁ దన యుద్యోగిని నియోగించి, రాయబారి నభినం

దించి, బిరుదము నొసంగి, వెడలుట కనుజ్ఞనొసంగెను. కార్యదర్శి యొసంగిన జాబులఁ గైకొని, మిలోషుఁడు నిజస్థానమునకుఁ బ్రయాణ మాయెను.

రాయబారి చిత్తము వివిధాలోచనలచే సంక్షుభిత మాయెను. ఆ జాబునందలి సమాచార మెటులుండునో, తన హృదయము నాకర్షించిన ఆ యపూర్వసుందరాంగి యవస్థ ఏమి కావలయునో, సర్వ సైన్యాధిపతి కరుణాయత్తచిత్తుఁడై యనుగ్రహించునో, మఱి యే మగునో యని పరిపరివిధముల తీవ్రతరముగఁ జింతించుచు, నిజమనో వేగమునఁ బాఱి, మిలోషుఁడు తన సైన్యాధిపతి శిబిరము చేరెను.

రాయబారి కొని తెచ్చిన జాబు సేనాని గ్రహించెను. రాయబారి చిత్తము పళ్లెరమునఁ బోసిన పాదరసమువలెఁ బరిపరిగతులఁ బరుగు లిడుచుండెను. సైన్యాధిపతి లేఖ లోలోనఁ జదివికొనెను; రాయబారి హృదయాందోళన మధికతర మాయెను. సైన్యాధిపతి వదనము వెల వెలఁ బోయెను: రాయబారి దుర్భరవిషణ్ణహృదయుఁ డాయెను. సేనాని యంతట నాజాబు నొసంగ, రాయబారి భయాక్రాంతుఁడై, కంపితకరుండై, యిట్లు చదివెను —

" ఘాతుకస్వభావుఁడగు మురాదు సంధికార్యము నిరసించెను. అట్టి వైరి కృపాపాత్రుఁడు కాఁడు. ఆతని పుత్రికయును దయార్హ కాదు. ఈ నీలఫరి మనకు జామీనుగ నుండుఁగాక. ఈ విషయ మెఱింగి, మురాదు వెనుదిరిగిన మేలు, ఈ కాంతను విడువనగును, లేదేని — మురాదు రణమునకే కడంగునేని, తదారంభముననే నీలఫరీని వధింపవలయు. తురుష్కులు దయారహితులు: అట్టివారియెడ ననుకంప యనుచితము. "

అట్టి భయంకరాజ్ఞ తిలకించినంతనే, మిలోషుని కండ్లు గిఱ్ఱున దిరిగెను, శరీరము కంపించెను, హృదయమ్ము విచ్ఛిన్నమాయెను. శరీర

మాపాదమస్తకము చెమ్మటతో నిండిపోయెను. ఆ ముహూర్తమున నొక వార్తావహుఁడు రయమున నరుదెంచి యిట్లు విన్నవించెను —

"తురుష్క-సైన్య మాకస్మికముగ మన ముంగలి సైన్యవిభాగముపైఁ బడి, మన సైనికుల నందఱను వెగనడిచెను. మన సైనికు లల్పసంఖ్యాకు లగుటయేగాక, యుద్ధమారంభమాయెనని యెఱుంగక యేమరియుండుటచేఁ బ్రతీకార మొనరింపఁజాలక, ఆత్మసంరక్షణ మొనరించుకొనఁ బ్రయతింపనైనఁజాలక, వధింపఁబడిరి."

రాయబారి యవస్థ యెట్టు లుండెను? మురాదే క్రూరుఁడై యుద్ధమారంభించెను: ఇఁక దన సర్వసైన్యాధ్యక్షుని కఠినశాసనము చెల్లవలయును. గత్యంతరము లేదా? శిరీషకుసుమకోమలాంగి మరణింపవలయునా? రాయబారి హృదయము భగ్గున మండిపోయెను. సైన్యాధిపతి యిట్టు లనుకొనెను — "ఉపాయాంతరము లేదు. సెర్వియా దేశాధిపతి యాజ్ఞ అమోఘము, శిరసావహింపవలయు —"

"మరణమా! నవనీతకోమలశరీరకు నంతటి ఘోరమా! అసంభవము! ఆర్యా! ప్రధానసేనాని నొక్క-సారి ప్రార్థించిన, మన్నింపఁడా?"

అనూన మనోవ్యథాబాధితుఁడై, మోఁకరించి విలపించు యువకుని లేవనెత్తి, వసీనియా దళవాయి యిట్టులనెను —

"మిత్రమా! వీరపురుషున కింతటి దైన్యమా? యుద్ధసమయమున సర్వచమూనివహముల శాసించు మహారాజు నాజ్ఞ నుల్లంఘించుట సాధ్యమా?"

"అయ్యా! దయామయుండవు! రెండుదినములు గడు వొసంగుము. సెర్వియా దేశాధీశుని పాదలపైఁ బడి ప్రార్థించెదను. ఆ ధర్మాత్ముఁడు తప్పక నీలఫరీని క్షమించును."

"కుమారా! అసాధ్యము. నేనే ఆజ్ఞోల్లంఘన మొనరించినచో,

సైనికులు పిచ్చిపట్టి నన్ను దృఢీకరింతురు. మన మెల్లరము సైని
కులము. సైనికులము నియమబద్ధులము. వేయేల! ఇట్టి ఘోరశిక్షకుఁ
బాత్రురాలగునది నా పుత్రికయే యగుఁగాక, ఐనను, శాసనము ననుస
రించి మరణింపవలసినదే.”

ఆసేనాని సహజముగ దయాళువగుటచే వాని నయనము లశ్రు
జలపూరములాయెను. ఇఁక రాయబారి యవస్థ వర్ణింపరాదు.
ఆపన్నునివలె, ఉన్మాదునివలె నాతని మానస ముద్రేకించెను. సేనాని
ఏమియు నోదార్పఁజాలక మాటాడఁజాలక, శిలాప్రతిమవలె నుండెను.
నిరాశాసాగరమున మునిఁగియున్న రాయబారి మానససీమ నాకస్మిక
ముగా నొక్క యూహ మెఱుపువలె మెఱయుటచే నుత్సాహదీపిత
వదనముతో నాతఁ డిట్టులనెను —

“అయ్యా! ఈ యాజ్ఞాపత్రము ననుసరించియేగదా, నీవు అబలను
వధింపనున్నావు! ఈ పత్రము అందలేదనుకొమ్ము — నేను పారవైచితి
ననుకొమ్ము — నీ వపుడీ కాంతను సైరింతువు గదా?”

“అసంభవము! రణరంగమున కరుదెంచిన సైన్యాధిపతి యట్లు
మెలంగరాదు. సైనికధర్మవిరుద్ధముగా మెలఁగజాలను. వీరుఁడా!
అవివేకము తోఁ బొంగి, ఆకన్నియ గుఱించి తలంపకుము.”

రాయబారి శరీరమంత నొక్కసారి కంపించెను: కండ్లు నిప్పులవలె
నెఱ్ఱగఁ బ్రకాశించెను. బంధీకృతపవనుఁడై, ఉప్పొంగెడు హృదయము
నొక్క హస్తమున నడంచి, రెండవకరమునఁ దాఁ దెచ్చిన యాజ్ఞా
పత్రమును రయమునఁ బట్టి పరపరఁ జించివైచి, ఆసమీపమున నున్న
మంటలో విసరివైచి, నిట్టూర్పు విడిచి యిట్టులనెను—“ఇఁక నీలఫరీని
వధించుటకు నాజ్ఞ లేదుగదా!”

వసీనియా సేనాని విస్మయాగ్రహపరవశుఁడై చయ్యనలేచి రాయ
బారిని దిట్టుచు, నిట్టట్టు తిరుగుచు, నొక్కనిమిష మాలోచించి,

నయనము లెఱ్ఱవాఱ, భటులనుద్దేశించి, కఠినస్వరమున నిట్టు లాజ్ఞాపించెను —

"ఈ దురాత్ముని బంధింపుఁడు! నా యాజ్ఞ తెలియువఱకుఁ గారయందుంచి బహుజాగరూకతతోఁ గావలియుండవలయు. ఏమరిన మీ కంఠములు తెగిపోవును, భద్రము!"

రాయబారియే తన ఖడ్గము భటులకొసంగి, శిరము వాల్చి మాఱాడక, వారి వెంటఁబోయెను.

వసీనియా సేనాని తోడనే మిలోషుని యవిధేయత ప్రధానసైన్యాధిపతికి నివేదించెను. ప్రత్యుత్తర మరుదెంచుటకుఁ గొంతకాల మాయెను. ఈలోన రాయబారి బంధితుఁడైన సమాచారము మురాదు పుత్రికయగు నీలఫరీకిఁ దెలియవచ్చెను. ఆ యువకుని యౌదార్య ప్రవర్తనము ఆమె హృదయమున నాటికొనెను. ఆకాంత యవస్థ కడు నపాయకరముగ నుండెను. రాయబారి యతిసాహస మొనరించుటచే తదాజ్ఞాపత్రము రూపు చెడినను, ఏమగును? ఐనను, ఆ సుందరాంగి స్వార్థత్యాగశీలుఁడగు రాయబారిక్షొఱకు విచారించెను. తన చిత్త మా కాంతుని యధీనమాయెనని యెఱుంగకయే, ఆ హేమగాత్రి హృదయము ప్రణయప్రపూర్ణ మాయెను.

చరిత్ర ప్రసిద్ధమగు 'కసోవా' యుద్ధమరుదెంచెను. ప్రధానసేనానియగు సెర్వియా దేశాధిపతి, వసీనియా నాయకుఁడు మొదలగువారు పరివేష్టింప సంగరము గుఱించి చితింపఁదొడంగెను. క్రైస్తవ సేనానులందఱు నొక్కసారి నలుదిక్కులనుండి శత్రుసైన్యముపైఁ బడి చిందరవందర యొనరించి విక్రమింపవలయునని సభాసదులు నిశ్చయించిరి. అనంతర మా మహనీయులందఱు దనివితీర సురాపాన మొనరించిరి. అది యొక వినోదమందిరమువలె రణ మొనరింప నున్న వీరులందఱు మైమఱచి యాడుచు, పాడుచు, గెంతుచు, కేరుచు

పోయిగ నుండిరి. ఎంత విపరీతము! ఎంతదారుణము! ఎంతయమా నుషము! ఇఁక భయంకర యుద్ధము ప్రారంభమగును: తమ వంటి మేదోమాంసవిహితులగు మానవులు లెక్కకు మీఱి కుప్పకుప్పలుగ భీకరరణరంగమున మరణింపనుండిరి! అట్టి సమయముననా, సురా పానము! ఆనందము! ఉత్సాహము!

ప్రధానసేనానియు మధుపానసౌఖ్యము పూర్తిగఁ జూరగొనియే యుండెను. అంతలో రాయబారి సంగతి తలంపునకు వచ్చుటచే నా విషయము ప్రశ్నింప, వసీనియా సేనాని యిట్లులనెను —

"ఆర్యా! మిలోషుఁడు నిజముగ మహాపరాధ మొనరించెను. ఐనను, వాని తాత్పర్యము గమనింపఁ దగియున్నది. మఱియు కేవలము ప్రేమబద్ధుఁడై ముగ్ధుఁడై మంచిచెడ్డ లరయఁజాలక, ఇట్టి యకార్యము నొనరించెను. అతఁడు పేరొందిన వీరుఁడు గూడ నగుటచే, మరణశిక్ష విధింపవలదని ప్రార్థింతును."

వసీనియా సేనాని యీ తెఱంగున విన్నవించెను. కాని, యుద్ధ సమయమున నేరములను క్షమించినచో, నపాయము వాటిల్లును. ఆ కారణమున సర్వసైన్యాధిపతి విముఖుఁడై మగుడ విచారించి యిట్లు లనెను —

"శ్రీఘ్ర మిలోషు నొక యసాధ్యకార్యమునకు నియోగింతము. కృతకృత్యుఁడైన మన్నింపఁగలము. పరిచారికా! రాయబారిం గొని రమ్ము!"

తోడనే, మిలోషుఁడు సైనికజనమధ్యస్థుఁడై ప్రవేశించెను. సైన్యాధిపతి యిట్లు ప్రశ్నించెను —

"యువకుఁడా! నీవు జీవింప నాశింతువా?"

"దేవా! ఆశింతును. నా ప్రాణమొసంగుము, ఎంతటి కఠిన సమయము విధించినను, ఒనరింపఁజాలుదు."

"ఒనరింతువా ?"

"మురాదు ప్రాణికేంయగు నిలఁగోకి సూత్రి ననకృతి నలుపఁ జాలను. మఱి కొట్టిరాన్నదైనను సాధింతును."

"అట్లయిన, సెలవిచ్చెదము. సూర్యోదయమగునంతనే, సంగరము ప్రారంభమగును. ఎట్టి కష్ట కార్యమైనను సాధింతునని ప్రగల్భమాడితివి. సమయాభిలాషి ... ప్రాణములకు, ... ప్రాణమునకుం గూడ భంగము కలుగును సుమా!"

రాయబారి నిశ్చలచిత్తుండై సమ్మతించుటచే, సభ్యక్షుఁ డిట్లు గంభీరముగఁ బలికెను —

"నీ వొనరింపవలసిన కార్యమియ్యది. సాధింతువా, మిలోషుఁడు మోహాభిభ్రాంతుఁడై రాజభక్తిమఱచెననెడు అపనింద తొలంగును. నిశాంతమగునంతనే, ఈ సుందరవసుంధర మానవరుధిరపూరిత మగును. మురాదు రణకౌశలతయే మహమ్మదీయుల బలము. కావున రణ మారంభమగునంతనే, నీవు రయమున మురాదును డాసి వధింప వలయును. ఆ మహమ్మదీయనృపాలుఁడు ప్రసిద్ధవీరజనమధ్యస్థుఁడై భయంకరనైనికనికరపరిరక్షితుండై యుండినను సాధింపవలయు. నీవు వీరుఁడవు; స్థిరచిత్తుఁడవై విద్యుద్వేగమునఁ బోదువేని తదవసరజనిత విస్మయాధిక్యమున నచటి పరిజనులు ప్రతీకార మొనరింపఁజాలరు, నిన్ను వారింపఁజాలరు. కావున, ఈకార్యము కేవల మసాధ్యము కాదు. పొమ్ము!"

ఈ నుడు లాలించినంతనే సభికులందఱు స్తంభీభూతులై పోయిరి. మిలోషుఁడు తన తోడిక్రైస్తవక్రూరకరవాలమున వధ్యుఁడగుటకు మాఱు, మహమ్మదీయ ప్రహారణమునఁ దెగటారునని వారు గ్రహించిరి. రాయబారి సన్నిహితాధికారియగు వసీనియా యొడయఁడు ముఖ్యముగ దుర్భరవిషాదాక్రాంత చిత్తుఁడాయెను. రాయబారి

యన్ననో! మిన్ను విఱిగి పడినట్లు నిశ్చేష్టితుఁడాయెను. మహాసముద్రము వంటి రిపుసేనానివహములఁ గడచుట యెట్లు? కడచిన, మురాదు నిలయమునుచుట్టు సహస్రనయనములతోఁ గావలియుండు సింహబలసమన్వితుల నెట్లు నిరసింపనగును? నిరసించిన, మహమ్మదీయ భూమీధవుని జుట్టియుండు ససహాయు వీరు లేమికావలయు? దుస్సాధ్యము! కేవలమసాధ్యము! మిలోషున కింక బ్రదుకుపై నాస యేల?

సూర్యోదయావసరమాయెను. భానుబింబము సకల జన నయనోత్సవముగ నుదయింపక, గాఢతరభయంకర నీలమేఘముల మఱుంగున నుండిపోయెను. నిర్హేతుక మానవరక్తోత్పాదనము సహింపఁజాలక, వసుంధరాదేవి విడుచు గాఢతర నిశ్వాసాశ్రు జలధారలో యన, ప్రచండమారుతము జెలరేఁగ, ఘనాఘనసంకుల వర్షము ధారాపాతముగఁ గురియఁదొడంగెను. ఐనను, ఇరుతెగలవారును యుద్ధసన్నద్ధులైరి. క్రైస్తవ మహాసైన్యములను శాసించు వివిధనాయకులు తమతమ సేనాబలంబుల సముచితముగ నిలిపిరి. కట్టెనుట మహమ్మదీయ సేనావాహిని శత్రుసైన్యమును ముంచివేయుటకు సిద్ధముగ నుండెను. ప్రధానసైన్యవిభాగములను సుల్తానుపుత్రులు శాసించుచుండిరి. ప్రధాన మహమ్మదీయసేనాని యెల్లెడల సంచరించుచుండెను. మురాదు అఖిల సైన్యమధ్యస్థుఁడై, యప్రమత్తుఁడై యుండెను.

యుద్ధమారంభమాయెను. రెండుపక్షముల సైనికులును దమతమ దైవముల దలంచి, సింహనాదము లొనరించి, మహాసంరంభముతో నొండొరులఁదాకిరి. అకస్మికముగ నొక క్రైస్తవయువకుఁడు అశ్వారూఢుఁడై వెలువడెను. ఆవీరుఁడు తనతోడి సైనికుల నిట్టట్టు పోఁద్రోచి నిజసైన్యవాహినీ పరిత్యక్తుఁడై, వాయువేగ మనోవేగములఁ బాఱి, చిచ్చరపిడుగువలె వైరిచమూనివహ పర్వతమును ఛేదించి, క్రిందుమీదు లరయక, ఇటునటు బరికింపక, నిరోధింపఁ

గడంగు సైనికుల నరఁటిచెట్లవలె సుళువుగఁ దెగనఱికి, మురాదు శిబిరము డాసెను. అమితబలవంతులగు జనీజరాసైనికులు రాజశిబిరము చుట్టును వివిధాయుధముల ధరించి కావలియుండిరి. ఆ యువకుఁడు రాయబారియగు మిలోషుఁడేయని పాలకులు గ్రహించియే యుందురు. రాజభటులా బాలవీరునిఁ గాంచి, మగుడ దౌత్యము నలుప నరుదెంచి యుండునని భ్రమించి, వానిని శిబిరములోనికిఁ బోనిచ్చిరి. మురాదు మహారాజు సువర్ణమణిమయ ప్రభాదీపితుఁడై అంగరక్షకానేక పరిరక్షితుఁడై, రాజనీతి విశారద మంత్రిజన పరివృతుఁడై, భయంకర సమర కార్యనిర్వహణదక్షుఁడై, సుస్థిరవిజయ సంపాదనాయత్తచిత్తుఁడై, సమున్నతకాంచన సింహాసనాసీనుఁడై యుండ, మన రాయబారి ఖడ్గపాణియై సుల్తానుకట్టెదుటకుఁబోయెను. తత్పరిజనులందఱు రాజమందిరము నలంకరించు సాలభంజికల భంగి వింతగ వీక్షించుచుండ, మదకరీంద్రముపై లంఘించు సముత్క్రోధ ఘూర్ణితహర్యక్షమువలె నుఱికి యొక్కపోటున రాయబారి మహామ్మదీయనృపాలునిఁ బొడిచెను. అచటి వీరులందఱు భ్రమాన్పడిరి. వారు ప్రబోధితు లగునంతలో మిలోషుఁ డేతెంచిన తీరుననే యదృశ్యుఁడాయెను !

రణరంగమునకుఁ గొంతదవ్వున మురాదు పుత్రికయగు నీలఫరి శత్రుసదనమున నిష్టసఖీజనపరివృతయై యుండెను. తనయవస్థ తలంచియు, యుద్ధపరిణామ మెటులుండునో యనియు, తన చిత్తము హరించిన ఆ యుదారపురుషుఁడు మిలోషునిగతి యేమగునో యనియు నా సుందరి పరితపింపఁదొడంగెను. అట్టి సమయమున సమీపించుగుఱ్ఱపు సవ్వడి విననగుటచే, నా కాంత విస్మయాతురచిత్తయైయుండ, నశ్వము తన గుడారముచెంతనే నిలిచెను. కనువిచ్చి పరికించునంతనే, రాయబారి మిలోషుఁడు సాక్షాత్కరించెను. ఆ లావణ్యవతి అగణితమధుర మందహాసవిరాజితయై, చంచల విశాలనయనజ వీక్షణావళిమాత్ర

మునఁ గుశలమడుగ, నాపెయుఁ దుద్విగ్నస్వరమున నిట్టులనెను —

"నీ వెవ్వనిఁ గాంచుచుంటివో యెఱుంగవు; ఎఱుఁగుదేని, నా యునికి సహింపఁజాలవు."

"ఆర్యా ! వీరుండవు ! మంచి, నీ ప్రాణము నొక చీడికిఁగొనక నాకుఁ బ్రాణదాన మొనంగిన యుదారమనస్కుఁడవు. నీకంటె నాకు బ్రియుండెవఁడు ?"

"నిన్ను రక్షించిన రక్షించితిఁగాక. నీ ప్రాణసముని ప్రాణము హరించితి."

తురుష్కనారీమణి భయాక్రాంతచిత్తయై విషాదభరమునఁ దన కరములు జోడించెను—"అయ్యా ! సన్నిహితబాంధవునివధించితివా ? లేక, నాసోదరుని—" నీలఫరి నయనములు జలపూరములాయెను. కంఠము రుద్ధమాయెను. రాయబారి యిట్టులనెను —

"కోమలీ! వీరపురుషోచితముగ ద్వంద్వయుద్ధమునఁ బొలియించితి నేని, ఇంతగ విచారించువాఁడగాను. నీవును మన్నింతువు. కాని, భయంకరకాలపాశసన్నిభ సమయబద్ధుఁడనై, చోరునివలె, భీరునివలె, హంతకునివలె వధించితి !"

"ఆ దురదృష్టవంతుఁ డెవ్వఁడు? సత్వర మెఱింగింపుము ! అయ్యా, మాటాడవేమి? "

"నీ జనకుఁడు ! సర్వక్షత్రియజన భయంకరుఁడగు మురాదు పాదుషా ! "

పట్టుతప్పిన పసిఁడిబొమ్మవలె నారాజపుత్రి నేలఁగూలెను. తత్క్షణ మా హేమగాత్రి ప్రబోధితయై, యున్మాదినియై, మొలనున్న బాకును రయమున నూడదీసి, రాయబారి హాహాకార మొనరించి నివారింపఁ గడంగుచుండగనే నిజహృదయవిచ్ఛేదన మొనరించెను. రాయబారి సహింపఁజాలక బ్రతుకుపై రోసి, తనువున బల్లెములు విరిగిన ఘాత

సూకరమువలె సత్యాగ్రహుఁడై, ఉన్మాదుఁడై, వైరుల వధించి వధించి, తానును వధ్యుఁడాయెను.

మహాత్మకీయొప్రపాలుఁ డింకను మరణింపలేదు. ఆ మహావీరుఁడు మరణశిక్షావిధితుఁడయ్యు, సమరకార్యనిర్వహణము కడు ప్రశంసనీయము నొనరించెను. క్రైస్తవులు ప్రథమమున విజృంభించియు, నోటుపడిరి. తత్ప్రసిద్ధనాయకులు పట్టుపడిరి. వారికి మరణశిక్షవిధించి, విజయోత్సాహితుఁడై మురాదుపాషా స్వర్గస్థుఁడాయెను.

మిత్రులారా! గాయబారియగు మిలోషుఁడు ధరించిన తనుత్రాణ మింకను మన ప్రదర్శనశాలయందుఁ గాన్పించును. మన దేశస్థులు వానిని భీరుఁడనియు, హంతకుఁడనియు నేవగింతురు. వాని దేశస్థులు మాత్రము మిలోషుఁడు సాటిలేని మేటి దేశభక్తుఁడనియు, మహావీరుఁడనియు నుతింతురు.

౬

ఖలీలుని కథ ముగిసెను. ఈరెండవగాథ దార్లుబనుపాషాకు నధికతర ప్రీతికరముగ నుండెను. ప్రణయ రణాద్యనేక రసపూరితమగు నా గాథ నా ప్రేమముగ్ధులగు లూకానుగుల్నేరులకును, జైరజాజూలియనులకును అత్యంతానందము నొడగూర్చెను. జులేఖామాత్రము జైరజా గుల్నేరులవలె విస్మయానంద వ్యగ్రమనస్క కాకుండ, వెనుకటివలెనే ఆత్మవిశ్వాస విరాజితవదనయై, నిజ విశాలతరళనయన దర్పణములనుండి వినీలవిభ్రమ వీక్షణ మాలికలు నిజ మనోకాంతుని మధురాననము నలంకరింప, నిశ్చలచిత్తయై, కథాశ్రవణ మొనరించెను.

ఖలీలు కథ సంతోషకారణ మగుటయే కాక, ఆందోళనమునకుఁ గూడఁ గారణమాయెను. పాషా యభిప్రాయమునకు విరుద్ధముగ ఖలీలుఁడు మఱెట్టి నెపంబున మఱియొక దిన మం దుండఁగడంగునో యని

ఆ యువతీ యువకులు తల్లడిల్లిరి. జులేఖామాత్రము తురుష్కుని బుద్ధి వైభవము నెఱింగిన దగుటచేఁ దదనుమానము నెఱుంగక నిశ్చలముగ నుండెను. కథ ముగిసినంతనే, దాల్త్రబను పాషా నిర్వికారుఁడై గభీరా లోచనాధీన మనస్కుఁడై, మిన్నకుండెను. కథాంశములగురించి యా వృద్ధవీరుఁడు చింతింపఁ దొడంగెను. గర్వాతిరేకమున యుద్ధసన్నద్ధము లైన క్రైస్తవానీకముల దహించివైచిన ఆ మహాశూరుఁడు శిక్షించిన మేటి మహామ్మదీయవంశోద్భవుఁడే కదాయని ఆ పాషా సగర్వముగఁ దలపోసి, యిట్టులనెను —

"ఖలీలుఁడా! నీ కథానిర్వచనము కడు ప్రశంసనీయము. తొల్లిఁటి మహమ్మదీయ విజయచరిత్ర నీకుఁ గరతలామలకము. మిత్రమా! ఒకరి నభినందించుట నా కభ్యాసము లేదు. ఐనను, నీ చాతుర్యము మాత్రము కొనియాడఁదగి యున్నది. నిరంతర కథా కథన కుశలులు సహిత మింత సరసముగఁ జెప్పఁజాలరు."

"పాషా! నీయంతవాఁడు సంతసించుటచే, నే గడు ధన్యుఁడను."

ఖలీలుఁ డట్లు పలికి, వినయపురస్సరముగ మోము వాల్ప, పాషా యిట్టు లనెను —

"కాని, మీ రింక వెడలు —"

"పాషా! నా రెండు కథలకే మీ రింతగ మురియుచుండిరి. వీనిం దృణీకరించు కథలు పెక్కులు నా మనోగతములై యున్నవని విన్న వించువాఁడను."

పాషా సాభిప్రాయముగా నవ్వి యిట్టు లనెను — "ఓహో! అరే బియా దేశపు కథావళి జ్ఞప్తికి వచ్చుచున్నది. నాఁటి సహర్జాదివలె నీవు మిత్రసహితముగ నిం దుండఁగోరి యిట్టి విచిత్రకథనమున కుద్యమించితివి!"

"పాషా! వివేచనాధురంధరుండ వగు నీ యపార గ్రహణశక్తి

నెఱింగిన పిమ్మట కా దనఁజాల. ఇట్టి స్వర్గమున నడుగిడి, మగిడి పోఁ
గడంగుట మాకు నిజముగ నసహ్యము. మహానీయా! మా కుల
గోత్రముల నెఱింగించితిమి: వినిర్మలప్రేమబద్ధులమనియు, విన్నవించి
యుంటిమి. కావున, మా పవిత్రమనోరథ మీడేర్చి మమ్ము సార్థక
జన్ముల నొనరింతువని విశ్వసింతును."

పాషా కొంతతడవు భ్రాంతియుక్తుఁడై మిన్నకుండి, యల్లన నిట్టు
లనెను— "ఆర్యా! నిక్కువము. కాని, మీ మీ యుదంతములు
నిక్కువము లని యెట్లు లరయనగును."

"పాషా! అది యెంతపని! మా మా దేశములకుఁ జారుల నంపి
నచో, నిజానిజములు తెలియఁగలవు. మా నుడు లణుమాత్రమైన
సత్యదూరము లగునేని, మమ్ము దండింపుము. అంతదనుక మమ్ము
బంధితులవోలె నిం దుండనిమ్ము."

"ఆర్యా! నా పుత్రికలు నా యధీనము గాని, జులేఖాపై నా కధి
కారము లేదుగదా!"

"మహానీయా! ఆ భయము నీకు వలదు. ఈ కన్నియ జనకుఁడు
సుఖముగాఁ బ్రసన్నుఁడు కాఁగలఁడని విశ్వసింపుము."

"వీరుఁడా! జులేఖా జనకుఁడు, మదీయ భావుకుఁడు. ఆ హతభాగ్యుఁడు మహావిపదంబుధి మునింగి యున్న వాఁ డని యెఱుంగుదు
గదా. ఇట్టి సంకటసమయమున నాతని మానస మఱయు టెట్లు?"

ఖలీలుఁ డంత భావగర్భిత ప్రణయ ప్రపూర్ణవీక్షణము నా శోభ
నాంగిపైఁ బఱపి, యిట్లు బదులాడెను —

"సకల ప్రజాహృదయము సంక్షోభింపఁజేయు భయంకర హత్యా
రహస్యము నొక వారము దినములలో నరయవలయునని సలీము
పాదుషా కఠినముగ శాసించెనని జులేఖా నా కెఱింగించెను. కాని,
జులేఖా తలిదండ్రులు పరమాత్ముని విశ్వసించియున్నారు. ఆ దయా

స్వహూపుని నిర్వ్యాజ కరుణాతిశయమున నా దారుణ రహస్యము తప్పక బయల్పడును: కావున, జులేఖా జననీజనకుల కపాయము పొరయనేరదు."

దాల్తబను పాషా మగుడ నాలోచనాపరుఁ డాయెను. అవకాశము చిక్కుటచేఁ బ్రణయానిలప్రచలితులగు నా యువతీయువకులు గుస గుస లాడిరి. పాషా యిట్టు లనెను —

"ఆర్యా! మహత్తరవిషయముల గుఱించి సావకాశముగా విచారింపవలయు: మహూర్తమాత్రమున విషయనిర్ధారణ మొనరించుట నే నెఱుంగను. నీ వొసంగు నుపాయము చూచుట కెంతయు సమంజసముగ నున్నది. ఈ గ్రీకు యువకుల సమాచారము లరయుటకుఁ జారుల నంపినగాని యథాస్థితి తెలియనేరదు. చారుల నంపినచో, నే ననుమతించినట్టులే యగును. కాని, అట్టి నిశ్చితాభిప్రాయము నా కింకను ఏర్పడలేదు. ఇఁక, నీ విషయ మన్ననో! నీ ముద్రికారహస్యము తెలిసిన గాని మన మేకాభిప్రాయబద్ధులము కాఁజాలము."

"మహనీయా! తీవ్రపడి కార్యాచరణమునకుఁ గడంగనేల? మఱి యిరువదినాలుగు గంటలు కానిమ్ము. అపుడు నీ హృదయాభిప్రాయ మెఱింగింపనగును. ఆ విషయ మెటులున్నను, రేపు సాయంకాలము మాత్ర మత్యంతానందకరంబగు నొక యపూర్వకథ వినిపింతును." పాషా సహజముగ కఠిన గంభీరవదనుఁ డయ్యు మందహాస మొనరించి, యిట్టు లనెను —

"మిత్రమా! నీ యభిప్రాయముల సాధించుటయందు నీకుఁ గల నేర్పు నిరుపమానము. నీ మాట త్రోసివేయఁజాలను. మఱి యిరువది నాలుగు గంటలు మీరు నా యాతిథ్యము స్వీకరింపుఁడు. బంధితుల వలెనే యుండవలయు సుడీ!"

ఖలీలు కాదనఁజాలక సమ్మతించెను. అనురాగకందళిత హృదయు

లగు గ్రీకు మిత్రులును వారి కాంతలును కరము సంతోషించి, పరస్పర ప్రణయ మధుర సంభాషణా సుఖోన్మీలిత హృదయు లైరి. అనంతర మా యువకులు తొల్లిఁటివలె వేర్వేరు మందిరములకుఁ బరిచారికా సహితముగాఁ బోయిరి.

ఒక్క విషయము గమనింపవలయును. ఉదయ మైనంత నే ఖలీలుఁడు రహస్యద్వార మడఁగియుండిన గోడను బూర్తిగఁ బరిశీలించి, తన మిత్రుఁడగు జూలియను శయనించిన శయ్యాగారమున కమరియున్న మరతలుపు కనిపట్టఁ జాలెను.

ఐనను, ఖలీలుఁడు తన మందిరము చొచ్చిన పిమ్మట తన మిత్రుని శయ్యాగారమునకుఁ బోలేదు: పోఁ బ్రయత్నింపలేదు. ఆలోచనాపరుఁడై, యా తురుష్క వీరుఁడు పలకో నిరీక్షించుచుండెను. అంత నెవ్వరో యా మందిరకవాటము మెల్లగఁదట్టిరి. పాషాభార్య యొసంగిన తాళ మాతని యధీనముననే యుండుటచే నాతఁడు రయమునఁ బోయి తత్సాహాయ్యమున సుళువుగఁ దలుపు తెఱచెను. తురుష్కుఁ డెవ్వతె కొఱకు వేచియుండెనో, ఆ పరిచారిక, నిజాధికారిణీ మానసోల్లాసిని, సంధానకర్త్రి అమీనాయే గోచరించి, యిట్లు లనెను —

" అయ్యా! ఈ రేయి పాషా తనభార్య శయ్యాగారమునకు రాఁడు. అదృష్టము! మా యేలికసాని నీ రాకకై మిగులఁ దత్తరపడుచున్నది. రయమున దయచేయుము."

ఖలీలుఁడు మందహాస మొనరించి, ఒక సువర్ణటంకము నాకాంత కరంబునఁ బడవైచి, అంతటి మహోపకార మొనరించు తారుపుగత్తె యెడ దానెంతయుఁ గృతజ్ఞుఁడై యుండినట్లు భ్రమఁగొల్పి, ఆ వృద్ధురాలి వెంటఁబోయెను.

నిరపాయముగ, నిశ్శబ్దముగ వారు క్రమముగా నిస్త్రిడ్జ్ఞాసతీమణి మందిరశ్రేణి సమీపించిరి. అమీనాతత్సమయోచితముగా వెనుదిరిగెను.

ఖలీబుఁడు మగుడ నాస్వర్గసన్నిభమందిరాంతర్గతుఁ డాయెను.

నిరుపమ సౌందర్య విభాసితయగు, తురుష్కప్రభుభార్య నేఁటి రేయి మనోహరతర వసనధారిణి యాయెను. ప్రసిద్ధతురుష్క నారీజన సహజములగు రుచిరాంబరములు వీడి, ప్రసిద్ధప్రౌఢ పాశ్చాత్యనారీజనోచిత మేల్వలువల ధరించి యుండెను. అంగవస్త్రము సుందరముగ నేలపై బొరలాడు చుండెను. ఆ మనోహరదుకూలము లా మోహనాంగి సహజరూపవైభవము నధికతరముగ నతిశయింపఁ జేయుచుండెను. ఆ కోమలి కుటిలస్వర్ణ కుంతలములు ధవళధవళములగు పొంగారు భుజములపై నందమొప్పఁ బడియుండెను. నిగనిగలాడు ముంగురులు రెండును మూఁడు మాత్రము వైభవ నిలయములగు నామెయూరి వక్షమున చనుగుబ్బలను మనోహరముగఁ జుంబించుచుండెను. సునీలవిభ్రమ తేజఃపుంజములగు నా దొరసాని నయనములు బేడిసల నీసడించుచు, మోహార్ణవమునఁ బరిభ్రమించుచుండెను. మనోహర తరంబుగ దిండులపై సగము వ్రాలియున్న ఆ నవమోహనాంగి నారీజన విముఖుండగు నిస్సంగునైనను గామాయత్తచిత్తు నొనరింపఁజాలి యుండెను.

తన్ను డాయఁబోవు నా మోహనాకారుం దిలకించి యా మోహనాంగి యిట్టు లనెను—

"సుందరాంగా! మాటతప్పక ఇందుండ నవకాశము చిక్కించికొంటివి: నాచెంత కరుదెంచితివి! నా భాగ్యము!"

ఖలీబుఁడు మందహాస మొనరించి, మధురముగ నిట్టు లనెను—

"సుందరీ! ఒకక్షణమైన నాలసింపక, నీయాజ్ఞ నాదల ధరించి రయంబున నేతెంచితి. కాని, నిన్న సాయంకాలమునుండి యింతదనుక పాపా ఈక్రీడామందిరమున కరుదేర లేదుగదా."

తురుష్క యువకునిఁ దనప్రక్క నాసీను నొనరించి యాసుందరి దరహాసితాననయై, "నీ వెట్లు గ్రహించితి?" వని ప్రశ్నించెను.

"గ్రహించుట కేమున్నది! హాహా యింకను విచ్చేసి యుండెనేని తాఁ బ్రమాదవశమున మఱచిన యీ కృపాణము రయమునఁ గొని యుండఁడా?"

ఖలీలుఁ డట్లు పలుకుచు నాశస్త్రము చేఁబూని, అద్దానిం బరీక్షింపఁ దొడంగెను. ప్రభుభార్య యంత నిజబాహువల్లరి నల్లనఁ దన ప్రియుని కంఠమున వైచి యిట్టులనెను —

"మనోహరా! మదీయభాగ్యవశంబున సముద్బద్ధుఁడవై యరుదెంచితివి!"

"కాంతా! ఏమందును! ఎంత నిరీక్షించినను, ఎంత ప్రయత్నించినను, అవకాశము చిక్క—"

ఖలీలుఁ డట్టి దైన్యాలాపముల, దైన్యముగఁ బలుకుచుండ, నా భోగవతి తదవసరజనిత నిర్వేదము భరింపఁజాలక, ప్రకంపితగాత్రయై, ఉద్విగ్నస్వరంబున నిట్టు లనెను —

"ఆహా! ఆ గయ్యాళి జులేఖా యింకను నీవు తనవాఁడవేయని భావించుఁగా? అబ్బా! దుస్సహమే!"

"కాంతామణీ! కొందల మందకుము. మాటాడుట కవకాశము లేకపోయెఁగాని, మదీయవిరసప్రవర్తనముచే మదభిప్రాయము తెలియఁ బఱచితి."

"ఆహా! అట్లు పలుకుము! నిక్కువమేగదా? సందేహము లేదు గదా!" ఆ మోహనాంగి హృదయ ముప్పొంగెను: సహజసుందరాననము వికాసవంతమై, దరహాసవిరాజితమైయొప్ప, మగుడ నిట్టులనెను — "సుందరుఁడా! నీ యమృతంపుఁ బలుకులచే నాకు శ్రవణపర్వమాయెను. కాని, లేనియాశ కల్పించి, నన్ను వంచింపవుగద! —"

తురుష్కుని వదన మెఱ్ఱబాఱెను. చేఁ జిక్కిన ఆ నవమోహనాంగుఁడు తన సంశయాలాపములకుఁ గినిసెనేమో యని వెఱచి, ఆ

బింబాధర విస్రస్తురాలై యిట్టు లనెను —

"ఖలీలుఁడా! అలుక వహింపకుము. మనోహరనిలయమగు భవదీయ సుందరాననమున కాగ్రహకళంక మాపాదింపఁ దగదు. సుందరాంగా! నిన్నుఁ గాంచి నేనెంత గాఢవిమోహపరవశనైతినో నీ వెఱుంగవు. నేఁ డెల్ల నిన్నే దలంచుచుంటి. భవదీయచారుతర మోహనాకారము నా హృదయఫలకమున నాటిపోయెను. ఒక్కక్షణమైన నిన్ను మఱచి యెఱుంగను. మఱవఁజాల. సుందరుఁడా! తొలుదొల్త నీ చిత్తము హరించిన యాకుసుమకోమలి జులేఖాను దలంచి మత్సర మూనుదునేని, నీ వన్యథా తలంపక మన్నింపవలయు!"

"సుందరీ! ఇంతటి దైన్యమేల? ఇంత మాత్రమున నేను వేఱువిధంబునఁ జింతింతునని భ్రమింపకుము. కాని, నా మాట గమనింపుము. జులేఖాకు నా హృదయ పరివర్తనము నెఱుక పరచి తత్ప్రణయ శృంఖలవిముక్తుఁడఁ గావలయునని ఎంతయుఁ బ్రయత్నించితి. కాని, పాపా నా కట్టి యవకాశ మొసంగఁ డాయెను. ఒక్కక్షణమైనఁ గదలక ప్రభు వా కన్నియచెంత స్థాణువు వలె నాసీనుఁడై యుండెను. ఇంత మాత్రమున మించిపోయిన దేమియు లేదు. ఉపాయముచే మఱియొకదిన మిందు మిత్రసహితముగా నుండుట కనుజ్ఞవడసితి. ప్రేయసీ! నీవొనరింపవలసిన కార్యమెద్దియన, రేపు సాయంకాలము సమయము కనిపట్టి మేము సభతీర్చియుండు స్థలంబున కరుదెంచి, నీప్రావీణ్యమున మేము మఱియొక దిన మిందుండునటు లొనరింపుము. మన యభీష్టము తప్పక సిద్ధించును."

"అసాధ్యము! నాకును నా మగనిపుత్రికలకును అన్యోన్య ప్రేమానురాగములు లేవు. వారు నామందిరము త్రొక్కరు. వారి మందిరమునకు నేఁ బోఁజాలను."

"వినను, రేపొక్కసారి మాత్రము పంతము పాటింపక, రావలయు.

ప్రేయసీ! నీ వట్టి ప్రయత్న మొనరింపవేని, మేమిఁక నిందు విడిసి యుండుట కవకాశముండదు. అయ్యది నీకు సులభసాధ్యము."

"నే నేమి చేయవలయునో నీవే ఉపదేశింపుము."

ఎల్లి ప్రొద్దు గ్రుంకునపుడు, నేను మఱియొక కథ వినిపింతును. ఒకటి గంటకు నా కథ ముగియును. కథముగియు సమయమున నీ వరుదెంచవలయు. కథాశ్రవణ కుతూహలమున నే నే తెంచితిననియు, కథ తోడనే సమాప్తియగుటచే నుత్సాహభంగమాయెననియు, ఒక్క కథయైన నాలించుట కవకాశ మొసంగవలయుననియు నీవు పాషాను నర్థింపుము. దాన మనకెంతయు శుభంబు చేకూఱు. మనోహారిణీ! ఇట్టి నిరపాయకృత్రిమవ్యాపారమునకుఁ గడంగెదవా?"

"ప్రాణప్రియా! తప్పక కడంగెద! ఎట్లు కడంగకుందును?"

మోహాంధకార నిర్మగ్నయై అన్యమెఱుంగని ఆమదవతి ఆ తెఱంగున పడిపడి బలుకుచు, నవిరళ మోహాతిరేకమున నాసుప్రసన్న ముకుమార సుందర తురుష్కయువకుని రయమున గాఢాలింగన మొనరించెను. ఖలీలుఁ డిట్టులనను —

"సుందరీ! నాకట్టి యనుమానము లేదు. ఐనను, ప్రాణేశ్వరీ! నే నింకను, నీవాఁడఁగాను గదా. రేపు ముందుగనే, యొక చీటి వ్రాసి, సిద్ధముగ నుంచెద. సాయంకాల సమావేశావసరమున నవకాశము చిక్కినా, జులేఖాకు, నా హృదయావస్థ నెఱింగించెద. లేదేని, ఎట్టులైన నా లేఖ నందిచ్చెదను. అనంతరము మనము —"

"నిరంతర భోగార్ణవతరంగ డోలికల నుయ్యాల లూఁగఁగలము! ప్రాణప్రియా! కొఱమాలిన ఇతర విషయములఁ దలంపక, సర్వశక్తియుతానంగదైవ చరణకమల సేవాపరాయణులమై, ధన్యులమై, సార్థక జన్ములమై హాయిగ నుందువారము!"

తదమందపారవశ్యమున నమ్మత్తకాశిని నిజ భుజపంజర బంధితే

సుందరాంగిని గాఢ కౌఁగిలింపఁ బులకరించి, యానందానంద నిర్మగ్నయై, మోసపుచ్చబడియుండె అమీనా సంభ్రమకంపిత వికార వదనయై దిగ్గున లేచి, ప్రకంపితస్వరమున నిట్టులఁ బలికెను —

" పాషా ! — పాషా వచ్చుచున్నాఁడు ! — వెలుపటి మందిరద్వార తాళము తిరుగుట విని వచ్చితిని ! "

తోడనే, ఇస్మిల్లాఖలీలులు దిగ్గున లేచిరి. యువకుఁడు చెంతనున్న కృపాణము తక్షణము ధరించెను. ఉన్మాదినివలె నమీనా యిట్లు లఱచెను — " దేవి ! ఏల యీ కాలయాపనము ? తొందరగ రయమునఁ బాఱవలయు ! "

" పాఱవలయునా ! ఎటు ? వలదు, వలదు. ఇందెందో దాచియుంచవలయు ! " అట్లుపలుకు ప్రభుపత్నివదనము నిరాశోద్భూత భయాధీనమాయెను.

" దేవీ ! దాచుటయా ! అసంభవము! ఒక్కక్షణమైనఁ దడయక, అటు పాఱవలయును ! " అట్లు పలుకు దాసి వడంకుచు, మొగమలు తెరచూపెను.

" అందుఁబోవలయునా ? " యని ఇస్మిల్లా విహ్వలచిత్తయై యఱచెను. భయాతిరేకమున నాసుందరాంగి హిమసన్నిభగాత్రయాయెను.

" దేవీ ! దేవీ ! ఇంత యవివేకమా ? మఱియొక క్షణమాలసింతుమేని మనము మువ్వురముఁ గూడ బాస్ఫరనదీ గర్భస్థులమగుదుము ! "

ఉపాయాంతరము కానరామి, ప్రభురాణి ఇయ్యకొనెను. ఒక్క నిమిషము పాషాను వారించి యుంచుటకై అమీనా వెడలెను. ఇస్మిల్లా దారి చూపు, ఖలీలుఁ డాత్రోవంబోయెను.

౧౦

ఖలీలుఁ డించుకేనియుఁ జలింపక ఆ గడప దాటిపోయెను. నీలజీమూతసన్నిభభయంకర దీర్ఘకాయుఁ డా రహస్యమార్గమునఁ గాపలియుండు

నని గతనిశాసంచరణమున నెఱింగియు, నా ధీరస్వాంతుఁడు సరకుఁ జేయకపోయెను. వెనుకటి రాత్రి తురుష్కుఁడు నిరాయుధుఁడగుటచే, నసహాయుఁడై యుండెను. కాని, ఈ సమయమున పాషా కృపాణము చేఁజిక్కుటచే, నాతఁడు నిర్భయముగా నుండెను.

ఖలీలుఁడు ద్వారము నతిక్రమించినంతనే, ఇస్మిల్లాసతి రయమునఁ దలుపువైచెను. ఆమార్గము తురుష్కుఁడు వెనుకటి రేయి కాంచినదే. అప్పటి యట్టులే, ఇప్పుడును దీపము గ్రుడ్డిగ్రుడ్డిగా వెలుఁగుచుండెను. ఖలీలుఁడు కొంతదవ్వరిగినంతనే, ఎవ్వరో నడచుచుండినట్లు అలికిడిఆయెను. మనవీరుఁడు పరికించుచుండగనే, తళతళలాడు దీర్ఘకరవాలము ధరించిన తాళవృక్షసన్నిభ భీకరమూర్తి — పాషా బానిసీఁడు కాన్పించెను. తురుష్కయువకుఁడు నిశ్చలచిత్తుఁడై రయమున వానిని డాసి, యిట్టులనెను —

" ఓయీ పరిచారకా ! నే నీ స్థలమునకే తేరవలసిన పరిస్థితులు నీ వెఱింగియే యుందువని భావింతును."

ఆ బానిస ఖలీలు నెన్నఁడు జూచి యెఱుంగఁడు. కావున, నాకస్మికముగ గోచరించిన ఆ వీరుని నిరుపమాన ధైర్యగాంభీర్యములఁగాంచి, విస్మయాక్రాంతుఁడగుటచేతనో, ఒకింత భయభ్రాంతుఁడగుటచేతనో ఆ బానిసీఁడు చకితుఁడై యాతనినట్టె తిలకించెను: ఆ భటునికరవాలము మెల్లగ దిగజారెను: కడువినయముగ, దైన్యముగ నేమియో సమాధాన మొసంగుటకుఁ గూడ వాఁడు సంసిద్ధుఁడాయెను. అంతలో నా కాపరి తెలివొంది, సహజమగు మొఱకుఁదనము వహించి యిట్లనెను -

"నేను బానిసను. అధికారుల చర్యలతో నాకుఁ బనియేమి?"

"ఇతరులకు వలెనే బానిసకు సహితము జ్ఞానముండును."

"బానిసీనికి జ్ఞానము సహజముగా నుండవచ్చును. ఐనను నిరర్థకము. ప్రాణశనేర్చినది మొదలు, దాస్యమొనరించుటయే అభ్యాసమగుటచే

వాని తెలివితేటలు క్షీణించును. స్వతంత్రముగా వినియోగించు నవ కాశము లేకుండుటచే, వాని పూర్వసహజ [illegible] దేఁబడును. కాన, దాసుఁడు స్వాతంత్ర్య విరహితుఁడగుటచే, వాని జ్ఞానమును జట్టుపడియుండును.

"ఓహోహో! మత ప్రసక్త శోకుఁడ! నీవు అప్రాజ్ఞుని భావతునివలెఁ బ్రసంగించుచుంటివి. నీకు భావస్వాతంత్ర్యము లేదని యెవ్వరనఁ గలరు? ఓయీ! నీకును నాకును ఎంతటి యంతరమున్నను, నా పలుకుల విశ్వసింపుము. మిత్రమా! నీతోడి పరిచయము నా కెంతయు సంతోషకరము."

వానితో నా తెలుఁగున నెవ్వఁడు మున్నెన్నఁడు సంభాషించి యుండకపోవుటచేతనో, లేక, తురుష్కుఁడట్లు ప్రసంగించుటకెద్దియేని నిగూఢ కారణముండునని యో, కాని, ఆ కృష్ణవర్ణ వాయువకుని నాశ్చర్యముగాఁ దిలకించెను. ఐనను, ఖలీలుని చిత్తము వాని కవగతము కాలేదు. అంత తురుష్కుఁడు మగుడ నిట్టులనెను —

"నీవంటి రక్షకుఁడుండునది విపరీతస్థలము కావలయు."

అంత నారక్కసుఁడు సహజకరాళ వికృతవదనుఁడై, ఉపాలంభ గర్భముగా నిట్టులనెను —

"నేనిందుఁ గావలియుండుట కొక రహస్యకారణ ముండిన నుండుఁ గాక. ఆ రహస్య మరయఁగోరు నపరిచితుఁడు విపరీతమానవుఁడు కావలయును."

"ఈ స్వామియగు దాల్తబను పాషాయొక్క యతిథిని; గాన, నేను కేవల మపరిచితుఁడఁ గానని యెఱుంగుము."

"అట్టులే కావచ్చును. నాకేమియుఁ బ్రసక్తి లేదు. నా వ్యాపార ముతో నీకును బనిలేదు. అయ్యా! మీరీప్రదేశమునుండి యావలకుఁ బోఁ జూతురని భావింతును, కావున, మార్గము చూపెద, దయ చేయుఁడు. నీవు సద్వంశజుఁడవు కావున, నేను ముందఱఁ బోరాదు; పిఱుంద నడచుచునే, త్రోవ చూపఁగలను, దయచేయుము."

“మిత్రమా ! [illegible] కాదు, నిన్ను ప్రశ్నించుట ప్రాప్తి కానిమ్ము. ఈ [illegible] గాంచి యుండుటచే నీవని కావలయు. ఇది [illegible]. కాని, నీవు [illegible] కాదికొని యుందువా ? లేక, నావలెనే కారణాంతరమున [illegible] మందిరమునం జిక్కి [illegible] సాగనంపుటకే యిం [illegible] ?”

ఖలీలుం డట్లు ప్రశ్నించుటచే, నా సిగ్గి విస్మయ భయభ్రాంతయుతుండై యాతని సన్నె తిలకించెను. [illegible] వీరుని నిశ్చలతా గాంభీర్యముం గాంచి నాం [illegible] చకితుం డాయెను. నాలుగు నిమిషములట్లు లూరకుండి, [illegible] యిట్లనెను —

“అయ్యా ! [illegible] సంరక్షింతుంగాక, నే నావిషయము మెఱింగింతునా ! నిన్ను నేనెఱుంగనే!”

“మిత్రమా ! అట్టివిషయము నేనేల ప్రశ్నింతును ? మఱియు, నన్నుం దిలకింపుము: ధనాశాపరుండనై చౌర్యమునకుం గడంగు దౌర్భాగ్యునివలె గోచరింతునా?”

నీగ్రో క్రోధఘూర్ణితుండై యిట్లనెను —

“గోచరింపక పోవచ్చును. అట్లుగాక, ఇస్మిల్లా ప్రభ్వి సదుపాయ మరయుటకే యిందుంటి ననుకొనుము. ప్రభురాణి శయ్యామందిరము నుండి నీ విప్పుడే యరుదెంచితివి. అట్టినీవు నాతో నీ విషయము నింత లాఘవముగాం బ్రసంగించుట యోగ్యమా?”

“ఓయీ మనము మనసు విచ్చి మాటాడు నపుడు, దొసంగేమి? అయోగ్యత లేదు, ద్రోహము లేదు. గమనింపుము ! ఈ యిస్మిల్లా ప్రభ్వి సతీజనసహజానురాగ మెఱుంగ...”

“అయ్యా ! గమనింపుము. పాపాభార్య చేయు వ్యాపారమున నప్పుడప్పుడు తోడ్పడుదు ననని గూడ ననుకొనుము. కాని, నీ వీస్తల

మున నిట్లు నిలిచియుండుట క్షేమకరమా యని, ఏల విచారింపవు? నేను జాగరూకతతో గావలి యుంటినా లేదా యని అరయుటకై, పాషా ఏక్షణమైన నరుదేరవచ్చును!"

"ఏమీ! రేయి యెల్ల నీవు జాగర మొనరింపవలయునా?"

"ప్రాణములపై నాశయున్నచో, నిద్రింపరాదు."

"అటులనా? నేనొక్క-మాటాడినఁ జాలు, నీకంఠము పాశబద్ధమగును. నిన్నటిరేయి నీవు నీగదియందు నిద్రించియుంటివి!"

"అబద్ధము! అయ్యో, వట్టి యబద్ధము! ఇంత దారుణమా!"

నీగ్రోసేనకుఁడు దుర్భరాగ్రహావరవశుఁడై, క్రోధాతిరేకమునఁ బైకిదుముకఁ జూచు మహిషమువలెఁ గాన్పించెను. ఖలీలుఁడు సహజస్థైర్యధుర్యుఁడై యిట్టులనెను —

"అబద్ధ మావంతయు లేదు. నీవు మధురనసౌఖ్యము ననుభవించి ఒడలెఱుంగక పడియుంటివి. నీ శిరస్సు గోడచెంత నుండెను. పాదములు నీగదిద్వారపు నుండెను. ఖడ్గము వీడి నీప్రక్క నుండెను. తలుపు తెఱచియే యుండెను. ఇనుపదీపపుఁ గిరణములు నీ ముఖమునఁ బడుచుండెను."

ఆ నీగ్రోవాఁడు వెఱ్ఱివాని పగదిఁ గొన్నినిముసములు మాటాడనేరక, ఖలీలునట్టె తిలకించెను. తుదకు మానసము భయాగ్రహములచేఁ గలంగ, మేనుకంపింప వికృతస్వరమున వాఁడిట్లు ప్రశ్నించెను —

"కాని నీకిట్లు తెలియవచ్చెనా?"

"అదంతయు నీకేల? నేనిచటకే తెంచియుంటినని గ్రహింతువా?"

"నీ విచట నెంత శీఘ్రముగఁ బోయిన నంతమేలు. పాషా యిటు వచ్చి చాల కాలమాయెను. ఏముహూర్తమున నరుదెంచునో యెఱుంగరాదు. వచ్చిన నిప్పుడే రావచ్చును. కావున, ఒక్కక్షణమైన నిచ

నాలసింపక వెడలుట క్షేమకరము. అయ్యా! దయచేయుఁడు; నేను వెనువెంటనే యరుదెంతును; ఒక్కనిమిషములో బైటఁ బడవచ్చును."

"మార్గదర్శకుఁడు వెనుకనుండిన ప్రయోజనమేమి? నీవు ముందు నడువుము."

నీగ్రో భ్రమాన్వుఁడై, యమిత విస్మయానుమానమయ వీక్షణమునఁ దురుష్కవీరుని విలోకించి, రయమునఁ దెలివినొంది, మెల్లగ ముందుకు నడువసాగెను. ఖలీలుఁడు వాని వెనువెంటనే పోవుచుండెను. వారు ద్వారము నతిక్రమించి, రాతిమెట్టు లల్లన దిగిరి. దీపము వారి వెనుక నుండుటచే, వారి ఛాయలు గోడపైఁ బడెను. బానిసీఁడు నడచుచుండినను, ధ్యానము ఖలీలుమీఁదనే యుండెను. ఆతఁడెట్లు నడచుచుండెనో పరిశీలించుటకై, వానికండ్లు తురుష్కవీరుని ఛాయమీఁదనే యుండెను. ఆతని కత్తి ఒర యందే యుండెను. ఖలీలుఁడు సహజస్థైర్యముతో నడచుచుండెను. వాని నిర్వికారనిర్లక్ష్యగమనభంగిఁ గాంచి, నాతఁ డెద్దియేని దురభిప్రాయమూహించెనని గాని, అపాయ మెద్దియేని సంభవించునేమో యని వెఱచుచుండెనని గాని తోఁపకుండెను.

వారిరువురు సోపానములు డిగ్గి, ఱాతిపలకలు పఱచియున్న స్థలమున కేతెంచిరి. అందు నడుమ నొక కఱ్ఱతలుపు నేల కమరి యుండెఁ గదా. ముందరుగుచుండిన అతికాయుఁడా తలుపుం దన పాదమునఁ దాఁకెను. ఏ క్షణమున వాఁ డట్టు లొనరించెనో, తత్క్షణము సముద్యత్క్రోధావేశమున మహిషముపై లంఘించు సింగంబు చందమున, వనాంతరప్రదేశమున నిర్భయముగ సంచరించు మృగముపై వృక్షశాఖనుండి మెఱుపువలె వ్రాలి నిజదృఢభయంకరతనూవల్లరిచే భయావహముగ బంధించు నజగరమువలె, ఖలీలుఁడు వానిపై రయమున నుఱికెను. వాని ఖడ్గము దూరమునఁ బడెను. వాఁడో!

దుర్బలబాలికుని పగిది నా మహాయూదారు కవాటముపై విసురునఁ బడెను. నల్లని ఒండజాయిపోలెఁ బడియున్న యా భటుని గుండెపై బాదమూని, విద్యుద్దీపితకృపాణము రయమున నూడదీసి ఖలీలుఁడు వాని కంఠమునకుఁ జూపెను. ఆకస్మికముగ నేలంబడుటచేతనే, వాని మతి వికలమాయెను: చిచ్చఱపిడుగుం బోలిన ఖలీలుని నిరుపమాన జవసత్వములచే నా నీగ్రో నిశ్చైతన్యుఁ డగుటయే గాక, భయభ్రాంతుఁడై, దుర్బలుఁడై కేవల నిస్సహాయుఁ డాయెను. ఎట్టకేలకు వాఁడిట్టులు దైన్యముగఁ బ్రశ్నించెను. — "అయ్యా! ఏమిది? నీ యభిప్రాయమేమి?"

"నీ వొక విషయ మెఱింగింపవలయు —"

ఖలీలుఁ డేమియో చెప్పఁ బోవుచుండ నంతలో నాతఁడే తెంచిన ఇస్మైల్లా మందిరద్వారము తెరచిన శబ్దము వినవచ్చెను. నీగ్రో యత్యంత భయవిహ్వలుఁడై, ఉన్మాదునివలె మెల్లగ నిట్టు లఱచెను —

"పాషా యరుదెంచుచున్నాఁడు! లెమ్ము! లెమ్ము! ఆలసింప రాదు! —"

"అట్లైన, లెమ్ము! కాని, నా కపాయ మొనరింపఁ బ్రయత్నింతువా, ఈ కృపాణము నీ హృదయరక్తము నాస్వాదించును! భద్రము!"

ఖలీలుఁ డట్లు పలికి మెల్లగ లేచి రయమున నాలుగడుగులు వెనుకకు వైచి, సిద్దియొక్క కత్తిపై రెండు పాదములను మోపి మగుడ నిట్టులనెను — "ఈ విషయ మొక్క నూటవైనను పాషాకుఁ దెలియరాదు, పాషా భార్యకును దెలియరాదు. ఆమె యొకవేళ ప్రశ్నించినచో, నెద్దియేని సమాధాన మొసంగుము. ఈ రహస్య మెఱింగింతువేని, నీవు నిన్న నిద్రించిన రహస్యము బయలు పరచెదను, నీవు తత్క్షణము మరణ శిక్షకుఁ బాల్పడుదువు!"

పాషా యరుదెంచునను భయమున విశేషముగ నోరువిచ్చి

మాటాడుట కవకాశము లేకుండినను, ఆ తెలుంగున గుసగుసలాడి ఖలీలుఁ డా సిద్దికి వెఱపుఁగొలిపెను. ఒక్కక్షణమాయెను: అంతలో నడుగులు భారముగఁ బడుచుండిన సవ్వడి తెలియవచ్చెను. ఖలీఁలుఁడు హరిణ శాబకమువలె నొక్క త్రుటిలోఁ బాఱి, మలుపుతిరిగి తన మందిరమునకుఁ జూపు సోపానముల నారోహించి, గోడయం దమర్చి యుండిన రహస్యకవాటము, కీ లెత్తిగిన, కత్తబున సుళువుగా దెఱచి తన మందిరము చేరెను.

మందిరాంతర్గతుఁడై నంతనే, యాతురుష్కవీరుఁడు తొలుదొల్త పాషా కృపాణము నెవ్వరు జూడఁజాలని స్థలంబున దాఁచెను. ఉదయ మగు నంతనే పాషా భటులందు ప్రవేశింతురు:

ఆ యస్త్రము వారి కంటఁ బడునేని, అపాయము సంభవించును. కావుననే ఖలీలుఁ డట్లు లొనరించెను. అనంతర మా వీరుఁడు గత వృత్తాంతము తలంచికొని, నిద్రాపరుఁ డాయెను.

ఉదయమున మేల్కాంచి యాతఁ డిట్లు చింతించెను — "రాత్రి పాషా యరుదెంచినంతనే సిద్దీ రహస్యభంగ మొనరించెనేని, ఇఁక నా విషయము తెలియకపోదు. కాని, వాఁ డట్లు లొనరించియుండఁడు: ఒనరించినచో సహజక్రోధకలుషితాంతరంగుఁ డగు పాషా యింత కాలము సహించియుండునా? నన్ను భయంకర శిక్షానలదగ్ధు నొన రించుటకై రయంబున నరుదేలకుండునా? కాన, నసంభవము."

అంతలో నొకసేవకుఁ డరుదెంచి తొల్లిటి యాసనాగారమునకు ఖలీలునిఁ గొంపోయెను. మార్గమధ్యమునఁ జిరపరిచితయగు నమీనా పండ్లతట్ట తాల్చి వడివడి పోవుచుండెను. సంధానకార్య ప్రవీణ యగు నా వృద్ధకాంత మన తురుష్కవీరునిఁ గాంచినంతనే ప్రమాన్పడి, అడు గిడ నేరక, యట్టె నిలచిపోయి, వెఱ్ఱిదానివలె నాతని వీక్షింపఁ దొడం గెను. చేతనుండిన తట్ట జారి నేలఁబడెను, పండ్లు మార్గ మంతట దొర

లెను! ఏమియు నెఱుంగని పరిచారకుఁ డిట్టులనెను —

"ఏమిది, అమీనా! ఆకస్మికముగా వ్యాధి సంభవించెనా? లేక, మహమ్మదీయధర్మము మఱచి, నీరమువంటి చుఱియేమైన పాన మొనరించితివా?"

జగతాంగన బదులాడక, ఏమియో గొణఁగుచు, పడుగులిడిన ఫలములను జేరదీసి బుట్టయందుంచి తన దారిం బోయెను. వృద్ధపరిచారిక యట్టు లెబ్బెబ్బనుట సురాపాన మాహాత్మ్యమే కావలయునని యెంచి, ఖలీలు వెంట నుండిన సేవకుఁడు పకపక నవ్వెను. తురుష్కవీరుఁడా విషయము గాంచనట్లు సహజనిశ్చలగమనమునఁ బోయి, మిత్రులగు జూలియను లూకాసులు వేచియున్న మందిరముఁ బ్రవేశించెను. వెనుకటి దినము వలెనే నేఁడును మిత్రులు ముగ్గురుం గలసి పరస్పర సంభాషణము లొనరించుచు, వినోదాదులం గాలవిలంబన మొనరించుచు హాయిగ నుండిరి.

సాయంకాల మగునంతనే భటులరుదేఱ, వారు ముగ్గురును సర్వవస్తుసంభరితంబగు పాషాపుత్రికల మందిరమునకుఁ బోయిరి. బాల్తబను పాషా యొక్క మృదులతల్పమున దర్పమొప్ప నాసీనుఁడై ధూమపాన సౌఖ్య మనుభవించుచుండెను. తురుష్క ప్రభువు సుప్రసన్నుఁడై యుండెను. లూకాసు ఖలీలు జూలియనులు తమ తమ కాంతలచెంత నాసీనులైనను, ఆతఁడు వారింపఁ బ్రయత్నింపలేదు. తమ ప్రియసందర్శనమునకై నిరీక్షించుచుండిన ఆ పద్మముఖు లమందానంద పరవశలైరి. ప్రణయావేశమున వారు గుసగుసలాడఁ గడంగుచుండగనే, ఖలీలు నుద్దేశించి పాషా యిట్టు లనెను —

"వెనుకటి రెండు కథలను తృణీకరించు నొక యపూర్వకథ వినిపింతు నంటివి! కానిమ్ము."

ఖలీలుఁడు సిద్ధముగనే యుండెను. కావున, పాషా కోరినంతనే కథకుఁ దుపక్రమించెను.

నా కథ పదునాలుగవ శతాబ్దము నాఁటిది. బవేరియాదేశమునందలి ప్రాచ్యారణ్యమున 'సిరిబరుఁ' డను క్షేత్రకర్షకుఁడు తనకుఁ గల చిన్న పొలము సేద్య మొనరించుచు జీవించుచుండెను. వాని భార్య నిండు జవ్వనమున మరణించి, కర్షకుని దుఃఖసాగరమున ముంచివైచెను. వాని కిరువురు కుమారులు. మాతృవిహీనులగు నా బిడ్డలకుఁ దానే తల్లియుఁ, దండ్రియు నై వారి యాటపాటలకు మురియుచుఁ దన విచార మొకింత మఱచి, లేమి యెఱుఁగక అతఁడు సుఖజీవన మొనరించుచుండెను.

సిరిబరుని పెద్దకుమారునిపేరు 'కిరాళుఁడు'. కరాళుని సమున్నతాకారము, దృఢశరీరము, గౌరవ గంభీర లక్షణయుతవదనము, మనోహర శ్యామలనయనములును ప్రశంసనీయముగ నుండెను. వ్యాయామక్రీడలం దెల్లపుడు నాతఁడే ప్రప్రథమమున బహూకృతిఁ గాంచుచుండెను.

రెండవకుమారుఁడగు, 'శిశుమాను' యొక్క ఆకార స్వభావములు కేవలము భిన్నముగ నుండెను. వ్యాయామక్రీడలందు వాని కాసక్తి లేదు. వాని శరీరము కోమలమై, సుందరమై, చూచుట కెంతయు మనోహరముగ నుండెను. శిశుమానుని నీలవిశాలనయనము లాతఁడు శాంత స్వభావుఁడని తెల్పుచుండెను. తన యన్నవలె శరీరవ్యాయామము నభిలషింపక, సమయ మగునపుడెల్ల నాతఁడు గ్రంథపఠన మొనరించుచుండెను. సోదరుల స్వభావములు పరస్పర విరుద్ధము లయ్యు, వా రెన్నఁడుఁ గలహింపక, పరస్పరానురాగబద్ధులై యుండిరి. వారి జనకుని యానందమునకు మేరలేదు.

సిరిబరుని క్షేత్రము చెంత మఱియొక భార్యారహితుఁడు వాసము చేయుచుండెను. వాని పేరు 'హరిమణుఁడు'. వాఁడును వృద్ధుఁడే. వానికి 'మరీటా' యను నొక యపూర్వ సౌందర్యవతి యగు పుత్రిక

కలదు. సిరిబసుడును హారిమణుడును గూడఁ గ్రైస్తవులే. హారిమణుఁడు రణకుశలుఁడగుటచే యుద్ధములందుఁ బాల్గొని వలయు ధనసంపాదన మొనరించి, అందొక పాలు వెచ్చించి యొక సుక్షేత్రము వడసి, ప్రాణసమాన యగు తన పుత్రిక మరీటా శైశవక్రీడా వినోదములం గాంచుచు, హాయిగ నుండెను. ఆ కన్నియ పరమపదించిన తన భార్యరూపునే ఉండుటచే, నా వృద్ధుఁడు ప్రాణసమానముగఁ జూచికొనుచు హాయిగ నుండెను.

వృద్ధు లిద్దరు చిరస్మర స్నేహబద్ధులై యుండిరి. హారిమణుని పుత్రిక ఇరువదేండ్ల ప్రాయంపు పూర్ణయౌవనవతియైనను, ఇంకను వివాహము కాలేదు. హారిమణుఁడు తత్ప్రయత్న మొనరించినట్లైనను గానరాదు. కాని, ఆ ప్రదేశమునందలి జనులు మాత్రము సిరిబరుని పుత్రులలో నొకఁ డా కాంతను వివాహమాడునని యనుకొనుచుండిరి. కాని, ఏ పుత్రుఁడు ? మరీటా యిరువురి యెడలను సమానముగ నభిమానముతో, చనవుతో మెలంగుచుండెను. కరాళుఁడు వ్యాయామవిద్యా ప్రదర్శనమునం దుత్తీర్ణుఁడై బహుమానము గడించునపు డా కన్నియ మానసముప్పొంగుచుండెను. వాని సోదరుఁడగు శిశుమారు సహజకోమల మంజుల స్వరమున నొక గ్రామ్య విషాదగీతికఁ బాడునేని, యా ముద్దుగుమ్మ యశ్రుజలదీపిత యగుచుండెను. కాని, అట్టి సందిగ్ధము చిరకాల ముండఁజాలదు గదా.

ఒక సాయంకాలము సిరిబర హారిమణులు సుఖాసీనులై ప్రపంచ విషయముల గుఱించి కొంతతడవు ముచ్చటించిన పిమ్మట, హారిమణుఁ డిట్టు లనెను —

“ మిత్రమా ! మనము చిరకాలమునుండి యన్నదమ్ముల వలె మెలంగుచుంటిమి. భగవంతుని కృపచే మన కిరువురకును లేమికి వెఱువ నవసరము లేని సంపద కలదు. ఇరువురము వృద్ధులము. తనువులు

శాశ్వతములు కావు. ఏ క్షణమునఁ బరమాత్ముని యాజ్ఞ యగునో యెఱుంగరాదు. కావున, మన మింకఁ గాలహరణ మొనరింపక వియ్యమందుట వాంఛనీయము గదా. ”

సిరిబరుఁడు సాభిప్రాయముగాఁ గరస్పర్శన మొనరించి, యిట్లు బదులాడెను —

“ మిత్రమా! నీ యభిప్రాయము సమంజసము. కరాళుఁడు నీపుత్రికను ప్రేమించి యున్నవాఁడు. వయసున నొక సంవత్సర మధికుఁడు. కావున, వారు పరస్పరము తగియున్నవారు. ”

“ నా కెంతయు సంతోషకరము, ఈ శుభకార్యము, నెల తిరిగి ఈ దిన మరుదెంచుసంతనే, యగుగాక. ”

వృద్ధమిత్రు లపరిమితానందభరితులై, తదుత్సాహమునఁ గడు పార మధురసముఁ గ్రోలి తమ యభిప్రాయము దృఢపఱచికొనిరి. ఆ విషయము జనకుఁ డెఱింగించినంతనే, మరీటా సుందరాననము లజ్జచే నెఱ్ఱవాఱెను: ఆసుందరి యప్రయత్న మందహాస విరాజితమై సాభిప్రాయముగా మిన్నకుండెను. ఆ సమాచార మెఱింగినంతనే, కరాళుఁ డానందపరవశుఁ డాయెను.

కరాళుని సోదరుఁడగు శినుమాను గూడ మరీటాను ప్రేమించెను. కాని, పదునెనిమిదేండ్ల ప్రాయంపు బాలుఁ డగుటచే, తత్ప్రభావము నాతఁడు పూర్తిగ గుర్తింప నేరకపోయెను. కరాళ మరీటాల వివాహము నిశ్చయమాయెనని వినినంతనే, యాతఁడుప్రబోధితుఁ డాయెను. తన హృదయావస్థ వాని కపుడు వ్యక్తమాయెను. వాని మనోవ్యథ వర్ణనాతీతముగ నుండెను. ఐనను, ఆ దురదృష్టవంతుఁడు తన దుఃఖము దిగమ్రింగి, లేని ధైర్యము వహించియుండెను. కావుననే, వాని చిత్తక్షోభ మఱియు నధికముగ నుండెను.

ఆ మఱునాఁ డుదయమున నా ప్రాంతపు జమీందారుఁడు —

' గిరీషు ' అను పేరు గలవాఁడు — వాహ్యాళి వెడలి, యలసి, దాహా
ర్తుఁడై, సిరిబసుని గృహము చెంత నిలిచెను. అచట నున్న శిశు
మారు వినయ గౌరవ పురస్సరముగా నామహనీయునకు సుస్వాగత
మొసంగి, ప్రశస్తమధురస మొసంగి యాతని మానసమున కుల్లా
సము గొల్పెను. గిరీషు జమీందారుఁ డాయువకుని సూక్ష్మరేఖలను
వినయ ప్రవర్తనమును గాంచి, సంతసించి, వాని జనకు నుద్దేశించి
యిట్టులనెను- " సిరిబసూ! నీయాతిథ్యము నాకెంతయుఁ బ్రీతికరము.
కాని, నీ నొక్కవిషయ మడుగఁ దలంచితి. ఈ బాలుఁడు శిశు
మారు నా గృహమున నుండఁ దగినవాఁడు. వీనిని నా ప్రధానపరి
చారకునిగా గ్రహింతును. నీ వడ్డు చెప్పక సమ్మతింపుము."

శిశుమారు కడుంగడు ముదమంది, వెంటనే ఇయ్యకొనెను.
కారణమేమన, తాను ప్రేమించిన కాంత సోదరునకు భార్య కానై
యుండెను. చిచ్చువలె నయ్యది శిశుమారు చిత్తమును దహించి వేయు
చుండెను. నిజహృదయవేదన వ్యక్తము కాకుండనుండుట, మఱియు
బాధాకరముగ నుండెను. కావున నా యుదారవంతుఁడు దుఃఖభాజన
మగు నా ప్రదేశమునకు దవ్వున నుండుటయే మేలని తలంచెను.
కాని, వృద్ధుఁడగు సిరిబసుఁ డన్ననో, తద్వియోగము సహింపఁ
జాలక, వలదని ఎంతయు బ్రతిమాలి, తుదకు సమ్మతించెను. కరా
ళుఁడు గూడ మొదట విముఖుఁ డయ్యు, దాన తన సోదరునకు శుభ
మొదవునని యెంచి అంగీకరించెను.

శిశుమారు పరిచారకుఁడని నిరసింపక వానిని జమీందారుఁ డమిత
వాత్సల్యముతో నరయుచుండెను. వాఁ డొనరింపవలసిన పను లంతగ
లేవు. వానికి గ్రంథపఠనాసక్తి యధికము. జమీందారుని గృహము
నందుఁ బ్రశస్తమైన గ్రంథసముదాయముండెను. కావున, నట పని
యుండని సమయమున నా యువకుఁడు దేశచరిత్ర పుస్తకములు చదివి

యుద్ధప్రియుఁ డాయెను. మహమ్మదీయులతోఁ బోరాడ వలయునని వాఁడు తత్తరపడసాగెను. దైవికముగా నట్టి యువకాళి మరచి కాల మునునే యేతెంచెను.

శిసుమాను సేవకామ్నత్తిం జొచ్చిన మూడు వారములకు, రణదుందుభులు భయంకరముగ మ్రోగెను. ఆట్టోమను వంశజుఁ డగు తురుష్క సామ్రాట్టు ఉద్దండ యశోమండితుఁడై, యఖర్వ బల దర్ప సమగ్రుఁడై, యఖండ వైభవ సమన్వితుఁడై, క్రైస్తవ రాజన్యులకు భయకారణుఁడై యుండెను. ఆకారణమున యూరోపా దేశాధీశు లందఱు నొక్కటియై మహమ్మదీయునిపై దండెత్త సంసిద్ధులైరి. బవేరియా దేశస్థుఁడగు గిరీఫు జమీందారుఁడు గూడఁ దన యినాము భూముల ననుభవించు పరిజనులు రణమున కాయత్తము కావలయునని ప్రకటించెను. గృహమున నొకఁడు సమరసన్నద్ధుఁడు కావలసి యుండెను. సిరిబరుఁడు వృద్ధుఁ డగుటచే వాని జ్యేష్ఠ కుమారుఁడు సైనికుఁడు కావలయును. కాని, కరాళుఁడు తాను వలచిన మగువను వివాహమాడుట మాని యుద్ధమున కెట్లు పోఁగలఁడు? కాని, శిశుమాను సమరోత్సాహియై యుండుటచేఁ గరాళుని కష్టము గట్టెక్కెను. పుత్రవియోగము దుస్సహముగ నుండినను, సిరిబరుఁడు చేయునది లేక సమ్మతించి, తనయు నాశీర్వదించి యుద్ధమున కంపెను.

వివిధ క్రైస్తవ నాయకులు ముందుగ, 'వియన్నా' నగరమునఁ గూడి సంగ్రామ క్రమము గుఱించి చర్చించి, 'నిశపలాశి' అను మహమ్మదీయ నగరము ముట్టడింపవలయునని నిశ్చయించిరి. తోడనే క్రైస్తవ సైనికనికాయములు మహాసంరంభముతో వేర్వేఱు మార్గములనుండి గమ్యస్థానము చేరఁదొడంగెను. క్రమముగా నరువది వేల మహాసైన్యము కూడెను. క్రైస్తవులు బలదర్పితులై ముట్టడి ప్రారంభించిరి. నిశపలాశీ దుర్గపాలకుఁడగు 'తోఘనాభేగు'

అల్పసైన్యయుతుఁ డయ్యు, మహమ్మదీయ సుల్తానగు 'బయేజీఁడు' తప్పక యరుదెంచునని విశ్వసించి. నిరుపమాన శౌర్యముఁ దాల్చి వైరుల నరుమాడఁ గడంగెను. తమకు జయము నిశ్చయ మని భావించిన క్రైస్తవ నాయకులు గర్వించి, తమ విధ్యుక్త ధర్మముఁ దొఱంగి విషయలోలురైరి. మహమ్మదీయ దుర్గాధిపతి యగు తోఘనాబేగున కయ్యది మిగుల ననుకూలముగ నుండెను. క్రైస్తవ చమూపతులు భోగపరాయణు లగుటయేగాక, తురుష్క నృపాలుఁడు వట్టి పిఱికిపంద యనియు, తమ ప్రతాపమెఱింగి యాతఁడు తమ రాజధాని వీడుటకునైన సాహసింపఁజాలఁడనియు ప్రగల్భములు పలుకఁ జొచ్చిరి. ఒకవేళ మిన్ను విఱిగినను, తమ మహాసైన్య మొక మహానగరమువలె నిలిచి, ప్రపంచమున కపాయము వారయకుండ తన్మహాభారము వహింపవచ్చునని వారు బీరము లాడఁదొడంగిరి.

అంతలో వారి గూఢచారు లరుదెంచి తురుష్కసార్వభౌముఁడు మహాసైన్యసమేతుఁడై స్వయముగా నేతెంచుచుండెననియు, ఏడెనిమిది మైళ్ళదూరముననె కాచి యుంటిమనియు విన్నవించిరి. క్రైస్తవ సేనాని కుపితుఁడై అట్టి ప్రవాదములను గల్పించిన జనులను ఉరి తీయింతునని గర్జించి, నిర్భయముగా నుండెను.

క్రైస్తవు లాతెఱఁగున గర్వాంధులై యుండ బైజీదు సుల్తాను. నిజదుర్గసంరక్షణార్థము నిజముగనే యరుదెంచెను. దుర్గమున. కవ్వల నున్న మైదానమున తురుష్కసైన్యము విడిసెను. ఆవిషయము తెలియవచ్చినను క్రైస్తవుల దురహంకార మట్టులేయుండెను. ఉదయించిన భానుఁడు అపరమందిరమున విశ్రమింపక మున్నె, తురుష్క సుల్తానుం బట్టి బంధించి, రణరంగమున నీడ్చి తమ సర్వసైన్యాధ్యక్షుని శిబిరమునకుఁ గొంపోవలయునని పాశ్చాత్యసేనానులు నంకల్పించిరి. వారిలో ఫ్రెంచినాయకుల ఉత్సాహము మితిమీఱెను.

తా మొక్కరే రిపుసంహార మొనరించి, తురుష్కసుల్తానుం బట్టి యశము చూఱఁ గొనవలయునని తత్తఱ మొంది, అనుభవజ్ఞుఁడగు ప్రధానసేనాని హితోపదేశము సరకుసేయక, తమ వంటి దురహంకారస్వభావులు మఱికొందరు భళీయన, నా వీరులు నిజసైన్యవిభాగములు వెంట జనుదేఱ, సగర్వముగ రణదుందుభులు మ్రోగించి ససంరంభముగ బయలువెడలి, దురదృష్టవశమునఁ దమ సేనావాహినికి దవ్వుననుండు తురుష్కులను క్రూరముగఁ జక్కాడుచు బైజీదు సుల్తాను యొక్క సైన్యమును బిడుగువలెఁదాకిరి. ఫ్రెంచివీరు లమిత బలపరాక్రమసమన్వితులు: వారటు లాకస్మికముగ నెగిరివచ్చి పైఁ బడుదురని సుల్తాను ఎఱుంగఁడు. ప్రసిద్ధ నికపలాశీయుద్ధ మా తెఱంగునఁ బ్రారంభమాయెను. అమరులు సహితము నుతింపఁదగినట్లు ఫ్రెంచివీరులు విజృంభించి, తమ ప్రచండశౌర్యానలముచే విశాల రిపుజనకాంతారమును దహించివేయుచుండిరి. తురుష్కపదాతులు, అశ్వికులు తుదకు అజేయులగు జనీజరీలు సహితము నిలువఁజాలక, పాఱిరి: పాఱక నిలిచిన సైనికులు భయంకరవైరిజనక్రూరకరవాల ఖండితశరీరులై త్రెళ్ళిరి. ఆ తెఱంగున, పదివేలమంది తురుష్కులు ఆఁకొన్న రణదేవత కాహుతియైరి. ఫ్రెంచిసైనికులు సహజముగా సమితోత్సాహితస్వాంతులై, పలాయన మొనరించు బగతుర నిర్దయులై వెన్నాడిరి.

విజయాతురులై క్రిందుమీఁదరయక ఉన్మాదులవలెఁ బాఱు క్రైస్తవసైనికులు కొంత దవ్వరగినంతనే, ఒక చిన్న కొండవెనుక నలుబదివేల తురుష్కసైన్యము మఱియొకటి భయంకరముగ గోచరించెను! తురుష్క సార్వభౌముఁడు స్వయముగా శాసించు సేనావాహిని అయ్యదే. క్రైస్తవుల యవస్థ దుర్భరమై, దుస్సహమై, కేవలము వర్ణనాతీతమై యుండెను. పోరుట యసాధ్యము: పాఱుట మఱియు

నహాశ్వము. పాపము! ఆ పాశ్చాత్య సైనికులు ధైర్యముగఁ బోరాడియు, నౌకాభంగమున గభీరనీలజలరాశింబడు ప్రయాణికులవలె, దీపమున కెగిరెడు పురుగులవలె, దావానలమునఁ బడు మిడుతలవలె, దారుణముగ మరణించిరి. ఒక్క ఫ్రెంచి వీరుఁడును ఇరువదినలుగురు సైనికులును మాత్రము సప్రాణముగ రణభూమినుండి మఱలఁ జాలిరి.

అతిభయంకరమగు యుద్ధసమాచారము తెలిసినంతనే, నిశపలాశీ దుర్గముచుట్టుఁ బడిసియున్న మిగిలిన క్రైస్తవసైన్యమున హాహాకారములు చెలరేగెను. వారి యహంకారము మాయమాయెను. ధైర్య మంతరించెను. చాలమంది వీరులు తమ సహజధర్మము మఱచి, తమ సహజగుణము పెల్లుబుక, ప్రాణములు తీపగుటచే, రయమునఁ బలాయన మొనరించిరి. ప్రధానసేనాని మాత్రము తన పండ్రెండువేల సైన్యముతో వీరపురుషోచితముగ నిలిచెను. కాని, ప్రయోజన మేమి? తురుష్క సార్వభౌముఁడు సంపూర్ణవిజయము కాంచెను. క్రైస్తవ సర్వసైన్యాధిపతి చేయునది లేక పలాయన మొనరింపవలసిన వాఁ డాయెను. తురుష్కులు వ్యాఘ్రములవలె వారిని వెన్నాడి, పెక్కండ్రను సంహరించి, యంతకంటె నెక్కుడుమందిని బంధించిరి.

యుద్ధానంతరము బైజీదు సుల్తాను నిశపలాశీదుర్గము చెంత శిబిర మేర్పఱచికొని, రణభూమిపైఁ దిరుగుచుఁ బరికించెను. జయము చేకూఱినను, ముప్పదివేలమంది మహమ్మదీయ సైనికులు జీవరహితులై ధరాతలంబున వ్రాలియుండిరి. సుల్తాను దుర్దాంత క్రోధ వివశుఁడై, దారుణముగఁ గసి తీర్చికొనవలయునని ప్రతినపూనెను. ఉదయమైనంతనే, సుల్తాను క్రూరశాసనము ననుసరించి, ఘోరమగు నరవధ ప్రారంభమాయెను. యుద్ధమున మరణింపక, సమరభూమినుండి పలాయన మొనరింపనేరక పట్టువడి, శస్త్రహీనులై, అసహాయులై కేవలము జీవచ్ఛవంబుల భాతినుండిన క్రైస్తవసైనికులను మహమ్మ

దీయులు కఱకుగరవాలముల దెసనరకఁబోడఁగిరి. క్రైస్తవవీరులు, నాయకులు, జమీందారులుంగూడ నట్టులే నికృష్టముగ మరణించిరి. శిశు మాను, ప్రభువగు గిరీష్ప జమీందారుఁ డట్టులే ఘోరవధ పాలాయెను. సూర్యాస్తమయమగుసరికి పదివేల విచ్ఛిన్నక్రైస్తవ మృతకళేబరములు కడువికృతముగ వసుంధర నలకరించెను. దాన, సుల్తాను దురాగ్రహ మొకింత యుపశమింప, మంత్రులు, సైన్యాధిపతులు లోనగువారు దైన్యముగఁ బ్రార్థింప, నాతఁడు ప్రసన్నుఁడాయెను: భయానక నర మారణ మాగిపోయెను.

గిరీష్ప్రభువుతోఁ బాటు శిశుమానుగూడ బంధితుఁడాయెను గాని, ఇరువదేండ్లప్రాయము లేని బాలు లవధ్యులనెడు ఇస్లాము మత న్యాయము ననుసరించి, వాని ప్రాణములు దక్కెను. శిశుమానుతో బాటు రెండువేల క్రైస్తవసైనికులు దురంతనరవధానంతరము మిగిలి యుండిరి. వారందఱు మహమ్మదీయనాయకులకు బానిసలైరి.

శిశుమాను రిపుజనభయంకరంబగు జనీజరీసైన్యమునఁ జేరవలసిన వాఁడాయెను. ఈ సందర్భమున నా ప్రసిద్ధసైన్య మెట్లు నిర్మిత మాయెనో ఎఱింగించెదను. నిష్కళంక యశోవిరాజితంబగు నట్టో మను వంశావళియందలి రెండవసుల్తాను 'ఊర్ఖాను' కాలమున నియ్యది స్థాపితమాయెను. ఒకానొక యుద్ధమునఁ బెక్కుండ్రు క్రైస్తవ సైనికులు పాదుషాకుఁ జిక్కిరి. బలవంతులగు సైనికులను జంపు టయు, బానిసల నొనరించుటయు గూడ నవివేకమని యెంచి నాఁటి మంత్రి ఒక యపూర్వాలోచన చేసెను. క్రైస్తవసైనికులను మహ మ్మదీయమతస్థుల నొనరించి, యాతఁడు తమ పటాలములలో నొక టిగఁ జేర్చెను. మేధానిధియగు నా మంత్రిపుంగవుని ఉపాయమునం దొక గొప్పరహస్యము కలదు. మతభ్రష్టులకుఁ గ్రైస్తవులు మఱలఁ దావొసంగరు: తా వొసగకుండుటయే గాక, అట్టివారు

కంటఁబడునంతనే విధాయకముగాఁ బట్టి వధింతురు: కావున, నట్టి సంకరజాతిస్థసైనికులు, క్రైస్తవులతోఁ బోరాడునపుడు ప్రాణములపై నాసవీడి, చంపఁగలవారిని జంపి తమ శత్రువులతోడనే మరణింతురు. కాన, వారి సాహసపరాక్రమములు దశాధికములుగా నుండును. మఱి యొక విశేషమేమన, వారు స్వామిద్రోహ మొనరింపఁజాలరు. అట్టి సైన్యమునే 'జనీజరీ' సైన్యమందురు. అట్టి సాహసికులఁ దలంచిన యంతనే క్రైస్తవులు సహజముగా భయవిహ్వలు లగుదురుగదా.

ఆ తెలుఁగువాఁడు శివమూను తనమతము వీడి శాత్రవమతస్థుఁడు కావలసివచ్చెను. సైనిక విద్యాలయములో వలయుశిక్ష నడసి, వాఁడు జనీ జరీ సైన్యమునఁ జేరి, క్రమముగా నభివృద్ధిఁ గాంచెను. బంధుజన వియోగము, స్వమతవిసర్జనము, దుస్సహ నికృష్ట పరమతావలంబనము, మించి దుర్భరరిపుసేవాను భవములచే నాయువకుఁ డుత్సాహవిరహితుఁడై విచ్ఛిన్నహృదయుఁడునై కుందుచుఁ, దన దురవస్థం దన తండ్రి కెఱింగింపవలయునని ఎంతయో ప్రయత్నించెను. కాని, రెండేండ్లు కడచినను, అట్టి యవకాశము చిక్కలేదు: ఉత్తర మంపుటయు నసాధ్యమాయెను.

దారుణ నిశపలాశీ యుద్ధసమాచారము తెలిసినంతనే, వృద్ధుఁడగు సిరిబరుఁ డమితదుఃఖ పరవశుఁ డాయెను. తనయుఁడగు శివమూను సమాచారము తెలియకుండుటచే వాఁడును భయంకరరణరంగముననో లేక, తదనంతరము ఘాతుక వైరిజనకరాళకరవాలఘాతముననో, మరణించి యుండునని ఆవృద్ధుఁడు ఱాలు కరగునట్టు లేడ్చెను. అన్నయగు కరాళుఁడు గూడఁ దన్నకై రణరంగమున కేగిన గుణవంతునిఁ దలఁచి తలఁచి తీవ్రదుఃఖానలతప్తుఁడాయెను. ఐనను, వాఁడు భార్యాపరుఁడై, సుతలాభముఁ గాంచి, క్రమముగా సోదరవియోగము మఱచి పోయిగ నుండెను.

రెండు సంవత్సరములు గడచినంతనే, మఱల నొక క్రైస్తవ తురుష్క సంగరము ప్రారంభించెను. 'తిమరతు' పాషాయను ప్రసిద్ధ తురుష్కవీరుఁడు నాయకత్వము వహించెను. ఆ తురుష్కసైన్యము నందు శిశుమారను గూడ నుండెను. పదునైదువేల తురుష్క సైన్య మాకస్మికముగా క్రైస్తవదేశములపైఁబడి దోపిడీచేయుచు, నగరములను గ్రామములను దావానలమువలె భస్మీభూత మొనరించి, స్త్రీ పురుష బాల వృద్ధజనములను గనఁబడినంతనే తెగనఱకుచుఁ బ్రయాణ మొనర్పసాగెను. క్రైస్తవాన్వయమున హాహాకారము లుదయించెను.

తురుష్కులు తొలుదొల్త బవేరియా దేశముమీఁదనే పడుటచే, నా దేశస్థులే యాత్మసంరక్షణార్థము యుద్ధసన్నద్ధులు కావలసినవారైరి. పెనుభూతమువలె నవతరించిన వైరినిఁ దాఁకుటకై ప్రతి క్రైస్తవపురుషుఁడును ఆయుధము ధరించెను. మరీటా జనకుఁడగు హారిమణుఁడు మరణించెను. కరాళుఁడును, వృద్ధుఁడయ్యు సిరిబసుఁడును గూడ నాయుధపాణులైరి. ప్రఫుల్లముఖియు, ప్రసన్నచిత్తయు సౌందర్యరాశియు నగు నిజప్రియాంగనను వీడుట కరాళున కెంతయుఁ గష్టముగ నుండెను. ఐనను, దేశభక్తిపూరితుఁడగు నా యువకుఁడు పితృసహాయుఁడై రణరంగమున కేఁగెను.

కొన్నిదినములకుఁ, యుద్ధము ప్రారంభమాయెను. క్రైస్తవు లారంభమున నతిప్రశంసనీయముగ విజృంభించిరి: తురుష్కులు వెనుదిరిగి, మఱియొక ప్రదేశమున నిలువవలసినవారైరి. అంతఁ దిమరతుపాషా క్రోధోన్మత్తుఁడై, తగు ప్రతీకార మొనరించి యశోపార్జన మొనరింపవలయునని దారుణముగ సంకల్పించెను. మఱునాఁడు మగుడ సమరము ప్రారంభమాయెను. నాఁడు యువనవీరులు ప్రదర్శించిన ధైర్యపరాక్రమములు నిరుపమానములు, కేవలము వర్ణనాతీతములు. ప్రతి

సైనికులను మహావీరుని వోలె నాక్రమించి, శత్రుసంహారము గావించెను. మహమ్మదీయులు మహావిజయముం గాంచిరి. చావు తప్పిన క్రైస్తవులు పట్టుబడి బంధితులైరి. ఆ తెలుంగు దండ్రి, కుమారులగు సిరిబక కరాళులొక జనిజరీసైన్యవిభాగనాయకునకుఁ జిక్కిరి. సర్వసైన్యాధిపతియగు పాషా యాజ్ఞ ననుసరించి, చీటులువైచి క్రైస్తవదాస్యులను మునల్మానుసైనికులు పంచికొనిరి. ఎవరివంతునకు వచ్చిన వారిని ఆ తురుష్కసైనికులు స్వహస్తములతో సాయంసమయమున వధింపవలయునని తిమురతుపాషా క్రూరముగ నాజ్ఞాపించెను. ఇట్టి దారుణము లాకాలమున సాధారణముగ జరుగుచునేయుండెను.

హసేను అను నాయకునకు కరాళసిరిబకులు చిక్కిరి. సైనికులు వారిందోడ్కొని తమ నాయకుని గుడారమునందుఁ బ్రవేశపెట్టి, తమ నెలవులకు మగిడిరి. కాని, హసేను కరాళసిరిబకులు పరస్పరము వీక్షించినంతనే, మువ్వురును భ్రమాన్పడిరి! కారణమేమి? ఆ హసేనుఁడే తొల్లిటి శిశుమానుఁడు! మరణించెనని తలంచిన చిన్నయనుంగు తమ్ముఁడు కంటఁబడినంతనే, కరాళుఁడు విపరీతప్రమోద పరవశుఁడై చెయ్యనఁబోయి, గాఢాలింగన మొనరించెను. వృద్ధజనకుఁడు మాత్రము దవ్వుననాసీనుఁడై, వివర్ణవదనుఁడై, దురంతబాధితాత్ముఁడై, యశ్రుధారల విడుచుచుండెను. ఎట్టకేల కా ముసలి యిట్టులనెను —

"ఓరీ! నీవు నాతనయుఁడవా? కుమారా! ఎంతటి యకార్య మొనరించితివి! ప్రాణసమానమగు స్వమతము వీడి నీచపరమతావలంబన మొనరించితివా? హా! విధీ! మహమ్మదీయమతము! మహమ్మదీయ నామము! మహమ్మదీయసేవ! మహమ్మదీయశిరోంబరము! శస్త్రము! కంఠమాల! అంగుళీయకము!! ఛీ! వేరొకఁజాలను! నిన్ను జూడఁ జాలను!"

కరాళుఁడిట్టులనెను — "తండ్రీ! మన శిశుమానుఁడు మఱల

మనకు గోచరించెను! ఇట్టి నిష్ఠురోక్తుల బాలునిఁ గారింపకుము. ఇంతకు, గుణవంతుఁడగు నీ కుమారుఁడు బుద్ధిపూర్వకముగా నిట్టి యధమకార్య మొనరించి యుండఁడు.''

"దైవమా! ఏల యొనరింతును? సోదరా! నేను ద్రోహిని! మతద్రోహిని! దేశద్రోహిని! ఏ దైవమును జనించినదాది విశ్వసించితినో, యా పరమ పావనుని విడనాడి, యన్యదైవారాధకుఁడనై, భయంకరులనియు, దయారహితులనియు దుర్యశముగాంచిన జనీజరీ సైనికులలో నొకఁడనైతి!''

"శిశుమానుఁ డట్లు నిజమనోవ్యథ నెఱింగింప, సిరిబరుఁడిట్లు సక్రోధముగాఁ బలికెను —

"ఛీ! వినఁజాలను! ఇట్టి పాపంపుఁ బలుకుల వినఁజాలను! ఓరీ! నీవు నా తనయుఁడవు గావు!''

"తండ్రీ! అంతటి యాగ్రహమువలదు. నా సోదరునకై నే నొనరించిన మహాత్యాగ మెఱుఁగవు. దాన నింతటి యనర్థకము దాపురించెను.''

కరాళుఁడు విస్మితుఁడై, "నా కొఱకా?'' యని ప్రశ్నింప, శిశుమానుఁడు వినయ నిశ్చల స్వరంబున నిట్టులనెను —

"ఔను. సోదరా! నేనును నీ వలెనే మరీటాను మనసారఁ బ్రాణసమానముగఁ బ్రేమించితి: ముద్దుల నా కాంతనే తలంచుచుంటిని: నిద్రయందైనను మఱవఁజాలకుంటిని. నే నా కన్నియఁ జెట్టఁబట్టఁ జాలుదునని ఆసించియుంటిని; విశ్వసించియుంటిని. అంత జనకు నభిమతము పిడుగువలెఁ దెలియవచ్చెను. ఆహా! నా యవస్థ అపు డెటులుండెను? తలంచినంత మాత్రమున దేహము కంపించును, హృదయము శీర్ణమగును! అన్నా! నీపై నాకుఁగల ప్రేమ యనంతము, నిరుపమానము, జనకునన్నానో, ప్రత్యక్షదైవమువలెఁ జూచుచుంటిని. భగ్నన

మండెను హృదయతాపము సహింపఁజాలక, మనోరథము ఘోరముగా భగ్నమగుటచే మన్మతికై యెట్టి మరితము చేయఁ బూనెదనో యని వెఱచియు, సర్వ సౌఖ్యధామ మగు గృహము వీడి, సైన్యము నాశ్రయించితి: యుద్ధానంతరము వైరివశంవదుఁడ నైతి. ఇంటి కరుదెంచు నవకాశములేదు; వచ్చినను, హతభాగ్యునకు సౌఖ్యమెక్కడ ? కావున, విధి విధానమని యెంచి, మహమ్మదీయుఁడ నగుట దోషమా ?”

అంతవరకు నడంగియుండిన పితృవాత్సల్య మంతట పెల్లుబుక, వృద్ధుఁడగు సిరిబరుఁడు విగతధైర్యుఁడై, ఉద్విగ్నహృదయుఁడై, ఘూర్ణిత మనస్కుఁడై, యమితోత్సాహ రుద్ధస్వరంబున — “హా ! కుమారా !” యని యఱచి రయమునఁ బాఱి, ప్రకంపిత భుజపంజరమున శిశుమానుని బంధించెను. కొంతతడ వట్లు గడచిన పిమ్మట, శరాళుఁడు ప్రబోధితుఁడై, కంపిత హృదయుఁడై, యిట్టులనెను — “తమ్ముఁడా ! సాయంకాల మగునంతనే, మేమిరువురము నీచేఁ దెగటార వలయు; లేదేని నీవ తెగటారవలయుఁగదా !”

“అన్నా ! నేనె మరణింతుఁగాక. ఒక యుపాయము స్ఫురించినది. దాన మనము మువ్వురము సురక్షితముగా నుండనగును. నే నొక సైనికోద్యోగినగుటచే, నాయనుమతి వడయకుండ ఈ గుడారమెవ్వరు ప్రవేశింపఁజాలరు. కావున, కొన్నిదినములు మీరిందు దాగియుండ వచ్చును. సమయమరసి మిమ్ము నిరపాయముగ సాగనంపెదను.”

“కుమారా ! నీవును మాతో నరుదెమ్ము. నిన్నుడించి పోఁ జాలము. తనయా ! నీవు మగుడ జన్మభూమి కేతెంచి, పాపంపుఁ బర మతత్యక్తుఁడవై మాతోఁ బాటు సుఖముగ నుండుము.”

జనకుఁడట్లు సాదరముగాఁ బలుక, శిశుమానుఁ డిట్టులనెను —

“హా ! తండ్రీ ! ఈ దురదృష్టవంతున కంతటి సౌఖ్యము లేదు.

మోహాతిరేకమున నాయవస్థ మఱచుచుంటివి. పరిస్థితులు క్రూరముగ నా శోకపథం బేర్పఱచెను: తదుల్లంఘన మసాధ్యము, అవివేకము, అపాయకరము. తండ్రీ! నీ కుమారుఁడే రణక్షేత్రముననో మరణించును: ఈ పాపపుఁ గళేబరమునకు సంస్కారము జరుగనేరదు: గృధ్ర జంబుకములకో, క్రిమి కీటకములకో ఆహారమగును గాఁబోలు: ఈ శరీర కంకాళము వర్షాతపంబులకు గుఱియై శైథిల్యము నొందుఁ గాఁబోలు: అపవిత్రమగు నా యాత్మ నితాంత బాధితమై యచ్చటనే పరిభ్రమించుఁ గాఁబోలు! తండ్రీ! నీవును గరాళుఁడును నాకై దవ్వుననుండియే ప్రార్థింతురా!"

నిజహృదయ దుర్భరారాటము నా తెఱంగున వెలిబుచ్చిన శిశుమానుఁ డచట నిలువక, ఆవలకు రయమునఁ బాఱి, దినకరుఁ డస్తమించువఱకు భయంకర మృతకళేబర విభూషితమగు రణవసుంధరం దిరుగాడి, చచ్చిన క్రైస్తవుల మస్తకముల రెండింటిని ఖండించి, శీఘ్రముగ భద్రపఱచి యల్లనఁ దన గుడారము చొచ్చెను: ప్రాంగణమున రెండు ఈఁటెలు పాతి, ఆ శిరములను వానికిఁ దగిలించెను. సూర్యోదయ మగునంతనే ప్రభుత్వవిచారకుఁ డరుదెంచి, సైనికులు శత్రుసంహారము ప్రభునాజ్ఞ ననుసరించి యొనరించిరో, లేదో, యని అరయుచు, శిశుమాను గుడారము ముంగలి ప్రదర్శనముఁగాంచి, సంతసించి, తనదారిం బోయెను. తండ్రి కుమారు లమితానందపరులైరి.

కరాళ సిరిబరులు హాసేను నామధేయుఁడగు శిశుమాను గుడారము చొచ్చి, మూఁడు నాలుగు దినము లాడెను. వారిని భద్రముగఁ బంపివేయుట కింకను అవకాశము చిక్కకుండెను. ఒక్కొక్క దిన ముడుగుచున్న కొలఁది, హాసేను భయ మధికతర మగుచుండెను. తురుష్కసైన్యము పునఃప్రయాణ మాచరించు సమయ మరుదెంచుచుండెను. రహస్య మిఁక దాఁగనేరదు. కాని, వారి యదృష్టము బాగుండుటచే,

నా సంకటసమయమున సర్వసైన్యాధ్యక్షుఁ డగు తిమరతుపాషా వ్యాధిగ్రస్తుఁ డాయెను. ఆ కారణమునఁ బ్రయాణములు నిలిచి పోయెను. హాసేను ప్రాణము కుదుటఁబడెను.

పాషా పున్నతి యనుదిన మధిక మగుచుండెను. పేరొందిన వైద్యశిఖామణులు భయభక్తులతోఁ బాటుపడియు, భగ్నమనోరథులై, క్రోధమూర్తియగు పాషా ఏమిచేయునో యని వెఱచి, యాకస్మికముగా మాయమైరి. వ్యాధిబాధ దుర్భరముగ నుండుటచే, నా తురుష్కప్రభువు క్రోధోన్మత్తుఁడై, దండతాడితభుజంగము వలె, నిశితాస్త్రకీలిత వ్యాఘ్రము వలెఁ బరిజనులు భయవిహ్వలు లగునట్లు, ఘూర్ణిల్లఁ జొచ్చెను.

ఈ సమాచార మెప్పటికప్పుడు హాసేనునకుఁ దెలియుచుండెను. వాని జనకుఁడగు సిరిబరుఁడు వైద్యవిద్యావిశారదుఁ డగుటచేఁ దన తనయునిఁ గాంచి యిట్టులనెను —

"కుమారా! నా ప్రజ్ఞ నీకు విదితము. ఎట్టి రోగమైనను నాకు సులభసాధ్యము. కాన, నన్ను బాషా సమక్షమునకుఁ గొంపోఁ జాలు దేని, కృతకృత్యుఁడనై ప్రభువు ప్రేమాభిమానమునకుఁ బాత్రుఁడఁ గాఁజాలుదు. దాన, మనము బహిరంగముగ మన యిల్లు చేరఁ గలము."

తోడనే, హాసేను సంతోషపరవశుఁడై, పాషా శిబిరమునకు రయమునఁ బ్రయాణ మాయెను. దారుణ రోగపీడితుఁడై పడియుండిన సేనాధ్యక్షుని విలాపములు దవ్వుననుండియే దుస్సహముగ వినవచ్చుచుండెను. హాసేనుఁ డనుజ్ఞవడసి, పాషా సమ్ముఖమున కేగి వినమ్రుఁడై నమస్కరించి, కంపితహృదయుఁడయ్యు ధైర్యముగ నిట్లు పలికెను —

"మహానీయా! భవదీయపవిత్రపాదధూళి యౌదలధరించుటకునైన నర్హుఁడకుఁ గాని యీ సేవకాధముని మనవి చిత్తగింపుఁడు! ఈ పవిత్రా

మున నొక క్రైస్తవసన్యాసి కలఁడు. నిస్సంగుఁడగు నా సాధు జనుఁడు రోగచికిత్సయం దసమానుఁడు. లోకవిషయములం దలంపక ఆ యనఘాత్ముఁడు నిరంతరము ధ్యానైకతత్పరుఁడై యుండును. ఐనను, నిర్వ్యాజపరోపకారపరతంత్రుఁడగు నమ్మహానీయుఁడు తప్పక విచ్చేయును. వనమూలికాప్రయోగమునం దప్పక రోగనివారణ మొనరించునని విశ్వసింతును: క్రైస్తవుఁడైనను, విశ్వసనీయుఁడని దృఢముగఁ జెప్పఁగలను."

"చూతము! ఆ కాఫరు ఫకీరు నిటుఁ గొనిరమ్ము! నా తెవులు మాన్పినా, ఆ కాఫరుని బహుమానములతో ముంచివేయుదును: లేదేని, మరణించినను, వాని పని పట్టింతును! భద్రము! పొమ్ము."

మృత్యుముఖమున నున్నను, ఆ తురుష్కపీరుని దురహంకార మొక్కటీరుననే యుండెను. తన ప్రభువట్లు పలుక, మహాప్రసాద మని పలికి మ్రొక్కి ఖరించి, వెడలి, హసేను నామధేయుఁడగు శిశుమాను తన జనకునితో నరుదెంచి, తిమరతుపాషా శిబిరము ప్రవేశించెను. ఈలోన నా సేనాని పరితాప మధికతరమగుటచే నున్మత్త హార్యక్షము భాతి గర్జింపఁ దొడంగెను. పరిజనులు భయభ్రాంతులై యట నిలువఁజాలకపోయిరి. అపూర్వసౌందర్యవతియగు నొక బాలిక ప్రేమపూరిత చిత్తయై, వ్యగ్రమనస్కయై యుపచారము లొనరించుచుండెను. తదుపచారకార్యనిమగ్నయై యుండిన ఆ మచ్చెకంటి ముఖవసనధారణము మఱచియుండెను. అట్టిసమయమున శిశుమాను కృత్రిమభిషగ్వర సహితముగా నందుఁ బ్రవేశించెను. మేలిముసుంగు తొలంగి నీలమేఘ పరిత్యక్త సుందర సుధాకరబింబ సమాన వైభవ సముజ్జ్వలముతో దీపించు నాకన్నియఁ గాంచినంతనే, శిశుమాను మూర్ఛఁబోయెను. అవనతవదనయై, నిజజనకుని ముఖవిలోకన మొనర్చుచు, నవ్యక్తమధురమంజుల కంఠమున ధైర్యము కఱవఁబూనిన

యీవాల్గంటి ఇందీవర సన్నిభ విశాలనయనము లక్ష్యవిహీని తములై యుండెను: మనోహరములై గులాబిలవలె రాజిల్లు కెంబెద వుల నడుమ నా కుందరదనపఙ్క్తిగాన విమల ముక్తాఫల సదృశ శోభాయమానముగ నుండెను: ఆ మోహనాంగి యంగ విస్ఫురణము పరిపూర్ణమై, సూక్ష్మమై, నిరుపమానమై, వర్ణనాతీతమై యలరారెను. ఆ కోమలాంగి ధరించిన షరాయినుండి కోమల కాంచన పదకంజాత ములు వెలువడి, నేత్రపర్వ మొనరించుచుండెను.

నాకమునుండి దిగివచ్చిన దివ్యాంగనయో యనునట్లు లనూనరూప వైభవ సముజ్జ్వలమైయొప్పు నా నారీరత్నము నొక్కనిమిషముఁ నిశ్చేష్టితుఁడై ముగ్ధుఁడై శిశుమానుఁడనిమిషనయనుఁడై కాంచఁ జాలెను. అంత నా ముద్దియ తటాలున మోమెత్తి యటు పరికించెను: ఆ చంద్రముఖి శీతల వీక్షణములు శిశుమానుమీఁదనే పర్వెను: వాఁడా దివ్యసుందర విగ్రహమునే, విభ్రాంతుఁడై, కాంచుచుండెను. ఆ మానవతి తోడనే సుందర సంధ్యారుణ రంజిత వదనయై, మేలి ముసుంగు రయంబున ధరించెను.

శిశుమానుఁడంత నిశ్చల స్వాంతుఁడై పాపా శయ్యకడ కేగి, మహాత్ముఁడగు క్రైస్తవఫకీరును గొనివచ్చితినని దైన్యముగ విన్న వించెను. పాపా యిట్లులనెను—

"నా చెంతకు రమ్మనుము! కుమార్! నీవిటనే యుండవలయు: నీవున్న, నా తాపమొకింత యుపశమించును."

సిరిబరుఁడంత రోగినిడాసి, పసనముపరిశీలించి, రోగముగుర్తించి, ఏవియోకొన్ని మూలికలు కావలయునని కోరెను. పరిచారకులు తోడనేపోయి యందందుఁ దిరిగి, వలయు నోషధులఁ గొనిదెచ్చిరి. సిరిబరుఁడు వానిని శుద్ధపఱచి, ప్రయోగార్హముగ నొనరించి, రోగి కొసంగు కార్యమున నిమగ్నుఁడై యుండ, శిశుమానుఁడు తనచెంత

నుండిన విద్యుల్లతావిగ్రహసౌందర్యవైభవము గాంచికొనుచుండెను. ఆతఁ డొకసారి సంకేతాను బ్రేమించియుండెను. కాని, తిమిరతు పాపా పుత్రికా విలోకనానంతర చిత్తోద్రేకము కేవల మస్వాభావికమై యుండెను. మున్నెన్నఁ డెఱుంగని వికారమొం హృదయమునంచి, యనలమువలెఁ బ్రజ్వరిల్లెను. విద్యుత్ప్రవాహము ఇసగిశినటులు, ఒడలంతయుఁ బ్రకంపిత మాయెను. అనిర్వాచ్యమగు నొకవింత యానందము వాని కనుభవైక వేద్య మాయెను. ఒక యపూర్వ సుఖస్వప్నముఁ గాంచువానివలె శిశు మానుఁడు తన్మయుఁడై యుండ, ఈ మధురంపుఁ బలుకులు వినఁబడెను —

"ఈక్రైస్తవుఁ డెవ్వఁడు ? విశ్వసనీయుఁ డగునా ! అపాయము వారయదుగద ! క్రూర విధివశమున వ్యాధిగ్రస్తుఁడైన ఈ మహానీయుఁడు సాధారణుఁడు కాఁడనుకొనా ! "

శిశుమానుఁ డంత ప్రబోధితుఁడై, తక్షణము గాంభీర్యము వహించి, పాపా పుత్రికకు తగుసమాధాన మొసంగెను. అ తనా 'వల్లకి' యొక్క నిమిస మూరకుండి యభినవ వల్లకివలె నిట్లు ప్రశ్నించెను — "నీ నామధేయ మెయ్యది ?"

"నన్ను హాసేనుఁడని పిలుతురు."

శిశుమానుఁ డట్లు సవినయముగ, సగౌరవముగాఁ బలుక, నాహేమ వల్లకి యల్లన నిట్టులనెను —

"ఈ పవిత్రక్రైస్తవునిఁ గొనితెచ్చి నీవు నిక్కముగ సార్థకనాముఁడవైతివి." అంత నాముద్దియ రయమునఁదన యంగుళీయముఁ దీసి శిశుమానునిఁ జేరఁ బిలిచి, యమిత మందస్వరమున మగుడ నిట్టు లనెను — "ఆర్యా ! ఈ యుంగరము నాజనకుని కొఱకుఁ దాల్పుము!"

"వనితామణీ ! వలదు, వలదు. నన్ను బహూకరింతునని ప్రభువు సెల విచ్చియే యుండెను. భవదీయజనకుఁ డప్పుడే ఈ క్రైస్తవ మహానీ

యుని ప్రభావముచే నాకింతబాధ దక్కెనని తోఁచెనిని. ఐనను, నీ వాసంగు బహుమానము వలదనఁ జాలను; నీకై ఈరమణీయ భూషణమును ధరించెదను. ”

తదవసరమున నాయువతీ యువకుల కరములు పరస్పరము చుంబించెను. శిశుమానుఁడు ప్రభుసహిత కరస్పర్శన మహాసౌఖ్యము ననుభవించి, తనమూల్యపదార్థము పరిగ్రహించెను. నీబహిః సంకేతము లేచి, నాలుగడుగులు వెనుకకువైచి, అమిత మందస్వరమున నిట్టు లనెను —

“ కుంములు తలకెక్కినవి : పాపా గాఢనిద్రాపరుఁ డాయెను : మేల్కాంచు వఱకు భంగము కలుగరాదు ; నే నీచెంతనే కనిపెట్టి యుందును. ”

వల్లకియు నచటనే యుండవలయును. ఆ యిందీవరనయనను వీడఁ జాలక శిశుమాను గూడ నెద్దియో నెపము కల్పించి యచటనే యుండెను. వల్లకి కనుసన్నఁ గాంచి, మూఁగ దాసీలు వివిధాహార సమృద్ధములగు వెండి పళ్ళెరములఁ గొని తెచ్చి యొక మేజాపై నిడిరి. అతిథుల గౌరవించు నెపంబున నా ప్రభుపుత్రి తన మేలి ముసుంగు సడలించి, విందారగింపవలయునని వారి నాహ్వానించెను. బల్లపై నానావిధరుచికర పదార్థము లమరియుండెను. పూజ్యుఁడగు మహమ్మదు కఠినముగ ఖండించిన మేలురకపు మధురసముగూడ నాయత్తమాయెను ; వల్లకీ శిశుమానులా భూలోక పీయూష మాస్వాదించిరి. తురుష్కప్రభు వెటులుండెనో చూడవలయునని సిరిబరుఁడు తటాలున లేచిపోయెను. మిగిలియుండిన యువతీ యువకులు చనవుగఁ బరస్పరము విలోకించుట కవకాశమాయెను. శిశుమానుఁడు ప్రణయామృతము గ్రోలిగ్రోలి పరవశాత్ముఁడై మఱలఁ గలియుదు మని నిబ్బరముగఁ బలికి వెడలెను.

సిరిబరుఁడా శిబిరముననే యుండెను. శిశుమానుఁడు మాత్ర మను గిన మగుడెంచుచు వల్లకి సుందరసుధాకరబింబముఁ దిలకించుచు, సైన్యాధిపతి క్షేమమరయు నెపంబున నాకలకంఠి మంజులాలాపము లాలించుచు వెడలుచుండెను. పదిదినములలో తిసురతురోగము కుదిరెను: ఇరువదిదినములలో నాతని కారోగ్యమలవడెను: ఇఁక సిరిబరుని యవసరము తీఱిపోయెను.

పాషా యంతట శిశుమానుని రావించి ఆ వృద్ధక్రైస్తవఫకీరునిఁ దనగుడారమునకుఁ గొంపోయి ఆతని వాంఛలనెల్ల సగౌరవముగా నరయవలయునని యాజ్ఞాపించెను. పాషా నిజముగ, భీతుఁడైనను, ఒక యనుమానము బాధించుచుండెను. కాఫరులను నమ్మరాదనియు, ఈ క్రైస్తవుఁడు నిపుణముగ వ్యాధి మఱలించినను విశ్వసింపరాదనియు, శీఘ్రముగ నరయఁజాలని విషము ప్రయోగించి, బహుమానము వడసి యాతఁడు పలాయన మొనరించునేని, తాను తిరుగరోగార్తుఁడై యధికతరబాధ ననుభవించి మరణింపవచ్చుననియు పాషా లోలోన ననుమానించెను. ఆ కారణముననే యా వృద్ధుని తన సైనికుని గుడారమున నుంచి, కొన్ని దినములు చూచి యనంతరము ఘనముగా బహూకరింపవలయునని పాషా ఆలోచన చేసెను.

పది దినములాయెను. పాషా యారోగ్యము దినదిన ప్రవర్ధమాన మాయెను. దాన నా ప్రభువు సంతసించి, క్రైస్తవుఁడు నిజముగ సజ్జనుఁడే యని గ్రహించి, కృతజ్ఞతాపూర్వముగా దాను మంచి పనదన మొసంగవలయునని సంకల్పించెను. కాని, క్రైస్తవ ఫకీరుఁ డెంతటి మేటిసాధకుఁడైనను, వాని నరసినవాఁడు హసేనుఁడుగదా! కాన, వాఁడును గొప్పబహుమానము వడయవలయును. వానిగుఱించి తన మంత్రులను బ్రశ్నించినంతనే వారెల్లరు హసేను వీరుఁడనియు, స్వామిభక్తిపరాయణుఁడనియు, సత్ప్రవర్తకుఁడనియు నేకగ్రీవముగాఁ

బలికిరి. ప్రభువు సంతుష్టాంతరంగుఁడై, తన తనయను రావించి, యిట్టు లనెను.

"కుమారీ! నిన్నొక కార్యార్థము చీరితి. ఎఱుంగుదుగదా, నా తొంటి దారుణవ్యాధిబాధ! పరమేశ్వర విలాసముచే మన హాసేనుఁడు తగిన భిషగ్వరు నరయఁజాలెను. నేను మఱల సంపూర్ణారోగ్యభాగ్యము ననుభవింపఁ జాలుటకు హాసేనుఁడే కారకుఁడాయెను. హాసేను మంచి మహామ్మదీయుఁడు, వీరుఁడు, అచిరకాలమున యశోవంతుఁడు కాఁగలఁడు. పట్టీ! బహుమానపురస్సరముగా నిన్ను వానికి భార్యగా నీయఁదలంచితి."

వల్లకి యమితానంద పరవశయాయెను. ఏ సుందరాంగునిఁ గాంచి మోహావిభ్రాంతచిత్తయై, తన ముద్రిక నొసంగి, కరస్పర్శనానంద మనుభవించి, తదాలోచనాధీనమానసయై యుండెనో, వానినే వివాహ మాడవలయునని పాషా యాజ్ఞాపించెను!

పాషా యంతటఁ దన పెద్ద కొజ్జాను జీరి, యిట్టు లాజ్ఞాపించెను. —

"అబ్దుల్లా! అమూల్యములగు వింత వసనములఁ బట్టించికొని, పండ్రెండుగురు పరిచారకులతో నీవు హాసేను గుడారమునకుఁ బొమ్ము. అందొక వృద్ధక్రైస్తవుఁడు గూడ గోచరించును. వారిని గాంచునంతనే గౌరవపురస్సరముగా నా యిరువురకు రుచిరాంబరములఁ గప్పి, సువర్ణ మాలికలువైచి, యంగుళీయములు తొడిగి రయంబునఁ గొనిరమ్ము! పొమ్ము!"

అప్రకార మబ్దుల్లా రయముసఁబోయి, ప్రభుసేవకుఁ డగుటచే పని వారితుఁడై, జంకు లేక హాసేను సమక్షమునకుఁ బోయెను. హాసేనుఁ డా సమయమునఁ గరాళసిరిబరులతో వినోదముగ సంభాషించుచుండెను. పిడుగువలె నరుదెంచిన సేవకునిఁ గాంచినంతనే, శిశుమానుఁ డుభయాతిరేకమున భ్రమొన్నడెను. అబ్దుల్లా డిల్లవడి యిట్టులనెను. —

"అయ్యా! నీ గుడారమున నొక్క క్రైస్తవుఁ డుండుననియు, వాని కీ రుచిరాంబరాది సన్మానముల నొసఁగవలయునని పాషా ఆజ్ఞాపించెను. కాని, ఈ నికటమున నిర్వురు గోచరించుచున్నారే! ఇం దెవ్వఁడు గౌరవార్హుఁడో యెఱుంగఁజాలను. కావున, మీరు ముర్వురు పాషావారి శిబిరమునకు దయచేయుఁడు!"

వాఁ డట్లు పలుకుచు హాసేను నామధేయుఁడగు శిశుమానునకు సగౌరవముగాఁ దాఁ దెచ్చిన రుచిరాంబరముఁ గప్పి, ఇతర బహుమానములఁ గూడ ధరింపఁజేసి, యంతవఱకుఁ గృతకృత్యుఁ డాయెను. కాని, శిశుమానునకు బహుమానములేల? తన రహస్య మిఁకఁ దెలిసి పోవును. ప్రసన్నహృదయుఁడై యుండిన పాషా యిఁకఁ గ్రోధోన్మత్తుఁ డగును: తండ్రి కుమారులు ముర్వుర కిఁక మరణము తప్పదు! శిశుమాను హృదయము పాషాణఘటిత మృణ్మయపాత్ర వలె ప్రక్కలాయెను! ఐనను, కర్తవ్యమేమి! పాప మా హతభాగ్యుఁడు చేయునది లేక జీవచ్ఛవంబుగతి ప్రభుసేవకు ననుగమించెను: కరాళ సిరిబరులును అట్టె పోయిరి.

అబ్దుల్లా ప్రభుసమక్షమున సాష్టాంగ మాచరించి, తాఁ గాంచిన వైపరీత్యము నివేదించెను. ఇరువురు క్రైస్తవు లనినంతనే తురుష్కప్రభువు విస్మయాగ్రహపరవశుఁ డాయెను. అంత నొక సభ్యుఁడు లేచి యిట్లు పలికెను —

"క్రైస్తవులా! ఎఱుంగుదు. యుద్ధమునఁ బట్టువడి, హాసేను వంతునకు వచ్చినవారలే! హాసేను వధింపక ఈ కాఫరులను విడిచియుండును."

తిమరితు పాషా క్రోధోన్మత్తుఁ డాయెను — "అల్లా! అల్లా! ఎంత ఘాగడము! ఈ కాఫరు నిజముగ ఫకీరుఁడని విశ్వసించి, నా చెంతకు రానిచ్చితి. అట్లు కాదేని, మనపైఁ గత్తి దూసిన నరాధములలో నొక్కఁ డగునేని, వీనిని వీని యనుచరులను నా ప్రాంగణమున నిప్పుడే

ఉరి తీయుండుడు! అహో! హా కీన్! మాటాడవేమి!"

[illegible] భయంకర చండశాసనుని వాదనముపై బ్రాలి శిశుమానును జేసి నమస్కారపత్రాంతికము పూర్తిగాఁ జెప్పెను. పాపా మహారాజు ప్రచలితకీలుఁడై యిట్లు పల్కెను —

"ఓరీ! కృతఘ్నా! ద్రోహము! మహాద్రోహము! చేఁజిక్కిన శత్రునందనుఁ బట్టి జక్కఁగఁ జిక్కఁబడవలయునని ఘోరసమయము గావించితి! అహో! సంహారా! ఎట్టి మోసము! హా!"

వృద్ధుఁడగు సిరిబరుఁ డంత దుఃఖపరవశుఁడై, అమిత భయాతురుఁడై, తత్సమాగతసదస్యహృదయ విదారణ మగునట్లు గోలుగోలున నేడ్చెను. సభాసదుల చిత్తము నీరాయెను. కఠినహృదయుఁడగు పాషా సహిత మొక్కింత ప్రచలితుఁడై శిశుమాను నుద్దేశించి యిట్లనెను —

"ఓరీ! విశ్వాసఘాతుకా! నీ జనకుఁడు నా ప్రాణము కాపాడెను. వాని కభయ మొసంగితి. మఱియు, వాని కొక కుమారుని దక్కింతును. మీ సోదరులలో నొక్కఁడు మరణింపవలయు. తనకెవ్వఁడు కావలయునో వృద్ధుఁడు తక్షణ మెఱింగింపవలయును."

భాగ్యహీనుఁడగు శిశుమానుఁ డంత నా దారుణ సమాచారము తన జనకున కెఱింగించెను. సిరిబరుని యవస్థ కడు దుస్సహముగ, కడు విపరీతముగ నుండెను. కుమారు లిద్దఱు రెండు నయనములవలె నుండిరి. సిరిబరుఁ డే నయనము కోల్పోవఁ గలఁడు? కరాళుఁడు జ్యేష్ఠుఁడు, వివాహితుఁడు, సంతానవంతుఁడు! శిశుమానుఁ డన్ననో! — కనిష్ఠుఁడు చచ్చి బ్రతికినవాఁడు, పాప ఘూయిష్ఠమగు పరమతము మగుడ విడనాడినందుకే మరణింపవలయునా? వలదు! వలదు! కరాళునకై గృహలక్ష్మి మఱియొక నిరీక్షించుచుండును! శిశుమాను మగుడఁ బునః ప్రత్యక్షస్తవ మతస్థుఁడు గావలయు! అహా! కరాళుని విడనాడుట దుస్సహము! శిశుమాను నొసంగుట యసంబద్ధము!

సిరిబరుఁ డమిత చింతా విహ్వలచిత్తుఁడై యీ తెఱంగున నున్మాద
ప్రాయుఁడై విలపించుచుండ, శిశుమానుఁడు ముందున కరుదెంచి
యిట్లు లనెను —

“ తండ్రీ ! నీ కింత వంతయేల ? కరాళుని కొఱకై భార్యాపుత్రులు
గంపెడాసతో వేచియుందురు ! వాని నొక్కని బలియిచ్చిన, స్త్రీహ
త్యయు శిశుహత్యయుఁగూడ సంభవమగును. కాన నేనే పోయెదను!”

“తమ్ముఁడా ! వలదు, వలదు ! నాకై యొకసారి మహాత్యాగ
మొనరించితివి ! చాలును మగుడ నీకాపద వొరయనిత్తునా? కరాళుఁ
డంతటి నీచాత్ముఁడు కాఁడని లోక మెఱుంగవలయు. తండ్రీ ! నేఁ
బోయెద !”

అన్నను వారించి శిశుమానుఁ డిట్లు లనెను—

“సోదరా ! నీ భార్యాబిడ్డలఁ దలంచి నన్ను మరణింప నిమ్ము.
నీ జీవితము సార్థకము; నాదో ! నిరర్థకము ! ”

“తండ్రీ ! వలదు ! సమ్మతింపవలదు ! సోదరుఁడు మతభ్రష్టుఁడై
మరణింపరాదు. నేఁ బోయెద.”

“తండ్రీ! వలదు. ఏ మతమైననేమి? నిశ్చలచిత్తుఁడనై మరణింతును!”

అంత సిరిబరుఁ డిట్లు లనెను.—

“శిశుమానుఁడే మరణించుఁగాక! ఆఁ! వలదు: శిశుమానుఁడు
కోమల శరీరుఁడు, వాని వినీలనయనములు కాంచినంతనే, గతించిన
నా సాధ్వి స్మరణకు వచ్చును. కరాళుఁడే యేగుఁగాక — కాదు,
కాదు. కరాళుఁడు ఆలుబిడ్డలు కలవాఁడే! శిశుమానుఁడు పరమతము
వీడి ప్రాయశ్చిత్తపూర్వకముగాఁ గ్రైస్తవమతావలంబుఁడైనఁ గాని
ఉత్తమగతులుండవే!— వాఁడు మరణించు టెట్లు?”

వృద్ధుఁ డమితభయాకులచిత్తుఁడై, దుస్సహావ్యగ్ర మనస్కుఁడై,
కరాళమరణ వహ్ని ఛాందోళిత హృదయుఁడై, కరాళశిశుమానుల

గుణశీలముల నితర్కించుచు నున్మాదప్రాయుఁడై విలపించుచుండ, శిశు మానుఁడవకాశము చిక్కించుకొని పాషాను డాసి యిట్టులనెను.—
“ప్రభూ! మా తండ్రిహృదయ మగాధ వచ్ఛితి: మరణింప సంసిద్ధుఁడనై యున్నవాఁడ: సత్వరము కృతకృత్యుఁడవు గమ్ము.”

తదాస్థానసభ్యులు దుఃఖపరవశులై, వినమ్రులై, ముకుళిత హస్తులై, ఆ దీనుని క్షమింపవలయునని పాషాను ప్రార్థించిరి. కాని, యా మహాసీయుఁడు ప్రసన్నుఁడు గాలేదు. పాషా యభిమతమెఱింగిన తలవరి భయంకరమగు వింటినారి సంధించి వధింప సంసిద్ధుఁడై యుండెను. ఆ హతభాగ్యుఁడు శిశుమానుఁడు ధైర్యనిశ్చలవదనుఁడై, వేగ టుకఁబునఁ గరములు కీలించి, మోకరించి దీనజనరక్షణ క్రియాదక్ష పవిత్ర పాద పంకేరుహ స్మరణైకచిత్తుఁడై, మరణోన్ముఖుఁడాయెను. దయారహితుఁడై పాషా సన్నయొనరించెను: తలవరి కాలసర్పసన్నిభమగు వింటినారిని శిశుమాను కంఠమునకుఁ జుట్టెను. ఒక్కక్షణికలో నా కాలపాశము బిగిసిపోవును: శిశుమానుఁడు విగతజీవుఁడగును. సభికులా భయానక ప్రదర్శనము చూడఁజాలక దుఃఖావనతవదనులైరి. శిశుమానున కింక దిక్కెయ్యది?

అట్టి మహాసంకట ముహూర్తమున, మేలిముసుంగుధరించిన యొక జవ్వని యా సభాగారమున మెఱుపువలె నుదయించి, పాషాపాదములపై రయమున వ్రాలి, “రక్షింపుము! రక్షింపుము! ఈ యువకుని రక్షింపుము! లేదేని, నన్నును వధింపుము!” అని గంభీరోద్విగ్న స్వరమునఁ బలికెను.

“వల్లకీ! ఏమి ఈ సాహసము! ఈ విశ్వాసఘాతుకుఁడు ప్రేమాస్పదుఁడా? వీఁడు తప్పక వధ్యుఁడు!”

అట్లు కఠినోక్తులాడు జనకుని వారించి, వల్లకి యిట్టు లనెను.—

“జనకా! నా విన్నపము మన్నింతువా, మేలు! లేదేని, నన్ను

నీ ప్రణామే [illegible]! తం[illegible]! [illegible] దోసరించిన
మహోపకార [illegible]
సముద్రము [illegible]! తండ్రీ! శ్రీప్రసాద [illegible]”

సభాసదు[illegible] [illegible] సంతోసిం
చిరి. [illegible] వాత్సల్య[illegible]
యున్న హేమస[illegible] [illegible] యిట్లు అనెను--

“కుమారీ! నీ మాట నా కనఁజాలను. మరియు సంతానమునందు నీవే గోదాస్త్రుఁడై రాను జనకునిఁ గనిపెట్టియుంటివి. నీ నిరుపమాన వాత్సల్యము నిక్కముగాఁ బ్రశంసనీయము. ఓయీ, హేమసేననామ ధేయా! లెమ్ము! నాక్షత్నాముఁడవై, చిరయశోమండితుండవై ప్రవర్ధిల్లుము: కష్టార్జిత బహుమానము మా కన్నియను బరిగ్రహింపుము.”

ఈ శుభవర్తమానము దవ్వుననుండిన కరాళసిరిబసులకు రయమునఁ దెలియవచ్చెను: అశ్రుజలార్ద్రమ్ములై ముకుళితమ్ములై యున్న నయనములు ప్రమోదవిస్ఫారితములాయెను: జీర్ణహీనవదనములు తోడనే నిరవధికానంద ప్రదీపితములాయెను.

ఆ సాయంకాలమే వల్లకీహేమసేనుల వివాహము మహావైభవముతో జరిగెను. ఎల్లరు నానందపరవశులైరి. సిరిబసుఁడు సహితము కడుముద మందెను గాని, చిన్ని కుమారుఁడు పరమశైవక పరిత్యక్తుఁడై, పూర్వ క్రైస్తవమతస్థుఁడు మగుడఁ గాఁజాలకపోయెఁగదా యనువంత యొకింత బాధించుచుండుటచే, నా ముదుసలికి సంపూర్ణానుభవము లేక పోయెను.

వివాహానంతరము కరాళసిరిబసులు పాపా మందిరమునఁ గొన్ని దినము లుండి, విందు లారగించి; వెలలేని కానుక లంది, యనంతరము తమ దేశమునకుఁ దిరిగిపోయిరి. శిశుమారుని వీడి యరగుట వారికిఁ

గను మత్సరముగ నుండెను. ఎడబాటు శిశుమానునకుఁ గూడఁ గడు దుస్సహమైయుండెను.

పల్లకీ శిశుమానులు ముప్పది సంవత్సరములు సంసారమహాసౌఖ్యము పూర్తిగ ననుభవించిరి. శిశుమానుఁడు ఘనాధికారధురంధరుండై, యమిత ధనవంతుఁడాయెను. ఐనను, సంతానవిహీనులగుటచే, వారి సౌఖ్యమొకింత కొఱఁతపడెను. అనంతరము సద్గుణవల్లరి యగు పల్లకి మిత్తివాతఁబడెను. శిశుమానుఁడు నిరావలంబియై యట నిలువఁజాలక, జన్మభూమి దర్శనోత్సాహియై తన కనకవస్తువాహనాదుల నెత్తించికొని ప్రయాణమాయెను. తత్పూర్వమే, సిరిజుఁడు సహస్రమాసములు నిండి సమాధిచొచ్చెను. శిశుమానుఁడు నిజసోదర సంసారమున లీనమై, తన యవసానము నాతెఱంగున శిష్టబంధుజన పరివృతుఁడై హాయిగ వెడలఁబుచ్చి కీర్తిశేషుఁడాయెను. ఆ మహానీయుఁడు నిశపలాశియుద్ధము గుఱించియు, తదవసర ఘోర సరసధాక్రమము గుఱించియు, నిజవిషాదాజ్ఞాతవాస విచిత్రోదంతము గుఱించియుఁ జక్కని గ్రంథము రచించిపోయెను. ఆగాధ శ్రోతగ నైరోపాఖండ కథారంగప్రవేశ మొనరించినపుడు క్రైస్తవజనానీకమున కమితానంద మొదఁగూర్చెను.

## ౧౨

ఖలీలుని కథ ముగిసెను. తొల్లింటి గాథలకంటె నియ్యది దాల్తబను పాషాకు నధికతరానందము కల్గించెను. వివిధరసపూరితమగు నా గాథ శ్రవణమొనరించునపుడాయా భావములు తురుష్కప్రభువదనమున ద్యోతకమగుచుండెను. వృద్ధతురుష్కుఁడా కాలమంతయు ననిమిషనయనుఁడై, దుర్భరసంశయబాధితుఁడై యా కథకుని వదనము నట్టె తిలకించుచుండెను. సహజ మనోహరాకారుఁడగు నా వీరుఁడు

తదవసరమున మఱియు దర్శనీయుండై యొప్పారెను. కోమలాంగి యగు జులేఖా కుతూహలాశ్చర్యాధుర్యయై యాలించెనని వేఱుగఁ జెప్ప నవసరములేదు. ప్రణయముగ్ధులగు లూకాసు గుల్నేరులును, హైరజా జూలియనులును గాఢోత్సాహపరవశులై కథాశ్రవణ మొనరించి రనుట చర్వితచర్వణము.

కథ ముగిసినంతనే, దార్లుబను పాషా సహజముగ నాలోచనా పరుఁడాయెను. చతురమతియగు ఖలీలుఁడు మఱెట్టి నెపము కల్పించి యీ ప్రణయమందిర నివాసము దీర్ఘతర మొనరించునో; లేక, తమ మిత్రుని యుపదేశానుసారముగాఁ దమరి నందుండనిచ్చి, చారుల నంపి పాషా తమతమ వంశచారిత్రముల నరయఁగడంగునో, యని యీ యువతీయువకులు చింతింపఁదొడంగిరి. ఆ సమయముననే ఖలీ లుఁడు నిజప్రియాంగనను డాసి, మోము వాల్చి, యీ హేమగాత్రి శ్రవణమున నేమియో చెప్పెను. ఆ మోహనాంగి మనోహరాననము కళావిహీనమై, చింతాక్రాంతమాయెను. అది యొక క్షణికము: తదాననము తత్క్షణ మాశోత్సాహరంజితమై, ప్రఫుల్లమై, విభాసురమై యలరారెను. ఆ పల్లవాధర యీ ముహూర్తముననే తదాసనము వీడి నిశ్శబ్దముగ మఱియొక సోఫాపైఁ గూర్చుండెను. పరస్పరప్రణయ సంభావణానందపరవశులైన లూకాసు మొదలగువార లా విష యము నెఱుంగరైరి. పాషా నిజమనఃప్రభవాలోచనాసాగరనిర్మ గ్నుఁడై యుండెఁగదా.

రెండు మూఁడునిమేషము లట్లు గడచినంతనే, ఆ మందిర కవా టము చలించెను: ప్రభుభార్యయగు నిస్మిల్లానతీతిలక మల్లనఁ బ్రవే శించెను. అనర్ఘరుచిరాంబరధారిణియై దీపించు నా గంధగజయాన మందిరప్రవేశ మొనరించినంతనే, మేలిముసుంగునుండియే కలయఁ జూచెను. ఖలీలుఁడు కాంతావిరహితుఁడై యుండెను! జులేఖా

దవ్వాన మఱియొక తల్పమున నుపవిష్టయై యుండెను: ప్రభుపత్ని లోలోన సంతసించెను. ఆ సుందరాంగిని గ్రీకు యువకు లెన్నఁడుఁ గాంచి యెఱుంగరు. ఐనను, రూపవైభవముఁ గాంచి, ఆమె పాషా సతి కావలయునని యెంచి, జూలియను లూకాసులు సగౌరవముగా లేచి నిలుచుండిరి.

అంత నా మందయాన మానససరోవరవిహరణమనోహరమరాళమువలె నల్లనల్లనఁ దన మగని జాసి, ఆ వీరుని దోర్దండమునఁ దన కోమలకరంబు స్పృశియించి, ప్రేమమయశీతలవీక్షణంబులఁ బర్వఁ జేసి, మోహినీసహజమంజుల మోహనస్వరంబున నిట్టులనెను —

"ప్రాణనాథా! ఈ మందిరప్రవేశ మొనరించుట కనుజ్ఞ దయ చేయుదువా!"

పాషా యానందపరవశుఁడై, తన ప్రియభార్యను సాదరముగాఁ దనప్రక్కఁ గూర్చుండ నియమించి, యిట్టులనెను —

"తరుణీ! నీ కెల్లయెడల సుస్వాగతము! ప్రేయసీ! నీ తోడ నేను ముచ్చటించినవారు వీరలే. ఈ యువకులు మువ్వురు రెండహో రాత్రము లీ మందిరమున విడిసియుండి, ఇఁకఁ దమ తమ నెలవులకుఁ బోనున్నవారు."

యువతీయువకులు నల్వురు తోడనే ప్రచలితహృదయులై, కృపణులై, నిజహృదయాభిపూర్వకముగా ఖలీలునిఁ దిలకించిరి. కాని, ఆ తురుష్కవీరుఁడు నిశ్చలుఁడై యుండెను. జులేఖా పదభ్రంశమంది వేఱొక సోఫాపై నాసీనయై యుండుట వారప్పుడే కాంచి, తత్కారణ మరయఁజాలక విస్మితులైరి. అంత నిస్మిల్లా పాషా నుద్దేశించి, యిట్టు లనెను.

"ఆర్యా! వీరిలో నొకయువకుఁడు విచిత్రమగు గాథల వినిపించి మీకు కవితోల్లాసము కలిగించుచుండెనని వినియుంటి. నాథా! అట్టి

సదవకాశము నా కేల ఒసంగవైతివని కినిసి యరు దెంచితి సుమా!"

"ప్రేయసీ! కథలపై నీ కింత మక్కువయని యెఱుంగను. మఱియు, మహామ్మదీయ కులాంగనవు, పూర్వాచార పరాయణవునగు నీవు పర పురుష విహారణప్రదేశమున కేతెంచుట కరంబు దుస్సహంబని యెంచి నిన్నాహ్వానింపనైతి."

"నాథా! మగఁడుండు ప్రదేశము నాకు దుర్గమము కానేరదు. మఱియు, నీ పుత్రికలు మాతృవిహీనలు గదా. తత్సమానురాల నగు నేను తత్సమాన బాధ్యత వహించి, యిట్టిరంగముల దప్పక ఉండవలయు."

"ప్రేయసీ! నీ హృదయ మిటులుండునని యెఱుంగనైతి. ఎఱింగి నచో, నిన్నాహ్వానించియుండనా! కాని, ఈ యువకు లిఁక నిందుండఁ జాలరు. అజ్ఞానినై ఈ సజ్జనుల నింతకాల మీ మందిరమున నిలుపు టయే అయుక్తము.

"నాథా! నీ ప్రియభార్యవిన్నపము మన్నించి, యొకవరము ప్రసాదింతువా!"

ఆవగలాడి యట్లుప్రశ్నించుచు, ధైర్య విధ్వంసకరములగు స్త్రీజన సహజ కుటిలమందస్మితరుచిర జాలముల నవిరళముగఁ బర్వజేసెను. తన్ముహూర్తమున నా కళానిధి మేలిముసుంగు ఒకింత సడలెను. తా ననుదినము గాంచునదయ్యు, నా కాంత యా సమయమున సహస్రాధిక వైభవ సముజ్జ్వల శోభాయమానముగ సంపూర్ణ సుధాకరబింబసన్ని భముగ, దేదీప్యమానముగఁ గాన్పించెను. ఆ వృద్ధవీరుఁ డుద్విగ్నుఁడై, చకితుఁడై, ముగ్ధుఁడై, నిజమనోనిశ్చితాభిప్రాయవిరుద్ధముగ నా జగ న్మోహినికి వశంవదుఁడాయెను. అంత నా కుటిలాలకమంజుల వీణారవం బున నిట్లు లనెను —

ప్రాణనాథా! ఇతిహాసములు, చిత్రకథలు, దేశచరిత్రలు నాకుఁ గడుంగడు నానందదాయకములు. ప్రణయ వీర రసప్రధానములు,

ఆనందపఱచెడు ప్రాచీనములగు గాథలం జెప్పి నాలింపవలయుం గదా. కాని, మదీయ మనోరథము చెల్లించెదనని విశ్వసించెదను."

సాహా పక్షి యుప్పుకలికి విరమించినంతనే పాషా యిట్టు లనెను —

"ఖలీలుండు కృపాయత్తచిత్తుండై శ్రమయనక మఱియొకకథ వినిపింప నిచ్చగించు చేని, నా కభ్యంతరములేదు: మిత్రసహాయుండై, యీ రేయికూడ నిందుండి, ఉదయమగునంతనే వెడలవచ్చును."

ఖలీలుండు తోడనే సహజ నిశ్చల స్వరంబున నిట్టు లనెను —

"ఆర్యా! మ యభ్రిప్రాయ మఱస మెలంగుట నా కెంతెయు నానంద దాయకము. కాని, ఒక్క రహస్యము గమనింపుము. ప్రభురాణియే కూతూహల యగునపుడు కాదనరాదు. ఐనను, ఒక్క రేయి రెండు కథలం జెప్ప సామర్థ్యము నాకు లేదు. పాషా! ఈ కథలు పాఠమువలె ధారాపాతముగా నప్పగించునవి కావని విన్నవింతును. దినమెల్లం జింతించి చింతించి, మఱచిన విషయములను స్మరణకుం దెచ్చికొని, ఆయా విషయములను సరసముగ సూత్రపఱచి, యనంతరము మీకు వినిపింతును. ఆర్యా! కావున, భవదీయాజ్ఞ నుపసంహరింతువేని, రేపు రాత్రి యొక అపూర్వగాథ రచించి చెప్పెదను. వెనుకటి దానికంటె నయ్యది అధికతర ప్రమోదదాయకమై యొప్పును."

అంత నా మోహనాంగి ఇస్మిలిడా ఒయ్యారముగ నిజభర్తృ భుజ దండము స్పృశియించి మర్మభేద్యములగు సునిశిత మోహాంపుం జూడ్కులం బ్రసరించినంతనే, దాల్తబనుపాషా యచేతనుండై ఎట్ట కేల కిట్టులనెను —

"మిత్రులారా! ఈ మందిరమున మఱియొక దినమునుండి మదీయాతిథ్యము స్వీకరింపుఁడు. ఈ లోన ఖలీలుని ప్రశ్నము గుఱించి లెస్సగ విచారించుటకుం గూడ నవకాశమగును. ఆర్యా! ఖలీలు మిత్రమా! మమ్ముల నానందపరవశుల నొనరింపంగల విచిత్రకథ సమకూర్చి

సంసిద్ధుఁడవై యుండుము."

దాల్తఁను పాషా తోడనే గమనోన్ముఖుఁ డాయెను. లూకాసు జూలి యనులు రెండు ప్రణయంపు మాటలఁ దమకాంతల శ్రవణముల వడి వడి పలికి, ఆ తురుష్క ప్రభువు ననుగమించిరి. ఖలీలుఁ డన్ననో, దవ్వుననుండియే జులేఖానుగాంచి, ప్రణామ పూర్వకముగా మోము వాల్చి, తన మిత్రులవెంటఁ బోయెను. ఖలీలుని ప్రవర్తనము నిస్మిలిడా సతి యనిమిషనయనయై యరయుచుండెను. ఆ మత్తకాశిని చిత్త మనంత సంతసప్రచలిత మాయెను.

ఖలీలుఁడు క్రమముగాఁ దన ప్రత్యేక మందిరము చేరెను. తోడనే, యాతఁడు కుడ్యాంతర రహస్యకవాటము తెఱచి, నిగూఢ మార్గాంతరగతుఁడై, జూలియను గది కంటియుండిన మఱి తలుపు గూడ నేర్పుమెయి సడలించి, మిత్రసందర్శన మొనరించెను. ఆలోచనా పరుఁడై యుండిన జూలియను తొలుదొల్త భీతచేతస్కుఁ డయ్యు, వికసిత వదనుఁడై, "నీ వెట్టు లరుదెంచితివి? నీ రాకకుఁ గతంబెద్ది?" యని ప్రశ్నించెను. ఖలీలుఁ డిట్టు లనెను.

"సమాధాన మొసంగుట కిది యదనుగాదు. ఆలసించుట కవకాశము లేదు. నే నీ మందిరమున నుండువాఁడ: నీవు సత్వరము నా మందిరము జొచ్చి, రయమున దీపమార్చి, నా శయ్యపై వ్రాలియుండుము. వృద్ధ పరిచారిక శీఘ్రముగ నీ చెంత కేతెంచును. నీవు మాటాడక, ఆలసిం పక దానివెంట పొమ్ము. నే నని భ్రమించి యా పనికత్తె నిన్ను, తన దొరసాని క్రీడా మందిరమునకుఁ గొంపోవును. నిన్నుఁ గాంచునంతనే, పాషా పత్ని దురాగ్రహపరవశయగును. నీ వేమియుఁ జలింపక, పాషా యే కారణముననో నిన్ను నా మందిరమున నుంచెనని సమాధాన మొసంగి —"

"ప్రియమిత్రమా! సుందరాంగి యగు త్రైరజాకు మదీయహృదయ

మర్పించి, ఇపు డిట్టి యకార్య మొనరింతునా ?”

“వలదు ఆశ్చర్య మొందింప వలను. జూలియా సుందర చరణ సేవా పరాయణుఁడ నయ్యు, నే ననేకపాపులు ఇశ్శ్వరిడా నను క్షమునకుఁ బోలేదా ? కాన, నను పూనభయంబు వీడి యుండుము. ఆ మోహనాంగి యేనున్నను నను త్తరమొసంగి, నను యానుకూలముగ నొలంగుము. నీవు మేధావంతుఁడవు: రసజ్ఞుఁడవు; తప్పక కృతకృత్యుఁడ వగుదువు — ఇప్పు డేమియుఁ బ్రశ్నింపకుము. నీ పటులు మొలంగగ దేని, ఈ ప్రణయ నిలయమున మఱియొక దిన ముండఁగలను.”

“మిత్రమా ! నీ ప్రభావ మెట్టిదో గాని యమోఘము !” —

గ్రీశ యువకుఁ డట్లు సవిస్మయముగాఁ బలికి, మఱి యేమియో ప్రశ్నింపనుండ, వానిని వారించి తురుష్కుఁ డిట్లులనెను — “మిత్రుఁడా ! అత్యాతురము వలదు. మదీయ హితవాక్యముల నేమరక, అప్రమత్తుఁడవై ప్రవర్తింపుము. పొమ్ము.”

జూలియను మిత్రవచోబద్ధుఁడై, ముగ్ధుఁడై వల్లెయని యల్లనఁ బలుక, ఖలీలుఁడు మగుడ నిట్టు లనెను —

“మఱియొక మాట చెప్పవలయు. పాపాభార్య సముకమున నీ వుందునపు డేమైన విఘాతము కలుగవచ్చును. అట్టియెడ నీవు ధైర్యము వీడక, ఆ కాంత చూపు మార్గము ననుసరింపుము. మార్గమధ్యమున మహాకాయుఁడగు నల్లని సిద్దీయొకఁడు భయంకరఖడ్గధారియై గోచరించునేని, వాఁడు మార్గదర్శకుఁ డగును. వాఁడు నీ పిఱుంద రాఁగోరును: కాని, నీ వందుల కియ్యకొనక, వానినే ముందు నడిపింపుము. దాన సర్వభయంబులును దొలంగును. ఆయుధ మవసరమై యుండును: నా తల్పమున నొక కృపాణ మణఁగియుండును, తదస్త్రము ధరించి పొమ్ము.”

జూలియ నా ప్రకారము గోడయందుఁ జొచ్చి యంతర్హితుఁడై

సాగి క్రమముగా కుతూహలోద్రేకముతో మొగ్గరించి, తొలుదొల్త మణిమయ ప్రదీపిత ఖడ్గరాజము ప్రకాశించెను, నీరసపడి, శయ్యాగతుండై, ఖలీలు నిష్క్రమణమార్గప్రయత్నమును గూర్చి చింతింపఁ దొడంగెను. తనయత్నము లన్నియు నిష్ఫలములై తన విపరీతములై యున్నను, ఆతఁడు వివేకవంతుఁ డనియు, సాటిలేని మేటి మేధావి యనియు నెఱింగి, జూలియను నిశ్చలస్వాంతుఁడై యుండెను.

అంధకారమందిరమున గ్రీకుయువకుఁడు నాలుగైదు నిమిషములు మాత్ర ముండెను. అంతలోఁ దాళము తెఱిగెను. తలుపు తెఱచి యొక వ్యక్తి మెల్లగఁ బ్రవేశించి, గ్రీకును డాసెను. అచ్చట నొక దీప ముండెను. తద్దీపశిఖాకాంతి యతి మందముగ, గను నస్పష్టముగ నుండుటచే, నొకరి మొగ మొకరికిఁ గానరాకుండెను. అంత నా వృద్ధ కాంత మెల్లగ నిట్లు ప్రశ్నించెను — "అయ్యా! ప్రణయమందిరము నకు రా, సిద్ధముగ నున్నావుగదా? లెమ్ము!" అందులకుఁ బ్రత్యుత్త రముగా జూలియను నోరు విప్పకయే యొక కాసు తీసి యామె కొసంగెను. ఆ తాప్పుకత్తె సంతోషపరవశ ఆయెనని వేఱుగఁ జెప్ప వలయునా? గ్రీకు యువకుఁడు శోకనే లేచి, ఆమె వెనువెంట నరి గెను. మార్గమధ్యమున నమీనా వెనుదిరిగి చూడలేదు. వారట్లు క్రమముగా ప్రభురాణి మందిరము డాసిరి. త దవసరమున జూలి యను వదనము దృగ్గోచర మాయెను: జరఠాంగన యమిత విస్మయ భయాకుల యాయెను! అంతదనుక ఖలీలుఁడే తనవెంట నరుదెంచె నని ఆ పరిచారిక విశ్వసించి యుండెను. నిజాధికారిణీ మనోహారణ క్రియాదక్షుఁడగు ఖలీలుఁ డేమాయెను? ఈ జూలియ నెటు లేతెం చెను? దొరసాని ఏమనును? ఆ కాంత హృదయ మొక్కసారి కంపిం చెను: దుర్దంత విస్మయ భయాతిరేకమున మతి సెడి కెవ్వున నఱవఁ బోయెను. ఐనను, వివేకవతి యగుటచే నా దాసి నిగ్రహించికొని,

ప్రశ్నపూర్వక విలోకనముల నా గ్రీకుపైఁ బఱప, నాతఁడు గంభీరాననుఁడై యేమియో సమాధాన మొసంగఁబోయెను. కాని, అట్టి ప్రదేశమున నిలిచి ప్రసంగించుట ప్రమాదకరమని యెంచి, పరిచారిక ప్రభురాణి ప్రథమమందిరము ప్రవేశించెను. జూలియను కూడ బ్రవేశించెను. దాసి తోడనే తలుపుమూసి ప్రశ్నింప, నా యువకుఁ డిట్టు లనెను —

"పాపా నేఁ డేలకో నన్ను ఖలీలు మందిరమున నుంచఁజేసెను. అందుల కేమైనఁ గారణముండునో, లేక మఱచి యటుల నాచరించెనో, తెలియదు."

"కాని, నీ మందిరము చీకటిగ నుండెనేమి?"

"తైలము చాలియుండదు. నేను జూచుచుండగనే దీప మాఱిపోయెను."

"కావచ్చు. నీకీ ఖడ్గ మెటులు లభించెను?"

"ఈ ఖడ్గమా! నా మిత్రుని తల్పమున వ్రాలినంతనే హస్తమున కియ్యది తగిలెను: తోడనే, సంతుష్టాంతరంగుఁడనై ధరించితిని. ఈ ప్రదేశము నాకపరిచితము. సాయుధులగు సేవకులు లెక్కకు మీఱి యుందురు. ఏ ముహూర్తమున నే ప్రమాదము వాటిల్లునో యెఱుంగరాదు. అఖిలజన భయంకరంబులగు హత్యాపరంపర గుఱించి విని యుండుటచే, మఱియు భయమంది, శస్త్రధరుఁడనై యుండుట క్షేమకరమని యెంచితిని."

జూలియను పలుకులు నిశ్చలముగ, సరళముగ, హృదయమునుండి వెలువడినట్టులే యుండుటచే, నమీనా విశ్వసింపవలసిన దాయెను. అనుమాన మొకింత కలిగినను, తోడనే యంతరించెను. కాని, ఆకాంత యవస్థ కడు విషమముగ నుండెను. ఖలీలుని వదనసందర్శనోత్సుకమతియై యూటలూరు తన దొరసాని సమక్షమునకు

గ్రీకునుఁ గొంపోవఁదగునా ? ప్రభురాణి యేమనునో? ఖలీలుఁడు కాకున్న, మఱియొక సుందరాంగుఁడు లభించె గదా యని సంత సించునో ? లేక, ఆ తురుష్క మన్మథుఁడే కావలయునని చలము వహించి కినియునో? ఏమియుఁ దోఁపక, అమీనా తహతహలాడెను. దీర్ఘాలోచన నిరర్థకమని యెంచి ఆ దాసి యిట్లు ప్రశ్నించెను—

"అయ్యా ! నిన్నీస్థలమునకుఁ గొని వచ్చుటకుఁ గారణమెద్దియో యెఱుంగుదువా?"

"ఎఱుంగనా ! మనోహర ప్రేమధామమునకు రమ్మని పిలిచితివి, నేను వచ్చితిని. ఏశృంగార రసజ్ఞుఁడు నిరాకరించును!"

అమీనా మగుడ విభ్రమాకుల మానస ఆయెను. అంతలోనే దృఢసంకల్పయై, యిట్టు లనెను— "ఇక్కడనే రెండు నిమిషములు నిలిచి యుండుము — ఆ — వలదు! పాషా యీ లోపుననే రాఁగూడదా? కాన, ఈ తెఱ మఱుంగున దాగియుండుము. ఒకవేళ పాషా యరుదెంచుగాక — మఱి యెవ్వరైన నేతెంచుగాక — నీవు కదలక మెదలక విగ్రహమువలె నుండుము."

గ్రీకు యువకుఁ డాప్రకారము దాగినంతనే అమీనా యల్లనఁబొఱెను.

ఇస్మిలిడా సతీతిలకము తన్మందిర శ్రేణియందలి మూఁడవగది యందు అపూర్వరుచిరాంబరములఁ దాల్చి, శయ్యాతలంబున నొయ్యారముగ వ్రాలియుండెను. ఆ విషయలాలస నిజమనోనయన మున ఖలీలుని మనోహరాకారమునుం గాంచి మురియు చుండెను. ఆ కాంత గంభీరముగ సముచితముగ నున్నను కామాయత్తయై, విరహానలతప్తయై, లోలోనఁ గ్రాగుచుండెను. ఎన్నఁడు తురుష్కుఁ డరుదెంచునో, వాఁ డేక్షణము నిజబాహుపంజర బంధితుం డగునో యని ఆ విలాసిని యువ్విళులూరుచు, నిజహృదయాంధకార విధ్వంసన క్రియాదక్షుఁ డగు శీతల తురుష్క చంద్రోదయమునకై నిరీక్షించు

చుండ, నాకస్మికముగఁ దలుపు విఱిగెను; అమీనా ప్రవేశించెను. ప్రభుపత్ని హాతాశయై ఆగ్రహోద్యుక్త ఆయెను.

వృద్ధదాసి రయమున డాసి, జరిగిన వైపరీత్యము విశదీకరించెను. ప్రభురాణి మిక్కిలి చీకాకుపడి, బాధితాత్మయై, ఉస్సురని నిట్టూర్పు విడిచి, యిట్టు లనెను.—

ఎంత దురదృష్టము! ఆహా! విధి నాకు కేవలము ప్రతికూల మాయెనే! ఆ సుందరాంగుఁడు నాకు లభింపఁడా యేమి? దుర్భరమే! — అమీనా! ఆలసింపకుము! ఈ గ్రీకును రయమున మఱలించి, నా ఖలీలునిఁ గొని రావలయు—"

"దేవి! ఉచితానుచితము లరయవలయు. ఇన్ని రాకపోక లొనరించుట కడు ప్రమాదకరము సుమా!—"

"భయమేల! ఖలీలుఁడు నామనోహరుఁడు. ఆ వగకాఁడు నన్ను బిగియార నాలింగన మొనరింప దహించుకొని పోవువాఁడు — నే నా విషయ మెఱుంగుదు-కనులారఁ గాంచితి— నాకై ఆ మోహనాంగుఁడు నిజమనోహారిణి యగు జులేఖాను బరిత్యజించెను. ఓసీ! పొమ్ము! ఖలీలుని రయమునఁ దోడ్తెమ్ము!"

"దేవీ! తీవ్రపడకుము! సావధాన చిత్తవై నా విన్నపము మన్నింపుము. ఏతెంచిన యీ గ్రీకును పంపివేయుట పాడికాదు. నీ ప్రతిష్ఠ భంగపడును. నీ యభిమత మీ యువకుఁడు గుర్తించియే యుండును. ఇతఁడు తెలిసియో తెలియకయో ఒక్కమాట జారవిడుచునేని—"

"అబ్బా! నిజము నిజము! కానిమ్ము. — అమీనా! ఈ యువకుఁ డెవఁ డంటివి? తైరజావలచిన సుందరాంగుఁడేనా?"

"అతిసుందరాంగుఁడు! అత్యంత సుందరాంగుఁడు! దేవి! ఖలీలునకుఁ దీసిపోఁడని చెప్పఁగలను. ఏమైనను —"

అమీనా ఆవాక్యమును మాటలచేఁ బూరింపక, భావగర్భితమగు నొక్కవీక్షణముచేఁ దదర్థము వ్యక్తీకరించెను. ప్రభుభార్య ఆలోచనా పరతంత్రయాయెను. ఆ వన్నెలాడికిఁ దురుష్కునిపైఁ గల ప్రేమ నిర్మలమైనది కాదు. అయ్యది కేవలము కామోద్రేకము. ఖలీలుని గాంచినంతనే ఆ కామిని చిత్త ముద్రేకించెను. అట్టి కామిని మఱి యొకనిఁ గాంచి మాత్రము మోహపరవశ కాకుండునా! ఖలీలుఁడైన నేమి! మఱి జూలియస్సైన నేమి? కాన, నాప్రభురాణి వినిశ్చితయై, యిట్టు లనెను —

"అమీనా! ఈ గ్రీకు యువకునిఁ దిలకింతును. రయమునఁ బ్రవేశపెట్టుము."

"దేవీ! అడుగ మఱచితిని, సిద్దినిఁ బ్రశ్నించితివా?"

"ప్రశ్నించితి: ఆ సమాచారము సావకాశముగాఁ దెల్పెదను; పొమ్ము!"

అమీనా యిఁక మాటాడక జూలియను దాగియున్న స్థలమున కేగి. ఆ తెర తీయఁబోయెను. ఆ సమయమున నవ్వాల సవ్వడి విన వచ్చెను! పరిచారిక నిశ్చేష్టయై యటు పరికింప, తాళము మీటి, విసురునఁ గవాటము పోఁద్రోసి దాల్తబను పాషా బోరున బ్రవేశించెను! అమీనా అమితభయాక్రాంతచిత్త యయ్యు, సంధాన కార్య ప్రవీణయగుటచే భయమున కెడమీక, గ్రీకును ముందుగనే గుప్తపఱచినందులకు లోలోనఁ దనుఁ దాఁ బొగడికొనుచు, భయభక్తియుతయై సగౌరవముగాఁ జేతులు జోడించి యుండ, పాషా యిట్టు లనెను —

"అమీనా! అపురూపమగు నౌకైదువు దొరకెనా! నిన్ననో, మొన్ననో నీ రాణిమందిరమున మఱచి యుంటిని. ఇంతలో నే మగును! దేవి తా నెఱుంగ దనుచున్నది —"

"పాపా! నే నెంతయో వెదకితిని: కను లన్నియు గాంచితిని. ఐనను గానరా —"

"దాసీ! అటులైన, మదీయసేవకాళి ఆ యమూల్య ఖడ్గము తస్కరించి యుందురు."

తురుష్క ప్రభువు క్రోధఘూర్ణమానమానసుఁడై దుర్నిరీక్ష్యుడై యుండెను.

"పాపా! అట్టులనే కావలయు. ఎట్టులైనను ఆ జాడ కనిపెట్టఁ బ్రయత్నింతును —"

"అటు లాలోచింపుము. మంచి బహుమానము నొసంగెదను. అమీనా! ఈ ప్రదేశమున నూపిరి సలుపకున్నది. గవాక్షమున కడ్డుగ నీ తెరయేల? దీనిఁ దొలంగించినచోఁ జల్లని పిల్లవాయువు లరుదేరఁగలవు."

పాపా యట్లు పలుకుచు, జూలియను దాగియుండిన పటము చెంతకుఁ బోయి, తొలంగించు నుద్దేశమున నద్దానిపైఁ జేయివైచెను. ఆహా! ఎంత ప్రమాదకరము! జూలియను ఏమి కావలయు? అమీనా యేమి కావలయు? ప్రభుపత్ని యేమి కావలయు? కాని అమీనా సామాన్యురాలు గాదు. ఆ దిట్టరి బిరానఁ బోయి ప్రభు భుజము పట్టి యాతుర కాతరస్వరమున నిట్టు లనెను —

"దేవా! వలదు, వలదు! దేవి శీతలబాధ గమనించి విరమింపుము! శైత్యాధికమునఁ గడు గుందుచున్నది: పవన మొక్కపిసరరుదెంచినను ప్రమాదకరము!"

పాపా హస్త మట్టులే జారిపోయెను — "ఏమి! దేవి కనారోగ్యమా! సాయంకాలమున మత్పుత్రీ కాసదనమునఁ గాంచియుంటిని: నా దేవి ప్రఫుల్లమై కలకలలాడుచుండెనే! అసాధారణసౌందర్యముతోఁ గూడ వదనము వలరారుచుండెనే!"

" పాషా! దేవి యెల్లప్పుడు మనోహరముగా నుండును. దేవా! తమ దర్శనార్థము మా దేవి యాతురచిత్తయై నిరీక్షించుచున్నది."

"ఇదె పోవువాఁడను. కాని, అమీనా! నా ముద్దుల కైదువు కానరాకున్నది. దురాత్ముల కెంతటి కండకావరము! ఎంతటి సాహసము! నా మందిరముననే ఇంతటి చౌర్యమా? ఉపేక్షింపఁజాలను! నా భృత్యులందఱు నవ్వల నిలిచియుండవలయు నని ఆజ్ఞాపింపుము. అచిర కాలమున వారిపని పట్టింతును! పొమ్ము! అమీనా! అటు లొనరింపుము!"

ఆ ముహూర్తమునఁ దలుపు తెఱచికొని దరహాసవిరాజితవదన యగు నిస్మిలిడా తన మగని కడ కరుదెంచెను. విషణ్ణురాలై, తదాలోచనాసాగరతరంగడోలికావిహారిణియై యున్న ఆ కామినికి పాషా కంఠధ్వని యంతలోఁ బిడుగువలె వినవచ్చెను. జూలియను ప్రథమమందిరముననే దాగియుండెను! అచ్చటనే పాషా యమీనాలు సంభాషించుచుండిరి! క్రూరవిధివశంబునఁ దన రహస్యము బయల్పడు నేని, అమీనా జూలియనులతోఁ బాటు తాను దుర్భర భాస్వరజల రాశి గర్భస్థ కావలయు! కాన, నా కాంత యమితభయాకుల చిత్తయై దిగ్గున బోయి, తలుపుచాటున నక్కి తరుణ తరుపత్రము వలెఁ బ్రచలించు హృదయము నొక కేలఁ బట్టి ఆ ప్రసంగము నాలించెను. తన ఖడ్గము కానరామి తురుష్కప్రభువు క్రోధోన్మత్తుఁడై యుండెను. ప్రభుపత్ని హృదయావేగము ద్విగుణీకృతమాయెను గినను, కుటిలస్త్రీజన సహజధైర్యము వహించి, ఆ వనిత వేచియుండెను. అమితచతురమతియగు నమీనా ఆసన్న మహోపద్రవము సులువుగాఁ దొలంగించెను. ఇస్మిలిడా దుర్భరహృదయభార మడంగెను. తదుత్సాహావరవశయై, ప్రఫుల్ల వదనయై ఆ తరళేక్షణ తన వల్లభుని సుస్వాగత మొసంగెను.

అమీనా యచట నొక్క నిముసమైనఁ దడయక, మనోవేగమున నావలకుఁ బోయి, ప్రభు నాజ్ఞానుసారముగాఁ బరిజనుల నందఱను జీరి, క్రోధఘూర్ణితప్రభుసమక్షమున వా రేమిచెప్పవలయునో పాఠము చెప్పెను. పాప మా సేవకు లేపాప మెఱుంగరుగదా. ఖడ్గము తస్కరింపకుండుటయే గాక, అయ్యది పోయెనని యైనను వారికిఁ దెలియదు.

అమీనా తత్కార్య నిమగ్నయై యుండ ఇస్మిల్లాసతి సుప్రసన్నాననయై, మధురస్వరమున సాదరముగా నిట్లులనెను —

"నాథా ! నీ వదన మేలకో వ్యాకులితమై తోఁచెడిని. నేను సహింపఁజాలను—"

"కాంతా ! నీ కా వంతవలదు. నా ప్రియతమఖడ్గము పోయెఁ గదా. దొంగను బట్టుటకై కట్టుదిట్టములు చేయుచుంటిని. కాని, ప్రేయసీ ! నీవు సుఖముగా లేవని వింటినే. ఏమి—"

"నిజము, నాథా ! నేనిందుఁ బ్రవేశించినంతనే, నాతను వొక్కసారి శైత్యాధీనమాయెను."

అమీనా కుటిలాలాపములు వినియుండుటచే, నిస్మిల్లా తదను గుణముగా వాక్రుచ్చెను. కాని, ఆమె హృదయము లోలోనఁ గడుఁ గంపించుచునే యుండెను.

"తరుణీ ! ఈగది కడు శీతలము. నీ విందు నిలిచిన, మఱియు బాధకరముగా నుండును. కావున లోనికిఁ బోదము రమ్ము."

నిష్కపటి యగు పాషా యట్లు పలుక నిజముగఁ జలిబాధచేఁ గుందుచున్నదివలె నా కాంత ఉహుహూ యని వణకి, వల్లెయని తల యూపెను, ఆ ఖగళాడి నిజనాథుభుజావలంబిత మనోహారవల్లరియై

యల్లన దన శయ్యామందిరము చేరి, శయ్యపై వ్రాలెను. పాషా యా తల్పముననే ఆసీనుఁడాయెను. ఆ మెఱుఁగుఁబోడి యనూన సోయగముఁ గాంచి, యా వీరుఁడు విగతధైర్యుఁ డాయెను. ఆ యిందువదన హసనాననయై, నిజమధుర మంజులాలాపములచేఁ దన ప్రభు నన్యవిచారశూన్యు నొనరించెను. ఆ టర్క్ లాడి యొక్క క్షణము క్రిందటనే శీతలబాధ నభినయించెను. ఇప్పుడా మదవతి నిద్దంపుఁజెక్కులు మనోహరారుణకాంతిభాసురములై యుండెను. ఆ మేటి మగఁడు మోహాతిరేకమున మునుఁగుఁడాయెను గాని, లేదేని, తత్కోటిల్యము గుర్తించియే యుండును. మంత్రముగ్ధుఁడువోలెఁ దన కృపాణము గుఱించియు, దురాగ్రహము గుఱించియు, అమీనాకుఁ దా నొసంగిన కఠినశాసనము గుఱించియు నా వీరుఁడు పూర్తిగ మఱచి, మోహవిభ్రాంతుఁడై నిజభామినీ భుజపంజరబంధితుఁడై నిద్రాపరుఁడాయెను.

జూలియను దాగి యొక గంటయాయెను. వాని యవస్థ వర్ణనాతీతము. పాషా యా మఱుఁగు తొలగించెనేని, ఎంతయేని అపాయము ఘటిల్లి యుండెడిది. తొలుదొల్త నా గ్రీకుయువకుని తనువు శారున రెండు తునకలై పడియుండెడిది. అమీనా తదపాయము తొలఁగించినను, ఏమగును? ఐనను, ఎంతటి విపత్తు సంభవించినను తన్నివారణోపాయము తోడనే యుండునని హెచ్చరించిన మిత్రవచనములు తలంపునకు వచ్చుటచే, జూలియను నిర్భయముగ నుండెను.

ప్రభునాజ్ఞానువర్తియై అమీనా సిద్దీలనందఱను ద్వారముచెంత బారు తీయించి యుంచెను. ఆ తంత్రకర్త్రి చిత్తము కడు నల్లాడుచుండెను. మందిరమున నేమగుచుండెనో, ఆ ముదుసలి యెఱుంగదాయెను. మెల్లగ లోనికేగి పరికింపవలయునని దాసి కడు తత్తరపడుచుండెను, కాని, భయానక పాదరక్షలు దయ్యములవలె గోచ

రించుచుండ, నెట్లు పోఁగలదు? పాషా క్రీడామందిరాంతర్గతుఁడై
యుండుసమయమున, దన్మహానీయుఁడు చీరకుండ, నెవరును ప్రవేశింప
రాదు. కాని, అమీనా విశేషానుభవము పొల్లుపోవునా? ప్రౌఢ
కాంతయగు తన దొరసాని సమయోచితముగఁ బ్రవర్తించుటను
గ్రహించి, దాసి భయ ముడిగి యుండెను. పాషా యింకను రాకుం
డెను. కావునఁ దనరాణి పాషాను విభ్రాంతు నొనరించి, నిద్రాసుఖ
మొనరించుచుండెనని యెంచి అమీనా సంతసించెను.

తురుష్క ప్రభువు నిజకాంతాభుజవల్లికా డోలికావిహారియై, తదుగ్ర
వక్షోజాశ్రితశిరస్కుఁడై లోకమెఱుంగక హాయిగ నిద్రించుచుండెను.
తద్విషయము గుర్తించి ఇస్మిల్లా యల్లన విడిపించికొని, అని
మిషనయనయై, నిబద్ధనిశ్వాసయై, తన మగని మస్తకము మెల్ల
మెల్లగ దిండులపై నిడెను. ప్రభువునకు నిద్రాభంగము కలుగలేదు.
తోడనే, ఆకాంత రయమునలేచి పాదరక్షలు విడిచి, కడునిశ్శబ్దముగ
నడచి, జూలియను దాగియుండిన తావునకేగి, కొండొక కవాటమున
దొంగిచూచెను. వరుసగ నిలిచియున్న ప్రభుభృత్యులును అమీనా
యును గోచరించిరి. అందు నిరువురు తప్ప మిగిలినవారు విశ్వాస
నీయులే. కాని ఆ యిరువురు మాత్రము ప్రభురాణీ రహస్యకథా కలా
పము నెఱుంగరు. ఆ కారణమున జూలియను నామార్గమున సాగ
నంపుట యసంగతము. కనకము సర్వభయనివారిణి: ఐనను, ఆ తులు
వలు తుంటరులై రహస్యభంగ మొనరింపవచ్చును. ఆ సేవకులను దమ
తమ నెలవులకుఁ బంపివేయుటకు వీలుకాకుండెను. పాషా యే
ముహూర్తమున మేల్కాంచునో యెఱుఁగరాదు. ఆతని శాసన
మమోఘము. ప్రభుపత్నియైన నుల్లంఘింపరాదు. ఆమహానీయుఁ
డొకవేళ రేయియెల్ల నిద్రించునేని, పరిచారకులంతదనుక అట్టులు వేచి
యుండవలసినదే. ఐన, జూలియను మాట యేమి కావలయు? తన

మాట యేమి కావలయు ?

ఏమైనను, గ్రీకుయువకుఁ డందుఁదడయుట కర మపాయకరము. ఎట్లైనను వానిం దరలింపవలయును. ఆమె రెండు నిముసములు విచారించి, సంశయవివర్జితయై, కృతనిశ్చయయై, తన కెంబెవపున వ్రేలిడి, తెర సడలించి రమ్మని సన్నయొనరించెను. నీలమేఘనిర్ముక్త సుధాకరమూర్తివలె జూలియను యొక్క మనోహరమూర్తి దృగ్గోచరమైనంతనే, ఆ యువతి హృదయము కంపించెను. తెరజాపార్శ్వచరుఁడై నపుడుకంటె నీ సమయమున జూలియను ద్విగుణీకృత సౌందర్యవైభవ విభాసితుఁడై, దర్శనీయుఁడై యలరారుచుండెను. అట్టి సమయమునఁ దన వల్లభుఁ డరుదెంచినందులకా కామిని కడు విచారించెను. కాని, విచారమునకు గాని విలాసమునకు గాని యవకాశ మెక్కడ ? పాపా యేక్షణమునసైన మేల్కొనవచ్చును. కావున నొక క్షణమైనఁ దామసింపరాదు. అంతలో జూలియను హస్తమున నవరత్నఖచితకృపాణము కానవచ్చుటచే, నిస్మిల్లా తోడనే మెల్లగ నిట్టులనెను — "ఆకైదు విటు తెమ్ము ! చూచితిగదా. ఇయ్యది కానరామి ఎంత గంద్రగోళమగుచుండెనో ?"

"వనితామణీ ! క్షమింపుము. మఱియేమికోరినను, శిరమునఁదాల్తుఁ గాని, దీనినిమాత్రము వీడఁజాలను."

"ఏల వీడవు ?"

అట్లు ప్రశ్నించు నాకాంత దుర్నిరీక్ష్యముగ నుండెను. మనోహర మధురవీక్షణ నిలయములగు నాకాంతనయనము లాకస్మికముగఁ బ్రచండానల సన్నిభములాయెను : మందహాస విరాజితమగు సుందరాననము అపూర్వభయానకమాయెను. మృదులమోహన సుందర సుకుమార కుసుమగాత్రి చూచుచుండగనే, పెనురక్కసియైనటులు తోఁచెను. ఐనను, జూలియను నిశ్చలస్వరమున సగౌరవముగ నిట్టులనెను.

"తరుణీ! వీడఁజాలను. ఏమందువా? అపాయసాగరమధ్యమున నిలిచి యున్నవాఁడ. సేవకులు సాయుధులై, యప్రమత్తులై, యవ్వలనే యున్నవారు. భయంకరుఁడగు నీ నాథుఁడిందే యున్నవాఁడు. రాగాని స్థలంబున కెట్టులో యరుదెంచి చిక్కుపడితివి: అట్టి వానికి ఖడ్గమువలదా!"

ఇస్మిల్డా క్రోధముడిగెను. ఆమె వినమ్రమై దైన్యస్వరమున నిట్టులనెను — "అయ్యా! నిన్ను సురక్షితముగ నీ మందిరమునకుఁ జేర్పఁగలను — ఖడ్గమిమ్ము."

"తరుణీ! నీకోరిక మన్నింపఁ జాలనైతినని మిగుల విచారించువాఁడను నాస్థలమున కేగుదనుక, ఈ యస్త్రము వీడఁజాలను. అనంతరము నేగాంచిన తావుననే భద్రపఱచువాఁడను. ఉదయమగునంతనే, నీపరిచారకులు నీ కొసంగెదరుగాక."

ఇస్మిల్డా తన విశాలనయనములను విశాలతరంబొనరించి, నిమిషముడిగి, గ్రీకుయువకునిపై సునిశిత వీక్షణజాలముల నవిరళోముగఁ బఱపెను. వాని మానసమున నెట్టి దురూహా యడంగియుండునో యని ఆ విలాసిని యరయఁగడంగెను. కాని, జూలియను నిశ్చలచిత్తుఁడై యచలాకృతినుండెను. ఆ యువకుఁడు నిష్కపటి యని యెంచి, ప్రభుపత్ని సంతసించి, తన వెంట రమ్మని సన్నయొనరించి యిట్టులనెను —

"ఇంచుకేనియుఁ జలింపవలదు! నిశ్చలచిత్తుఁడవై నా వెనువెంట నరుదెమ్ము. మన యిరువురి ప్రాణములును ఒక్క శిరోజమాత్రపటుత్వము గలిగియున్నవని యెఱుంగుము. అణుమాత్ర మప్రమత్తుఁడ వగుదేని, అణుమాత్రము భీతుఁడ వగుదేని, మన మిరువురము విచ్ఛిన్నమస్తకులమై, భయంకర బోస్ఫరజలరాశి గర్భస్థుల మగుదు మని యెఱుంగుము!"

జూలియను సముచితముగ బదులాడెను. వాని గాంభీర్యము గాంచి, సంతసించి, నిజసుందర తరుణారుణ చరణపల్లవములతో రత్నకంబళము లపై సల్లన నడచి, తన శయ్యాగారము డాసినంతనే యట నిలువ వలయునని ప్రభుపత్ని గ్రీకునకు సన్న యొనరించెను. అనంతర మా మద వతి శయ్యాగతుఁడైన తన మగఁ డెటులుండెనో యని అల్లన తొంగి చూచెను. ప్రభు వట్టులే మైమఱచి నిద్రించుచుండెను. ఆ కారణమున నా కాంత వెలు పుడిగి, నిజమందిరప్రవేశ మొనరించెను: గుర్తెఱిఁగి, జూలియనుఁ డనుగమించెను. వాని హస్తము తన మొలనున్న బాకు మీఁదనే యుండెను. విధివశమునఁ దురుష్క-ప్రభువు మేల్కాంచు సేని, ఆత్మసంరక్షణ మొనరించుకొన నాతఁడు సంసిద్ధుఁడై యుండెను. కాని, పాపా కేవలము శిలాప్రతిమవలెఁ బడియుండుటచే, వాని ప్రయత్నము వ్యర్థమాయెను. మందిరాంతము నిరపాయముగాఁ జేరి ప్రభుపత్ని యచటి మొగమలు తెర సడలించి, తత్ప్రదేశమున నున్న ద్వారము తెఱచి, తన యనుచరుఁ డటు పోవలయునని యాతుర దైన్యభావము లుట్టిపడఁ బలికెను. జూలియనుఁ డటులాచరించెను.

మునకుఁ జిరపరిచితమగు లోహదీపప్రకాశిత పథమున గ్రీకు యువ కుఁడు పోసాగెను. మిత్రుఁడగు ఖలీలు హెచ్చరిక నేమఱక జూలి యనుఁ డప్రమత్తుఁడై హస్తము ఖడ్గముమీఁదనే యుంచి నడుచు చుండెను. కొంతద వ్వరిగినంతనే, నీలజీమూతసన్నిభ దీర్ఘకాయుఁడు భయంకర కరవాలధారియై భయతరంబుగ గోచరించెను. ఖలీలు ముందుగనే ఎఱింగించి యుండుటచే, జూలియను చలింపక స్థిరచిత్తుఁడై యుండెను.

జూలియను గోచరించినంతనే, ఆ సిద్దీ వినయ గౌరవ పూర్వకముగాఁ దన ఖడ్గము తటోత్కోశమునందిడి, దైన్యముగ నిట్టులనెను —

"ఆర్యా! క్షమింపుము. ప్రభునిక్షేపము నపహరించు ధూర్తులు కని

పట్టికొని యుందును: కావున నెవ్వ రరుదెంతురో, ఎట్టి యాగంతకుఁ డేతెంచునో యెఱుంగఁజాలక, ఇట్టి భయంకరరూపమునఁ గావలి యుందును. నిన్నుఁ గాంచినంతనే నీ రాకకుఁ గతెఱింగితిని. దారి చూపెదను, దయచేయుము."

"కాని, ఈ నిగూఢ ప్రదేశము నాకుఁ గేవలము వింతగ నున్నది. కావున, నీవు ముందు నడచిన, నే ననుగమింతును."

అధమ సేవకోచితమైన వ్యవదనమున సిద్దీ యిట్టులనెను —

" అధమాధముఁడను, ముందు నడవఁగలనా! మఱియు, ఈ మార్గము సుగమము; దయచేయుఁడు."

మిశ్రవచోబద్ధుఁడైన జూలియను గంభీరవదనుఁడై, కఠినస్వరమున నిట్టులనెను —

"నీవు ముందుఁ బోవలయు: ఇయ్యది నా యాజ్ఞ అని గ్రహించి నడువుము."

"అయ్యా! ఔఁగాక. కాని, ఆయుధము ధరింపనేల? నేను ఘోర ద్రోహ మొనరింతునని భావింతువా?"

"ఒక్క క్షణముక్రిందట నీ యాకృతి యెటు లుండెనో కాంచితి గదా. అట్టి బెట్టిదుల కాటపట్టగు నిట్టి స్థలమున నాయుధము తాల్ప వలదా?"

సిద్దీ వదనము అపూర్వముగ మాఱిపోయెను. అది యొకక్షణికము. తదుత్తరక్షణముననే వాఁడు రయమునఁ దిరిగి మార్గదర్శకుఁ డాయెను. వారు క్రమముగా మెట్టుదిగిరి. జూలియను అనిమిష నయనుఁడై ఆ సేవకు నరయుచుండెను. కడమెట్టు చేరినంతనే, వాని హస్తము మెల్లగ ఖడ్గముపైకి బోవుచుండెను: గ్రీకు యువకుఁడు మఱియు నప్రమత్తుఁ డాయెను. సిద్దీ ఒక్కయడుగు వైచి, తన కర వాలముఁ బట్టఁబోయెను. గ్రీకు సక్రోధముగ తద్దురాచారముం గాంచు

చుండగనే, ఆ మూలలనుండి మఱియొకవ్యక్తి గోచరమాయెను.

ఆ వ్యక్తి ఖలీలుఁడు; మిత్రసందర్శన మైనంతనే, జూలియను మానసము ప్పొంగెను. సిద్దీ యవస్థ మాత్రము కేవలము విరుద్ధముగ నుండెను. ఖలీలునిఁ గాంచినంతనే ఆ ఘోరాకారుఁడు వన్యమృగమువలె గుఱ్ఱెడెను. తురుష్కవీరుఁడు నిరాయుధుఁడు. ఐనను, ఆతనిఁ గాంచినంతనే సిద్దీ చకితుఁ డాయెను. ఖలీలుఁ డంతఁ గడుగంభీరముగ వానిని డాసి యిట్టులనెను —

"పరిచారకా! నీ ప్రవర్తనమునకు సంతసించితిని. గత నిశాసమాచారము వివేకవంతుఁడవై వెల్లడింపవైతివి. ఇప్పుడు నట్టులే మెలంగుము. నా గుఱించి యెటులాడితివో, నా మిత్రుని గుఱించియు నటులే యాడుము. తద్విరుద్ధముగ నాచరింపఁ గడంగుదేని, నీ ప్రాణము మదధీనమై యున్నదని స్మరింపుము: భద్రము!"

తా నొక యధికారివలె ఖలీలుఁడు మాటలాడెను. జనప్రదర్శిత వ్యాఘ్రమువలె సిద్దీ దుర్బలుఁడై ఘూర్ణిల్లి, యపూర్వ భయవిహ్వలుఁడై, యట్టె నిలిచిపోయెను. ఖలీలుఁడు హస్తసంచలన మొనరించెను: ఆతనివెంట జూలియను పోయెను. వా రిరువురు క్రమముగా ఖలీలుమందిరముఁ జేరిరి. "మిత్రమా! జరిగిన సమాచారము సవిస్తర మెఱింగింపుము." అని ఖలీలు కోర, జూలియను స్వీయకథాకథన మొనరించి యిట్లు ప్రశ్నించెను —

"నా కథ వింటివి. ఇఁక నీ కథ వినవలయు. నీ ప్రవర్తనము అవ్యక్తముగ, నిగూఢముగ కేవల మతీతముగ నున్నది. గంభీర వీక్షణమాత్రమున నా కరాళదీర్ఘకాయునిఁ బ్రచలింపఁ జేసితివి. మిత్రమా! నా చిత్తము భయంకరానుమానబాధిత మగుచున్నది —"

"చాలు! మిత్రమా! సమాధానముల కిది సమయము కాదు. నీ మిత్రుఁడ లూకానున కీ విషయమంతయుఁ దెలుపవలదు. మిత్రమా!

నన్ను విశ్వసించి, ఏమియుఁ బ్రశ్నింపక, ఎయ్యది ఎట్లు పరిణమించునో పరికించుచుండుము. నా మాట కెుగాదక మెలంగెదేని, భవదీయ హృదయాపహారిణి యగు తైరజాను జేపట్టఁగలవని సనుయ మొనరింతును. ఆ ఖడ్గ మిఁక నిటు తెమ్ము. శయ్యాగతుఁడవై నీ తైరజాను సంస్మరింపుచు నిద్రింపుము. ”

ఎన్నెన్నియో ప్రశ్న లడుగవలయునని జూలియను చిత్త ముడికి పోవుచుండెను. ఐనను, ఖలీలుఁ డట్లు పలికినపిమ్మట మాఱాడఁజాలక ఖడ్గమువీడి కరస్పర్శన మొనరించి, ఆతఁడు తన మందిరమున కేగెను.

మఱుచటి యుదయము యథాప్రకారముగ పాషా పరిచారకు లేతెంచి, ఖలీలానుల మందిరద్వారములఁ దెఱచిరి. కొంతదవ్వున అమీనా యొకమూల నక్కి యుండెను. ఆమె కాన్పించినంతనే, ఖలీలుఁడు తత్కారణము సుళువుగా గుర్తించెను. ఐనను, ఆ వీరుఁ డా వృద్ధురాలిని గాంచనట్టులే ప్రవర్తించెను. యువకులు మువ్వురును గోచరించినంతనే, ఆమె తనదారిం బోయెను.

పరస్పరసహవాససౌఖ్యము ననుభవింపుచు నా మిత్రులు దినమెల్ల హాయిగఁ బోనిచ్చిరి. తన రహస్యము లూకాసున కెఱింగింపక, తద్విషయమై ఖలీలుని బ్రశ్నింపక, జూలియను సముచితముగ సంచరించెను.

సాయంకాల మాయెను: పాషా ప్రభృతు లరుదెంచిరి. తా మెంతయు నాతురపడు ప్రణయమందిరమునకుఁ దోడనే మిత్రులు పోయి, ప్రియాంగనావదన సందర్శన మొనరించి ధన్యులైరి. పాషా గంభీరముగ సుఖాసీనుఁడై యుండెను. ఇస్మిల్లాసతి ఆ చెంతనే మేలిముసుంగు ధరించియుండెను. ఆకారణమున నా పడంతి ఈ సమయమున నెట్టిభావములు కల్గియుండునో అరయుట కవకాశము లేకుండెను. లూకాసు రయమునఁబోయి తన గుల్నెరుచెంగట

నుపవిష్టుఁడాయెను. తన, ప్రాణకాంత చెంత జూలియను అధివసించెను. ఖలీలుఁడు దవ్వుననున్నయొ జాలెఖాను గాంచి సగౌరవముగా శిరమువాల్చి, దవ్వుననే సమాసీనుఁడాయెను. కథాప్రసంగోత్సాహితులై దార్లబను పాషా కాలక్షేపము సేయుచుండుటచే, ఖలీలుఁడు తదుద్యోగ భాగము నటునిటు నడిపెను.

౧౪

1452 సంవత్సర మొకనాఁటి సుప్రభాతసమయమున వేఁటకై దర్పముగ బయల్వెడలిన యొకానొక సంఘమునుండి ఘనవేషధారుఁడగు నొక సుందరతురుష్కయువకుఁడు విడువడి, మృగయాపరతంత్రుఁడై, తదుత్సాహాతిశయమున మున్ జాల దవ్వరిగెను. ఆ వీరుఁ డాకస్మికముగా వెనుదిరిగినంతనే, తత్ప్రమాదము వ్యక్తమాయెను. దుర్గమారణ్యభూములఁ దాను దారి తప్పితినని యాతఁ డపుడు గ్రహించెను. తన వారలరుదెంతురేమో యని యతఁడు కొంత తడవు నిరీక్షించెను. కాని, ఎవ్వరు రారైరి. తానెటుఁబోవుటకును దోఁపక, ఆ వీరుఁడు వారువముడిగ్గి, వినిర్మలనదీప్రవాహముపొంత నాసీనుఁడై, గాఢ దీర్ఘాలోచనాపరుఁడై ప్రపంచము మఱచెను.

ఆలోచనాసమాధియం దాతఁ డెంతకాల ముండెనో యెఱుంగరాదు. కాని, ఆవీరుఁ డాకస్మికముగఁ ద్రుళ్ళి పరికించుసంతనే, తన భుజములక్రిందుగ, బేరుటురమునకుఁ జుట్టి యొక పాశము గోచరమాయెను! ఆ క్షణముననే అయ్యది బిగియుటచే, నా యువకుఁడు పూర్తిగ నస్వతంత్రుఁ డాయెను. క్రోధవిస్మయాతిరేకమున రయమున నిటునటుఁ జూడ, మొఱకులగు ముచ్చులు ముప్పురు కాన్పించిరి. వారి భావము తోఁడనే గుర్తించి "మీకేమి కావలయు" నని తురుష్కుఁడు ప్రశ్నించెను. అందొకఁ డిట్టులు బదులాడెను—

"చక్కఁగ నడిగితివి! మా కేమికావలయునో చెప్పెద, వినుము, మహానీయా! మొదట నీమొలకు (వ్రేలాడుసంచియందలి సువర్ణము కావలయు; రెండవది, నీవు ధరించిన యుంగరములు; మూఁడవది, కొన్ని దినములు నీసహవాసము: తగిన పరిహారము మాకు లభించి నంతనే మమ్ము వీడవచ్చును."

ఆ మోటుకుఁ డట్లు కటుకుగఁ బలుక, యువకుఁ డిట్టులనెను —

"నాచెంతఁగల సువర్ణనాణెములను ఆభరణములను మీకొసంగెదను. నన్ను మాత్రము పోనిండు. మీకుఁ బరిహారధన మెంతో కావలయునో, ఎన్ని వేలసువర్ణములు కావలయునో చెప్పుడు. నేఁ బోయినంతనే తప్పక మీ కంపెదను. మహమ్మదుపై, బ్రూసా నగరస్థ సమాధులందు శయనించుసుల్తానులపై నమయము సేసిచెప్పెద — ధన మెవ్వని కేస్థలమున నొసంగవలయునో మీరే నిర్ణయింపుఁడు, అట్లనే యగు."

అంత నొకదొంగ వికటముగ నిట్లు లనెను —

"అయ్యా! మే మొక విధమగు వర్తకులము: ఇట్టి నీటుమాటల వలనఁ బ్రయోజనములేదు. ఇట్టిది వ్యవహారధర్మము కాదు. అల్లదె, వనము! మే మందు నివసింతుము. మా యొడయఁడుకూడ నం దున్నాఁడు. సత్వరము దయచేయుము."

తురుష్కుఁ డెంతయో బ్రతిమాలెను; ఎన్నియో సమయము లొనరించెను; ఎంతయో యాసపెట్టెను. కాని, ఆ దురాత్ములు పాషాణహృదయులై నిరాకరించి, తమతో రయమున రావలయునని తొందర యొనరించిరి. ఆలసించినచోఁ దన యనుచరు లేతేరవచ్చునని యాసించి, తురుష్కయువకుఁ డా మ్రుచ్చులను మఱల మఱల నర్థింపఁ దొడఁగెను. ఆ రహస్యము దొంగలుకూడఁ గొంత తడవైనపిమ్మట గ్రహించి, యా వీరుని బలిమిమై తరలింప నుద్యమించిరి. అట్టిమొడ

హాయరింఖానినాదములు వినవచ్చెను. యువకుఁ డానందపరవశుఁడై "అల్లా! ఇఁక బ్రతికితి!" నని యఱచెను.

"లేదు ! ఆ యేతెంచువారిలో నొకఁడు పురుషుఁడు: రెండవది స్త్రీ ! నీ కేమియు లాభములేదు"

ఒక చోరుఁ డట్లు పలుకుచునుండ, నా యువకుఁ డెలుగెత్తి నూతనాగతుల సంబోధించెను. ఆ దుష్టులంతఁ దమ బందాను రయమునం గొనిపోవలయునని కడు ప్రయత్నించిరి. వీరుఁడు దుస్సహ పాశబద్ధుఁ డయ్యు, నాత్మరక్షణార్థము పెనుగులాడఁ దొడంగెను. అంతలో నా మార్గస్థు లార్తరక్షణ పరాయణులై, తత్ప్రదేశము సమీపించిరి.

కాని, ఈలోపుననే వీరున కపాయము వాటిల్లనుండెను. ఆతఁడు మువ్వురకును లోఁబడక నిరోధించియుండుటయు, మఱియొక వీరుఁ డరుదెంచుచుండుటయుఁ గాంచి, ఒకఁడు క్రుద్ధుఁడై, ఉన్మత్తుఁడై, ఆ తురుష్కునిఁ దెగనఱకఁ దన కరవాలము నెత్తెను. అట్టి మహా సంకటసమయమునఁ గ్రొత్తపురుషుఁ డరుదెంచెను. ఆతఁ డేతెంచుటయు, తేజి డిగ్గియు, ఖడ్గధారియై యుఱికి ఆ సాహసికుని నిరాయుధు నొనరించుటయు నొక్క క్షణమున జరిగెను. అంత నా హంతకులు మువ్వురుంగలసి వైరినిఁ దాఁకిరి. నవీనుఁ డా పాపాత్ములకుఁ దావీక, నిజరణకౌశల్యము నత్యద్భుతముగఁ బ్రదర్శించెను. సమయమరసి, యాతని వెన్నంటివచ్చిన మచ్చెకంటి తురుష్కవీరుని పాశములు రయమున ఛేదించెను. ఆ యోధుఁడు తోడనే స్వీకృతాయుధుఁడై పోరాడెను. హంతకులు ధైర్యముగఁ బోరాడియు, తుదకుఁ దెగటారిరి.

తురుష్కుఁ డంత దన కృతజ్ఞత వెలిబుచ్చుటకై తన రక్షకుని డాయంబోయెను, అతనిప్రాయ మొక్క సంవత్సర మధికముగ

నందును గాన వాఁడును యౌవనప్రభాపిభాసితుఁడే. వాని వదన సౌందర్యము వస్త్రధారణము వాగ్వైఖరియుంగాంచి, యాతడు గ్రీకు కానోపునని తురుష్కవీరుఁడు గ్రహించెను. ఆతఁ డున్నత వంశజుఁడు కావలయు ననియును దెలియుచుండెను. వాని నంటి యుండిన కోమలాంగియు నట్టులేయుండి, నిరుపమసౌందర్యముతో నలరారుచుండెను. ఆమె ప్రాయము పదునెనిమిది వత్సరము లుండును.

తురుష్కుని యభినందనాలాపముల నాలించి గ్రీకు యువకుఁ డిట్టులనెను —

"ఆర్యా! నన్నింతగఁ గొనియాడఁదగదు. నే నిట్టి సంకటమునఁ జిక్కినపుడు నీ వెట్టు లాచరింతువో, నేనును అట్టులే యొనరించితిఁ. అంతకంటె విశేషములేదు. కాని, గ్రీకులు తురుష్కులు ఈ తెఱంగున మిత్రులవలెఁ గలియక, సదా రక్తరంజిత రణరంగమున మాత్రమే కూడుట కడుసంతాపకరము సుమా."

"తప్పెవ్వరిది? ఆటోమనులు మిగుల బలవంతులు. మీ రేఁడు తురుష్కసమ్రాట్టునకుఁ, జెల్లింపవలసిన కప్పము సరిగఁ జెల్లింపక, ఎగవేయఁ బ్రయత్నించును!"

తురుష్కయువకుఁ డట్లు సగర్వముగ వడివడిఁ బలుక, గ్రీకు ఇట్టులనెను—

"నేటి గ్రీకులు తొంటివారల ప్రసిద్ధపరాక్రమమునందు సగ మైనఁ గలిగియుండిరేని, ఇంతటి దుర్దశకుఁ బాల్పడియుందురా! మా రాజ్యము బోస్ఫరసుజలవలయితమై యుండుటకుఁ మాఱుగ, పరసియా దేశముపర్యంతము వ్యాపించియుండెడిది!

ఆ సమయమున గ్రీసుదేశమునకు 'కాన్‌స్టాంటునోపిలు' రాజ ధానియై యుండెనని పాఠకులు గుర్తింతురుగాక.

తురుష్కమహామ్మదీయుఁడు కఠినవీక్షణుఁడై యిట్టులనెను—

"ఓయీ! ఎఱుంగవా? తురుష్క-సార్వభౌముఁడగు రెండవ మహమ్మదు తన పతాకము కాన్‌స్టాంటునగరప్రాకారముల నలంకరించుదనుక, క్రైస్తవ 'చర్చి' లన్నియు మహమ్మదీయమసీదు లగువఱకు సహింపనని పూనినప్రతిన యెఱుంగవా? గ్రీకు సార్వభౌముఁడు నిజవంశజులకంటె మిన్నయగునేని, నిజరాజధాని సంరక్షణ మొనరింపనిమ్ము, చూతము!"

గ్రీకు యువకుఁడు దేశభక్తి పూరితుఁడై, ఉత్సాహియై, ఉద్విగ్నుఁడై తదుచితస్వరమున నిట్టులనెను —

"గ్రీకుసార్వభౌముఁడగు 'కాన్‌స్టంటైను' తప్పక కృతకృత్యుఁడగును. మహమ్మదీయుఁడా! గ్రీకుల శౌర్యము నేఁడు కానరాకున్నది, వాస్తవము. అంతమాత్రమున వారు శౌర్యహీనులని భ్రమింపవలదు. ఇప్పు డడఁగియున్నను, వైరు లరుదెంచి నగరము ముట్టడించునంతనే, ప్రాణాధిక దారాపుత్రాది బంధుజననిలయమున కపాయము ఘటిల్లనుండెనని ఎఱుంగునంతనే, అఖిలక్రైస్తవాస్పదయు మహాదుర్గ ప్రథమప్రాకార మనఁదగు నగరరాజము శత్రుసైన్యవలయిత మాయెనని వినునంతనే, గ్రీకులశౌర్యాగ్ని ప్రజ్వరిల్లును; దైవము నిక్కముగఁ దోడగును."

"ఎంత బేలవు! ఇఁక గ్రీకు సామ్రాజ్యముపనినరి. మీప్రవక్తలే, మీకాలజ్ఞులే, యట్లు వాకొనుచున్నారు. ఆటోమనులు 'సరిన' ద్వారము నుండి నగరప్రవేశ మొనరింతురనియుఁ బ్రతీతికలదు. ఎఱుంగవా!"

గ్రీకు చిన్నవోయెను. చిత్తమునఁజెలఁగు దుశ్చింతల వారించుటకో యనఁ, లలాటము తాఁకి తాఁకి, నిట్టూర్పువుచ్చి, అతఁ డిట్టకేల కిట్టులనెను —

"ఔనౌను. పూర్వ మాహాత్మ్యము లేదు. మాతేని యాజ్ఞానుసారముగా నయ్యది యనాదినుండినట్టులు మగుడ నిర్మితమాయెను.

కాని, గ్రీకులిప్పుడు ఆటోమనులతోడి వైరముడిగి సుఖముగ—"

"ఎంతకాలము! మఱియొకజోస్యము వెఱింగించెద. మీ రాజధానిపై నంపదాన గురిపించు శాత్రవున కయ్యది యధీనమగునని మీప్రవక్తలు చిరకాలమునుండియు వచించుచున్నవారు."

అట్టి పలుకులు గ్రీకునకు దుస్సహముగ నుండెను—"అయ్యా! వృద్ధజనప్రలాపములఁ బురస్కరించుకొని, యిట్టు లాడుట పాడియగునా? మహమ్మదీయుల కుత్సాహజనకములు కాని జోస్యములనే నెఱుంగనా? రాయబారి మిలోషుఁడు మురాదు సూల్తానును బొడిచి చంపిన ప్రసిద్ధ 'కొసావా' యుద్ధానంతరము హంగరసేనాని దుఃఖితుఁడై యొక దైవజ్ఞునిఁ జూడ, నొక్క ప్రసిద్ధనగరముం గ్రోల్పోవువఱకుఁ గ్రైస్తవులు సదా అపజయమునే పడయుచుందు రని వాక్రుచ్చెను. అట్టి నగరము 'బెల్గ్రేడు' కానోపు: అది కాదేని మీ యైరోపాఖండస్థరాజ్యనగరమగు 'అడ్రియానోపిలు' కానోపు, అంతటితో —"

"సరికాదు. కాన్స్టాంటినోపిలే యా నగరము!"

"ఆహా! కాఁబోలు! కావచ్చు — "

"ఔను! మా మహమ్మ దేమనెను? ఒకముఖమున సముద్రమును, రెండవముఖమున భూమిని దిలకించు నగరరాజము 'ఈసాకు' వంశజుల యధీనమగునని సెలవిచ్చెను: మఱియు దన్మహానగర సంపాదనాధ్యక్షుఁడే లోకైక రాజన్యుఁడనియు, తత్సహచరసైన్యమే ఉత్తమోత్తమమనియు గూడ సెలవిచ్చెను."

అట్టి దుస్సహంపుసంభాషణము మఱలింపనెంచి, గ్రీకు యుపకరుఁడిట్టులనెను —

"అయ్యా! ఇట్టి జోస్యములందలంచి, మన యవ్యాజ సహవాసమునఁ గళంకపఱుపనేల? నీవు ప్రసిద్ధమగు ఉస్మానువంశజుఁడవు,

పీరుఁడవు. దైవికముగా నీ పరిచయలాభ మలవడినది. ఈకన్నియ మదీయసోదరి. కారణాంతరమున నీ సమీపనగరమునకుఁ బోయి మగుడువారము. మా పరిజనులు కొంతదవ్వున నున్నవారు. వా రతి శీఘ్రముగ రాఁగలరు. కావున, అంతదనుక దయయుంచి యిట నిలుతువేని, నా పరిచారకు లరుదెంచి గుడారములు వేయుదురు. మన మందు సస్నేహముగా నోగిర మారగింతము."

తురుష్కుఁ డంత నా యువతీయువకుల లెస్సగ బరికించి యిట్లు ప్రశ్నించెను —

"నా కమితోపకార మొనరించుటయేగాక, విందునకుఁ గూడ నాహ్వానించు నుదారపురుషుని నామధేయ మెయ్యది?"

"అయ్యా! నాపేరు 'లూకాసు నటరాసు' ఈకన్నియ 'ఐరిణి'. గ్రీకుసార్వభౌముని షడ్డకుఁడగు పెద్ద 'డ్యూకు' మా జనకుఁడు.

"పెద్దడ్యూకు నటరాసు పరాక్రమధౌరేయుఁడు: ప్రబలవిరోధి. అట్టివాని సంతానముతోఁ బరిచయము కలిగినందుకు సంతోషము. నా యనుచరులు నాకై తత్తరపడుచుందురు: కాన నీ యాహ్వానము స్వీకరింపఁజాలను. అయ్యా ఈ యుంగరము మత్కృతజ్ఞతాసూచకముగాఁ బరిగ్రహింపుము. మనము మఱలఁ గలియునపు డీచిహ్నము మన పరిచయమును స్మరణకుఁ దేఁగలదు. నా కృతజ్ఞత నపుడు మహోత్తరముగఁ జూపఁగలను."

అట్లు పలికి, ప్రతివచనముల కెదురుచూడక మహమ్మదీయ యువజనుఁడు తురంగముపై లంఘించి, చరణాంకుశము గ్రుచ్చి రయమునఁ బోయెను.

ఈ ముచ్చట జరిగిన కొన్ని దినములకే, ఆటోమను సుల్తానగు రెండవమహమ్మదు గ్రీకులపై దండెత్తఁగోరి, సముచితసన్నాహము నాచరింపఁ దొడంగెను. 'అర్బనుఁ' డను గ్రీకు ఒకఁడు దేశద్రోహియై

సుల్తాను నాశ్రయించి, గొప్ప ఫిరంగులఁ దయారుచేయుట కొఱకుఁ బడెను. వానికి మహమ్మదు విలువగల వసదనము లొసంగి, వేయి పౌనుల భారముగల రాలను విసరు యంత్రముల తయారుచేయుమని కోరెను. అంతటి మహత్తరభారము నొక మైలుదూరము విసరెడు ఫిరంగినిఁ దయారుచేసి యర్బనుఁడు ప్రభుసన్మానము, గాంచెను. మహమ్మదీయుల యుత్సాహము తోడనే దశాధికమాయెను. గ్రీకు లన్ననో! తద్భయంకరవార్త నాలించి, తలంపరాని జోస్యములఁ దలంచికొని, వికలస్వాంతులు కాఁజొచ్చిరి. తత్పూర్వమే గ్రీకుల యవస్థ దుస్సహముగ నుండెను. వారి తొంటి శౌర్యప్రతాపములు స్వప్నగతము లాయెను. ఉన్నవారైనను ఏకాభిప్రాయబద్ధులై యుండక, పరస్పరమతకలహములఁ బ్రొద్దుపుచ్చుచుండిరి. గ్రీకురాజధానియందు ద్వివిధమతస్థు లుండిరి. వారిరువురు క్రైస్తవులే యైనను, భిన్నాభిప్రాయులై, బుద్ధిహీనులై, మహమ్మదీయు లరుదెంచుచుండి రని తెలియ వచ్చినను సరకుసేయక, కాలహరణ మొనరించుచుండిరి.

1453 ఏప్రిలు ఆరవతేది. రెండవ మహమ్మదు సుల్తాను రెండు లక్షల యేఁబదివేల సైన్యము సమకూర్చుకొని, కాన్‌స్టాంటు నగరముం జుట్టెను. వారి ఫిరంగులు సముచితస్థలంబుల భయంకరముగ నిలిచియుండెను. సూర్యోదయ మగుచుండగనే, పెనురక్కసిం బోలిన మహమ్మదీయుల పెద్దఫిరంగు వైరిజన హృదయము పగులునట్లు అతి భయంకరముగ గర్జించెను. అదియే యుద్ధప్రారంభము. ఆ మానవ మారణమహాయంత్రము మఱియొక్కసారి మ్రోఁగి, తద్విపరీతాటోపమునకుఁ దానె నిలువనేరక భగ్నమాయెను. తన్నిర్మాత యగు నర్బనుఁడు గూడఁ దద్విలయమున, నిజదేశద్రోహప్రతిఫలముగ మరణించెను. ఐనను, మిగిలిన ఫిరంగులతోడనే మహమ్మదీయులు శిలాపాతము నవిరళముగఁ గురిపింపఁదొడంగిరి. ఒక లక్షమంది

మహమ్మదీయ సైనికులు విరామ మెఱయక సంతత ధారాపాతముగ వర్షించు బాణములుకూడ గ్రీకులకుఁ గడు సహాయముగ నుండెను.

మహమ్మదీయులు గండుమీఱి యుద్ధోద్యోగులు పట్టువిడక వైరులఁ గాఱింపఁ దొడంగిరి. హతభాగ్యులగు గ్రీకులస్థితి వర్ణనాతీతముగ నుండెను. సైన్య మేడువేలు మాత్ర ముండెను. వారి నౌకాబలము కూడ హీనముగ లెక్కకు మున్నూటయిరువది మాత్ర ముండెను. వారి శతఘ్నులు కూడఁ గడునీరసముగ నుండెను.

ఇట్లుండ, నాలుగువందల సంఖ్యగల తురుష్క నౌకాబలమునకును అల్పమగు గ్రీకు నౌకాబలమునకుఁ బోరాట మాయెను. ఎట్టులో గ్రీకులే విజయముఁ గాంచిరి: తురుష్కనౌకాసేనానికి శృంగభంగ మాయెను. గ్రీకు లమితానంద పరవశులై తమ భాగ్యదేవత ప్రసన్న మాయెనని స్థైర్యము వహించిరి. భూతలాధిపత్యము తమ యధీన మొనరించిన విధాత జలాధిపత్యము మాత్రము క్రైస్తవుల పాలొనరించెఁ గాబోలునని తురుష్కులు భావించిరి.

కాని, గ్రీకులు సుస్థిరానంద భాగ్యము నోఁచికొనరైరి. మూఁడవ నాఁటి ఉదయమగుసరికి, దవ్వుననుండిన తురుష్కనావలు డెబ్బదియెనిమిది గ్రీకు నౌకాశ్రయమునఁ బొడసూపెను. గ్రీకుసైన్యమున హాహాకారములు చెలరేగెను. తా మప్రమత్తతతో రేయింబవళ్లు కాచికొనియుండ, తురుష్కనౌక లందే తెఱంగున బ్రవేశింపఁగలిగెనో తెలియకుండెను. ఏనౌకయు రాకుండ దిట్టమగు నినుపగొలుసులను వారు కట్టియుండిరి. తదభేద్యపాశము లట్టులే యుండెను. ఐన, శత్రునౌక లెట్లు రాఁజాలెను! విచారించి చూడ, నావడవలను నేలపై నీడ్చి, నిశాసమయమున నందుఁ బ్రవేశించియుండురని గ్రీకులు గ్రహించిరి. ఆదూరము ఐదుమైళ్లుండును. జలగాముల నంత దవ్వు భూగాముల నొనరించుట యతి సాహసము; కడు ప్రశంసనీయము,

ఆకారణమున గ్రీకుల యవస్థ మఱియు దుర్భరమాయెను.

మహమ్మదీయు నాకాదశమును బరశురామప్రీతి యొనరింపవలయు నని రెండుసారులు ప్రయత్నించి, గ్రీకులు భగ్నహృదయులైరి.

ఇరువదినాల్గవ తారీకు ఉదయమాయెను. ముట్టడి శీఘ్రముగఁ దుదముట్టింపఁగోరి సుల్తాను తెలుంగునఁ బ్రకటించెను—"సైనికులారా! వీరులారా! ఈకార్యమున కింత కాలయాపన మొనరించుట హాస్యాస్పదము. ఇరువది తొమ్మిదవ తారీఖున మీరీ దుర్గమును భగ్న మొనరించి, మీకును నాకును యశమార్జింపుఁడు. యశమే కాదు, ధనము గూడ గడింపుఁడు! భూమియు గృహములును మదధీనములుగాని, నగరజనుల సొత్తంతయు మీయది !"

ధనాశచే మహమ్మదీయుల ధైర్యోత్సాహములు ద్విగుణమాయెను. తద్భయంకర దివస ముదయించెను. గ్రీకుల యవస్థ దుర్భరమై దుస్సహమై, దురంతదుఃఖభాజనమై, వర్ణనాతీతమై యుండెను. గ్రీకుసార్వభౌముఁడు నిజరాజధాని సంరక్షణార్థము చేయఁగల ప్రయత్నము లొనరించెను. పాఠకజనపరిచితుఁడగు 'లూకాసు నటరాసు' అతని ఛాయవలె నగరమునం దెల్లెడల సంచరించెను. కాని. ఝంఝానిల ప్రపీడిత గభీరపారావారమువోలెఁ బఱతెంచు ప్రచండరిపు సేనావాహిని వారింప నెట్లు సాధ్యమగును? తత్సార్వభౌముఁడు పరాజయ పరాభవములు తథ్యమని గ్రహించి, ప్రాణము తృణప్రాయమని యెంచి, మధ్యందినమార్తాండునివోలె నమేయ బలపరాక్రమోజ్జ్వలుండై వెలింగి, సంగరరంగమున వీరపురుషోచితముగ నిహతుఁడై కీర్తిసాంద్రుఁడాయెను.

గ్రీకు లింకను జేలలై తమ దైవము తమ్ముఁ దద్విపదంబుధినుండి రక్షించునని ఆసించి యుండిరి. ఆ దౌర్భాగ్యు లట్లు చూచుచుండ గనె కట్టం దెగఁగొట్టి ఘనఘనారవంబునఁ బఱతెంచు నుత్తుంగ నదీ

ప్రవాహమువలె మహమ్మదీయసేనావాహిని సాయంకాల మైదుగంట లగునరికి, జోస్యులు పలికిన సరిసద్వారమునే తొలుదొల్త నిర్భిన్న మొనరించి, అనాదిమహానగరము నాక్రమించెను. గ్రీకురాజధాని యంతయు వైరిసైనికనికాయములతో నిండిపోయెను. కంటఁబడు ప్రాణిం జెక్కాడుచు మహమ్మదీయులు దీన పుర జన గృహంబులు దారుణముగ దోపిడిచేయ నారంభించిరి. క్షతగాత్రవిలాపములు, మృత్యువ్యథితుల మూల్గులు, భీరుల దైన్యాలాపములు, అనాథబాలికా జనాక్రోశములు, క్రూరమహమ్మదీయ విసరవిదళిత బాలాజన కనికర దుస్సహ దుఃఖా రవంబులతోడను అమ్మహానగరము ఘూర్ణిల్లఁజొచ్చెను.

ఆటోమను సామ్రాజ్యనిర్మాతయగు నాఁటి ఊస్మానుస్వప్నము నేఁడు సఫలమాయెను. రెండు నీలములనడుమ, రెండు పచ్చలనడుమ రాజిల్లు వజ్రమువలె జలధి వలయవలయిత మహీమండలాంగుళీయము నకు భూషణప్రాయమగు మహారత్నమువలె నొప్పు నగరరాజము తద్వంశాధీనమాయెను.

రెండవ మహమ్మదు సుల్తాను నిజమంత్రి సామంతాదిజన మండి తుండై యానాఁడే దర్పమొప్పఁ బలిత మహానగరప్రవేశ మొనరిం చెను. క్రైస్తవప్రసిద్ధప్రార్థనాలయమగు 'సెంటు సోఫియా' కే సుల్తాను నూటిగఁ బోయెను. మహమ్మదీయ మతాచార్యుఁ డనుజ్ఞాతుఁడై, మతావేశపరుఁడై, అల్లావారి పవిత్రనామసంకీర్తనము గంభీరస్వరం బున నొనరించెను. దీర్ఘసహస్రసంవత్సరపర్యంతము క్రైస్తవ దైవ ధన్యవాద ముఖరితమహానగరము మహమ్మదీయ ప్రార్థనారవములచే ఘూర్ణిల్లఁజొచ్చెను. అఖండవిజయప్రదాతయగు పరమాత్మ నా తెలంగున నారాధించిన యనంతరము, విజయుఁడగు మహమ్మదు వేటాక స్థలంబునఁ గొలువుండి, యుద్ధమునఁబట్టువడిన గ్రీకుప్రముఖు లను నిజసమక్షమునకు రప్పించెను. వారిఁగాంచి, వారు మూర్ఖులై

యుద్ధసన్నద్ధులగుటవలనసే సంగరము దీర్ఘతరంబాయెననియు, దాన నధికరక్తపాతము సంభవమాయెననియుం బల్కి, క్రుద్ధుఁడై దూషించి, వారిని దోడనే వధింపవలయునని సుల్తాను దారుణముగ నాజ్ఞాపించెను.

ఇఁక మన నటరాసుఁ డేమాయెనో చూతము. వీరాగ్రేసరుఁడగు నా యువకుఁడును తన నృపాలునివలెఁ జేతనగు శత్రుసంహారణ మొనరించి వీరస్వర్గమునకుఁ బోవలసినదే. కాని ముందుగనే యాపురుషుఁ డాకస్మికముగా గదా తాడితశిరస్కుఁడై, విస్మృతుఁడై, నేలఁగూలెను. అట్లు మోఁదిన మహమ్మదీయుఁడు నటరాసుయొక్క వేషగాంభీర్యములఁ గాంచి, ఆతఁడు కులీనుఁడు కావలయునని యెంచి, దానఁ దన కమితపరిహార మలవడునని ఆసించి, చంపక, తత్సమీప శూన్యగృహమున కాతనిఁ గొంపోయి, సముచితోపచారము లొనరించెను. ఆ మహమ్మదీయసైనికుఁడు జనీజరీ దళములోనివాఁడు. వాఁడు తొల్లి గ్రీకుజాతివాఁడే. నటరాసు తెలివొందినంతనే భయకంపితహృదయుఁడై, తన రాజధాని యవస్థ యెటులుండెనని ప్రశ్నించెను. జనీజరీ యిట్లు బదులాడెను —

"మహమ్మదు సుల్తానిపుడు సోఫియా మసీదునందు —"

"సోఫియా మశీదా!" అని నటరాసు అమితభయవిస్మయాకులచిత్తుఁడై యడిగెను. జనీజరీ యిట్లు బదులాడెను —

"ఔను. నీ వనుదినము 'కన్య' నారాధించు వైభవసమన్విత ప్రార్థనాగారము నేఁడు మహమ్మదీయుల మసీదాయెను."

"ఏమీ! సుల్తానీనగరమును వశపఱచికొనెనా?"

"మహానీయుఁడగు పాదుషా యిపుడు తన నవీనరాజధానియందు సుఖమై యున్నవాఁడు. అల్లా ప్రభావము!"

"ఛీ! ఓరీ యధమాత్మా! గ్రీకువై జన్మించి, చిరకాలము క్రైస్తవద్వైవము సంస్తుతించిన జిహ్వతోఁ దదన్యాయమునకెల్ల మేటి

దుర్గమగు నిమ్మహానగరమును విధ్వంస మొనరించిన మహామ్మదీయుల మాయదైవము నెట్లు కొనియాడఁగలవు?"

"యౌవనుఁడా! ఈ పాటి యెఱుంగవా? పరిస్థితులతోఁబాటు హృదయముగూడఁ బరివర్తించును. దానఁ దొంటిప్రవర్తన మంతయు విస్మృతంబగును."

ఆ యవనీయుఁడు "నీ మహామ్మదివు డెం దున్నవాఁడు?" అని నటరాను కుపితుండై నిందాగర్భిత మందహాస మొనరింప, జనీజరీ యిట్టులనెను —

పాదుషావా రిపుడే రాజమందిరమున కరుగుచుండిరి. నీవు సేవ చేయునంతనే, రాజసమక్షమునకు రావలయును. అయ్యో! నీవు సద్వంశజుఁడ వని భావింతును."

"నేను పెద్దదుర్గ్యాకు కుమారుఁడను."

"అయ్యో! నీ జనకుఁడు సుఖమై యున్నాఁడు."

"ఆహా! నీ ప్రభువు అక్కటికమెఱుంగని క్రూరస్వభావుఁ డని వినియుందును. జనకుఁడు బంధితుఁడాయెను; ఆహా! మదీయ సోదరి యిరిణి యేమాయెనో!..."

నటరానుఁడా తెలుంగున దనఁ సోదరీజనకులఁ దలంచి యత్యంతము తల్లడిల్లుచు, సర్వాపాయనివారణసమర్థుండగు పరాత్పరునిఁ జిత్తమున సంస్మరింపుచు, నాసైనికునివెంటఁ బోయెను.

సైనికుఁడు సింహద్వారముదాసి, తన యుదంత మెఱింగించి, లోనికిఁ బోనీయుమని యటఁ గావలియున్న రాజోద్యోగినిఁ గోరెను. వాఁడు తోడనే విస్మితుఁడై యిట్టులనెను —

"ఏమి! నీవు నటరాను లూకాసునే గొనివచ్చితివా! ఆ పురుషు నెందున్నను, జీవించినను, మరణించినను బట్టికొనిరావలయునని పాదుషావా రాజ్ఞాపించిరి."

ఆపలుకుల నాలించినంతనే, నటరాను హృదయము విహ్వలించెను. తన కెట్టి యాపదవాటిల్లునో యని త్రొట్రిల్లుచు, నాతఁడు మహమ్మదీయ రాజసభకుఁ బోయెను. విపులవైభవసమన్వితమగు సభాభవనమున సామంతమంత్రి ప్రభుజననికర పరివేష్టితవిరాజమానుఁడై, మహమ్మదు సాదుషా గోచరించెను. తన్మహనీయులం వివిధకార్యాలోచనానిమగ్నులయ్యు, మధురమధువు నవిరళముగ నాస్వాదించుచు హాయిగ నుండిరి. నటరాను అవస్థ కడు దుస్సహముగ నుండెను. తా ననేకసారు లాహూయమానుఁడై కడు విలాసముగఁ గడపిన సభాస్థలికాతఁ డీ సమయమున బంధితుఁడై పోవలసివచ్చెను. వాని చిత్తమధికవిషాదభరమ్మున నీరగుచుండెను. తత్పారవశ్యమున నా యువకుఁడు మోమెత్తి మహమ్మదీయ నృపాలునిఁ జూడఁజాలక, నిజమనోభవదుఃఖానలపరితప్తుఁడై యవనతవదనుఁ డాయెను. విజయోన్మాదుఁ డగు సుల్తాను వానిం జూడక యే, "ఎవ్వఁ డీ క్రైస్తవశునకము ?" అని సగర్వముగఁ బ్రశ్నించెను.

ఆ కంఠధ్వని వీనుల సోకినంతనే, నటరాను త్రుళ్ళిపడెను. కారణమేమి ? ఆ కంఠము మున్నాతఁ డాలించినదే ! యువకుఁ డా కారణమున మోమెత్తి పరికించినంతనే, మున్నుఁ దాను దొంగలబారినుండి రక్షించిన మహమ్మదీయ యువకుఁడే తనయెదుట సింహాసనాసీనుఁడై యుండెను ! నటరాను తోడనే యానందోత్సాహదీపితవదనుఁడై నిజకరాంగుళకీలితాంగుళీయము నప్రయత్నముగా రయమున నూడఁదీసి, మహమ్మదీయ సమ్రాట్టున కద్దానిం బ్రదర్శించి, మోఁకరించి, వినయసంభ్రమస్వరంబున నిట్టు లనెను —

"రక్షింపుము ! మహనీయసార్వభౌమా ! రక్షింపుము ! నా జనకుని, నా సోదరిని రక్షింపుము !"

సుల్తాను మందహాస మొనరించి యిట్టు లనెను.

"తెమ్ము! భయము వలదు. చెప్పితిగదా మనము మరల గలియుదు మనియు, నా కొసరించిన యుపకారమునకు ఘనతర ప్రత్యుపకార మొనరింపఁగలననియును. కాని, మన మింత శీఘ్రముగ సమావేశ మగుదుమని మాత్ర మెఱుంగను. నటరాసా! జోస్యములు నిజ మాయె సుమా!"

"ఆహా! మా దేశ దౌర్భాగ్యము!"

వానిని వారించి, మహమ్మదు కఠినస్వరమున నిట్టులనెను — "విధి విధానముఁ దలంచి విలపింపకుము."

అంతలో నొక జనీజరీయుద్యోగి గ్రీకు సార్వభౌముని భిన్నమస్తకము నొక శూలాగ్రము నలంకరింపఁజేసి సభాభవనమునఁ బ్రవేశించెను. పాదుషా క్రూరమృగసహజోత్సాహవిరాజితవదనుఁడై తదుత్తమాంగముం దిలకించి, నిజ మహావిజయసూచకముగా నా దారుణ చిహ్నము నొక బల్లపై నుంపవలయునని ఆజ్ఞాపించి, ఆ యుద్యోగికిఁ బెక్కు సువర్ణములు బహుమానముగా నొసఁగెను. ఆగ్రహాధికమున నటరాను హృదయము భగ్గున మండిపోయెను. డెందమునఁ బొంగు నాగ్రహము నడంపఁజాలక పండ్లుకొఱికి, తదావేశ ప్రకంపితస్వరమున నాతఁడు నిర్భయముగ నిట్టులనెను —

"విజయుఁడా! నీ విజయము నేల యిట్లు కళంకపఱచెదవు?"

"మూర్ఖయువకా! మేము సహింతుమని, కొలఁది నెఱుంగక అఱతువా?" అని సుల్తాను ప్రజ్వలితానలనయనుఁడై గర్జించి, భ్రాతృరసపాన మొనరించెను. నటరాను మానసము దుస్సహముగ మండిపోవుచున్నను నిగ్రహించియుండ, నంతలో నాతని జనకుఁడు పుత్రికాసహితుఁడై ప్రవేశించెను. పెద్ద డ్యూకును గాంచినంతనే సుల్తాను సక్రోధముగా నిట్టు లనెను —

"ఇరు తెగలవారును ఇంతమంది యకారణముగాఁ దెగటారకుండ

ముందుగనే నగరము మదధీన మొనరింపవైతివేమి? ఇంత జననాశనము లేకుండెడిదే!"

"అయ్యా! ఆశాప్రేరితులమై పోరాడితిమి. మా దురదృష్టవశమున నగరము నీ యధీన మాయెను."

"కానిమ్ము! మీ వైపున రణ మాచరించిన కులీనుల పట్టిక నొకటి నా కిమ్ము."

సుల్తాను దురభిప్రాయము గుర్తించి నటరాసు సత్వర మిట్లనెను –

"నాజనకుఁ డంతటి దురాచార మొనరించి దుర్యశము గడింపఁడు."

నటరాసు మాటాడు లోపుననే సుల్తాను నయనము లాతని సోదరి యగు నైరిణి నిరుపమాన సౌందర్య విరాజితమగు వదనముపైఁ బ్రాలెను. నటరాసుఁ డట్లు తీవ్రముగఁ బలికినంతనే, మహమ్మదీయ నృపాలుఁడు కుపితుఁడై యిట్లు లనెను.–

"యువకుఁడా! మాటాడకుము! నాఁడు నీవు చేసిన యుపకారము నకుఁ బ్రత్యుపకార మొనరింపఁగోరెదను. కాని,–

"వలదు! వలదు! అపయశోభాజనమగు సన్మానము మాకు వలదు."

"కుమారా! దుర్భరపరిస్థితు లెటులొంచిన, నటు లొంగవలయు. ఆత్మ సంరక్షణోపాయ మరయు–"అట్లు పలుకు తన జనకుని వారించి, "మన గౌరవమునకు భంగమగు తెఱంగున మెలంగరాదు" అని నటరాసు ధైర్యముగఁ బలికెను. తత్సమాగత మహమ్మదీయ ప్రభువులందఱు నా ధైర్యశాలి నట్టె ససంభ్రమముగఁ దిలకించిరి.

సుల్తాను మగుడ యువకుని మాటాడ వలదని శాసించి, గ్రీకు వీరాగ్రేసరుల నామధేయముల నొసంగవలయునని పెద్దమ్యాకును మఱలఁ గోరెను. ఆవృద్ధుఁడటు లొనరింపఁబోయెను. కాని, వానిని వారించి, నటరాసిట్లు లనెను–

“తండ్రీ! ఇంతటి యుద్ధమా[illegible] [illegible] మన వత్సాంశమును గళంక పఱపకుము. జూ[illegible] వారిణ దేవత యెట్టిభయానక రూపమున నైన మనలను గబళించుఁగాక : క్రైస్తవ[illegible] [illegible] బడి క్రుగ్గిన [illegible] : [illegible] నేమి ! [illegible] [illegible] చిన ఘన కార్యములఁ [illegible] [illegible] చెలంగుము.”

నటరాను [illegible] [illegible] గాంచి సుల్తాను [illegible] డాయెను. కుమారుని పలుకులు వినఁజాలక, పెద్దమ్మా[illegible] చెవులు మూసికొనెను. తన జనకుని దైన్యావస్థఁ గాంచి దుఃఖ పరవశయై, అట్టి దుస్సహ ప్రదర్శనముం గాంచుటకంటెఁ దానాత్మహత్య నాచరించిన బాగుండుననిన, ఐరిణి ప్రకంపిత హృదయయై విలపించెను.

ఈలోన, గ్రీకు ప్రముఖుల పట్టికఁ దయారుచేసి, [illegible] హోంకరించి, పెద్దమ్మాకు సుల్తానున కొసంగెను.

“ఆహా! ఇయ్యది గ్రీకు పరాభవదినము! దుర్భరము!” అని ఐరిణి పట్టఁజాలక విలపించెను. తత్కాలసన్నవమంజులాలాపములు వీనులఁ బడినంతనే సుల్తాను చకితుఁడై, విభ్రాంతుఁడై యిట్టులనెను.—

“సుందరీ! దగ్గరకురమ్ము. ఏమంటివి? నీదు కోపాలాపములు సహితము గడుమధురము లగుటచే, మగుడ వినవలతు.”

సుల్తానట్లు పలికినంతనే, నటరాను ద్విగుణీకృతవ్యథోద్దీపితుండై, నిజసోదరి మానసంరక్షణార్థము, క్షుధార్తసింగము పగిది, నుఱుకఁ బోయెను. కాని, జనీజరీ లాతనిం దమ దృఢతమ బాహుయుగ్మములఁ బట్టుటచే, నాయువకుఁడు భగ్న మనోరథుఁ డాయెను.

అంతట సుల్తాను పెద్దమ్మాకు నుద్దేశించి, యిట్టులనెను—

“అమ్మా! నామాట పాటించి యీపట్టిక నొసంగితివి, సంతసము. నీకుమారుఁడు దుడుకఁడై, మూర్ఖుఁడై అవివేకియై యెడ తెలియంగక ప్రవర్తించినను, నిన్ను దప్పక బహూకరింతును. ఈ హేమగాత్రి,

ఈ విద్యుల్లత, ఈ కలభాషిణి, హరిణి కరుణాయత్త చిత్తయై నా యర్ధాంగియై, నా సుల్తానాయై మదీయహృదయానందకారిణియై, ప్రాగ్దేశపరిపాలనా ధురంధర పరిపాలకయై, యఖండ భోగభాగ్యవైభవ సముజ్జ్వలయై, విరాజిల్లుగాక. సుందరీ! ఇంత కాఠిన్యమేల? రమ్ము! ప్రసన్న చిత్తవై రయమున రమ్ము; మదఖండ విజయోత్సాహా న్నధికతర మొనరింపుము."

"వలదు! వలదు!" అని యఱచుచు ఉన్మాదసహజ భూరిబలంబు నందును, బట్టిన జెట్టుల నిట్టట్టు దిట్టతనంబునఁ బోఁద్రోచి, నటరాసు నిజసోదరి చెంతకు శరవేగమునఁ బోయెను. మహామ్మదీయ నృపాల క్రూరవీక్షణపాత ప్రకంపితయగు నాకోమలి యభినవ కుసుమ వల్లరివలె నిజభ్రాతృ భుజాదండము నాశ్రయించెను. వృద్ధజనకుఁడు ముగ్ధుఁడై మిన్నకుండెను. అంతసుల్తాను క్రుద్ధుఁడై కఠినముగ నిట్టులనెను.

"ఓయీ! పడుచుఁదనంబున నింగిత మెఱుంగని ఈ యువజనులను మందలించి, మదాజ్ఞాబద్ధుల నొనరింపుము. లేదేని, పురాతన కృతజ్ఞతానివారిత భీషణక్రోధాశనీ నిర్భిన్నుఁడై నీసుతుఁడు మ్రగ్గఁగలఁడు!"

వృద్ధుఁ డేమి చేయఁగలఁడు? పాపమా హతభాగ్యుఁడు తన సంతానము నెట్టులైన రక్షింపవలయునని దైన్యముగఁ బ్రార్థించెను. సుల్తాను క్రోధోద్దీపితుఁడై యిట్లు గర్జించెను —

"ఓయీ! యుద్ధమునఁ బట్టువడిన మీరందఱు నాయాజ్ఞ శిరసా వహింపవలయునని యెఱుంగవా? మాఱాడకుము. నాయాజ్ఞ అమోఘము!"

అంతదనుక వినమ్రుఁడై యుండిన డ్యూకు ధైర్యము వహించి, సుల్తానును ధిక్కరించెను. తోడనే, ఆతఁడు సన్నయొనరింప, భటులు రయంబున నాతండ్రి కుమారుల బలముడిపి, ఆ మందభాగ్యులు చూచుచుండగనే, గ్రీకు కన్నియను పాదుషా యాసనము చెంతకు

నీడ్చికొనిపోయిరి.

"అరే! దురాత్మా! కృతఘ్నుఁడా! అధమాత్మా! ఇదియా నీవొనరించు ప్రత్యుపకారము!..." అట్లు నితాంత క్రోధఘూర్ణితుఁడై యఱచుచు నటరాసు నొక చీరికింగొనక, సుల్తాను ఐరిణిన్ డాయబోయెను. పాపమా హతభాగ్య నిజనయనదళ ప్రభవాశ్రుజల నిర్మగ్నయై, వికీర్ణ విలంబమాన శిరోజయై, క్రూర భటాకర్షణావసర విచ్ఛిన్నకంచుకయై, రూపొందిన దీనత్వమువలెఁ దోఁప, నాభయంకర మహమ్మదీయ నృపాలుఁడు కామాయత్త చిత్తుఁడై యా రమణీమణి రమణీయ కుచకుంభములపై దృష్టి నిల్పి యానంద పరవశుఁడాయెను. ఆ కాముకుఁ డంత నాయనాథ బాలిక కరాబ్జము నల్లనఁబట్టి ధైర్యము కఱపి, యమూల్యాభరణాదుల నిచ్చెదనని పలికెను. ఐరిణి యేమియు మాటాడలేదు. చూచుచుండగనే, ఆమె దురంత దుఃఖమంతరించెను: దుస్సహ విచారారుణ దీపిత వదన మాకస్మికముగా వెల్లవాఱెను; నయనము లచంచలములై, యసాధారణముగఁ బ్రకాశించెను: ఉరువక్షోజ ప్రచలనము సన్నగిల్లెను. మోహాంధుఁడగు సుల్తాను అన్యవిచార మెఱుంగక, ఆ కాంత కౌనుపైఁ జేయివైచెను. అంత నామానిని పనీల వీక్షణంబుల నాతనిపైఁ బఱపి, దిగ్గునలేచి, తద్దురాత్ముని హస్తమునటు విసిరి, రయమున రెండడుగులు వెనుకకు వైచి, నిజహృదయమున కంటియుండు కటారిం దటాలునఁ దీసి, మెఱుపు మెఱసిన చందమున నామెఱుఁగుఁబోఁడి యతిసాహస మొనరించి, నిజహృదయ విచ్ఛేదన మొనరించి, పట్టు తప్పిన సువర్ణ విగ్రహమువలె నేలఁ గూలి, మఱియొక క్షణమున మరణించెను!

అంతవఱకు నాసుల్తాను ఐరిణి చెయ్దముల నరయుఁడాయెను. ఆ కాంత మరణించినంతనే, మహమ్మదు క్రూర శరఘాతబాధిత శార్దూలమువలె మజ్జ్వలానలనయనుఁడై, యిట్టట్టు గలయఁ జూచి,

దురంతమగు నాశాభంగమునఁ గ్రోధోన్మత్తుండై, తన దీర్ఘ కరవాలము నూపఁ బెఱికి, హుంకరించి, తన కట్టెదుటనున్న తండ్రి కుమారులను ఖండింపఁ బోయెను.

వజీరుఁ డంత లేచి, వీరజనవితాన, విదారణ వ్యాపార దక్షమగు ప్రసిద్ధ హస్తమున నట్టి నికృష్టకార్య మొనరింపవల దని ప్రార్థించెను. పాదుషా యంత నాచెంతనున్న మధురసముఁ గ్రోలి, యొకింత సేద దేఱి, మగుడనుపవిష్టుండై, ఆ గ్రీకుల కంఠముల నాతఁడే ఖండింప వలయునని వజీరు నాజ్ఞాపించెను.

తండ్రి కుమారులు తోడనే యావలకుఁ దలవరులచేఁ దరలింపఁ బడిరి. నిజపుత్రికా మరణము దారుణముగ దృగ్గోచర మైనంతనే, గ్రీకు సహజ ధైర్యస్థైర్య ధుర్యుఁడాయెను. పాప మా మహానీయుఁడు చూచుచుండగనే లూకాసు ముందుగ వధ్యుఁడాయెను. ఆ ధీరస్వాంతుఁ డావంతయుఁ జలింపక, జనకునకు ధైర్యము కఱపి యసువులఁ బాసెను. పెద్దమ్యాకుకూడ నమేయ ధైర్యగాంభీర్యస్ఫూర్తి దీపింప భగవన్నామస్మరణ మొనరించి, మోఁకరించి, భయంకరవైరికరవాలమునకు మెడయొగ్గి ముహూర్తమాత్రమునం దనప్రియతమ సంతానముం జేరఁ బోయెను. ఆ ధైర్యశాలుర యుత్తమాంగములు గూడ నా క్రూర మహమ్మదీయ పాదుషా సమక్షమునఁ బ్రదర్శింపఁ బడెను.

## ౧౫

ఖలీలుని నాల్గవకథ కూడ దార్తబను పాషా మొదలగు వారి కమితానందప్రదముగనే యుండెను. కాని, తొంటియట్లు కథావిమర్శనాధీనమానసుండై కడు నుప్పొంగుటకు నా పాషా కవకాశము లేక పోయెను. ఖలీలుఁడు కథ ముగించిన ముహూర్తముననే, పరిచారిక యగు నఫీనా మర్యాద నతిక్రమించి బిఱబిఱ లోని కరుదెంచుచు

నున్నాదిని వలె " ప్రభూ ! జనీజరీలు ! జనీజరీలు ! " అని యఱచెను.

ఆ దాసి యమిత భయాక్రాంత యగుటఁ గాంచి, పాషా దిగ్గున లేచి, యిట్లు ప్రశ్నించెను —

"అమీనా ! ఏ మాయెను ? ఆ భయంకరదళము తిరుగఁబడిరా!"

"పాషా ! వజీరుఁ డొకదూత నంపెను. నీవు రాజధానికి సత్వరము రావలయునని తెలిపి, యితర ప్రముఖులఁ గాంచుటకై వాఁడు వెంటనే వెడలెను !"

పాషా యిట్టు లనుకొనెను —

"ఎంత ప్రమాదము ! నాపై ప్రభుత్వమున కమిత విశ్వాసము. కాని, ఇపుడు నేనేమి చేయఁగలను ! సైన్యాధిపతినేగాని నా సహచరుఁ డొక్కఁడైనను లేఁడుగదా ! "

ఆ పలుకుల నెల్లరు నాలించిరి. తోడనే, ఖలీలుఁ డిట్టులనెను —

" పాషా ! నీ కా వంత వలదు. నేను నీవెంట నరుదేఱఁగలను. నా యస్త్రము నా కొసంగుము : తఱియగునపుడు మద్భుజబలము నీవ చూడఁగలవు ! "

" పాషా ! నేనును సంసిద్ధుఁడను. మదీయహృదయ రుధిరాస్వాదన మొనరించువఱకు నేఖడ్గమైనను నిన్నుఁ దాఁకఁజాలదు !

"పాషా ! నేనును సంసిద్ధుఁడను. సజీవుఁడనై యుండునంత కాలము నిన్ను వీడను ! "

లూకాసు జూలియను లాతెఱంగునఁ బలికిరి. ఇదంతయు నొక్క త్రుటిలో జరిగెను. కాని కాంతాజనంబెటులుండెనో అరయవలయును. అతి భయంకరమగు జనీజరీవిప్లవమనినంతనే ప్రభుపత్నియగు నిస్మి లిడా భయవిహ్వలయై, వివర్ణవదనయై యల్లనఁ దాఁ గూర్చుండిన సోఫాపై వ్రాలెను. తైరజా గుల్నెరులు కూడ నమితభయాతురలై చంచలవీక్షణంబుల నొండొరులఁ దిలకింపఁ దొడంగిరి. కన్నుమిన్ను

జులేఖా భీకహారిణేక్షణవలె, ఖలీలువదనము విలోకించెను. కాని ఖలీలాదుల ధైర్యగంభీరోదార ప్రవర్తనముం గాంచి, అయ్యబలామణులు భయముడిగి తమ కాంతులను లోలోన నుగ్గడించిరి.

ఇస్మైల్లాసతి యట్టులే ఇంకను బడియుండెను. కారణమరయుటకై అమీనా వడివడి బోయెను. తన దొరసాని మేలిముసుంగుం దొలంగించి పరికించినంతనే, యాప్రభ్వి భయాతిరేకమున మూర్ఛిల్లెనని తెల్లమాయెను. తోడనే, పాషాపుత్రికలుగూడ సాహాయ్య మొనరింప నాపరిచారిక తనప్రభురాణిని భద్రముగఁ దనమందిరమునకుఁ జేర్చెను.

దాల్తబనుపాషా యొక్క ప్రసిద్ధవీరుఁడని చెప్పియే యుంటిమి. పాదుషాకును, మంత్రి వర్గమునకును, సైన్యమునకునుఁ గూడ నాతఁడు ప్రేమాస్పదుఁడై యుండెను. ఆవీరుఁడు తన యెదుట ధైర్యములాడు యువకులనుఁగాంచి, వారు మిథ్యాప్రగల్భులు కారని గ్రహించి యిట్టులనెను —

"మిత్రులారా! మీసాహాయ్యమెంతయు వాంఛనీయము. మనము సత్వరము కాన్‌స్టాంటునగరమునకుఁ బోవలయు. మీరు మీరాడిన చందమున మెలంగుదురేని, దాల్తబనుపాషా కృతఘ్నుఁడు కాఁడని గ్రహింపఁగలరు."

జులేఖా యంతఁ దన మామను జూచి యిట్టులనెను —

"మామా! నన్నను గానిపొమ్ము, రక్షకభటాధికారి యగు మత్ప్రియజనకున కేమి యపాయము వాటిల్లునో యని కడుభయమగుచున్నది. దురాగ్రహపరులగు జనీజరీ లాతనినే తొలు దొల్త బాధింపఁగలరు."

జులేఖా పలుకులు సమంజసముగ నుండుటచే, పాషా సమ్మతించెను. అంతలో, తైరజాగుల్నేరులు తమ తల్లిమందిరమునుండి యరుదెంచిరి. జులేఖా ప్రయాణమగుచుండెనని యెఱింగినంతనే, యట్టి క్లిష్టసమయమున విప్లవరంగమున కేగుట కడు నుపద్రవకరమని చెప్పి

పోవలదని వారు మిక్కిలి బ్రతిమాలిరి. కాని, జనకుని కెట్టి యపాయము పొడముచునోయని బెగడొందు జులేఖా యచట నిలచుటకు సమ్మతింపదాయెను. లూకాసు గుల్నేరు చెంతకును, జూలియాను తైరజా కడకునుబోయి, మధురప్రణయమంపుఁబలుకులు రెండాడిరి. ప్రభువత్ని యాటంకములేని కారణమున, ఖలీలుఁడు నిర్భయముగాఁ దన మనోహారిణితో సంభాషించెను.

పాషా యంతఁ దనభటులంజీరి, ఆ యువజనుల ఆయుధములం దెచ్చి వారికొసంగవలయునని ఆజ్ఞాపించి, ప్రయాణసన్నాహము లొనరించుటకై తన మందిరమునకుఁ బోయెను. ఆవిధముగ నన్యోన్యానురాగబద్ధులగు నాయువతీయువకులు మనసార ముచ్చటించి ఆశ్లేష సౌఖ్యము నొక్కసారి యనుభవించుట కవకాశమేర్పడెను. వియోగము దుస్సహమగుటచే తైరజాగుల్నేరు లవిరళాశ్రుజలార్ద్రనయన లైరి. యుద్ధమగుట తథ్యము. ఆహవమున నెట్టియపాయము వాటిల్లునో యెఱుంగరాదు. తమ ప్రియులు మగుడఁ దమకంటఁబడుదురో, లేదో, యని వా రమితముగ దుఃఖించిరి. భీతచేతస్కలగు తమప్రియ కాంతలను జేరఁదీసి, గ్రీకులు తమ భుజపంజరంబుల బంధించి, సముచితముగ భయముడిపిరి. అనంతరము వా రవ్వలకేగి, పాషాను గలసికొనిరి.

యువకులు మువ్వురు వెంటనరుదేఱ జులేఖా సహితముగా దార్తబను పాషా యొక్క మేలురకంపు నౌక నారోహించి, వాయువేగమునఁ బ్రయాణమొనరింపఁ దొడంగెను. అపుడు గ్రీష్మకాలము, రాత్రి పదిగంటలుమాత్రమాయెను. ప్రకృతిసౌందర్యము దర్శనీయమై యుండెను. పినీలాభ్రతలంబున వజ్రపుఁదునుకలవలె విరాజిల్లు తారకలు విమల బాస్వర సుజల రాశియందు మనోహరతరంబుగ బ్రతిబింబించు చుండెను. దవ్వుననుండిన రాజధానియందలి సమున్నత సౌధములు, మసీదులు, గోపురములు, స్తంభములు మొదలగునవి శోభాయమాన

ముగ దృగ్గోచరమగుచుండెను.

జులేఖా మేలిముసుఁగుఁ దాల్చియుండెను. ఖలీలుఁ డామెప్రక్కనే కూర్చుండి, సమయమగునపుడెల్ల నా కన్నియ కోమల కరాబ్జము నల్లనఁబట్టి ఏమియో గుసగుసలాడుచుండెను. నౌకారోహణ మొనరించినంతనే, లూకాసునకు గతవృత్తాంత మంతయు స్మృతిపథంబునదోఁచెను. మిత్రసమేతుఁడై తా నాప్రణయానుభవసుఖుం జొచ్చుటయు, పాషా యాకస్మికాగమనమునఁ దమరహస్యభంగమగుటయు, నిషిద్ధశుద్ధాంతప్రవేశమునకుఁ దానే బాధ్యుడనని పలుకుటయు, దానఁ బాషాక్రుద్ధుఁడై తన్నే దండింపఁగోరుటయు, భయంకర కాలునివోలె మండిపడు పాషా తాను గుల్నేరునుంగలసి పడవెక్కి యానమొనరించుటయు మొదలగు విషయములు లూకాసు తలంపునకు వచ్చెను. అంతలో, పాషా వ్రేలున దీపించు తన యుంగరముఁగాంచి, ఖలీలుఁడు చకితుఁడై ఒక్కనిమేషమాత్ర మాలోచించి యల్లన యిట్లనెను —

"పాషా! ఆ యుంగరము నా కొసంగుటయే నీకును క్షేమకరమని భావింతును."

ఉంగర మనినంతనే పాషా గ్రుక్కన్నడి, యనంతరము తురుష్కయువకునిపై వెఱఁగుఁజూడ్కులఁ బఱపి, ప్రథమ సందర్శ నావసర జనితానుమానము మగుడ బాధింప, దుర్భరడోలాయమాన మానసుండై, మందస్వరమున నిట్టు లనెను —

"ఆర్యా! ఇప్పుడైనఁ జెప్పరాదా? ఇట్టి ముద్రిక నీ కెట్లు లభించెను? నే నేమని గ్రహింప—"

"తొలిరేయియే చెప్పితిగదా, నా యుదంతము. అట్టులే గ్రహింపుము."

"ఆర్యా! నీప్రవర్తన మతివిపరీతము!" అని పలుకుచు, నెద్దియో అవిలంఘనీయ ప్రభావముగ్ధుఁడైనటు లావృద్ధవీరుఁడు తదంగుళీయకము

తీసి ఖలీలున కొసంగెను. యువకుఁ డద్దానిని ధరింపక, తన జేబునందు భద్రపఱచెను. హాసా సంభ్రమచేతస్కుఁడై అనిమేషనయనుఁడై చూచుచుండెను.

నౌక రయమున రేవుచేరెను. హాసాగృహమునకును, జులేఖా జనకుని గృహమునకును జేరువుగనుండు స్థలంబున నా నావ నిలిచెను. తోడనే వారందఱు దిగి, పట్టభంగముల నెక్కిరి. ఆప్రదేశమున విప్లవ చిహ్నము లెవ్వియుఁ గానరాకుండెను. కాని, తన్నికటజనానీకము భయాతిరేకమునఁ గావలయు, తలుపులుబంధించి తమతమగృహములం దడఁగియుండిరి. అంగడులు కూడ మూయఁబడి, బాట లన్నియును జనశూన్యములై యుండెను. ఖలీలుఁడిట్లు లనెను —

"హాసా ! నీ వీగ్రీకువీరులతో నీ గృహంబునకో, లేక, ప్రధానామాత్యుని మందిరమునకో వెడలుము. నే నీమానిని జులేఖానుఁ దన జనకుని సదనమున జేర్చి వచ్చెదను. అనంతరము మీ రాజ్ఞాపించు స్థలంబున కరుదెంతును."

"మిత్రమా ! మేము ముందుగ మద్గృహంబునకే పోయి అశ్వముల నాయత్తము చేయవలయు. అనంతరము, వజీరుభవనమున కేగవలయు. నీవచటనే సత్వరము మమ్ముఁగలియుము. ఆలసింపకుమా ! ఈ రేయి ఏ క్షణమున నెట్టియాపద ఉత్పత్తిల్లునో యెఱుఁగరాదుగదా."

ఖలీలుఁడు వల్లెయని పలికి, జులేఖాసమేతముగఁ గ్రమముగా నా కన్నియ గృహము డాసెను. తురుష్కుఁ డా ద్వారముచెంత నిలిచి, నిజమనోహారిణిచెవి నేదియోచెప్పి ఆపైఁ దనముద్రికఁదీసి, ఆయన్ను మిన్న కోమలకరంబునకుఁ దొడిగెను. ఆ చంద్రముఖి మేలిముసుఁగు ధరించి, ప్రకంపితస్వరంబునఁ దన కృతజ్ఞత వెలిబుచ్చెను. ఆ యుదార వీరుని ప్రవర్తనము, విపరీతమహిమాన్విత ముద్రికా ప్రదానమును ఆ లజ్జావతిని విపులానంద బాష్పబిందు సందోహమున ముంచివైచెను.

ఖలీలుఁ డా శుభాంగి కెంబెదవుల నొక్కి—పట్టి ముద్దాడి, ధైర్య మూనఁ
వలయునని హెచ్చరించి, రయమున వెడలెను. తురుష్కుఁడు పాషా
మందిరమునకుఁ బోలేదు: వజీరు భవనమునకును బోలేదు, ఎచటి
కో యేఁగెనో తెలియదు.

మన మిఁక దాల్తబనుపాషా సమాచార మరయవలయును. నిర్జ
నవ్యవీథులంబడి సాగి సాగి, గ్రీకులతోఁ బాటు ప్రభువు నిజగృహ
ప్రవేశ మొనరించెను. ఇలు సేరినంతనే, తనభటులంజీరి ఆయుధపాణులై
గృహరక్షణ మొనరింప నప్రమత్తులై యుండవలయునని ప్రభు వాజ్ఞా
పించెను. సేవకులు తత్పూర్వమే శస్త్రధరులై యుండిరి. అంతలోఁ
బరిచారకులు గుఱ్ఱములు సిద్ధముగ నున్నవని తెలుప, నా వీరపుంగ
వుఁడు జూలియను లూకాసులతోఁబాటు తురంగారూఢుఁడై నగరు
మందిరాభిముఖుఁ డాయెను.

జనీజరీవిప్లవ మన నెట్టిదో యిప్పట్టుననే అరయుదము. అజేయమగు
జనీజరీసైన్యము లెక్కకు నలుబదివే లుండును. వారు అతిభీకరులై
పాదుషాకు విజయసంపాదన మొనరించుటయేకాక, పాదుషాకే భయ
కారణములుగూడనై యుండిరి. ఎద్దియో నెపమున ప్రభుత్వమును ధిక్క
రించుట వారికి సాధారణకృత్య మాయెను. క్రొత్తసుల్తాను సింహాసనా
సీనుఁ డగు సమయమునఁ వారికి ధనము విశేషముగఁ బంచిపెట్టుట
సాంప్రదాయ మాయెను. ఆ కారణమున, వారు సహజముగ నట్టి
యవకాశముల కెదురు చూచుచుండిరి. ఎదురు చూచుచుండుటయె
కాక, సుల్తాను రణమున నోటువడినను, ప్రభుత్వనిర్వహణమునం
దసమర్థుఁడైనను, వయోవృద్ధుఁడైనను గూడ వారు రయమునఁ దిరుగఁ
బడుచుండిరి. అట్టివాఁడు రాజ్యార్హుఁడు కాఁడను నెపమున వానిని
రాజ్యచ్యుతు నొనరించి, మఱియొకనిం బ్రతిష్ఠింపవలయునని మొఱకుఁ
దనము వహించుచుండిరి. తన్మూలమున ధనసంపాదనము సులువుగా

పలవడునుగదా. సుల్తాను పుత్రులు రాజమందిరమున బంధితులువోలె బడియుందురని చెప్పియుంటిమి. ఐనను, జనీజరీ లెట్టులో వారలతో దౌత్యము నెఱపి, ఎవ్వఁడు తమపై నవిరళ సువర్ణవృష్టి కురిపింతునని సమయ మొనరించునో, వాని నా సైనికులు రాజ్యాధిపతి నొనరించు చుండిరి. వా రొకప్పుడు వజీరుఁడు ప్రజాకంటకుఁ డామెనని తిరుగఁ బడుచుండిరి. అటుగాక, దేశమున కెద్దియేని మహోపద్రవము సంభ వించునేని, ఆ భారము సుల్తానమీఁదనే వైచియుంగూడ విప్లవ మొన రించుచుండిరి. జనీజరీసైనికు లీతెఱంగున ధనాశాపరులై, స్వార్థపరులై దుష్టస్వభావులై, తమ ప్రభుత్వమునకే అత్యంత భయకారణములునై యుండిరి.

జనీజరీసైనికులు నివసించు శ్రేణు లొక ప్రత్యేక విశాలస్థలమున నమరియుండెను. సైనికజన విహరణ స్థలములగు మైదానములు గూడ నచటనే యుండెను. ఆ చుట్టును నొక పెద్ద ప్రాకార మమరియుండెను. వా తిరుగుఁబాటు నూదించు సంజ్ఞ ఎద్దియున, తిండితిను సానికలను తెడ్డులను తమ కిటికీలనుండి ఆవలకు వారందఱుంగలసి యొక్క-ముహూ ర్తమునసే పాఱవేతురు. అట్టి ప్రదర్శనము గోచరించునంతనే, నగర జనులందఱు తద్భయంకరభావము గ్రహించి, భయవిహ్వలు లాగుదురు. సాధారణముగా వారి యధికారులు సహితము వారి కెదురాడ నేరక, విప్లవమునఁ బాల్గొందురు. ప్రభుత్వముతో బొందు పొసఁగు నపుడు తమ నాయకుల కే యపాయము రారాదని వారు విధింతురు: కావున, తదుద్యోగులు నిర్భయముగా విప్లవమునకుఁ దోడగుదురు. జనీజరీమహాసైన్యమునకుఁ బ్రధానసేనాని యగు 'ఆగా' సహితము సర్వసాధారణముగా వారి యుద్యమ మామోదించును.

జనీజరీలు సాధారణముగ సాయంకాల మగునంతనే తమ తమ దారుసానికలఁ బాఱవైతురు. అంతమాత్రమునఁ దోడనే ఆకాశ్యా

చారములొనరింపరు. రేయి యెల్ల మధుపానాద్యనేక వ్యసనములందు నిమగ్నులై, ప్రభుత్వాధికారులు లోఁబడి తమ యభిప్రాయముల నామోదింతురేమోయని సూర్యోదయమగువఱకు వేచియుందురు. అటుగాక రాజ్యాధికారులు ధైర్యమువహించి నిరాకరింతురేని, ఆ సైనికులు తమ యావరణమునుండి వెలువడి, ప్రభుత్వపక్షపాతులగు పాషాలయు, తదితర ప్రజాకంటకులయొక్కయు మందిరములపై దాడి వెడలుదురు. వారి మనోరథసంప్రాప్త మాలస్యమగుకొలది, వారి దురాచారములుగూడ నధికతరమగును. ఒక్కొకప్పుడు సుల్తానుయొక్క పటాలములు వారిని శిక్షించుటకు మాఱుగ నుపేక్షించును. దాన జనీజరీలు మఱియుఁ జెలరేగుదురు. అటుగాక, సుల్తాను సైనికులు స్వామిభక్తిపరాయణులై విద్రోహుల నెదిరింపఁ బూనుదురేని, రాజ నగరమంతయు నొక భయానకరణరంగముగఁ బరిణమించును.

కావున, నీ సమయమున జనీజరీలు విప్లవధ్వజమెత్తినంతనే, ఎట్టి దారుణములాచరింతురో యను దుర్భరభయాతిరేకమున బురజనులు తమతమ కులాయముల డాగిరి. సంపన్నగృహస్థులు తమ ధనకనకాభరణాదులను గుట్టుమగు నేలమాన్యములందు భద్రపఱచిరి. తమ గృహములందు మొఱకులు చొరకుండఁ దమ ద్వారములను ఘనమగు నయోదండములచేఁ బరిరక్షించుకొనఁ దొడఁగిరి. గృహములందుండు ఖడ్గాది సమరసాధనముల నవసరార్థ ముపయోగించుటకై పదునుచేయ నారంభించిరి. ఉన్నవారు తమ తుపాకులను గూడ నాయత్తపఱచికొనియుండిరి.

ఖలీలుఁ డింకను రాకుండుటకుఁ గతంబెద్ది యని విచారించుచు, గ్రీకుయువజనమధ్యస్థుఁడై నిశ్శబ్ద నిర్జనవీథులంబడి, దాల్తబనుపాషా క్రమముగా వజీరుభవనము సమీపించెను. ద్వారము మూయఁబడియున్నను, పాషానామధేయ మాలించినంతనే, ద్వారపాలకుఁడు దయు

మునఁ దలుపు తెఱచి, యాతని నేగాక, లూకాసు జూలియనులను గూడ లోనికిఁ బోనిచ్చెను.

గ్రీకుయువకులు మొదటిమందిరముననే నిలువవలసినవారైరి. అట్టి వారలనేకు లందుండిరి. దాల్తబను సూటిగా నాలోచనాగారములోనికిఁ బోయెను. రాజ్యభారధురంధరులగు నధికారులు సుమారేఁబదిమంది యుంపుండిరి. వజీరుఁ డండగ్రాసనము నలకరించియుండెను. దాల్తబను పాషా యరుదెంచినంతనే యందొకఁడు పరిస్థితులను సంగ్రహముగ విశదపఱచెను. తాము కోరు షరతులను జనీజరీలు లిఖించి తమద్వారముచెంత బ్రదర్శించి యుంచిరి. అవి యేమన, సలీముసుల్తాను నిజసింహాసన పరిత్యాగ మొనరింపవలయును; జ్యేష్ఠకుమారుఁ డగు 'ముస్తఫా' రాజ్యాధిపతికావలయును; వజీరును ఉద్యోగమునుండితొలగింపవలయును; ప్రధానన్యాయాధిపతియగు కదీస్కారుని — జులేఖా జనకుని — బహిరంగముగా వధింపవలయును.

క్రూరస్వభావులగు జనీజరీ లొకవిచిత్ర మొనరించిరి. మహానగరమునుఁ గలవరపఱచుచుండిన దారుణదుర్మ్రణముల నెపంబున వారు విప్లవ మొనరించిరి. దానఁ బురజనులు తమ యుద్యమము నామోదించుటయే కాక, సుల్తాను సైనికు లెదురు తిరుగరనియు వా రాసించిరి, కావున వారి ప్రవర్తనము తదనుగుణముగ నుండుటకై, నగరరక్షణభారమువహించి, దారుణహత్యాపరంపర లాచరించుఘాతకులఁ బట్టఁజాలని కదీస్కారుని వధింపవలయునని పట్టుపట్టిరి.

దాల్తబనుపాషా ఆ యా సమాచారముల నాలించిన యనంతర మొక వృద్ధ రాజనీతిజ్ఞుఁడు లేచి యిట్లనెను —

"అయ్యా! నగరరక్షణభారధురంధరుం డగు కదీస్కారుఁడు — పాసీను — భయంకరహత్యారహస్య మీవఱకు నరయఁడాయెను. నగర ముడికిపోవుచున్నది. ఈ కదీస్కారుఁడు తదుద్యోగభారము వహించి

మనఁదగఁడు. ఈతఁడు మరణింపవలయునని కదా, జనీజరీలు విప్లవ మొనరించిరి. మన మియ్యకుండుమేని, మన సైనికులు మనకు లోఁబడియుండరు. అనంతరము మనము వారి నుచితవిధమున శిక్షింపనగును. కావున, కదీస్కారుఁడగు హాసేనును జనీజరీల హస్తగత మొనరించుట సమంజసమని భావింతును.”

అంత దాల్తబనుపాషా రోషకషాయితాత్ముఁడై తన బావయగు హాసేను మరణింపరాదని ధైర్యముగఁ బలుక, తొంటి వృద్ధమంత్రి యిట్టు లనెను —

“మిత్రమా! ఈ సమయమున రోస మసమంజసము. ఇట్టి సమయమున నా సోదరుఁడు వధ్యుఁడు కానున్నను. వేఁడుదును.”

పాషా యంత ప్రధానామాత్యు నుద్దేశించి యిట్టు లనెను —

“మంత్రిపుంగవా! హాసేను కదీస్కారునకు సుల్తాను ఎనిమిది దినములు మాత్రము గడువొసంగెను. నేటికి నాలుగుదినములు మాత్రమాయెను. కావున, వాఁ డవధ్యుఁడని మనవిచేయువాఁడను. మఱియొకటి ఈనగరమునందును, పరిసరములందును, సుల్తానుసైన్యములు సుమారేఁబదివే లుండును. ఈ సైన్యములు మదధీనములై పెక్కువిజయములఁగాంచెను; కాన, నేను సైన్యాధిపత్యము వహించి —”

వజీరుఁ డాతని వారించి యిట్టు లనెను —

“ధీరోత్తమా! నీ పరాక్రమ మవక్రము. నీ కార్యోత్సాహము నిరుపమానము. నీదు స్వామిభక్తి నిక్కముగ నాదర్శప్రాయము; నీకు వర్తమానమంపిన యనంతరము పరిస్థితులు మాఱెను. వివిధసైన్యాధిపతులు తమతమ సైనికులు జనీజరీలపై నభిమాన మూనినవారలని తెలియఁ బఱచిరి. మిత్రమా! నగరమంతయు నేక కంఠమున కదీస్కారుని మరణ మాకాంక్షించుచున్నారు. కాన, నాతని మరణము ధ్రువము.”

అంత మఱియొక రాజనీతివిశారదుఁడు లేచి యిట్లులనెను —

"మంత్రివరా! లెస్సగా సెలవిచ్చితివి. ఈ కదీస్కారుఁడు తప్పక వధ్యుఁడు; అనంతర మీ మహాసీయుఁడు దాల్తబనుపాషా సుల్తాను సైన్యములకు నాయకత్వము వహించి విప్లవకారుల హతమార్చుగాక. కాని ఒక్క విషయము గమనింపవలయును. హసేనును జనీజరీల కొసంగ రాదు. ఒసంగుదుమేని, మనము భీరులమనియెంచి ఆచెనటులు మఱియు జెలరేగుదురు. కావున, సుల్తానువారి తలారియే కదీస్కారుని బహిరంగముగా వధింపవలయు: దాన, ప్రజాగ్రహ ముపశమించును: జనీజరీల బలము నీరసించును. ఇట్టి మహాసంకటసమయమున దాల్తబను పాషా యుదారమనస్కుఁడై, స్వామిభక్తిపరాయణుఁడై, దేశహిత కార్య పరతంత్రుఁడై బంధుత్వమును కెడమీక, సమ్మతింపవలయునని మనవిచేయున్నాఁడను."

ఆ నుడులు కడుసమంజసముగ నుండుటచే, దాల్తబనుపాషా బాంధవ్యమును బోఁద్రోచి, తన భావుకుని మరణము నామోదించెను. సభ యంతటితో ముగిసెను.

ఉన్నతప్రభుత్వోద్యోగులు మొదలగు ప్రముఖులను వధించుటకొక ప్రత్యేకాధికారి యుండెను. వానిని సాధారణముగా 'బాళ్చి' యని పిలుతురు. తదధికారిని జేరి, హసేను కదీస్కారుని గృహంబునకు రయంబునఁ బాఱి ఆతని, తత్క్షణము వధించిరావలయునని వజీరుఁ డాజ్ఞాపించెను. తోడనే, ఆప్రభుమారకుఁ డిరువురు సహకారులఁ దోడుకొని, యమునివలె నగరరక్షకుని గృహమున కతిరయమునఁ బోయెను.

దురదృష్టవంతుఁడగు హసేనుకదీస్కారుఁడు, ప్రాణాపహరణక్రియా దక్షచాపధరుండై యభినవ దండధరునివలె 'బాళ్చి' గోచరించినంతనే సముద్యత్క్రోధహర్యక్షదర్శన హరిణమువలె భయవిహ్వలుఁ డాయెను. బాళ్చి యిట్టు లనెను —

"అయ్యా! న్యాయకార్యభారధురంధరుఁడనై నే నేతేరవలసిన వాఁడనై తినని మిక్కిలి వగచువాఁడను: నేను కేవలము రాజసేవకుఁడఁ గదా."

"అయ్యా! విధి నిర్ణయము! ఎవ్వఁడెదురాడఁగలఁడు? నీపైఁ గినియను. కాని, లోనికేగి మత్ప్రియభార్యాపుత్రికలను గడసారి కాంచి, యూఱడించి, యరుదెంతును."

"అయ్యా! క్షమింపుము. నిన్నొక్కక్షణమైన వీడరాదని యాజ్ఞ. కావున, నీ బంధుగులఁ జూడఁగోరెదేని, వారి నిచటకు రప్పింపుము."

"దైవమా! నా పుత్రిక నాల్గుదినములు దూరమునను౦డి, ఇప్పుడే యరుదెంచెనని వింటి. వివిధకార్యములలో చేయుంబవళ్ళు నిమగ్నుఁడనై యింతవఱకుఁ గాంచుట కవకాశము లేకపోయెనే. హా! పుత్రీ! పత్నీ! ఈ దుర్వార్త నేమని వినుపింతును? ఎట్లు భరింపఁగలరు?"

హానేనుఁ డట్లు విలపించి, యనంతర మొక సేవకునిఁజీరి, వానిచేఁ దన భార్యాపుత్రికలను రావించెను. ఏమియు నెఱుంగని జులేఖా రయమున బాఱి పరమానందభరితస్వాంతయై నిరవధికప్రేమావేశమునఁ దన జనకుని గాఢాలింగన మొనరించెను. కదీస్కారునిపత్ని మాత్రము మూర్తీభవించిన మరణ మనఁదగు బాష్పీని గాంచి నంతనే, అమితభయాతిరేకమున కెవ్వున నఱచెను. అంత జులేఖా చటుక్కున వెనుదిరిగి చూచి భయవిస్మయపారవశ్యమునఁ బట్టు తొఱంగి, యట్టె నిలచిపోయెను.

"వలదు! వలదు! అయ్యా! నా మగనిచెంతకు రావలదు! ఒక్క దినము గడు వొసంగుము — ఒకగంటయైనఁ జాలును! పాదుషావారి పవిత్రపాదములపైఁ బడి —"

అట్లు గోలుగోలున నేడ్చు తన ప్రియాంగనను వారించి, కదీస్కారుఁ డిట్టులనెను —

"ప్రేయసీ! ఏల ఈ వ్యర్థవిలాపము? రాజశాసన మమోఘము. విధివిధాన మనుల్లంఘనీయము. కాంతా! నేను మరణింపక తప్పదు."

ములుకులుబోలు తండ్రి పలుకులు వీనులం బడినంతనే పద్గాల్లి, క్రోధవిస్ఫారితనయనయై మఱల చూడం జూచి, ప్రచలితతీవ్రస్వరమున జులేఖా యిట్లులనెను —

"మరణమా! తండ్రీ! ఏమంటిరి! ఓయీ, బాల్హీ! నీ కీయధికార మెవ రొసంగిరి!"

"సర్వాధికారము వహించియున్న మహనీయుఁడు నన్నీ సన్నికార్యమునకు నియోగించెను."

"కుమారీ! ఎందులకీ వృథాభాషణము? నా కాల మాసన్నమాయెను. అనవసర కాలయాపనము కేవలము బాధాకరము, వేఱు ప్రయోజనము లేదు. అనవసరము, ధైర్యమూనుము, నేం బోయెద, నీ జనయిత్రి నూఱడింపుము."

అట్లు మరణోన్ముఖుండై, తదవసరోద్భూతనిరాశావేశ సంకలిత నిశ్చలచిత్తుండై సయ్యదు హాసేను నభినందించుచు బాల్హీ యిట్లు పలికెను—

"ఆర్యా! నీ ధైర్యమెంతయుఁ ప్రశంసనీయము. నీ విఁక మరణింప సంసిద్ధుఁడవుగమ్ము."

అట్లుపలికి, అనేక కంఠవిలుంఠనసమర్థమగు ఘోరతరచాపమును బాల్హీ సారించెను.

"హా! ప్రేయసీ! మత్ప్రియపుత్రీ! నన్నుం గడసారి యాలింగన మొనరింపుఁడు. ఇదే పోయెద, సెలవిండు; దయామయుండగు పరమాత్ముఁడు మీకు హితమాచరించుం గాత!"

కదీస్కారుం డట్లు పలికినంతనే, ప్రకంపితశరీరయయ్యు జులేఖా ధైర్యధుర్యయై, తదవసరోద్రేకపూరితచిత్తయై, విస్ఫారితారుణనేత్రయై

దీపించి, ధైర్యాతురసంభరితస్వరంబున, నిట్టులనెను —

"జనకా! ఒక్క క్షణ మాగుము. ఓయీ! కార్యశూరుఁడా! చూడు మీ యంగుళీయము! ఈ యపూర్వ లాంఛన మపూర్వ మహిమోపేత మగునేని, తత్క్షణ మావలకుఁ బొమ్ము!"

ఆ కాంత ఖలీలుఁ డొసంగిన యుంగరము ప్రదర్శించెను. రాజ భటుఁ డద్దానింగాంచి, దగ్గఱకుఁబోయి పరిశీలించి, యందలి గోళ మును తదితరాపూర్వసంజ్ఞలనుగాంచి భయసంభ్రమాకులుండై, జాస్త ఖాను వెఱఁగుఁదనంబునం దిలకించుచు నట్టె నిలిచిపోయెను. అంత, నా కన్నియ ఇట్టులనెను —

"వెడలుము! నీ వికఁ దడయ నవసరము లేదని గ్రహింతువు గదా."

ఆ భయంకర ప్రభుత్వాధికారి తోడనే సవినయముగ సలాము లాచరించి, యనుచర సమేతుఁడై నిష్క్రమించెను. జులేఖా యమం దానందకందళితగాత్రయై రయంబున విస్మయానంద పరవశులగు నిజ జననీజనకులను గాఢాలింగన మొనరించెను!

## ౧౬

కదీస్ఖాని గృహమునకు జాఫ్రీపోయిన సమయముననే, ఖలీ లుఁడు జనీజరీల తావునకుఁ బోయి, అచటి ప్రధానద్వారము తట్టెను. ఆ ద్వారముచెంతనే, ఆ సైనికులు కోరు మరతులు ప్రదర్శింపఁబడి యుండెను. అద్దానిం గాంచినంతనే, తురుష్క యువకుఁడు క్రోధ వివశుఁడై, శతధా భిన్న మొనరింపఁబోయెను. కాని, అట్టి ప్రవర్త నము అనుచితమని యెంచి చూచుచుండఁగనే, సింహద్వారమున నుండు చిన్న తలుపు తెఱచి, తద్ద్వారపాలకుఁడు ఖలీలునిఁ గాంచి,

"నీ వెవ్వఁడవు? ఎందులకు గదుగొంచితివి?" అని ప్రశ్నించెను. ఖలీలుఁ డిట్టు లనెను —

"మీ సర్వసైన్యాధిపతియగు ఆగాతో మాటాడవలయు. నన్న సత్వరము కొనిపొమ్ము."

"ఇం దెవ్వరు ప్రవేశింపరాదు. జనీజరీలు తమ సానికలను విసరివైచిరని యెఱుంగవా?"

"నగరమంతయు నెఱుంగును. కాలయాపన మొనరింపక, నాకు దారి యొసంగుము: లేదేని, నిన్నుఁ బరిమార్చియే పోయెదను."

అట్లు పలుకుచు ఖలీలుఁడు పండువెన్నెలయందుఁ దళ తళ మెఱయు కరవాలము రయమున నూడదీసెను. ద్వారపాలకుఁడు సహజముగ ధైర్యవంతుఁడు, అమిత బలశాలి: దీర్ఘ కరవాలమునే గాక, భయంకరమగు తుపాకిం గూడ ధరించియుండెను. కావున, ఒక్క యువకుని బెదరింపులకు వాఁడు చలింప నవసరము లేదు. ఐనను ఖలీలుని అపూర్వ గాంభీర్యము భటుని - వినమ్రము నొనరించెను. వాడంతట చకితుఁడై, ముగ్ధుఁడై, వినయవిధేయుఁడై, సగౌరవముగా నిట్టులనెను —

"ఆర్యా! అల్లదే దీపరాజము దేదీప్యమానముగ వెలుఁగుచున్నది. అయ్యదే ఆగా యాగారము. ఇటు పొమ్ము."

ఖలీలుఁడంత మందహాస మొనరించి, బరువైన బంగారు సంచి వానికి బహుమాన మొసంగి, లోనికిఁ బ్రవేశించి, వాఁడు చూపిన మార్గము ననుసరించెను. ఆగా మందిరము చెంత నొక భటుఁడు వివిధాయుధధారియై కావలియుండెను. కాని, ఎద్దియేని అత్యవసర కార్యము లేక ఆతఁడు ప్రథమద్వారము నతిక్రమించి రాఁజాలఁడని యెంచి, వాఁడు వారింప కూరకుండెను. ఆకారణమున ఖలీలుఁడు సులువుగాఁ దన్మందిరాంతర్గతుఁడాయెను, అనంతర మాతఁడు విశాల

సోపాన పరంపరనారోహించి, మేడమీఁదకుఁ బోయెను. అచట మఱి యిరువురు ద్వారికు లాతనిఁ గాంచియు, సురాపానము తల కెక్కుటచే, మూఁగవాండ్రవలె మిన్నకుండిరి. ఖలీలుఁడే వారినిఁ బ్రశ్నింప, ఆగా యుండిన మందిరము వారు చూపించిరి.

ఖలీలుఁ డొక విశాలమందిరమును బ్రవేశించెను. ఆ సభాభవన మునం దున్న తాసనమున సర్వజన భయంకరుండగు జనీజరీ సర్వ సైన్యాధీశుఁడు దర్పమొప్ప నాసీనుఁడై యుండెను. ఆతఁడు పీరజనో చిత వస్త్రధారణ మొనరించి, శిరమున నొక టోపీ మాత్రము తాల్చియుండెను. ఆ యుష్ణీషము మనోహర లాంగూల విరాజితంబై, సువర్ణ బాలచంద్ర లాంఛన దీపితంబై యుండెను. తల్లాంఛనంబున నొక మనోహర సువర్ణ దర్వి వెలుఁగుచుండెను. ఆగా ఏఁబదియేండ్ల ప్రాయమువాఁడు, సమున్నతాకారుఁడు, దృఢగాత్రుఁడు, గంభీర వదనుఁడు గూడనై యుండెను. జనీజరీ సైన్యము నందలి వివిధ సైని కోద్యోగు లిరువదిమంది చుట్టును సోఫాలపైఁ గూర్చుండిరి. వా రందరి చేతులందును ధూమనాళము లిమిడియుండెను. అందరి యెదుటను మేజాలపై కాఫీ షర్బతు మొదలగు మనోహర పానీయ ములు గూడ నమరి యుండెను.

అపరిచితుఁ డగు ఖలీలునిఁ గాంచినంతనే, తత్సభాసదు లందఱు విస్మయపరులైరి. ఐనను, ఆయువకుని యసూన గాంభీర్యౌ దార్యగర్భిత సమున్నత మనోహరాకారముఁ గాంచి చకితులై, కుపిత స్వాంతులు గాక, వారట్లె వీక్షించుచుండ, ఖలీలుఁడు తా నరుదెంచిన తలుపు మగుడవైచి, వారి మధ్య కేగుచు. నావిప్లవ కారుల ధైర్యమెంతటిదో, వారి హృదయమెట్టిదో యెఱయుటకో యన, నా యా నాయకుల నొక్కసారి కలయఁజూచెను. ఆ దళ నాయకు లట్టులే విభ్రమ విస్ఫారితనయనులై పరికించుచుండ, ఖలీ

లుఁడు ఆగాను సమీపించి, నిశ్చలగంభీరస్వరమున నిట్లు ప్రశ్నించెను -

“జనీజరీ విప్లవమునకు నీవు నాయకత్వము వహించితివఁట నిక్కమా?”

“ఇట్లు ప్రశ్నించుటకు నీవెవ్వఁడవో, నీకుఁ గల యధికార మెద్దియో ఎఱిఁగింతువేని, సమాధాన మొసంగఁబడును.”

ఖలీలుఁ డంత గర్వగాంభీర్య విస్ఫురిత వీక్షణంబుఁ బఱపి, “నీప్రశ్నలకుత్తర మొసంగ”నని విస్పష్టముగఁ దెలిపెను.

“కాని, నీవెవ్వఁడవో, నీరాకకుఁ గత మెద్దియో యరయకుండ నిన్ను మారహస్య సమావేశమున కెట్లు రానిత్తుము?”

“మీప్రశ్నలను సరకు చేయను. నాయాశయ మెట్టిదైనను, తప్పక కొనసాగును. మీ హృదయములు నాకుఁ గరతలామలకము లని యెఱుంగుఁడు. ఈవిప్లవమునకు మీరు కారకులు కారు. ఇతరులు రగులజేసిన ఈదుష్టవిప్లవమునకు మీరు బలవంతముచే నాయకత్వము వహించితిరి. ఇంతకంటె యవివేకముండునా? బలవంతులు, ధైర్యవంతులు, ప్రభుభక్తి పరాయణులును అగు మీబోటి ప్రముఖులు యుక్తాయుక్తముల నరయక, తీవ్రపాటున సమిత ప్రజా నష్టకరం బగు నిట్టి నికృష్టకార్య మొనరింపఁ గడంగుట కంటె, హీనత్వ మింకొకటి యుండునా?”

జనీజరీ నాయకుల హృదయ మర్మ మరసి ఖలీలుఁడు సముచిత తీవ్రోపన్యాస మొనరించుటచే, వా రెల్లరు నిస్తేజులై, నిర్వికారులై, ఆలోచనాపరులై ఖలీలుఁ డెవ్వఁడో, వాఁ డేల రావలయునో యను విషయములు పూర్తిగ మఱచిపోయిరి. తన వచన ప్రభావము గుర్తించి, యాతఁడు మగుడ నిట్టులనెను —

“సర్వసైన్యాధిపా! నీ వొక మేటి మగండవని పేరు గాంచితివి. నిన్నల్లి మార్గమధ్యమునఁ గాంచునపుడు, “అతి భయంకరులగు

నలుబదివేల మంది జనీజరీల కీ మహానీయుఁ డరిగాఁపు. కాని, నాయ కుఁడు కాఁడు," అని పల్కుఁగునేని, నీ వాక్షణము నన్ను వధింతువు. కాని, యథార్థ మట్టులే యున్నది! మృగప్రాయులగు సైనికాధ ములు తలంచునపుడెల్ల సానికలఁ బౌఱవైచి విప్లవ మొనరింపఁ గోరుదు రేని, నీవు నాయకత్వము వహించుట పాడి యగునా? ఇయ్యది ధీరజనలక్షణమా? మహానాయకుఁ డొనరింపవలసిన కార్యమా? మూర్ఖులగు దుష్ట భటానీకములకు దాసానుదాసుఁడవై, అంధుని చందమున బౌదుపాపై విప్లవధ్వజమెత్తుట ప్రశంసనీయమా? ఆగా! నీ వుదారహృదయుఁడ వని యెఱుంగుదు. దుర్వారధీరోదాత్తుండ వని యెఱుంగుదు: నిరుపమానతురుష్కసామ్రాజ్యమున కాధారభూతుండ వనియు నెఱుంగుదు. అట్టివాఁడవు ఒక్కని మేషమాత్ర మేకాకివై విచా రింతు వేని, ఈ కార్యము నిక్కముగ నసంబద్ధమనియు వర్జనీయ మనియు నీవే గుర్తింపఁగలవు. ఈ నా పలుకులన్నియు నినుబోలు నీ వీర వర్యులకుఁగూడ సమన్వయించునని వేఱుగఁ జెప్పుట అనవసరము."

జనీజరీనాయకు లందఱు స్తంభీభూతులై పోయిరి. ఖలీలుని గాంభీర్యము నిరుపమానముగ నుండెను. కడు ధారాళముగఁ దోఁచిన యాతని పలుకులు వారి హృదయమున నాటికొనెను. తనవంటి యుదారమానిసులతోడనే మాటాడినటు లా వీరుఁడు నటించెను. ఖలీలుని వీక్షణము లొకింత నిరసనముతోఁ గూడ మేళగించి వారి వదనములపైఁ బడుచుండుటచే, సేనానులమానస మొకింత చుఱుక్కు మన, మఱుగువడిన పౌరుషము రేకెత్తెను. తాము నిక్కముగఁ దమ స్వాతంత్ర్యముం గోల్పోయి, సైన్యమునకు నాయకులై యుంట మాని, దాసుల మైతిమని గ్రహించిరి. ఆగా యింకను మానముద్ర దాల్చియుండ, తత్సమానసైన్యాధిపతి యొకఁడు వివేకవంతునివలె నిట్లు అనెను —

"ఈ యువకుని పలుకులు నిక్కముగఁ దోఁచుచున్నవి !"

"ఈ వీరుని పలుకు లసమంజసములు కావు !"

"నిరుపమాన వివేకనిధి యగు మన ప్రవక్తగుణ మొకింత ఈ యపరచితున కలవడినటు లున్నది."

మఱి యిరువురు సేనాను లట్లు పలుక, ఆగా ఇట్లు లనెను —

"ఈ యువకుని వాక్కులు సత్యసమన్వితములై యున్నను, కొంత వెగటుగఁ బలికెను. ఐనను, ఈ పురుషుని గౌరవోదార గంభీరప్రవర్తనముం దలంచి, ఉపేక్షింతము. కాని ఈ మహానగరమును దారుణముగ సంక్షోభింపఁజేయు భయంకర హత్యాపరంపర గుఱించి ఈతఁ డేమనును ?"

ఖలీలుఁ డిట్టులనెను —

"అయ్యవి తప్పక గర్హితములే. కాని, నలుబదివేల మహాసైన్యమును శాసించు మహావీరుఁడవు, నీ వేమి చేయఁజాలితి వని, నేను ప్రశ్నింపవలయును."

"హంతకుల నరయుట మాపనికాదు."

"సుల్తానువారి పనియును గాదు: ఐనను, మీ రా మహాపురుషుని పదభ్రష్టు నొనరించెద రే!"

"రాజు సర్వాధికారి; కావున, బాధ్యుఁడు."

"ఇది నీసిద్ధాంతమగునేని, వ్యక్తిగత ప్రభుత్వము నున్నయగును: లేదేని, పరమాత్మునివలెనే, సుల్తానుకూడ సుస్థిరసర్వశక్తి సమన్వితుఁడు గావలయు!"

ఖలీలుని యుక్తియుక్తవచన ప్రాగల్భ్యముం గాంచి, సభాసదు లెల్లరు ససంభ్రములై, యాతనిఁ గొని చూడిరి. ఆ వింతయువకుఁడు మఱుగడ నిట్టులనెను —

"ఆగా ! నీ వనుభవజ్ఞుఁడవు, వివేకవంతుఁడవు, ధర్మపక్షైక వర్తనుఁ

డవు. నిన్ను నీ జనీజరీసైనికులను హాత్యలకై దూరుట యెంత సమంజ సముగ నుండునో, సుల్తాను వారిని దూషించుటయు నంత సమంజ సముగనే యుండునని వ్యక్తమగును. నీ వొనరింపవలసిన కార్యములు కొన్ని కలవు; అట్లులే పాదుషావారు చేయఁగల కార్యములును గొన్ని కలవు కావున, ఇట్టి విపరీతఘోరకృత్యములు జరుగునేని, తచ్ఛాఖాధికారులే బాధ్యు లగుదురు."

"అయ్యా! పాదుషావారు బాధ్యులుకారని తప్పక అంగీకరింతును. నా యభిప్రాయము నట్టులే యున్నది."

"ఆ కారణముచేతనే వజీరుఁడుగూడ బాధ్యుఁడు గాఁడని చెప్ప వలయు. ఆతనిఁ దొలఁగించుట యసంగతము."

"ఔను! కాని, కదీస్కారునిగుఱించి యేమందువు?"

"ఆతఁడును బాధ్యుఁడు కాఁడనియే చెప్పఁగలను. తద్రహస్య విచ్ఛేదనాకార్యపరతంత్రు లందఱు చేయఁజాలని కార్య మాతఁడు మాత్రము చేయఁగలఁడా? ఐనను, రక్షకభటాధీశుఁ డగుటచే, నాతఁడే బాధ్యుఁ డని యనుకొందము. కాని, మన మొక్క విష యము మఱవరాదు. సుల్తాను వా రాతని కెనిమిది దినములు గడు వొసంగెఁగదా. ఇయ్యది నాల్గవదినము. ఇంకను నాలుగు దినము లున్నవి. కదీస్కారుఁడు మిగుల పరిశ్రమ యొనరించెను: తప్పక కృతకృత్యుఁ డగుననియే విశ్వసింతును. అటుగాక, మీరు తీవ్రపడి ఆ సమర్థకర్మకరుని ఖండింతురేని, వాని ప్రయత్న మంతయు నిరర్థక మగును. దాన, మన నగరమున కెంతయేని చేటుమూడును. కావున, నేఁ గోరున దేమన, మన కదీస్కారుఁడు పూనినకార్యము పూర్తి యగువఱకు వసనిండు. మీ మీ సైనికులు యథాప్రకారము తమ తమ కార్యము లొనరింపవలయునని మీరు శాసింపుఁడు. మీ కట్టి సమర్థతకలదు: ధైర్యవంతులరై యాచరింపుఁడు. నాలుగు

దినములు కడచి ఐదవ దినము గడచునదికే దారుణరహస్య కథాకలాపము బట్టబయ లగునని విశ్వసింపుఁడు."

సరస సంభాషణాపారీణుఁడగు ఖలీలుఁ డట్లు విస్పష్టగంభీర స్వరంబునఁ బలికినంతనే, సభాసదు లెల్లరుఁ దమ ప్రవర్తన యసంబద్ధముగ నుండెనని గ్రహించి, ఉపన్యాసకు నుగ్గడించి, ఆగా సహితము విప్లవము నంతరింపఁజేయవలయునని వాంఛించెను. కాని, సైనికులు తిరుగఁబడుటకుఁ గారణము ధనతృష్ణ యొక్కటి కాదు. వారు నిరూపించు కారణములు కేవలము నెపములు. కావున, నాయకు లెంత యాలోచించినను, ధన మలవడినఁగాని, సైనికులు లోఁబడరు. నా రా కారణమున దురంతచింతాక్రాంతచిత్తులై డీల్లపడియుండ, ఖలీలుఁడు తదభిప్రాయము గుర్తించి, శతాధిక గర్వ సంభరితగాంభీర్యము వహించి, తదుచితస్వరంబున నిట్టులనెను —

"ఆర్యులారా! మీరును మీ సైనికులును గూడ హితవచనముల నిరసించి మెలంగుదురేని, తద్భయంకరఫల మెఱింగించెద గమనింపుఁడు. అప్పుడైన మీ మౌర్ఖ్యము తప్పక పటాపంచలగును. సలీముసుల్తాను మిక్కిలి యుదారవంతుఁడు; ఐనను, తన కెట్టియపాయము వొరయకుండ, సముచితసన్నాహము లొనరింపఁజాలని యసమర్థుఁడని భ్రమింపకుఁడు. ప్రసిద్ధ యశోభాసురుండగు రెండవ మహమ్మదు సుల్తాను తొల్లి ఈనగరముపై దండెత్తినపుడు నాఁటి పురజనులగు పాశ్చాత్యులు తమ తమ ధనకనకాదులను భద్రపఱచికొనుటకై సొరంగములఁ ద్రవ్వికొనిరని వినియుంటిరిగదా. నాఁడు రాజభవనమునుండి భూగర్భమున నొక యపూర్వ దీర్ఘరహస్యమార్గము కలదనియు, అయ్యది 'బ్లచరినీసు' ద్వారమునకుఁ జేర్చుననియుఁ బ్రతీతి కలదుగదా. అయ్యలారా! ఏల కంపించెదరు! ఆ ద్వార మెద్దియో యెఱుంగుదురా? సర్వజనవంద్యుఁడగు సుల్తానుపై

ధ్వజ మెత్త సాహసించిన మీరును మీ సైనికులును అభూతగర్వాతి రేకమున విడసియున్న ఈ స్థలంబంతయు నా సొరంగముమీఁదనే యమరియున్నదని ఇప్పుడైన నెఱుంగుఁడు! ఆ రహస్య భూరంధ్ర మంతయు భయంకరమగు ఫిరంగుమందుతో నిండియున్నది. పాదుషా వారు దయామయులు: వివేకవంతులు: సహనశీలురు: కావున నిందనుక సహించియున్నవారు. అనలప్రభావ మెఱుంగక అందుఱుకఁ జూచు శలభగణంబువలె, మీరింకను జలము వహింతురేని, మీ రందఱు నిమేషమాత్రమున భగ్గునమండి భస్మీభూతులై పోదురు!"

సగర్వముగ, ధాగాళముగ, గంభీరముగ, నిశ్చయముగ నిట్లు ఖలీలుఁడు పలికినంతనే, జనీజరీనాయకు లందఱు లోలోనఁ దల్లడిల్లి డిందుపడి మిన్నకుండ, నెట్టకేలకు వారినాయకుఁడగు ఆగా భ్రాంతి తోఁ జెంగి యిట్లు ప్రశ్నించెను—

"అయ్యా! నీ వెవ్వఁడవు? ఇట్టి రహస్యవిషయములు నీకెట్లు తెలియ వచ్చెను?"

"అయ్యా! నీ కర్ణమున నొక్క పలు కాడెద: దాన, నాకొలఁది నీ వెఱయఁగలవు."

ఖలీలుఁ డట్లు పలుకుచు నా ప్రధానసేనాని శ్రవణపుటంబున నేమియో పలికెను. అట్లు లొనరించు ఖలీలుఁడు నిజాధరమున వ్రేలిడి, తోడనే యాగాను వీడి సహజ నిర్లక్ష్యసరణి నల్లన మందిర మధ్యప్రదేశమునకుఁ బోయి యట్టె గంభీరముగ నిలుచుండెను.

ఖలీలుఁ డేమనెనో గాని, ఆగా తోడనే కంపిత హృదయుఁడై అనిమిషనయనుఁడై, ఉద్విగ్నస్వరంబున నిట్టులనెను —

"ఆర్యా! ఖలీలు మహాశయా జనీజరీలను శాంతపఱచు భారము నాయది. ఎట్టులో, నా ధనమంతయుఁ బంచియైనను, విప్లవము లేకుండ నొనరింతును. అయ్యా! నీవు వెడలుము. నీ వేగిన

యొక గంటలోపున మూడు చువ్వలు చయ్యన మింటి కెగయును. దాని విప్లవ మంతరించెనని గ్రహింపుము."

"సైన్యాధీశా! సంతసించితిని. బెదరించి లంచ మొసంగుట నేనెఱుంగను. నీ ప్రవర్తనమునకు మెచ్చి నేనొసంగు వసదనము పరిగ్రహింపుము." అని పలుకుచు ఖలీలుఁడు ఆరంగుళముల పరిమితి గల చిన్న రత్న మంజూషము జేబునుండి తీసి తెఱచినంతనే, తన్మందిరమును దీపించు దీపరాజ వినిర్గతా విరళ కిరణజాలములయందు మెఱపుల చందమున మెఱుఁగొందు నపూర్వ నవరత్నములు సేనానుల నయనములు చెదరునట్లు గోచరించెను. ఆగా ఉత్సాహవిశాలాయతవదనుఁడై, తదమూల్యపారితోషికము నందికొనెను. ఖలీలుఁడంత గౌరవపురస్సరముగా శిరము వాల్చి తన దారినిఁ బోయెను.

కదీస్కారుని వధించుటకు బాళ్ళి వేగిన సమయముననే, ఖలీలుఁడు జనీజరీ నాయకులతో సంప్రతించెను. అనంతరము, ఇతర రాజనీతిజ్ఞులు కూడ నియ్యకొన వజీరు దాల్తబను పాషాను సుల్తాను సైన్యములకు నధినాయకు నొనరించి, విప్లవ దావానలము నార్పు భార మాతనిపైఁ బెట్టెను. ఇతర ప్రముఖుల కుచితకార్యముల నియోగించి, ఆ యా సమాచారముల సుల్తానునకు లిఖించి పంపి, వజీరుఁడు సభ ముగించెను.

సుల్తాను సైన్యము లేఁబదివేలున్నను, ప్రస్తుతము పదివేలసైన్యము మాత్రము పాషా యధీనమాయెను. గ్రీకుయువకులు జూలియను లూకాసులు పాషా వెనువెంటనే యుండిరి. ఖలీలుఁ డేమాయెనో, ఆవీరుఁ డింకను రాకుండుటకుఁ గతం బెద్దియో యని చింతించుచు వారు పోసాగిరి. ఖలీలునకై నిలుచుట కవకాశము లేదు.

సుల్తానుకుఁ జెందియుండిన పదివేల యాశ్వికదళ మొక ప్రత్యేక స్థలమున విడిసియుండెను. తత్సైన్యాధిపతులు జనీజరీలతోఁ గలియు

టకు, మానుటకును నిర్ణయించికొనఁజాలక, ఔదాసీన్యము వహించి తటస్థముగ నూరకుండిరి. దాల్భబను పాషా నూటికి వారిచెంతకే పోయెను. యోధజనప్రియుండగు నా మహానుభావుని గాంచి, మంత్రి వర్గము తలం పెత్తింగినంతనే అశ్వికసైన్యాధిపతు లెల్లరు నాతని నాయకత్వ మామోదించిరి. కాని, సైనికులుగూడ నామోదించినఁ గాని ప్రయోజనములేదు. వారిలోఁ జాలమంది పగలు దారుణ రహస్యవధకుఁ బాల్పడిరి. కావున వారు కూడ నగరరక్షకునిపై గ్రోధమూని, వాఁడు తప్పక మరణింపవలయునని కృతనిశ్చయులై యుండిరి. కదీస్కారుని వధించుటకై బాశ్చీ వెడలినసంగతి మాత్రము పాషా యెఱుంగును: అనంతర సమాచార మాతఁ డెఱుంగఁడు. కావున నా పాషా అశ్వికుల తలం పెత్తింగినంతనే, ప్రజాకంటకుండగు కదీస్కారుఁ డీసరికి నిక్కముగ మరణించియుండు నని నిబ్బరముగఁ బలికెను. సైనికు లెల్లగు సంతసించిరి. కాని, ఆ నాయకులలో నెల్లఁ బెద్దయగు దళవాయి పాషాను సమీపించి రహస్యముగ నిట్టులనెను —

" మిత్రమా ! ఒక్కవిషయ మరయఁ గోరెదను. కదీస్కారుని యుదంతము నిజమగునా ? లేక సైనికులను లోఁబఱచికొను నెపమున నిట్లు పలికితివా ? ప్రధానామాత్యుఁ డెట్లులైనను వానిని రక్షింపఁ బ్రయత్నించునని యనుమానింతును. "

" మిత్రమా ! అనుమానము వలదు. మేము చూచుచుండగనే, రాజద్రోహియగు బాశ్చీ కదీస్కారుని వధించుటకై పోయెను. వధా నంతరము వాని మస్తకము సులేమానుమసీదుచెంతఁ బ్రదర్శితమగును."

"అట్టు లగునేని, మేలు : మా సైనికు లెల్లరు నీవు శాసించు తెఱంగునఁ బ్రవర్తింతురు. అన్యథా యగునేని, ఈసైన్యమంతయు మనలను నిరాకరించి, విప్లవకారులతోఁ గలసిపోవును. అంతటితో సరిగాదు. మన ప్రాణములకే యపాయము సంభవింపవచ్చును.

అందు, నీపై మఱియుఁ గినిసియుందురు. "

"మిత్రమా! సందేహ మేమియు లేదు. కదీస్కారుని వధింప వలయునను నాజ్ఞ వీనులార వింటిని: తత్కార్యభారకుఁడు బాశ్చీ యందులకై ప్రయాణమగుట కన్నులారఁ గాంచితిని. కావుననే, ఇంత నిబ్బరముగాఁ జెప్పుచుంటిని. నగరరక్షకుఁడు మదీయభావుకుఁడు; ఐనను, ప్రజాక్షేమము, రాజ్యక్షేమమును గోరువాఁడ నగుటచే, నేనును ఆమోదించితిని. మిత్రమా! తాళుము. సైనికుల సందేహము నేనే మాన్పెదను."

పాషా యట్లు పలికి, సైనికశ్రేణుల జూసి, ఎలుఁగెత్తి, సగర్వముగ నిట్లు లుపన్యసించెను —

"సైనికులారా! కదీస్కారుఁడు మరణించెనని యెఱుంగుఁడు. మన మిదే జనీజరీస్కంధావారము సమీపింపవలయు. ప్రసిద్ధమగు సులేమానుమసీ దా మార్గముననే యున్నది. నగరరక్షకుని భిన్న శిరం బచట మీరలే చూడఁగలరు. అట్లు కాదేని, నా వాక్యాలు సత్యదూరము లగునేని, తత్పరిహారపూర్వకముగా నా తల మీ కొసంగెద!"

తదుపన్యాస మారుతాహతి సైనికసందేహానుమాన మేఘములు పటాపంచ లాయెను. త దవసరోత్సాహసూచకముగా, వా రెల్లరు జయజయధ్వానము లొనరించిరి.

ఈ తెఱంగున సుమారు ఇరువదివేల సైన్యము దాల్తబనుపాషా యధీన మాయెను. దుర్గయాశ్వికదళమే కాక, ఫిరంగిదళముకూడఁ దన యధీనమున నుండుటచే, పాషా తనకు భయంబులేదని విశ్వసించి యుండెను. దవ్వుదవ్వుల నుండు సుల్తానువారి యితర సైన్యము లే తేరువఱకు వేచియుండక, జనీజరీలు నగరముపైఁబడి ఘోరము లాచరింపఁగడంగువఱకు నుపేక్షింపక, తోడనే పోయి జనీజరీదుర్గమును

శతఘ్నీబలంబున నిర్భిన్న మొనరించి, పరాక్రమవంతులగు నాశ్వికుల నందుఁ జొరఁబెట్టి, విప్లవకారులు తత్క్షణము సవినయముగాఁ దమ తమ పట్టులవీడి ఆయుధవిసర్జన మొనరింపరేని, ఆ దురాత్ముల హతమార్పవలయునని దాల్తబనుపాషా నిశ్చయించెను.

రేయి ఒంటిగంటాయెను. భీకరమహాసేనాముఖంబున దాల్తబను పాషా గ్రీకుయువజన మధ్యస్థుఁడై, ఇతరాంగరక్షకజనపరివృతుండై, యమితోత్సాహ దీపితాననుఁడై దర్ప మొప్ప బయల్వెడలెను. భయంకరములగు ముప్పదిఘరంగులు ధనంధనరవంబు లొనరించుచు నడచెను. ఆ వెనుక నాశ్వికదళము ఘమఘమధ్వానము లొనరింపఁ దొడంగెను. కాల్బల మావెనుక దడ దడ నడుగులు వైచుచుఁ బోయెను. ప్రజాసంకీర్ణమగు మహానగర మచిరకాలమున దారుణ రణరంగముగఁ బరిణమింపనుండేఁగదా యని సహజదుర్భర భయాతిరేకమున గృహస్థు లెల్లరుఁ దమ తమ గృహంబుల నణఁగియుండిరి. కొందఱు ధైర్యవంతులుమాత్రము సాహసించి తమసోరణగండ్లు తెఱచి యమ్మహాసైన్యసంరంభము భయసంభ్రమాకులంబున దిలకించిరి.

గమనత్వరితమున దాల్తబనుపాషా యొకింత ముందుగ సులేమాను మసీదు సమీపించెను. తన బావయగు కదీస్కారుఁడు వధ్యుఁడాయెగదా యను విచార మొకవంకఁ జిత్తమును విహ్వాలింప, సైనికుల యనుమాన ముడిగి తన ప్రతిన నిలుచుగదా యను దృఢతమ విశ్వాస మొకవంక నొకింత యుత్సాహ మొసంగ, దాల్తబనుపాషా మోమెత్తి తిలకించెను. నిర్మలాభ్రతలంబున సుధాకరుఁ డుజ్జ్వలుఁడై వెలుంగుచుండెను : ప్రకృతి యంతయు మనోహరమై ప్రస్ఫారము శోభాయమానముగ నుండెను : కదీస్కారుని మస్తకము [illegible] కానరాకుండెను. వంకరతిరిగిన మసీదుగోడ అడ్డియుండునని తద్భాగమును రయమునఁ జూచెను. ఐనను, కదీస్కారుని ఘోషింపు

దృగ్గోచరము కాదాయెను. అంతలో లూకాసు ప్రభువు చెంతకుం బోయెను. తోడనే, పాషా యిట్లు లనెను –

“మిత్రమా! ఈ ప్రదేశమునందే కదీస్కారుని మొండితల శూలాగ్రమును నలంకరించియుండవలయు: నా దృష్టి హ్రాస్వమగుటచేం గాంబోలు, నా కది గోచరమగుకున్నది: యువకుండవు, నీవు చూడుము.”

లూకాసు చుట్టుం దిలకించి తన కయ్యది కానరాలేదని బదులాడెను. అంతలో నరుదెంచిన జూలియును గూడం గలయంజూచి అట్లేయనెను. పాషా క్రుద్ధుండై, తీవ్రస్వరంబున నిట్లు లనెను –

“ఏమంటిరి? నావలె మీకును దృష్టిమాంద్యమా! కదీస్కారుని శిర మిచట లేకున్న మతేమి కావలయు? ఆ దురదృష్టవంతుని యుత్తమాంగ మిచట గోచరింపరాదనియే వాంఛింతును. కాని, విధి విధానము!”

“ప్రభూ! ఐనను, నగర రక్షకుని తలయే గాదు, మ తే తలయు నిం దెచ్చటను గానరాదు.”

జూలియను లూకాసు లట్లు పలుక, పాషా మఱియొకసారి చుట్టుం బరికించి, తచ్ఛిరంబు కానరామి, తేజిపై జీవరహిత శిలావిగ్రహమువలె నాసీనుండై యుండ, నాశ్వికదళాధిపతి రయమున నరుదెంచి, “ఆర్యా! నగర రక్షకుని శిర మెక్కడ? ఎక్కడ?” యని వడి వడి ప్రశ్నించెను.

కాని దురంత విస్మయాతిరేకమున, నితాంత దిగ్భ్రమము కతంబున పాషా నిరుత్తరుం డాయెను. వికలమైన ఆ వీరుని చిత్తమునందు నగర రక్షక శిరంబు గాక, వేయి మస్తకంబులు ప్రత్యక్షమయుండెను. సులేమాను పరిసరప్రాంత భూమి యంతయుం దన్మానసికశక్తి తేరువల్ల ఛిన్న విచ్ఛిన్న శిరసహస్రములతో నిండిపోయెను. ఆ ధీరులాచరింపంగల ధైర్యుండై, ఆ ధీరస్వాంతుండు వికలస్వాంతుండై, ఘండుని

చందంబున నిందందు వెఱుంగుఁ దనంబునఁ గాంచుచుఁ బ్రతివచన మాడ కుండుటచే, సేనాని తీవ్రముగ మఁగుడ నిట్లు ప్రశ్నించెను —

"అయ్యా! మాటలాడవేమి? కదీస్కారుని శిర మెక్కడ? సత్వ రము చూపుము!"

"శిరమా! ఏమి! పదివేల మొండి తల లీ సీమ యంతటను దోఁచుచుండ, నొక్క శిరము చూపమందురేల?"

నిజ యవస్థానుగుణముగా నసంబద్ధముగ దాల్తబను పాషా యట్లు పలుక, మంచి చెడ్డ లరయ కాతఁ డకారణముగఁ దన్నుఁ గేళి సేయుచుండెనని యెంచి, ఆశ్వీక సైన్యాధిపతి క్రుద్ధస్వరంబున నిట్టు లనెను —

"అపహాసమున కిది సమయము గాదు. తరుణ మెఱింగి ప్రవ ర్తింపవలయు. దీన నెంత యుపద్రవ ముప్పతిల్లునో గమనింపుము. ఇట్టి యాటలు సాగవని నేను ముందుగనే చెప్పియుంటిని. ఈ సేనా వాహిని కదీస్కారుని మస్తకముఁ గాంచినఁ గాని సంతసింపదు!"

అంతలో మఱికొందఱు సేనానులు వారిని సమీపించిరి. పాషా యొక మహాసీయుని వోలెఁ బ్రవర్తించి తమ్ము మోసగించెనని యను మానించి, వారు క్రోధారుణిత నేత్రులైరి. పాషా ప్రక్కనేయున్న లూకాను జూలియనులు పరిస్థితులు విషమించెనని గ్రహించి, విషయ మెటులున్నను అపహాసించుట మాని కర్తవ్య మూహింపవలయునని బ్రతిమాలిరి. పాషా యంతఁ దెలివొంది, సవిస్మయముగా నిట్టులనెను —

"మిత్రులారా! మిమ్ము మోసగించుటలేదు. నే నుండగనే, కదీ స్కారుని వధింపవలయునని పజీ రాజ్ఞాపించెను: తత్కార్యభారము వహించి, నేఁ జూచుచుండగనే బాల్చి వెడలెను. ప్రమాణ మొనరించి చెప్పగలను —"

"అయ్యా! ప్రమాణములతోఁ బనిలేదు. సైనికు లప్పుడే ఘోషింపు

చున్నారు! ఏమందువు? అల్లదె యాలింపుము! కదీస్ఖారుని శిరస్సు కావలయునట; లేదేని నీ శిరంబుఁ గొందురట!"

సేనావాహిని నిజముగ గలంగఁ జొచ్చెను. మహాసముద్రమధ్యమున నవ్యక్తముగ బయలుదేఱి, తద్భవతరంగములు తీరంబు దెస, బాలుకోలంది నధికతరంబై, తద్భంగానీకములు గట్టున కెగసి విఱుగు నవసరమున నధికతమంబై, భయంకర మేఘగర్జితారవ సదృశంబై యొప్పు ధ్వానమువలె నా మహాసైన్యమునందు తొలుదొల్త నవ్యక్తకలవర ముదయించి, విజృంభించి హాహాకారములు చెలరేఁగ, "కదీస్ఖారుని శిరము! లేదేని, దాల్తబను పాషా శిరము!" అను భయంకర నినాద మొక్కపెట్టున ఘోరతరంబుగ వెలువడెను.

దాల్తబను పాషా యవస్థ కడు దుర్భరముగ, కడు నపాయకరముగ నుండెను: ప్రచండజంఝామారుతోద్ధూత సముత్తుంగ తరంగ పరంపరావృత ప్లవంబువలె నుండెను: ఆశ్వికదళంబులు క్రమక్రమముగా నరుదెంచి యాతనిం జుట్టిరి.

ఏమియుఁ దోఁపక, "మీరే కదీస్ఖారుని గృహమున కేగి, మీకసి తీర వాని నేల వధింపరాదు?" అని సైనికుల నాతఁడు ప్రశ్నింపఁ బోయెను. కాని, దాల్తబను పాషా సహజోదారస్వభావుఁ డగుటచే, నట్టి దురూహ యా క్షణముననే యంతరించెను. అంత నా ధీరోదాత్త చిత్తుఁ డతి సాహస మొనరించి విస్పష్టముగ నిట్టులనెను —

"సైనికులారా. కదీస్ఖారుని మస్తకము కానరాదేని, నా తల యొసంగెదనని యంటిఁగదా. కావున నా కంఠము ఖండించి, శాంతింపుఁడు."

"వలదు! వలదు! నాకంఠమునఁ బ్రాణముండ, నట్లు కాఁజాలదు!" అని, యఱచుచు గ్రీకుయువకుఁడు లూకాను తదవసరోద్భూతధైర్య ప్రోత్సాహావేశమున విద్యుత్ప్రభావిభాసిత దీర్ఘకరవాలము కేలునం బూని

పాషా కడ్డుగ నిలిచెను. రెండవ గ్రీకు జూలియసు కూడ నిరుపమాన సాహసోద్దీపితుండై, అట్టులే యొనరించెను. వారి యద్భుత ప్రవర్తనము పాషాకే విస్మయము కల్గించెను.

ఆశ్వికు లందఱు దుర్దాంతక్రోధఘూర్ణితులైరి. పెద్ద యుద్యోగు లందఱు నొకరి నేర మింకొకరు కప్పివేయుటకుఁ బ్రయత్నింతురని వారెఱుంగుదురు. కదీస్కారుఁడు దగ్గరచుట్టము గూడ నగుటచే, దాల్తబను పాషా తప్పక వంచించెనని వారపుడు గ్రహించిరి. వజీరు పాషా లిర్వు రేకమై, తమ కండ్లయందు దుమ్ముకొట్టి, కార్యసాధన మొనరింపఁ జూచిరని వారు సహజముగా నిశ్చయించిరి. కాని, ఎంతటి విశ్వాసము లేకున్న, దాల్తబను పాషా యంత నిబ్బరముగాఁ బలుకును, యంతటి యపాయకరకృత్యమునకుఁ గడంగును, అని వారు వివేకింపరైరి. చిత్త ముద్రేకించెను: వివేక మంతరించెను: దారుణ ప్రతిక్రియాచరణమే యిఁక మిగిలెను. “వంచకునిఁ బరిమార్పుఁడు! గ్రీకులనుగూడ మట్టుఁడు!”

అట్టి భయంకరరవంబు లవిరళముగ నా సజీవపారావారమునుండి వెలువడెను. అందరికంటె దవ్వుననున్న రౌతులు తమ కృపాణములు సారించి, ‘గ్రీకులను పాషాను బట్టు నెపంబున వడి వడిఁ బోసాగిరి. ఆ దురదృష్టవంతున కిఁక దిక్కెయ్యది?

అట్టి సమయమున నెవ్వఁడో యొకరౌతు వాయువేగమున, నారంగస్థలమునకే యరుదెంచు చుండెను. సైనికులు క్రోధోన్మత్తులై, సాయుధులై, పాషామీఁద కేతేరుసమయముననే, యా రౌతు “నిలుఁడు! నిలుఁడు!” అని ఉచ్చైస్స్వరంబున నఱచుచు, తళ తళ మెఱయు సునిశిత కరవాలముల నొక చీరికిం గొనక, వ్యాఘ్రముల భాతి ఘూర్ణిల్లు సైనికులకును తద్భక్ష్యపదార్థములకును మధ్యగాఁ బోయి నిజక్రోధవిశాలనయనములు నిప్పులు కుఱియ, నీ వింత యేమి

యని తీవ్రస్వరంబునఁ బ్రశ్నించెను.

ఆ పురుషుఁడు ఖలీలుఁడే !

“ ఈ వింత యేమందువా ? మేము ఘోరముగ మోసపోతిమి. వంచకులను జక్కాడవలయు. అనంతరము, జనీజరీలకుఁ దోడగుదుము.”

పాషాను జుట్టిన సైనికు లా తెఱంగున నాగ్రహావేశమునఁ బలుక, ఖలీలుఁ డిట్టు లనెను —

“ చాలును ! జనీజరీలు విప్లవ ముడిగిరి ! మీ వలెనే వారును రాజ భక్తియుతులై యున్నవారు !”

“ ఓహో ! మఱియొక మోసమా ! చాలు ! ఈ యాట లిఁక సాగనేరవు ! ”

సైనికు లట్టు లఱవ, ఖలీలుఁడు విస్పష్టగంభీరస్వరమున నిట్టులనెను. —

“నేను యథార్థ మాడితి. జనీజరీలు ప్రభుత్వవిధేయులైరి. ఇంకను అనుమాన ముండునేని, నింగినంటు నా చువ్వలం జూడుఁడు !”

## ౧౭

ఖలీలుఁ డట్టు లనుచుండగనే చువ్వలు చుఱచుఱ మిన్నంటెను. అయ్యది జనీజరీ విప్లవ విరామచిహ్నమని యెల్ల రెఱుంగుదురు. ఒక యరమైలు దూరముననే వెలువడిన తదపూర్వాంబరదీపికలచే నా ప్రదేశమంతయుఁ గడుశోభాయమానముగ విరాజిల్లెను. విప్లవ మంతరించె నని స్పష్ట మాయెను.

సైనికుల విస్మయము వర్ణనాతీతముగ నుండెను. ఒక్క క్షణ మాలస్యమాయెఁగాని, పాషా ఈపాటికి ఖండితశరీరుఁడు కావలసినదే: జనీజరీలు విప్లవమునఁ బాల్గొనవలసినదే. ఇంతలో ఖలీలుఁ డరు దెంచుటయు, విప్లవాంతకచిహ్నము లతివింతగ వెలుంగుటయు సంభవమాయెను. అంతయు నింద్రజాలమువలె నుండెను. సైనికులు

విపరీతవిస్మయచేతస్కులై, మూఢాత్ములై, చేష్టలుడిగి చూచుచుండ తదవస్థ గుర్తించిన ఖలీలుఁ డిట్టు లనెను. —

"ఇట్టి యుత్కృష్ట కార్యభారము వహించి తత్సమాచార మెఱింగింప నరుదెంచిన నేను ఒక సామాన్యదూతను. నేఁ జెప్పవలసినది యింకనుం గలదు. సుల్తానువారియందు భక్తిగలిగి మీరు వ్యక్తపఱచిన కార్యదీక్ష యూరకపోదు. మీ మీ నిలయంబుల కరుగునంతనే, మీరమూల్య బహుమానముల వడయఁగలరు. మీ రాజభక్తి యొకింత దుడుకుఁదనంబున నొకింత విరసంబైనను, కరుణాసముద్రుఁడగు పాదుషా సైరించి మిమ్ము బహూకరించును."

"కదీస్కారుని గుఱించి యే మందువు?"

"కదీస్కారుఁడు వధార్హుఁడుకాఁడు. తన విధ్యుక్తధర్మము నాతడు నెరవేర్చుచున్నవాఁడు. మఱి నాలుగుదినములు గడచునంతనే, మీరే యాతని నుగ్గడింతురు. మీ రిఁక మీ తావులకుఁ బొండు. విప్లవాంతము మీ కెఱింగింపుమని నన్నుఁ బంచినమహానీయుఁడే మీకు బహుమానములు చిక్కుననియు గూడ నాతోఁ జెప్పెను. ఆలసింపక పొండు!"

మొండితనంబున నలుగు రైదుగురు మాత్రము కదీస్కారుని మస్తకము కావలయునని యఱచిరి. కాని ఖలీలుని సంతోష సందేశ మాలించిన తదనంత సైనికనికాయ మమందానందాతిరేకమున ఘూర్ణిల్లెను. జనీజరీలు విప్లవ ముడిగిరి: తమకు సంభావన ముట్టును: ఇఁక, కదీస్కారునితోఁ బనియేమి?

తోడనే, ఖలీలు జూలియను లూకాసులును తక్కుంగల పరిజనులును వెంట నరుదేర, పాపా ప్రాణాపాయకరంబైన యా ప్రదేశము నుండి రయంబునఁ బ్రయాణమాయెను. కొంత దవ్వరిగినయనంతర మాతఁ డిట్టు లనెను —

"ఖలీలు మిత్రమా! నీ కతంబున నా ప్రాణము దక్కెను;

కృతజ్ఞతాపూర్వకముగా వందనము లాచరింతును. కాని, నీ చర్య కేవల మగమ్యముగ నున్నది!"

ఖలీలుఁడు వినమ్రుఁడై మిన్నకుండెను. పాషా యాతనిపైఁ దొంటియట్లు అపూర్వగౌరవానుమానపూరిత వీక్షణములఁ బఱపి, యిట్లు ప్రశ్నించెను —

"మదీయ సాలుఁ డెట్లు జీవించియున్నవాఁడో ముందుగ నెఱింగింపుము."

"కదీస్కారుని వధించుటకు బాశ్చికి ధైర్యము చాలకపోవలయు!"

"జనీజరీ విప్లవము?"

"చిన్నకథ కల్పించితిని. ఆగా చెంతకుఁ బోయి, వారి తావంతయు భూగర్భమున ఫిరంగిమందుచే నింపఁబడి యున్నదనియు, నొక్కయగ్నికణముచే నా మహాసైన్యమంతయు భస్మీభూతమై పోవుననియుఁ జెప్పితిని. ఆగా నన్ను విశ్వసించి విప్లవ మంతరింపఁజేసెను."

"నీ వద్భుతపురుషుఁడవు!"

"ఆర్యా! గోడలకుఁ జెవులుండును. తనీ యవివేకము ఆగాకుఁ దెలియరాదు."

"ఔనౌను. కాని, కదీస్కారుని మీరే యుగ్గడింతు రంటివే! అది యేమి?"

అదియొక మిథ్య. అట్లులనకున్న, సాగదు. కాని, నాలుగు దినములు వ్యవధి చిక్కెఁగదా. కదీస్కారుని యవస్థ నిక్కముగఁ గడు నపాయకరముగా నున్నను, కేవల మాశారహితమై యున్నను, అదృష్టము కలసిరాకూడదా? అసాధ్యకార్యము లొకప్పుడు సాధ్యము లగును. ఒప్పులకుప్ప యగు జులేఖాను దలంచిదైనను, ఆపాటియసత్య మాడవలదా?"

"నిజము. కాని, సైనికులకు బహుమానములు లభించునంటివే!

అది యెట్లు?"

"దాని కేమున్నది! సహజోదారస్వాంతుఁడగు సుల్తాను తనయభి మాన సైనికులకు ధన మొసంగకుండునా? ఆ విషయము నే నెంత నిబ్బరముగఁ బలికినను, దోసఁగులేదు."

"ఆహా! నీ విజ్ఞాన మఖండము, సుస్థిరము, కేవలము నిరుప మానము. ఈ రేయి మొదటినుండియు నెంతలేసి కార్యము లొన రించితివి! నా వంటి వ్యక్తులకే కాక, సుల్తానువారికిఁ గూడ నమిత సాహాయ్య మొనరించితి వే!" — అంతలోఁ దొంటి యనుమానము మానసమున దీపించుటచే, నాతనిపై భావగర్భితవీక్షణముఁ బఱపి, దాల్తబనుపాషా మగుడ నిట్టులనెను.— "సుల్తానువారికిఁ గూడ నమిత సాహాయ్య మొనరించితి వే! ఇంతటి కార్యశూరుఁడు ఎంతటి మహా సన్మానమున కైన—"

"అట్టిసన్మానము నీవశమున నున్నది."

"సత్వరము చెప్పుము! ఏమది?"

"మ రేమియులేదు. చారుల నంపి మా యుదంతముల నరయుటకు నీ వొకవిధముగ నొడంబడితివి. నీ వటు లొనరించు వఱకు యూరాము మందిరమున నే మేముండ—"

"మీ రవశ్యము రావలయు! నీవు కోరునపుడు, నేఁ గాదందునా? ధైర్యశాలులగు నీ గ్రీకులుగూడఁ గీర్తనీయులు. కాని, నేను ముందుగ వజీరు భవనమునకుఁ బోయి—"

"వజీరున కీ విషయములు తప్పక తెలియును. నే నరుదేరునపుడు, వజీరు సపరివారముగాఁ బాదుషావారి నగరునకు బ్రయాణము సల్పుట కాంచి యుంటిని. కావున, నీవు, నిశ్చలస్వాంతముతో నీయూరాము గృహంబునకుఁ బోవచ్చును. ఉదయమగునంతనే, వజీరు భటుఁ డరు దెంచి నిన్నెంతయు నభినందించును."

యుక్తియుక్తములగు నాపలుకుల కెదురాడఁజాలక, పాషా ఇయ్యకొనెను. కాని, తాను తన నగరమందిరమునకు మాత్రము ముందుగఁ బోవలయునని యాతఁడు పలుక, ఖలీలుఁ డిట్టు లనెను—

"ఆర్యా! అట్టులే కానిమ్ము. నా గ్రీకుమిత్రులుగూడ నీ వెంటనే యరుదెంతురు. నేను ఈలోన నా కీ యశ్వము నొసంగిన మిత్రున కీ వాహనము నొసంగి, మన నౌక నిలిచియున్న తావున మిమ్ము రయంబునఁ గలసికొందును."

అంత గ్రీకులుకూడ సముచిత భాషణములం దమ కృతజ్ఞత వెలిబుచ్చిరి. అనంతరము వారొకవంకను, ఖలీలుఁడింకొకవంకను బోయిరి.

ఖలీలుఁడు కొంతదూర మేగి, ఒకచిన్నసందు తిరిగి తేజి డిగ్గెను. అచట నొక గుఱ్ఱపువాఁడు వేచియుండెను. ఖలీలుఁ డిట్టు లనెను. —

"సదకా! మాటాడకుము. నేఁ బంచిన పనులొనరించితివా?"

"చిత్తము!" అధికాలాప మా వీరునకు ససహ్యమని యెఱింగిన వాఁ డగుటచే, వాఁ డట్టు లేకవచనమాత్ర సమాధాన మొసఁగెను. ఖలీలుఁ డిట్టు లనెను —

"నేఁ జెప్పిన చొప్పున నీవును దదితరులునుగూడ నేఁ దెలిపిన స్థలంబున కంటియుందురు గదా! నిరంతర మప్రమత్తతతో నిగూఢముగ గావలియుందురు గదా!"

"చిత్తము!"

"నేను సన్నరొనరించు నంతనే, మీరు కావింపవలసిన కార్యక్రమము మీకు లెస్సగఁ దెలియునుగదా?"

"చిత్తము!" అని పలుకుచు నాసేవకుఁడు రెండు షడంగుళములచిన్నడబ్బి యొకటి ఖలీలున కొసంగెను. ఆ వీరుఁడు నంతసించి, వానికి సెలవొసంగి, తాను వేఱొక మార్గమున కదీస్కారుని గృహంబు జాసి, అచటి సేవకు నొకనిఁజీరి, లాక్షారసముద్రితంబగు

నొక కమ్మి నొసంగి, తోడనే వెనుదిరిగి నదీ ఘట్టమునకు రయంబునం బోయెను. తదుత్తర నిమేషముననే గ్రీకు యువజన మధ్యస్థుండై పాషా గూడ నరుదెంచెను. ఆక్షణంబ వారందఱు సాకాంక్షులై, మనోహర జలవిహార సౌఖ్యమనుభవించిరి. పాషా యిట్లు లనెను. —

"ఖలీలుండా? ఈ రేయి ఎంతటివైపరీత్యములు సంభవించెను? నీ వెంత సాహసోదారముగఁ బ్రవర్తించితివి! నీ యద్భుత — "

"పాషా! గతవృత్తాంత మింకఁ దలంపవలదు. మన కష్టములు గట్టెక్కెనుగదా. అమితశాంతసౌఖ్యాలవాలమగు భవదీయారామ సౌధము మాత్రము నీకు స్మరణీయము."

"నా మందిర మనునంతనే జ్ఞప్తికివచ్చెను. మీరు మగుడ నా యతిథులగుచున్నవారు. మీ నిరుపమానప్రవర్తనముగాంచి, మీ ప్రణయ మనోరథముల నిరాకరింపజాల. ఖలీలుండా! నీ వ్యవహారము నా యధీనము కా — "

"ఔను. జులేఖా తలిదండ్రుల యనుమతి వడయవలయును."

"కావున, నే నీ గ్రీకువీరుల గుఱించియే చింతింపవలయు. మీ వంశ గౌరవభాగ్యములను నే నింక ననుమానించుట యసంబద్ధము, అవివేకము, ఐనను, మనము లోకాతీతులముకాము. కావున ఖలీలుండా! భవదీయోపదేశానుసారముగ మదీయ భటుల నంపువాఁడను. లూకాసు జూలియనులారా! ఇచ్చటి మీ మీ యుదంతముల లిఖించి, జననీజనకుల యనుజ్ఞ కోరుఁడు. సేవకులు రే పేగెదరు."

గ్రీకు యువకు లమితానందపరవశులైరి. తలిదండ్రులు తప్పక ఆమోదింతురు. డెందమునఁబొంగు సంతసమ్మును వారు సముచితముగ వ్యక్తపఱచిరి. ఇట్టి శుభపరిణామమునకు ఖలీలుండే ప్రధానకారణ మగుటచే నాతని వా రెంతయు నుగ్గడించిరి."

"కాని, అంతవఱకు లోకమర్యాద — అట్లు చెప్పఁబోవు పాషాకు

ఖలీలుఁ డిట్టులనెను — ”

“ నీమాటనతిక్రమింపవలదు. మమ్మెప్పటియట్లు ప్రత్యేక మందిరము లందే యుండనిమ్ము. పాషా! నీగౌరవమున కేకొంతయు రానీక మెలంగుదుమని యెంతుగుము.”

“ఆహా! ఏమి నీబుద్ధివైభవము! మీవంటి యుదారపురుషులు నాయతిథులగుట నాకెంతయు నానందదాయకము. ఖలీలుఁడా! నీకథ లెంత రసపూరితములు! వినఁబోలేది వినవలయుననియే యుత్సాహము పొడముచున్నది. నా యర్ధాంగి యమితాతురముతో నీకథకై నిరీక్షించుచుండును.”

“ఆర్యా! నా శక్తికొలది మీ కానంద మొదఁగూర్పఁ బ్రయత్నింతును.”

పాషా సాభిప్రాయముగా నవ్వి యిట్టు లనెను.—

“కాని జులేఖా లేని కారణమున, నీ భావౌన్నత్యము డిందుపడునేమో సుమా!”

“ఆర్యా! ఆ కన్నియ భవదీయ దర్శనార్థము రే పరుదెంచు నని విశ్వసింతును.”

భయంకర విప్లవము కడు సుళువుగా నంతరించుటచేఁ బాషా మానసము పరమానంద సంభరితమై యుండెను. తురుష్కప్రభు వా కారణమున హాహాహా యని నవ్వి యిట్టు లనెను.—

“ఈ చతురజ్ఞుఁడు వివిధ దుస్సాధ్యకార్య నిమగ్నుఁడై యుండెనని భ్రమించితిని; కాని, తన ప్రేమనిధానమగు కన్నియను మఱవలేదే! ఈ చోద్యమాలించునంతనే, నా యిస్మిలిడా తప్పక స్మేరాసన—”

“వలదు, వలదు. స్త్రీజాతికెల్ల నలంకారప్రాయమగు నా మహామానిని, నేను జులేఖా సందర్శనార్థమే యరుదెంచితినని యాలించు నేని, అట్టి యనుమాన మైనను స్ఫురించునేని, సహింపఁ జాలదు. నా

హృదయము నీవు లెస్సగ గ్రహించితివి: కాదనఁజాలను, కాని, ఇస్కం
దరియాసతీమణిమాత్ర మెఱుంగరాదు ”

“ఖలీలుమిత్రమా! నీ పలుకులన్నియు వివేక పుంజములు. ఔను, సుప్రసిద్ధ వీరులు, సుప్రసిద్ధ సుల్తానులు నగు ఉస్మాను, మురాదు, బైజీదు, రెండవ మహమ్మదు మొదలగు వారల గుఱించి యింత ధారాళముగా, నవిరళముగా బ్రసంగించు ప్రజ్ఞానికుఁడు వేఱువిధముగ నెట్లు మాటాడును? కోమలాంగియగు నా కాంత కేవలము సూపొం దిన కోమలత్వమే యనఁదగును, సుగుణమని చెప్పనొప్పును, సౌశీల్య మని నుతింపవలయును. నా హృదయారామమునందలి మనోహర మగు గులాబిగదా, నా మనోహారిణి!”

ప్రభురాణి శీలము సమగ్రమెఱింగిన ఖలీలుఁడును, గ్రీకులును తదసంబద్ధాలాపముల కెంతయు లోలోన నవ్వికొనిరి. జూలియను ఖలీలులు ఆ మానవతి శయ్యామందిరము కాంచియుండిరిగదా. లూకాసు అంతటి భాగ్యము నోచికొనకపోయినను, ఆ క్రీడామందిర మున కాతఁడే ప్రప్రథమ మాహ్వాయమానుఁ డాయెననియు, అట్టి మహాసమయమున పాషా పాదరక్షులవలన విఘాతము ఘటిల్లెననియు వరసిదే యుంటిమి.

నౌక యంతలోఁ గయ్యచొచ్చెను. వారందఱు నేలకు డిగ్గి క్రమముగా మందిరాంతర్గతులైరి. ఎప్పటియట్టులు యువకులు ముప్వురు తమ తమ గదులలోనికిఁ బోయిరి. కడు నలసియుండిన ఖలీలుఁడు మఱి యే విచిత్రకార్యమున కుద్యమింపక, శీఘ్రముగా శయ్యాగతుఁడై నిజహృదయాపహారిణి జులేఖాను దలంచుచు నిద్రా పరుఁ డాయెను.

భయంకర జనీజరీ విప్లవ మంతరించెననియు, తమ ప్రియులు మగుడ నరుదెంచిరనియు నెఱింగి, తైరజాగుల్మీరు లమందానందము

నందిరి. పాషా నూటిగాఁ దన కాంతసదనమునకే పోయెను. తురుష్కప్రభువు కేవలము మిథ్యాప్రగల్భుఁడు కాకున్నను, ఖలీలుని ప్రాముఖ్యత సాధ్యమగునట్లు మఱుగుపఱచి, తన ధైర్య స్థైర్యములకు వెఱచియే జనీజరీలు గతాహంకారులై లోఁబడిరని తన భార్య విశ్వసించువిధంబున నాతఁడు తత్కథాక్రమ మెఱింగించెను. అంత నా కాంత జులేఖాగుఱించి ప్రశ్నింప, దా నా కన్నియను జనకుని గృహంబునకుఁ జేర్చితిననియు, అనంతరవృత్తాంత మేమియుఁ దెలియదనియు పాషా పలికెను. దాన జులేఖా ఖలీలుల ప్రణయ మంతరించెనని విశ్వసించి, ఆ నవమోహనాకారుఁడు మగుడఁ దన మందిరమున కేతెంచినందుల కా కామిని యనిర్వచనీయానందము ననుభవించెను. తురుష్కయువకుని రాకకుఁ దగు కారణము పాషా చెప్పఁడాయెను : కానఁ, దన సౌందర్యమే యా మోహనాంగు నాకర్షించెనని, ఆ కులుకులాఁడి మఱి మఱియు సంతసించెను.

మఱునాఁడు మధ్యాహ్నసమయమున వజీరుయొక్క సేవకుఁడరుదెంచి, యమూల్యములగు పెక్కు బహుమానములును, ఒక జాబును గొనితెచ్చెను. రాజధాని మహా విపత్సాగరమున మునింగియుండిన సమయమున దాల్తబను పాషా యొనరించిన గొప్పసేవ నగ్గడించుచు వజీరుఁ డాలేఖ లిఖించి యంపెను. పాషా సహజముగా సంతోషపరవశుఁడై తత్సేవకున కుచితపసదనము లొసంగియంపెను!

జూలియను లూకాసులు తమ ప్రణయోదంతములను వ్రాసి పాషా సేవకుల కొసంగిరి. ఆసేవకులు తోడనే ప్రభునాజ్ఞ ననుసరించి ప్రయాణమైరి.

ఆసమయముననే, కదీస్కారుని తనయ జులేఖా యరుదెంచెను. పాదకునిఁ బొమ్మని రయమున కదీస్కారుని గృహము దాసి, అచ్చటిసేవకునకు ఖలీలుఁ డొసంగిన జాబునం దుండిన సమాచార మియ్యదె !

దివాసమయమునఁ శోషా పుత్రికలును జులేఖాయును పరస్పర సంభాషణా పరతంత్రలై, హాయిగ నుండిరి. ఇస్మిలిడా నిజమనోభవాలోచనానిమగ్నయై యుండెను. యువకులు చతురంగాదివినోదములఁ బ్రొద్దు పుచ్చుచుండిరి. దాల్తబనుపాషా యొకానొక కార్యము తలపెట్టి రాజధానియందలి తన మందిరమునకుఁ దత్కార్యార్థము సేవకు నంపెను. తత్పరిణామము శీఘ్రముగ వ్యక్తమాయెను.

మధ్యాహ్నము తిరిగినంతనే, రాజధానినుండి పెక్కండ్రు కర్మకరు లరుదెంచిరి. అనంతారామప్రదేశమునందు వారు చిన్న చిన్న మందిరములు నెలకొల్ప నారంభించిరి. కొందఱు చక్కనిగుడారములు నిర్మింపఁ దొడంగిరి. మఱికొంద ఱా యారామపథంబుల కిరుకెలంకుల సముచితస్థలంబుల నాసనములఁ బఱుపఁ గడంగిరి. వనపాలకులు కొందఱు అట్టిట్టు పెరిగిన వృక్షశాఖలను రమ్యతోరణములుగను, చక్కని చాందినీలుగను వంచికట్టిరి. లెక్కకు మీఱిన గులాబిచెట్లను వివిధప్రదేశములఁ బలుతెఱంగులసిల్పి, నా ప్రదేశముం గడు మనోహరముగ నొనరించిరి. తదారామవాటిక లన్నియు బల్లలు, కుర్చీలు, సోఫాలు మొదలగు వస్తుచయంబులతో నిండి, చూడ వేడుకగా నుండెను.

ఆ మందిర కాంతాజనంబులు విషయ మెద్దియో యెఱుంగకున్నను, సందడి దండిగనుండుటచేఁ దమ కవాటపత్రములఁ దెఱచి పరికింపఁ దొడంగిరి. తద్వ్యవహారప్రయత్నములఁ గాంచి యచిరకాలమునఁ బెక్కండ్రు అతిథులు రావలయునని తైరజాగుల్నేరులు గ్రహించిరి. కాని, యట్టి ఉత్సవావసరమునఁ దమకు బంధవిమోచన మగునో, తాముగూడ హాయిగఁ దిరుగఁ గలమా యని ఆ సుందరీమణులు సంశయబాధితాత్మలై యుండిరి. ఇస్మిలిడా మనోభావ

మన్యథా పరుగిడుచుండెను. తన నాథుఁడు తనకుఁ దెలుపకుండ నట్టి ప్రయత్నములేల ఒనరింపవలయు నని ఆమె యాగ్రహాయత్తచిత్త యాయెను. కాని, వివిధకార్య రచనాపరాయణుఁడై యుండిన పాషా కానరాకుండుటచేఁ దనయులుక వెలిబుచ్చుట కవకాశము లేక పోయెను. అంత నా యింతి కొండొకవిధంబునఁ జింతించెను. ఈ యుత్సవ సందర్భముననే, దనచిత్తచోరుని ఖిలీలునిఁగాంచి సరస సంభాషణ మొనరింపనగునని యెంచి, ఆ మదవతి యమందానంద మందెను.

సాయంకాల సూఱుగంటలు సమీపించునరికిఁ, ప్రచండభానుఁడు ప్రశాంతుఁడగుచు, ప్రదేశమంతయు శీతలకరంబై యొప్ప, చల్లని పిల్లవాయువు లల్లనలేచి, బాస్ఫరజలవిహారము మనోహరతరం బొన రించెను. నౌకలు పుంఖానుపుంఖములుగఁ దోచి యొక్కటొక్కటిగ పాషా మందిర పరిసరఘట్టమున నిలువనారంభించెను. వివిధ ప్రాయంపుఁ గులీనులు, పురుషులు, స్త్రీలునుగూడ, నాహూయమానులై యరుదెంచుచుండిరి. మేలిముసుంగులు ధరించిన యాకాంతలు వివిధ రుచిరాంబరములఁ ధాల్చి యపూర్వ సౌందర్యముతో నలరారుచుండిరి. మకుమారులగు చుట్టంబుల సౌకర్యార్థ మచ్చటి పరుమశిలామయ సోపానములు రమణీయమగు మెత్తని మొగములచేఁ గప్పవడి యుం డెను. ఆ బాట కిరుకెలంకుల నపురూపమగు గులాబులు శోభాయ మానముగ నలంకారపూర్వకముగ విరాజిల్లుచుండెను.

అంత కొంకెంత పూర్వమే దాల్తబను పాషా తన ప్రాణకాంత చెంతకుఁ బోయెను. ప్రభుపత్ని ప్రసన్నచిత్తయై, మధురమందహాస విరాజితాననయై తన మగనికి సుస్వాగత మొసంగెను.

"మనోహారిణీ! మన సేవకు లొనరించు మహత్తర ప్రయత్న ములఁ గాంచితే యుందువు. నీ కథింత విస్మయానందంబులు కల్గింపఁ

గోరి, ముందుగ వచింపనైతి. రాజధానియందుఁ జెలరేగిన భయానక విప్లవము నమసెఁగదా. తద్విజయోత్సాహసూచకముగా నొక యుత్సవము కల్పించితి. ప్రముఖు లందఱు నరుదెంతురు. కావున, నో సుందరాంగీ! మదీయ ప్రతిష్ఠాగౌరవములకు వన్నె తెచ్చునట్లు ఉత్తమోత్తమవసనములఁ దాల్చి యరుదెమ్ము.”

చతురమతియగు ప్రభుపత్ని వల్లెయన, పాషా రయమునఁ దన పుత్రికాసదనమునకుఁ బోయి యిట్టు లనెను —

“పుత్రికలారా! విప్లవము నడంచి, తదఖండవిజయమునకు సాక్షిభూతముగా గులాబీపండుగ కల్పించితి. మీ మీ మనోహరాంబరములఁ దాల్చి రావలయు. మీ ముసుంగులు మాత్రము సమముగా నుండవలయునుడీ. మీ పరిచితపురుషు లందు గోచరింతురు: కాని, మీ రెఱుంగనట్టులే, మెలంగవలయు: మనగృహంబున వా రుండిన విషయ మేరికిఁ దెలియరాదు. కొందఱు కొంటెతనంబున నిట్టివిషయములనే యరయఁ బ్రయత్నింతురు. కాన, మీరు తదుచితముగ మెలంగుదురుగాక.”

అనంతరము పాషా గ్రీకులు ఖలీలుఁ దుండిన మందిరమున కేగి యిట్టు లనెను—

మన రాజధాని భయంకర జనీజరీ విప్లవమునం బడి గ్రుస్సక నిల్చియున్న కారణమున, తదుత్సాహాతిరేకమున గులాబీయుత్సవము శోభాయమానముగఁ జేయఁ దలంచితి. పేరొందిన పౌరులందఱుం దమ మిత్రకళత్రాదులతో నరుదెంతురు. మీరును రావలయు. మీరు పోరాని బందుగులు, అమితగౌరవార్హులు, విమల సదాచార సంపన్నులు. మీవంటి మాననీయుల స్వేచ్ఛాప్రవర్తన మరికట్టుట నా యభిమతము కాదు. ఐనను, మీరు నాపుత్రికను జులేఖానుఁ గాంచునప్పుడు, పరిచయము లేనియట్టులు సంచరింపవలయును. పర

స్పర ప్రసంగావసరమున నూతనాగతులవలెనే మీరును తదుచితము గనే పలుకరించి మెలంగవలయు. ఇట్టు లాడితినని యన్యథా తలంప కుఁడు." యుపకులు ముప్పు రందుల కియ్యకొనిరి. పాషా సంతసించి వెడలఁబోయి చు, మ తెద్దియో స్ఫురింప, వెనుదిరిగి ఖలీలునిం గాంచి యిట్టు లనెను—

"మిత్రమా! ప్రసంగవశమున జనీజరీ విప్లవము గుఱించి మాటలు రావచ్చును. నీ వా విషయ మంతగ—"

"పాషా! తత్ప్రసంగము వచ్చునేని, నీ కతంబుననే ప్రచండవిప్లవ జలధరంబులు పటాపంచ లాయెనని చెప్పుదును" పాషా యహం కారముం దలంచియు, దాఁ దదనుగుణముగాఁ దాళము వైచుట యెఱింగియు ఖలీలునకు నవ్వు కల్గుచుండెను. కాని, ప్రభువు చిన్న వోవునని యెంచి యాతఁడు సహించికొని, నిర్వికారుఁడై యథా ప్రకార మిట్టు లనెను — "పాషా! యోధాగ్రేసరుండవగు నీ పేరు తలంచియే గదా, నీవు మహాబలసమేతుఁడవై యరుదెంచుచుంటివని యెఱింగియే గదా, జనీజరీలు విగతధైర్యులై భయవిహ్వలులై శస్త్రాస్త్ర విసర్జన మొనరించిరి! అట్లు కాదేని, ఆగా కేవలము నామాట పాటించియే లోఁబడునా?"

ఖలీలుని నుతిపూరితాలాపములచే నా వృద్ధపీరుని మానస ముప్పొంగెను. ఆతనినుగుణములఁ గొనియాడి పాషా మగుడ నిట్టులనెను —

"మీరు సంసిద్ధులరై యుండుఁడు. అతిథు లరుదెంచు సమయము నసే, మీరును రావలయు. మీరును రాజధానినుండి వచ్చిన మిత్రులవలెనే దోఁపవలయు."

పాషా యొక్కసారి తన యారామముసం దెల్లెడలఁ దిరుగాడి, సేవకు లొనరించిన ప్రయత్నములఁ గాంచి, సంతసించి, యనంతర మాతఁడు యుపకులకడ కేగి, వారిని విడిచి, దయుంబునఁ దన యంతః

పురంబునకుఁ బోయెను. నిజప్రియాంగన, పుత్రికలు, భగినీ పుత్రికయు వెంట నరుదేర, యతిథులకు స్వాగత మొసంగుటకై పాషా సాకాశ్రయస్థానమునకుఁ బోయెను. ఖలీలాదులు కొంత దవ్వునఁ దిరుగాడుచుండిరి.

ఆరుగంట లైనంతనే, సుందరోద్యానవన మంతయుఁ బ్రసిద్ధజన సంకీర్ణమాయెను. పేరువడసిన స్త్రీపురుషులు రెండువందలమంది యరుదెంచిరి. అస్తంగతుఁడు కానుండిన దినకరుఁడు మనోహరాకారుఁడై వెలుంగుచుండెను. తదవసరదృశ్య మసాధారణవైభవముతో నలరారుచుండెను. తద్విశాలారామతటంబునఁ బొడసూపిన తాత్కాలిక సుందరనిలయములు వివిధవర్ణరంజితములై, కమనీయ కనకబాలచంద్రలాంఛన విరాజితములై, ప్రశాంతభానుబింబప్రసరిత సాంద్రసువర్ణకిరణ ప్రవాహప్రభావమున మఱియు శోభాయమానముగ దీపించెను. మనోహరములగు గులాబీపుష్పములు ఒక గుడారమునుండి యింకొక గుడారమునకుఁ జక్కఁగఁ దోరణములు కట్టియుండెను. గుడారములు, దీపములు, పర్ణశాలలుం గూడ నవిరళ నూనాలంకృతములై నేత్రపర్వములై యొప్పారెను. ప్రణయప్రపూర్ణములగు నపూర్వకుసుమగుచ్ఛములచేతనే గొన్ని స్థలంబు లలంకరింపఁబడెను. గులాబీయుత్సవము సార్థకనామమగునటులా ప్రదేశమంతయు దన్మనోహరగుళుచ్ఛములతో నిండియుండెను. పటకుటీరము లందును, విహారణపథంబు లందును అమరిన యాసనములును, వేదికలును గులాబీ సింధూరవర్ణమయమగు మొగములు తొడుగుతో మనోహరముగ రాజిల్లుచుండెను. ఎల్లెడల సముచితముగ నొప్పియుండిన యపూర్వపు మేజాలపై నవిరళమనోహరాపూర్వ భోజ్యపదార్థములు నిలిచియుండెను. దాల్తబను పాషా మహమ్మదీయుఁడైనను, మహమ్మదువారి యాదేశముల నెల్ల నాదలఁ దాల్పగడంగు మాధఖాంద

సుఁడు కాకుండుటచే మధురసాస్వాదనాభిజ్ఞులైన రాఁగల యతిథి జనంబులకుఁ గూడఁ దత్ప్రదార్థము నాఁడు స్థాపించి యుండెను.

ఆ దృశ్యము నిజముగ ననూనశోభాయమానముగ నుండెను. ఏతెంచిన కాంతామణులందఱు వసనాచ్ఛాదితవదనలైనను, దత్సౌందర్యనైభవంబున కావంతయుఁ గొఱంతలేకుండెను. మంజుల చిరుఘంటికారవంబుల వలె నెలువడు నా కలకంఠుల కలస్వనహాసములు రమణీయపల్లవాధర వినిర్గతంబులు కావలయునని తెలియుచుండెను. సుందరీజన వదనసుధాకరబింబములు వసనమేఘాక్రాంతము లైన నేమి? అపూర్వరూపనైభవ మగణిత శోభాయమానముగఁ దోఁచుచుండెను. మనోహర కుసుమవల్లరీసమాన లఘుతరశరీరలును, గంధగజేంద్ర సదృశ ఘనతర శరీరలును నుండిరి. వారు ధరించిన తదుచిత వస్త్రధారణముచే నధికతర దర్శనీయముగ నుండిరి. సంధ్యారాగ మధికతరంబగుకొలఁది, అపూర్వ మధురసపూరిత కాచపాత్రములు వివృతములగుకొలఁది, ఆరామవిహార మొనరించు మచ్చెకంటుల మేలిముసుంగులు తన్నికట తరుశాఖల కారణంబునఁ దొలఁగ, దృగ్గోచరమగు వదనము లనూన సౌందర్యసముజ్జ్వలనైభవముతో నలరారుచుండెను. తోడునీడవలె వెన్నంటు రసికవరుల కాతెఱంగున నమితానంద మొనఁగూరుచుండెను. ఆకామినులు మగుడ వసనాచ్ఛాదిత వదనలగులోన నొక్క మోహావీక్షణంబు విడుచుటకుఁగూడ నవకాశ మేర్పడుచుండెను.

ఒక సాంద్రతర లతానికుంజము నుండి మనోహర తూర్యారవంబులు తదవసరమున మంజుల స్వనమున యతిథులకు సుస్వాగత మొసంగెను. తత్సమయోద్భూత శకుంత సంతాన కలకల నినాదములు గూడ సమయానుకూలముగ నుండెను. దినమణి పశ్చిమ కాసార మువఁ గ్రుంకినంతనే, వేనవేలు దీపము లొక్కసారి దేదీప్యమాన

ముగ వెలింగెను. ఆ ప్రదేశమంతయు విపులమై భవ సముజ్జ్వలమై, దర్శనీయమై, వర్ణనాతీతమై యొప్పారెను.

ఉత్సవారంభమునఁ బాషా వనితాజనంబు లాతని నంటియే యుండిరి. దాన వారికిఁ బ్రసిద్ధయతిథులఁ బ్రశంసించు నవకాశము చిక్కెను: దీపారాధన మైనంతనే, యాప్రభువు తనుబోలు నున్న తాధికారులనడుమ నాసీనుఁడై, హుక్కాగొట్టము చేఁబూని ప్రసంగ మునకుఁ జొరకొనెను. ఇస్మెలిడా మొదలగువారు తమదారిని బోయిరి.

ఇందందుఁ దిరుగాడుచుండిన జూలియను లూకానులు తమ ప్రాణకాంతలం గాంచి, మనసార ముచ్చటింపఁ జాలిరి. ఖలీలుఁడు నిజప్రియాంగనను డాసి యిట్టు లనెను —

“జులేఖా! మనము కలసి యుండరాదు. ప్రభుపత్ని నాకై తిరుగు చున్నది. నా యుదంతము నీ కెఱింగించియుంటిగదా. ఈ సమయ మున నిన్ను మెలంగవలసి — ”

“ మహనీయా! ఇంత సమాధానమేల? నీ వొనరించిన మహోప కార మెన్నటికైన మఱపునకు వచ్చునా? నీ ఋణ మెన్నటికైనఁ దీరునా? — ”

“ ప్రేయసీ! ఇట్టి వెడగుమాట లాడవలదు. నే నమితోపకార మొనరించితి నేని, నీవు ప్రత్యుపకార మొనరించియే యుంటివి. భవ దీయ హృదయ పెన్నిధానము నొసంగి, నన్ను ధన్యు నొనరించితివి! ఇందు నా కేమి కావలెను? ప్రాణకాంతా! మన మిఁక నిరవధిక సౌఖ్యము చూఱఁగొందుమని విశ్వసింపుము. నీ విఁక పొమ్ము ”

ఖలీలుఁ డట్లు పలికి తత్ప్రదేశ మేకాంతముగ నుండుటచే నట్టి సదవకాశము బోనాడక, నిజమనోహారిణియగు నా పల్లవాధరి మధురాధరామృతము చవిచూచి, తన దారిం బోయెను. ఆ లతా

కుటీరమునం దవ్వలి కొనయందే, ఇస్మిలిడా నడినడిఁ దిరుగాడుచు నుండెను. ఆ హరిణేక్షణ ముఖవసన ధారిణియై యున్నను, తన్మనోహర మూర్తి పరిపూర్ణతా సౌందర్యము, గమనవైభవమును, విపరీతమగు వేగిర పాటును గాంచునంతనే, ప్రభుపత్ని కావలయునని తెలియుచు నుండెను. తను గాంచ వలయుననియే ఆ కామిని పరిభ్రమించు చుండె ననియు ఖలీలుఁడు గ్రహించెను. సాధ్య మగునంతవరకుఁ దప్పించికొన వలయునని యెంచి, ఆ వీరుఁడు రయమున వేఱొక వంకఁ దిరిగెను.

ఆరామసీమ యంతయు దీపికా సహస్రంబులచేఁ బట్టబగలువలె వెలుగుచుండినను, పాషా మందిరము మాత్ర మంధకారమున నే యుండెను. దీపకాంతి యంతవరకుఁ బోలేదు. అందుఁ మందిరపుఁ గొనయొండు మఱియు నంధకార బంధురమై యుండెను. ప్రభుపత్ని కంటఁ బడకుండఁ బాఱిన ఖలీలుఁ డావంకకే పోయెను —

"ఈ కాంత నన్నుఁ గాంచునంతనే, తప్పక దూఱును. ఐననేమి? ఆమెను జూచుటకే ఎల్లెడల నిందనుక సంచరించు చుంటినని తెల్పి, నన్నట్టు లుపేక్షించుట పాడిగాదని నేనే ముందుగ నిందింతును. అల్లా! ఇట్టి కపట ప్రవర్తనావసరము రయమునఁ దొలంగుఁ గాక."

ఖలీలుఁ డా తెఱంగున నాలోచనాధీన మానసుండై యుండ, తత్సమీపద్వార మెద్దియో మెల్లగఁ దెఱచినటులాయెను. అతఁడు ప్రబోధితుఁడై తిలకించునంతనే యా సవ్వడి యంతరించెను. తోడనే కుతూహలడోలాయమాన మానసుఁడై, మనవీరుఁడు శబ్దముద్భవించిన వంకకు నల్లనఁ బోయెను. అచ్చటి షచ్చిక బయులు మందిరము తట్టు వాలి యుండెను. అట్టి వాలు వలన, భూమట్టమునకు దిగువ నుండిన గదులకు వెలుగు వచ్చుట కవకాశమేర్పడెను. పల్లమున దిగుకొలఁది అంధకారము బంధురతరంబాయెను. అచటనే అనతిదూరమున నెవ్వరో దీర్ఘమగువ్యక్తి తోఁచెను. దీర్ఘకాయము, తెల్లనిబట్టలు, ఒక

విధమైన పాగాయును చూచి, వాఁడు చిరపరిచితుఁడగు సిద్దీ కావలయునని ఖలీలుఁడు గ్రహించెను. అట్టి సమయమున, అట్టిప్రదేశమున వానికేఁ బని యేముండును? వానిరహస్య మరయువలయునని ఖలీలుఁడు పొంచియుండెను.

ఖలీలుఁ డట్లు నక్కిచూచుచుండ, సిద్దీ దొంగవలె విసరునఁబోయి అత్యంతము చేరువనున్న గుడారము ప్రవేశించెను.

వాఁడందుఁ జొచ్చుటకుముందు నిమేషమాత్ర మాప్రాంగణమున నిలిచి తొంగిచూచెను. ఒక్కముహూర్తమె యందుండి, వాఁడు రయమున వెలువడెను. ఆ ముష్కరుఁడు తొంటితావునకు శీఘ్రతరముగ నరుదెంచుటచే, ఖలీలుఁడు మఱింత వెనుకకుఁబోయెను.

సిద్దీ సంచరించిన తావున, నిమ్న తమ భూభాగమున, నొక దిట్టముగు తలుపుండెను. నిశ్చలాత్ముఁడగు ఖలీలుఁ డందు రయమునఁ జొరంబడెను. ఆధైర్యశాలి యందు జొచ్చినంతనే, అమిత విస్మయాక్రాంతచిత్తుఁ డాయెను. 'నిశాసమయమునఁ దాను రహస్యవిహారణ మొనరించిన పథంబునందలి మెట్లవరున క్రిందనున్న దారుమయగు వ్ర కవాటమే అయ్యదియని ఖలీలుఁడు రయమున గుర్తించెను. వీరుని సంభ్రమ మంతరించునంతలో, సిద్దీ యడుగులసవ్వడి శ్రవణగోచర మాయెను. అతఁడు తోడనే సిద్దీవైచి వెడలినట్టులే యాతలుపువైచి యొకప్రక్క నక్కియుండెను. గ్రుడ్డిగ వెలుఁగు నినుపదీపపుఁ గాంతిచే నా నిర్మానుష్యాంధకారప్రదేశము చూడ దుస్సహముగా నుండెను. అంతలో, సిద్దీ రయమున నరుదెంచి నిజచరణబలంబునఁ దలుపువైచెను. వానికక్షులందు రెండు సారాయి సీసాలును, వివిధ ఫలాది తినుబండారములును నుండెను. ఆ పదార్థముల సంగ్రహించుటకే వాఁ డటు బోయెనని వ్యక్తమాయెను. తొందరపాటున ఖలీలునిఁ గాంచఁజాలక, ఆయా సంచితార్థములను నేలనిడి, తత్కవాటము

భద్రముగ బంధించుటకై తాళము తీయుచు, ఖలీలునిఁ గాంచెను.

ఖలీలుఁ డాకస్మికముగ గోచరించుటచే నా భటుడు విపరీత సంభ్రమచేతస్కుఁడై యప్రయత్నముగఁ దాళము పాఱవైచి, దుర్దాంతక్రోధాతిరేకమునఁ దన దీర్ఘకరవాలము సారించెను. కాని, ఆ క్షణముననే మఱియొక కృపాణముకూడ మెఱపువలె దీపించెను. త దస్త్రధారి ఖలీలుఁడే యని వేఱుగఁ జెప్పనవసరము లేదుకదా. అతఁడు నిరుపమాన గాంభీర్యముదాల్చి, విస్పష్టస్వరమునఁ గఠినముగ నిట్టు లనెను —

"ఓరీ! నా మాటల కెదురాడక వినుము. నా యాజ్ఞ జవదాట సాహసింతువేని, నీవు మనఁజాలవు. నిన్ను ధనవంతు నొనరించుటకును, తగుదండన విధించుటకునుగూడ సమర్థుఁడనని యెఱుంగుము. నీవు తక్షణము — "

కృపాణధారియై, గంభీరాకారుఁడై, దుర్నిరీక్ష్యుఁడై యొప్పు ఖలీలునిఁ జూచినంతనే, సిద్దీ చకితుఁ డాయెను. అతఁడేమి యాజ్ఞాపింపఁగోరునోగాని, ఆరామమునుండి యాకస్మికముగా నాక్రందనములు వెలువడెను. ఖలీలుఁడు మాట లుడిగి వినుచుండ, నా ధ్వని యధికతర మాయెను. హాయిగ విందు లారగింపుచు బరస్పర సంభాషణ సౌఖ్యోన్మత్తులై యుండవలసిన బంధుజనంబుల కంతలో నేమి యుపద్రవము వాటిల్లును? ఖలీలున కేమియుఁ దోపకుండెను. తన కత్యంత ప్రియతమమగు జులేఖా కేమైన నాపద ఘటిల్లెనా యను భయం బాతని మానసముఁ బీడించుటచే, నా వీరుఁడు తన కార్యము మఱచి, సిద్దీని మఱచి, అట్టి మహాసమయముననే ఆ యసాధ్యపురుషుని ఖండింపనైతిఁగదా యని ఆ బానిసీఁడు విచారించుచుండ, నవ్వాలి కుఱికి, భయపక్షసాహాయ్యమున శీఘ్రతరగమనుండై యా తావున కేవ్వన వ్రాలెను.

కాని, భయకారణము లేకుండుటయేగాక, ఎట్టి ధీరస్వాంతునకైన
నవ్వు పుట్టించు వింత యొందు సంభవించెనని తెలియవచ్చెను. వింత
కదు సంతృప్తికరముగా ముగిసెను. అతిథిజను లందఱు నమితానంద
భరితులైరి: దావ, బాషాయును సంతోషపరవశుఁడాయెను: తన
మిత్రులను సగౌరవముగా సాగనంపుటకై ఘట్టమునకుఁ బోయెను.
హికపీయూషపాన మొకింత యధికతరంబగుటచేఁ గావలయు,
ాలశరీరుఁడగు నా వృద్ధవీరుఁడు చల్లని నీరమునఁ గాలిడినంతనే,
ంచె మొరిగి తజ్జలాశయమున దిగజారెను. అపాయము లేకున్నను
పాషాను జుట్టియున్న నారీమణులు సహజభయాతిరేకమునఁ గెవ్వన
నఱచిరి. పురుషులు కారణ మరయకయే హాహా యనిరి. ఖలీలుఁ
కాలించిన యాక్రందనధ్వాన మయ్యదే! పాషా భటులు రయమున
నరుదెంచి, తమ ప్రభువును లేవనెత్తిరి.

అతిథు లందఱు వెడలిరి. ఇఁక, దాల్తబను ప్రభ్వీప్రభువులును,
యువతీయువకు లార్వురును మాత్రము మిగిలియుండిరి. వారందఱు
నొక సుందరపర్ణశాలయం దాసీనులైరి. పదునొకండు గంటలు
మాత్రమే యగుటచే, వేళ యింక నంతగ నతిక్రమింపలేదు. మనో
హరశీతలవాతపోతములు మేను సోకి మానసోల్లాసము కల్గించుటచే
ల్తబను పాషా యాప్రదేశము వీడఁజాలక, మధువు నొకింతగ్రోలి,
హుక్కాగొట్టము చేఁ దాల్చి, ఖలీలునిఁ బిలకించి, కథచెప్పవలయు
నని కోరెను.

సంపూర్ణము

ఈ గ్రంథకర్తగారిచే రచింపబడిన

# గ్రంథాలు

| | | |
|---|---|---|
| మొగలాయీ దర్బారు | 1వ భాగం | 1—8—0 |
| ,, | 2వ భాగం | 1—8—0 |
| ,, | 3వ భాగం | 1—8—0 |
| ,, | 4వ భాగం | 1—8—0 |
| అంతఃపురము | 1వ భాగం | 1—8—0 |
| ,, | 2వ భాగం | 1—8—0 |
| సంజీవి | 1వ భాగం | 1—8—0 |
| ,, | 2వ భాగం | 1—8—0 |
| మేరీరాణి | | 1—8—0 |

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము